# యువ

సచిత్రమాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 29 జూన్-1974 సంచిక 5


జూలై నెల

## భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10-00



. ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

జూన్ నెల

# భావపరిచయ పోటీ

## బహుమతి పొందిన వ్యాఖ్య



తల్లి పోలీసు అయిన
పిల్ల లూరకుందురే ధరణిలోన
లైటులేని సైకిలెక్కి వచ్చు
తండ్రినే పట్టింప ఫిర్యాదు చేయవచ్చు.

— సి. శోభ, హైదరాబాదు.

# తాతయ్య గర్ల్‌ఫ్రెండ్

గోవిందరాజు సీతాదేవి



రైలు దిగిన రంగయ్యగారు బొంబే మహాపట్నంలో కాలుపెట్టారు. స్టేషనుకి తమ్ముడు కొడుకు జగన్నాధరావు వచ్చి పెదతండ్రిని యింటికి తీసుకు వస్తూంటే కారులో కూర్చుని రంగయ్యగారు బొంబే పటణాన్ని కుతూహలంగా

చూస్తూన్నారు. యేదో కొంప మునిగిపోతూన్నట్టు పరుగులెత్తేజనాన్ని చీమల బారుల్లా పోతూన్న చిన్నకార్లనీ ప్రతి నాలుగురోడ్లకూడలిలోనూ పదినిమిషాలైనా ఆగిపోయే (ట్రాఫిక్)నీ చిన్నపిల్లవాడిలా కళ్ళు పత్రికాయల్లా చేసుకుని చూస్తూ

"జగన్నాథం నీకు డ్రైవరు లేడూ ?" అన్నారు.

"యిక్కడ డ్రైవరికి జీతం చాలా యివ్వాలి పెదనాన్నా" ముందుకు చూస్తూ అన్నాడు.

"అరె జగన్నాధా యిన్ని చిన్నకార్లు చీమలబారుల్లా పోతున్నాయి. యిక్కడున్న ప్రతిఒక్కరికీ కారువుందేంరా."

జగన్నాధం పెత్తండ్రి మాటకి నవ్వేశాడు.

'ఎందుకురా నవ్వుతావు ?"

"యేంలేదు. అందరికీ కార్లేవుంటే నడిచిపోయేవాళ్ళు చూడు యెందరు కన్పిస్తూన్నారో."

"నిజమేసుమా ! యెంత బొంబేపట్నం అయినా అందరూ లక్షాధికారులూ కోటీశ్వరులయే వుండరుగా. మధ్యతరగతివాళ్ళూ వున్నారా ! వున్నా యీ మహాపట్నంలో బ్రతకగలరా ! ఔనూ కారులో యింతసేపు ప్రయాణంచేసినా నీ యిల్లు రాదేరా ! అయినా రైల్వేస్టేషను నీ యింటికి యింతదూరం అయితే కష్టంకదూ !"

మనవైపు బందరునించి విజయవాడ వెళ్ళినంత దూరం రోజూ ప్రయాణం చేసి బ్రతుకుతెరువుకి (వుద్యోగానికి) వచ్చేవాళ్ళున్నారు యిక్కడ." అంటూనే మెయిన్‌రోడ్డు దాటించి చిన్నరోడ్డువైపు కారుతిప్పాడు. యిల్లు వచ్చేసినట్లుంది అనుకున్న రంగయ్యగారిక్కి యింకా కారు ఆగటంలేదని ఆశ్చర్యం కల్గింది.

"అబ్బ ! యెంతపట్నం ! యెన్నిమేడలూ– యీ మేడలు ఆకాశాన్నే అందుకునేట్టున్నాయిరా బాబూ ! తలెత్తి చూస్తే ఆఖరు అంతస్తు కన్పించటంలేదు. అబ్బ... అబ్బ..."

ఆయన ఆశ్చర్యంనుంచి తేరుకోకముందే కారు ముందుకి సాగిపోతూవుంది.

రంగయ్యగారు కృష్ణాజిల్లాలోని ఒక పల్లెటూరిలో మూడెకరాల మాగాణి పొలానికి అధిపతి. ముగ్గురు ఆడపిల్లలూ భార్యా వున్న మధ్యతరగతి కుటుంబీకుడు తమ్ముడు రామారావుకి పెద్దచదువు చెప్పించి మంచివుద్యోగం వచ్చేలా చేశారు. తమ్ముడు పైకివెడితే తన పిల్లలికి కూడా సాయంచేస్తాడని ఆశ పెట్టు

కున్నారు. అయితే రామారావుకి పెళ్ళిఅయి ఒక కొడుకు పుట్టినతర్వాత వుద్యోగం వూరువెడుతూ రైలుప్రమాదంలో మరణించాడు భార్యతోసహా! యింకా ముక్కుపచ్చలారని పసిబిడ్డ జగన్నాధాన్ని స్వంతబిడ్డకంటే కూడా యెక్కువగా చూస్తూ పెంచి పెద్దచేస్తూ చదువుచెప్పించారు రంగయ్యగారు.

జగన్నాధం కాలేజీ చదువుకీ ఆడపిల్లలు పెళ్ళిడుకీ ఒకేసారి వచ్చారు. ఒక యకరం అమ్మి పెద్దమ్మాయిపెళ్ళి కానిచ్చారు. మరో యకరం అమ్మి జగన్నాధాన్ని కాలేజీలో చేర్చారు. కాని తన చదువు పైకి సాగేలా లేదని జగన్నాధం

"యేదైనా చిన్న వుద్యోగం చూసుకుని ప్రైవేటుగా చదువుకుంటాను పెదనాన్నా" అన్నాడు. కానీ రంగయ్యగారు ఒప్పుకోలేదు. జగన్నాధం బీయస్సీలో ఫస్ట్‌క్లాస్ తెచ్చుకున్నాడు. రంగయ్యగారి ఆనందానికి హద్దులేదు. యెమ్మెస్సీ చదివిస్తే బాగుండు కానీ ఆ పని తనవల్లకాదే!

సరిగ్గా యీ టైములోనే రంగయ్యగారి చిన్నప్పటి స్నేహితుడు "జగన్నాధానికి యెమ్మెస్సీ చెప్పించి యేకైక పుత్రికని యిచ్చి పెళ్ళిచేస్తాను నా లక్షరూపాయిల ఆస్తినీ యిస్తాను యిల్లరికం పంపు" అని అడిగాడు.

"ఛీ! ఛీ! యిల్లరికాలు మా యింటా వంటా లేవు" అన్నారు రంగయ్యగారు.

"ఆ పిల్లవాడి భవిష్యత్తు బాగుంటుది! పంపేసెయ్యి." అంటూ బంధువులు హితవుచెప్పి రంగయ్యగార్ని బలవంతంగా ఒప్పించారు. అంతే జగన్నాధం బొంబే వచ్చాడు. రాజేశ్వరిని పెళ్ళిచేసుకుని యెమ్మెస్సీ పాసై మంచి వుద్యోగంలో స్థిరపడి స్నేహితులతో కొన్ని వ్యాపారాల్లో భాగం కల్పి, జాగ్రత్తగా లక్షరూపాయలని యిప్పటికి అయిదులక్షలుపైనే దాటించేశాడు.

యింక రంగయ్యగారు మిగతా రెండెకరాల పొలం అమ్మి యిద్దరమ్మాయిల పెళ్ళిళ్ళుచేసి అత్తవారిళ్ళకి పంపేసి వెనక్కి తిరిగి చూసుకుంటే సగం కూలిపోయిన పాత పెంకుటిల్లు తప్ప మరేం మిగల్లేదు. అయినా ఆయన విచారపడలేదు. ఓ పదిమంది కుర్రాళ్ళకి పాఠాలుచెప్పి వచ్చినదానితోనే కాలం వెళ్ళదీస్తూన్నారు భార్యా భర్తలిద్దరూ. యీమధ్య జగన్నాధం ప్రతినెలా వందరూపాయలు పెత్తండ్రికి పంపిస్తూన్నాడు. వార్ధక్యంలో ఆర్థిక యిబ్బందులు లేకుండా హాయిగా 'కృష్ణా' 'రామా' అనుకుంటూ తన పల్లెటూరిలోనే కాలంగడిపేస్తున్నారు. అయితే యీమధ్య జగన్నాధం పెత్తండ్రిని ఓమారు బొంబే రమ్మని ఉత్తరాల మీద ఉత్తరాలు వురికించేస్తూండటంవల్ల బయలుదేరక తప్పలేదు.

అసలు రంగయ్యగారు తనవూరు తప్పించి పెద్దపట్టణాలు యెప్పుడూ చూసి యెరుగరు. ఒక్కసారి యేదో పనిమీద హైదరాబాద్ వెళ్ళవల్సివచ్చింది. యింక అక్కడనుంచి వచ్చినతర్వాత వూళ్లోవారందరికీ ఆ పట్నంలోని వింతలూ విడ్డూరాలూ కథలు కథలుగా అడగనివారికీ అడిగినవారికీ చెప్తూనే వున్నారు. యిలా ఓ సంవత్సరంవరకూ ఆయన చెప్తూనేవున్నారు. జగన్నాథం రెండుమూడేళ్ళకోసారి వచ్చి రంగయ్యగార్ని చూసి వెళ్ళిపోతూంటాడు. గానీ రంగయ్యగారు యిక్కడికి రావటం యిదే మొదటిసారి.

జగన్నాథంకి పిల్లలు ముగ్గురు. యిద్దరబ్బాయిలూ ఒక అమ్మాయీ. వీళ్ళని చాలా చిన్నప్పుడు చూశారు కానీ యిప్పటికి చాలా పెద్దవాళ్ళు అయివుంటారు. "వీళ్ళకి స్కూళ్ళకి సెలవులు లేవనీ సెలవుల్లో ఏవో వూళ్ళు చూడటానికి వెళ్ళారనీ," యిలా ఉత్తరాలు రాసేవాడు జగన్నాథం. "పిల్లలని చూడాలని వుంది తీసుకురా, లేకుంటే వాళ్ళ ముగ్గురినీ పంపు" అని రంగయ్యగారు రాస్తే జవాబు అది. సరే... యిక పిల్లలనైనా చూడవచ్చు, అలాగే బొంబే పట్నాన్ని చూడవచ్చు అని యెలాగైతేనేం బయలుదేరారు.

జగన్నాథం కొడుకు పెద్దవాడిపేరు అనిల్. రెండోవాడు భరత్. యింక అమ్మాయి సవిత అనిల్ యెమ్మెస్సీ చదువుతూ మానేశాడు. భరత్ ఎం.ఏ. ఫస్ట్‌క్లాస్. యింక సవిత బీయస్సీ ఫైనల్ యియర్‌లోకి వచ్చింది.

రంగయ్యగారు యిక్కడికి వస్తూంటే ఆయన భార్యకూడా బయలుదేరింది "నేనూవస్తా" అంటూ. యింతలో చిన్నల్లుడు ఉత్తరం రాశాడు.

"మీ అమ్మాయికి పురిటిరోజులు అత్తగారిని వెంటనే యిక్కడికి పంపించవలెను. లేకుంటే చాలా యిబ్బంది. "అర్జెంట్" అని. యింక ఆవిడని అక్కడికి పంపక తప్పలేదు. తను రైలుయెక్కకా తప్పలేదు. వంటరిగా బొంబే రావాలని రైలు యెక్కారు కానీ మనస్సులో ఒకటే ఆరాటంగావుంది. తను జగన్నాథానికిరాసిన ఉత్తరం అందిందో లేదో! జగన్నాథమే రైలుస్టేషన్‌కి వస్తాడో రాడో, పిల్లలని కనుక పంపిస్తే వాళ్ళని గుర్తుపట్టగలనా! పట్నవాసంలో పెరిగి పెద్దైన పిల్లలు. రోజురోజుకి మారిపోతూన్న ఫాషన్స్‌లో యే రకంగా వుంటారో!

యీలాంటి ఆలోచనలతో రాత్రిఅంతా ఆయన నిద్రపోలేదు. టిఫెనైనా చెయ్యలేదు. నాలుగు అరిటిపళ్ళు కొనుక్కుని తిన్నారు అంతే. యీ విశ్వనాథం పిల్లలకోసం భార్య యేవేవో పిండివంటలు చేసి యిచ్చింది. ఆ మూటలకి రాత్రి




అంతా కాపలాకాయటమే సరిపోయింది. రంగయ్యగారి భార్య మాణిక్యమ్మ మనవలకోసం వంద అరిశలూ పాతిక మినపసున్ని వుండలూ యాభై కజ్జికాయలూ వంద జంతికలూ అప్పడాలూ వడియాలూ అంటూ మూటలు కట్టి "యివన్నీ జాగ్రత్తగా రాజేశ్వరికి యివ్వండి" అని మరీమరీ చెప్పింది.

"పిల్లలు కమ్మగా ఓ వారం తింటారు" అని కూడా చెప్పిందావిడ. యింక రంగయ్యగారు యీ సామానులన్నీ ఒకటికి నాలుగుసార్లు లెక్కించుకుంటూ ఓసారి పొరబాటుపడి మినపసున్ని వుండలసంచీ కాస్తా యే ప్రయాణీకుడో కొట్టేశాడని ఒకటే కంగారుపడిపోయి మళ్ళీ సరిచూసుకుని 'అమ్మయ్య, సంచీ వుంది' అనుకున్నాడు. యిలా సాగిన ప్రయాణాన్ని గుర్తుతెచ్చుకుంటూ రైలు దిగీ దిగగానే కొడుకుకోసం వెయ్యికళ్ళతో అందరినీ పరిశీలిస్తూండగా జగన్నాధం కన్పించటం సామానుతోసహా పెత్తండ్రిని కారులో యింటికి తీసుకురావటం జరిగింది.

రంగయ్యగారు ఆలోచనల్లో వుండగానే కారు ఆగిపోయింది. జగన్నాధం కిందకిదిగాడు. రంగయ్యగారు కారుదిగి యెదురుగా కన్పించే ఆరంతస్తుల భవనాన్ని పరీక్షగా చూస్తూ అమాయకంగా అన్నారు.

"జగన్నాధా! యిన్ని అంతస్తుల మేడ కట్టానని యెప్పుడూ వుత్తరమన్నా రాయలేదేంరా!"

జగన్నాధం నవ్వి,

"ఆ అంతస్తులన్నీ మనవికావు పెదనాన్నా! మూడో అంతస్తులో ఒక 'ఫ్లాట్' పద పైకిపోదాం" అంటూ కారు'లాక్'చేసి నడుస్తూంటే.

"అయ్యో! కారులో సంచీలు వుండిపోయాయిరా! నే తెస్తాను కొన్ని యివ్వు."

"వద్దు. నౌకరుకుర్రాడు తెస్తాడు. రండి నా వెంట" అంటూ 'లిఫ్ట్' యెక్కించి పైకి తీసుకువెళ్ళి కారిడార్‌లావున్న చోటులోనించి కాస్తదూరం నడిచి ఓ తలుపు దగ్గరఆగి కాలింగ్‌బెల్ నొక్కాడు. అక్కడ చాలా పోర్షనులే వున్నట్లున్నాయి. ఆ వాకిలి తలుపులకి యింగ్లీషులో వారి వారి పేర్లూ హోదాలూ రాసివున్నాయి.

జగన్నాధంగారి యింటితలుపు తెరుచుకుంది. పద్దెనిమిదేళ్ళ పనికుర్రాడు జగన్నాధానికి సలాంచేసి కారుతాళం అందుకుని క్రిందకి వెళ్ళిపోయాడు.

రంగయ్యగార్ని హాలులావున్నచోటుకి తీసుకువెళ్ళి సోఫాలో కూర్చోమని చెప్పి తన గదిలోకి వెళ్ళిపోతున్నాడు. కుందేలులావున్న కుక్కపిల్ల పరుగున వచ్చి జగన్నాధరావు మీదకి యెగబాకింది, తోక ఆడిస్తూ. యింతలో రంగయ్య గారిని చూసి మొరగటం మొదలుపెట్టింది. దాని అరుపుకూడా అదోలావుంది. దాన్ని చిత్రంగా చూస్తూ "యిది కుక్కపిల్లేనా, భలేవుందిరా! అబ్బ... యీ వూళ్ళో అప్పుడే చెమటపోస్తోందిరా!" అంటూ పైమీది వుత్తరీయంతో మొఖాన పట్టినచెమట తుడుచుకుంటూ కూర్చున్నారు. జగన్నాధరావు సీలింగ్‌ఫాన్ 'ఆన్' చేసి గదిలోకి వెళ్ళిపోయాడు.

నిశ్శబ్దంగావున్న యిల్లు అదోలా వుంది అసలు యిక్కడికి వచ్చేసరికే కోడలూ మనవరాలూ మనవళ్ళూ యెంత ఆత్మీయంగా ఆహ్వానిస్తారో అని తీయటివూహల్లో తేలిపోయారు. తనకోసం అందరూ వాకిట్లో యెదురుచూస్తూ వుంటారనీ కారుదిగ్గానే

"తాతయ్యా!" అంటూ సవిత పరుగువచ్చి వాటేసుకుంటుంది అనీ అనిల్ చేతిలోని సంచీలు అందుకుంటాడనీ భరత్ అంతగా పరిచయంలేక దగ్గరకి రాక తల్లివెనక చేరి

"అమ్మా! తాతయ్య నాకేం తెచ్చాడో కనుక్కోమ్మా!" అంటూ మారాం చేస్తాడనీ యింక రాజేశ్వరమ్మ ఒకగ్లాసుతో కాఫీ ఒకగ్లాసుతో మంచినీళ్ళు అందించి

"అత్తయ్యగారు యెలావున్నారు?మనవూళ్ళో అందరూ బాగున్నారా?"అంటూ ప్రశ్నలవర్షం కురిపిస్తే వాటికి తను జవాబు చెప్తూంటే సవితా, అనిల్, భరత్ శ్రద్ధగా చేసుకుని వింటారనీ యిలా యెన్నో అనుకుని వచ్చారు రంగయ్యగారు.

అసలు కారుదిగి యీ అంతస్తుల యిల్లు చూసేసరికే నిరాశ ముంచుకు వచ్చింది. కొడుకు బొంబేలో యిల్లు కొన్నాడంటే ఓ పెద్దమేడా దానిచుట్టూ

పెద్ద పూలతోటా, చుట్టూ ప్రహరీగోడా పెద్దగేటూ వగైరా వుంటాయని ఆ తోటలో సాయంకాలాలు వాలుకుర్చీలో కూర్చుని మనవరాలితో కబుర్లు చెప్పవచ్చు అనుకున్న ఆయనకి యేదో శత్రు దుర్గంలోకి ప్రవేశించినట్లు నిశ్శబ్దంగా ఎలక్ట్రిక్ 'లిఫ్ట్'లో పైకివచ్చి వాకిలి వరకూ [illegible]చ్చి [illegible]ట్టి తలుపు తె[illegible] వరకూ నిలబడి ఆ పైన లోపలికి చొరబడి తలుపు ధడాలున మూసుకుని కానీ లోపలికి నడవలేకపోవటం అదో యేమిటో కొత్తకొత్తగావుంది మన యింట్లోకి రావటానికి యిన్ని అడ్డంకులా! అహ... అస్సలు యీ పద్ధతి నచ్చలేదు రంగయ్యగారికి.



అయితే పల్లెటూర్లలోలాగా యీ మహాపట్నంలో తలుపులు బార్లాతెరిచి వుంచితే దొంగలు దోచుకుపోరూ! తన ఆలోచనలకి తనకే నవ్వువచ్చింది ఆయనకి.

ఔనూ తనువచ్చి యింతసేపయినా కోడలు కన్పించదేం! అనుకుంటూ ఆ హాలుచుట్టూ చూశారు. జగన్నాధరావ్ బట్టలు మార్చుకుని లుంగీ కట్టుకుని తువ్వాలు భుజాన వేసుకుని వస్తూ,

"పెదనాన్నా ముందు స్నానం చేస్తారా! కాఫీ తాగుతారా!" అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

వీడిముఖం వీడికి మర్యాదకూడా తెలియదు. అయినా మర్యాద యేమిటీ యింట్లో! యిది నాయిల్లు కాదూ! వీళ్ళందరూ నావాళ్ళుకాదూ! రాకపోకలు తగ్గి యేదో కొత్తకొత్తగావుంది గానీ, అనుకుని తనలోతనే నవ్వుకుని

"ఒరే అబ్బాయ్! ముందు వేడికాఫీ కావాలిరా" అనేశారు.

"యిదిగో అబ్బాయ్ ! ముందు మంచినీళ్ళు కూడా కావాలి."

"సవితా తాతగార్కి మంచినీళ్ళు యివ్వు తల్లీ" జగన్నాథరావు యిలా రెండుసార్లు పిల్చినా జవాబురాలేదు. రావ్ కోపంగా

"సవితా !" బిగ్గరగా కేకపెట్టాడు.

"ఆ ! వస్తూన్నా డాడీ !" యిప్పటికి జవాబు వచ్చింది

సవిత యింట్లోనే వుందా ! వుంటే నాదగ్గరికి రాదేం. రంగయ్యగార్కి చిరాకెత్తుకొచ్చింది.

"జగన్నాథం వచ్చేవేళా కోడలు యెక్కడికి వెళ్ళినట్లు" అడిగారు. వంట యింట్లోనించి యే అలికిడీ విన్పించక. అసలు యీ యింటికి వంటిల్లు యెటు వైపున వున్నదో కూడా అర్థంకాక.

జగన్నాథం పేపరు చూస్తూనే పెత్తండ్రితో మాట్లాడుతూన్నాడు.

"డాక్టర్ దగ్గరకి వెళ్ళింది. అటునించి అటు మార్కెట్ లో కూరలుకూడా తీసుకుని వస్తానంది."

యింతలో నౌకరు వాసు కారులోని సామానంతా పైకితెచ్చి యజమాని చెప్పినగదిలో అవన్నీ సర్దుతూంటే జగన్నాథం

"వాసూ! ముందు గ్లాసుతో నీళ్ళు పట్టుకురా! చూడూ మంచి కాఫీకూడా తీసుకురా, అర్జెంట్. 'టీ' కాదు కాఫీ."

వాసు నీళ్ళు తెచ్చియిచ్చి అయిదునిమిషాల్లోనే కాఫీ తెచ్చాడు. వేడిగానేవుంది. కప్పూ సాసరూ చూసి

''వాసూ! మరోకప్పు తెచ్చియివ్వు పెదనానగార్కి అది సరిపోదు"అన్నాడు.

"నీకో నాయనా !"

"నేనిప్పటికే చాలాసార్లు తాగాను పెద్దనాన్నా ! వాసు కాఫీ బాగాచేశాడా?"

"ఫర్లేదు" కాఫీ తాగేస్తూ అన్నారు.

"మీరు స్నానంకూడా చెయ్యండి. వాసు బాత్‌రూమ్ చూపిస్తాడు" అంటూ మళ్ళీ వెళ్ళిపోయాడు. వాసు ఖాళీకప్పులు తీసుకువెళ్ళి లోపల యేదో పనిచేస్తూన్నాడు. సవిత 'వస్తూన్నా' అని పావుగంట అయినా అంతులేదు. 'పోనీ రాలేదేం' అని 'వీడు అడగనన్నా అడగడేం' అనుకుని వాసువచ్చి 'రండి స్నానానికి' అనగానే లేచివెళ్ళారు. స్నానం పూర్తిచేసుకుని వచ్చి మళ్ళీ ఆ హాలులోనే కూర్చున్నారు. నిద్ర ముంచుకువస్తోంది. యీ సోఫాలో పడుకోవచ్చునో

లేదో! కిందపరిచివున్న తివాచీ చక్కగావుంది. క్రిందపడుకున్నా ఫర్లేదుకానీ యీ పట్నవాసంవాళ్ళు నవ్వినా నవ్వవచ్చు, అనుకుంటూ ఆలోచిస్తూన్నారు.

కళ్ళు మూతలుపడిపోతున్నాయి. ప్రక్కగదిలోనించి యింగ్లీషూ, హిందీ మ్యూజిక్ కలగాపులగంగా విన్పిస్తోంది. పైన ఫానుగాలి హాయిగా వీస్తోంది. రాత్రిఅంతా రైలులో కూర్చుని కూర్చుని నడుం నెప్పి పుడుతూంటే 'అబ్బ!' అనుకుంటూ పైపిడతువ్వాలు సోఫామీద పరచి నడుం వాల్చారు. చిన్న కునుకు పట్టింది కానీ అదెంతసేపో నిలవలేదు. యెవరివో కోపంగా మాటలు విన్పించి మత్తుగా కళ్ళు తెరిచారు.

ఆ హాలులోనే కాస్తదూరంలో హిప్పీ వేషంలో వున్న యిరవైఅయిదేళ్ళ కుర్రాడు కుక్కపిల్లని యెత్తుకుని రంగయ్యగారివైపు కోపంగా చూస్తూ హిందీలో అరుస్తూన్నాడు. "నాన్సెన్స్! అవి సోఫాలా! కర్రమంచాలా! పిల్లో కవర్స్‌కి యెలా ఆయిల్ అయిందో చూడు వాసూ! నీకు బుద్ధి లేదూ! యీయన్ని యిక్కడ పడుకోమని నువ్వు చెప్పావా?"

యిదంతా తనని గురించే అన్నది అర్థమై నిద్రమత్తు యెగిరిపోయి అమాంతం లేచి కూర్చున్నారు రంగయ్యగారు. అతన్ని పరీక్షగా చూస్తూ బెత్తెడు బెత్తెడు ముక్కలు అతికి కుట్టినట్లున్న లంగా అంత లూజున్న పాంటు, అవే రంగులున్న షర్టు, యెద్దులమెడలో వేసేలావున్న రంగురంగుల పూసల దండా, కుడిచేతికి వెండి కడియం, యెడంచేతివ్రేలికి యెనామిల్ వుంగరం, కళ్ళకి తెల్లఫ్రేమ్ కళ్ళజోడూ— గడ్డం పెరిగివుంది. యెర్రగావున్న జులిపాలజుట్టూ— అసలు వెనకనించి చూస్తే లంగా కట్టుకున్న ఆడపిల్ల అని భ్రమపడవచ్చు. అలా వుంది అతని రూపం.

అతన్ని క్రిందినించి పైకి పరీక్షగా చూస్తూన్న రంగయ్యగార్ని అనిల్‌కూడా అలాగే చూస్తూ ముఖంమాత్రం చికాకుగా పెట్టాడు. చంకలో కుక్కపిల్లని క్రిందకిదించి చరచరా లోపలికి వెళ్ళిపోయాడు. కుక్కపిల్ల యిటూ అటూ తిరిగి రంగయ్యగార్ని వాసనచూసి చక్కగావచ్చి సోఫాలో ప్రక్కన కూర్చుంది.

దీనిదుంపతెగ. జూలు మెత్తగావుంది. వీళ్ళందరూ చాలా శ్రద్ధగా పెంచుతూన్నారులావుంది. యింతకీ యీ జులపాలవాడు అనిల్ కాదుకదా! యే దొంగ వెధవన్నా యింట్లో జొరపడ్డాడా! కాదు. కొత్తవాడైతే కుక్కపిల్ల వూరుకుంటుందా! అన్నట్లు వాసుని పిల్చికూడా యేదో ఆగ్రహం వెళ్ళగక్కాడుగా! అనిల్ అయితే వీడికి యిదేంవేషం. వెధవ యెమ్మెస్సీ మధ్యలో వదిలేసి యీ

పిచ్చివేషాలు వేస్తూ తిరుగుతూవుంటే రాజేశ్వరీ, జగన్నాథం యెలా వూరు కున్నారు. పెళ్ళీడుకి వచ్చిన వెధవ యీ అవతారంతో వుంటే యే ఆడపిల్ల వరిస్తుంది ? అయినా యీ వూళ్ళో మంగలిషాపులు కరువా ? ఏమిటో ?

రంగయ్యగార్కి మహా చిరాకువచ్చింది అనిల్ వేషం చూసేసరికి జగన్నాథాన్ని పిల్చి 'యిదేం పెంపురా ?' అని నాలుగు చీవాట్లూ వేసేయాలన్నంత కోపం వచ్చింది యింతలో "డాడీ ! వాటర్" అంటూ అందమైన పూవులున్న గాజుగ్లాసుతో నీళ్ళుతెచ్చి తండ్రి అక్కడ లేడని "అరె ! డాడీ వాటర్" అరిచింది సవిత, సోఫాలోకూర్చున్న తాతగార్ని చూడకుండానే.

యింక రంగయ్యగారు కళ్ళజోడులోనించి తల ఒకపక్కకి వంచి సవితని చూస్తూన్నారు. యిరుకుగావున్న పాంటులా వున్న పొడుగులాగూ దానిమీద అబ్బాయిలు వేసుకునే కాలర్ షర్టూ వేసుకుంది. రిబ్బన్‌తో కట్టేసింది జుత్తుని. తెల్లగా కాస్త బొద్దుగా అందంగా అమాయకంగా వుంది ముఖం. అయితే చేతులకి గాజులుగానీ మెడలో వంటిపేట గొలుసుకానీ కాళ్ళకి పట్టీలుగానీ చెవులకి జూకాలుగానీ లేవు ముఖాన బొట్టుకూడా లేదు తలంటుకున్నట్టున్న జుత్తు గాలికి యెగురుతూ ముఖాన చిందరవందరగా పడిపోతోంది.

"యిది కొంపదీసి సవిత కాదుకదా !" లోపల అనుకోబోయి పైకే అనేశారు. అప్పుడు తలతిప్పి చూసింది సవిత. "యస్ ! నాపేరు సవితే ! అన్నట్టు మీరు...మీరు... తాతగారా?" అంటూ చేతిలోని గ్లాసుని అలాగే పట్టుకుని రంగయ్యగారి కళ్ళజోడునీ పాతకాలంనాటి కంటిమెడ గుండీలున్న అర్ధకిలో చక్కెర అలాగ్గా పట్టేంత వర్టుజేబునీ దానిలో నిండుగావున్న యేవేవో నోట్ ముక్కలనీ కళ్ళజోడుపెట్టెనీ చూస్తూ—

"మీరు ఆ జేబులో పెట్టుకున్న సామానుతో ఆలిండియా టూర్ కొట్టి రావచ్చు అంటాను. మీరు కాదంటారా ?" అంది.

"ఏమిటీ ?"

సవిత మాటని రంగయ్యగారు అర్థంచేసుకోవటానికి రెండునిమిషాలు పట్టింది. ఆ తర్వాత నవ్వేశారు, సవిత ముఖంలోకి చూస్తూ.

"అన్నట్టు ! మంచినీళ్ళు మీకేనా ! అయితే తీసుకోండి" అంటూ అందివ్వబోయింది.

"మా తల్లే" అంటూ ఆ గ్లాసు అందుకుని "తల్లీ సవితా ! వెనకటికి ఓ అమ్మాయి అచ్చంగా నీలాంటిదే చావకుండా బ్రతికివుంటే యెప్పుడో ఒకప్పుడు

పెళ్ళిచేస్తా అన్నారట. లేకుంటే నేను రైలుదిగివచ్చి యెంతసేపయింది, మీ నాన్న నిన్ను నీళ్ళుతెమ్మని చెప్పి యెంత సేపయింది. వాసు యిచ్చిన కాఫీతాగి స్నానం చేసి పడుకుని ఓ చిన్న కునుకు తీసి మీ అన్నయ్యేనా ఆ జులపాలవాడు వేసిన కేకలకి నిద్ర తేలిపోయి లేచి యెంతసేపయిందీ! యిప్పుడు వచ్చి నీళ్ళుతెచ్చాను తాగు అంటూన్నావా అమ్మా, పోనివ్వు తాగుతాను."

అంటూ సవితవైపు ఆత్మీయంగా చూస్తూ వుండగానే సవిత ఆయన చెప్పిన విషయమంతా అర్థంకానట్లు ముఖంపెట్టి మళ్ళీ యేదో పనివున్నట్లుగా "ప్లీస్ తాతగారూ వన్‌మినిట్! యిప్పుడేవస్తా" అంటూ చెప్పులకాళ్ళతోనే లోపలికి పరుగుతీసింది. సవిత అలా పరుగుతీస్తూంటే "అరె! పడిపోదుకదా!" అన్నట్లు చూస్తూ కూర్చున్నారు. సవిత వెళ్ళినంత వేగంగానూ తిరిగి వచ్చింది, ఓ డైరీ లాంటి బుక్కూ పెన్‌తోనూ సోఫాకి దగ్గిరగా కుర్చీలాక్కుని కూర్చుని కుక్క పిల్లని ఒళ్ళో కూర్చోపెట్టుకుని "యిప్పుడు చెప్పండి. యిందాక మీరేదో కొత్త 'సామెత' వాడారే అది మరోసారి చెప్పండి" అంటూ పెన్ రెడీగా పెట్టుకుంది.

రంగయ్యగార్కి వళ్లుమండింది. యెంతో దూరంనించి తనువస్తే యీ మనవ రాలి పలకరింపుకి అసలే మండిపోతూంది. అసలు సవిత వస్త్రధారణే నచ్చలేదు ఆయనకి. వత్తరిఅయ్యిన పిల్ల చక్కగా వాయిల్‌చీరె కట్టుకుంటే యెంతబాగుం టుంది. పోనీ లంగా,వోణీ అయినా వర్లేదు. వాలుజడా పూవులూ జడకుచ్చులూ వుంటే యెంతబాగుంటుంది. మెడలో గొలుసున్నా బాగుండు. సిగ్గూ యెగ్గూ లేకుండా మగాళ్ళ యెదురుగా కూర్చోవటం పమిటలేకుండా! అయ్యో! రామ. ఛి ఛీ రాజేశ్వరికి అస్సలు బుద్ధిలేదు

రంగయ్యగారు చిటపటలాడిపోతున్నారు సవిత మాత్రం యిదేం గమనించి నట్లు లేదు.

"చెప్పండి తాతగారూ! క్విక్" అంటోంది. ఆలస్యం భరించలేనట్లు. రంగయ్యగార్కి తను మాటల్లోపడి యే సామెత వాడిందీ గుర్తుకురావటంలేదు. 'గుర్తులేదు' అంటే మనవరాలు పిల్ల ఆట పట్టిస్తుందేమో అనుకుంటూ సవితని మెల్లగా కబుర్లలోకిదించి అంతక్రితం తను చెప్పిన సామెతని గుర్తుకి తెచ్చు కునేందుకు ప్రయత్నిస్తూన్నారు. ''సవితా యీ పాతకాలంనాటి సామెతలన్నీ యిలా 'నోట్' చేసి యేంచేస్తావ్!" అన్నారు

సవిత కుక్కపిల్లని ముదుచేస్తూనే ముఖానపడే జుత్తుని వెనక్కి తోసుకుంటూ "మా చిన్నన్న భరత్‌లేడూ వాడికి యీ సామెతలంటే చాలా యిష్టం. కష్టపడి

‘కలెక్ట్’ చేసి నోట్ చేయటం ఒక హాబీ. అసలు మాకిలాంటివి చాలా అపురూ పంగా దొరుకుతాయి. యెందుకంటే ఆంధ్రాకి చాలా దూరంగా వున్నాం కదా! అందుకూ మా చిన్నన్న యెవరన్నా సరే కొత్తసామెత చెప్తే చాలు టెన్ రుపీస్ యిస్తాడు. తాతగారూ మీరు తిరిగి వెళ్ళిపోయేలోపల నేనో హండ్రెడ్ రుపీస్ అన్నా సంపాదించాలి అని యిప్పుడే ప్లాన్ వేశాను.”

“అలాగా! అయితే చాలానే చెప్తాను కానీ మీ చిన్నన్నకి అంతడబ్బు నీ కిచ్చేందుకు యెలావస్తుంది! నీకు టెన్ రుపీస్ యివ్వటానికి ప్రతిసారీ” టెన్ రుపీస్ అన్నమాట అచ్చంగా సవితలానే పత్తి పల్కారు రంగయ్యగారు. అది గుర్తించి ఓసారి ఆయన ముఖంలోకి వింతగా చూసి యేం పట్టించుకోకుండా

“డాడీ పెద్దన్నకీ, చిన్నన్నకీ, నాకూ పాకెట్ మనీ ప్రతిమంతూ యిస్తారు..”

“అలాగా! అయితే మరి యింక యిలా డబ్బు సంపాదించటం ఎందుకూ!”

“పెద్దన్న ఫాదర్ యిచ్చిన డబ్బు ఒక్కరోజులో ఖర్చుచేస్తాడు. యింక మమ్మీని డబ్బుకావాలి అని వేధిస్తాడు. చిన్నన్నేమో కంజూస్. పాకెట్ మనీలో ఒక్క వన్ రుపీ కూడా ఖర్చుచేయడు.”

“మరి నువ్వు?”

“నేనా! పెద్దన్నలా చెయ్యను కానీ అప్పుడప్పుడూ ‘దోస్త్’లని పిక్చర్ కి, హోటల్ కి యిలా తీసుకువెళ్ళవల్సివస్తుంది. ఒక్కసారికూడా సరిపోదు. డాడీ అస్సలు యెక్కువగా యివ్వరు.”

“మరెలా నీకు. మంత్ అంతా.”

“చిన్నన్నదగ్గర అప్పు చేస్తూంటాను. యిప్పటికి చాలానే బాకీపడ్డాను. అన్నట్లు తాతగారూ, మీకు తెల్సిన సామెతలన్నీ నా ఒక్కదానికే చెప్పండి! అన్నయ్యలకి అస్సలు చెప్పవద్దు. చూడండి. మీరు యీ నోట్ బుక్ లో నోట్ చేయనివే చెప్పాలి అంటే కొత్తవి అన్నమాట. మీరుచెప్తే నేనీ నెల బాకీఅంతా తీర్చేస్తాను.”

సవిత కుక్కని కుర్చీలో కూర్చోబెట్టి తను నిల్చుని మాట్లాడుతూవుంది. రంగయ్యగారు ఆ యింటి వాతావరణాన్ని అర్థంచేసుకునేందుకు ప్రయత్నిస్తూ న్నారు. యీ సామెతల కబుర్లు వీళ్లకి అవసరాన్ని వుపయోగించుకుంటూ ఒక్కోటీ చెప్పాలి. లేకుంటే వీళ్లు మళ్లీ పలకరించకపోవచ్చు అనుకుంటూ తనలో తనే నవ్వుకుంటూ తను చెప్పినసామెతని గుర్తుతెచ్చుకునేందుకు ప్రయ త్నిస్తూన్నారు. అది చస్తే గుర్తుకిరావటంలేదు.

"చెప్పండి తాతగారూ!" సవిత త్వరపెట్టటం మొదలుపెట్టింది.

సవిత నోట్ బుక్‌లోకి తొంగిచూస్తూ

"ఔనూ! తెలుగు సామెతలని ఇంగ్లీషులో నోట్ చేసుకుంటున్నావేం!" అన్నాడు.

"తెలుగు రాయటం రాదుగా."

"ఓయ్ దేవుడా! మరి నీ మొగుడికి వుత్తరాలు రాయాలంటే యెలా!"

"ఇంగ్లీషులో రాస్తాను"

"నిజమే! సరేగాని ఇంగ్లీషులో రాసిన సామెతలకోసం టెన్‌రుపీస్ ఖర్చు చేయటం వేస్ట్ కదా!"

"కాదు! యివన్నీ ఒక 'బుక్' లా ప్రింట్ చేయిస్తే యీ బొంబేలో హాట్ కేక్‌లా అమ్ముడుపోతాయి."

"ఆ.. యీ ప్లాన్ అంతా నీదేనా!" ఆశ్చర్యంగా అన్నాడు.

"కాదు! పెద్ద బ్రదర్‌ది."

"యిందాకటి జలపాలజుట్టువాడేనా! వెధవని మా వూరు తీసుకువెళ్ళి మా వాసుగాడిచేత సమ్మర్ క్రాష్ చేయించి పంపిస్తాను. తెలుగు సామెతలని ఇంగ్లీషులో అచ్చువేయించి అమ్ముతాడూ! సామెతలంటే యేమిటనీ వీడి వుద్దేశ్యం? జీవితాల్లోని కష్టసుఖాలు కాచి వడబోసి ముందుతరాల వారికోసం వాళ్ళ భవిష్యత్తులో బంగారు బాటలు వేసుకోవాలనీ ఆలా వేసుకోవటంలో తప్పటడుగులు వేయబోయేప్పుడు యీ సామెతలనేవి 'తస్మాత్ జాగ్రత్త' అని హెచ్చరికలు యిచ్చే యివి వజ్రపు తునకలు కావూ! తెలుగు భాషకీ తెలుగు సంస్కృతికీనూ! అసలు వీటిని అర్థంచేసుకుని విజ్ఞత తెచ్చుకుని మనస్సుని విశాలం చేసుకుని సుఖశాంతులతో వర్థిల్లాలి కానీ ప్రతిదానికీ కమర్షియల్ రూపాన్నిచ్చే స్వార్థపరుడైన యీనాటి మనిషిని ఆ దేవుడు కూడా రక్షించలేడు. ఓ మంచి పనిచేయాలంటే యీలాంటి సామెతలని చక్కగా సేకరించి తెలుగులో పుస్తకంగా అచ్చువేయించి తెలుగుదేశానికి దూరంగా వున్న యిక్కడివారికి ఉచితంగా అందించాలి. యిలా చేస్తే అందరూ సంతోషిస్తారు."

రంగయ్యగారు యీ మాటలన్నీ గబగబా అనేస్తూంటే సవిత కళ్ళు చిట్లించి అర్థంకానట్లు చూస్తోంది.

"సవితా! యేదమ్మా నీ చేతిలోని పుస్తకం యిలా యివ్వు. యేవేవి నోట్ చేశారో చూస్తాను" చెయ్యి చాచి అడిగాడు.

"మీకు ఇంగ్లీషు వచ్చునా ?" పుస్తకం యివ్వకుండానే అడిగింది.

"యేదో కాస్త వచ్చుగానీ యిలాతే ?"

అంటూ దాన్ని అందుకుని చదువుతూ తలపంకిస్తూ

"షేక్స్ గొప్పగానే వుంది. సరేగానీ సవితా యీ సామెతల్లో ఒక్కదానికైనా అర్థం తెలుసునా ?" అన్నారు.

"ఉహూ ! అవన్నీ మీకెందుకు" విసుగ్గా చూసింది సవిత.

పల్లెటూరి గబ్బిలాయియాయనా యేదేదో మాట్లాడేస్తున్నాడు. సరిగా అర్థం అయి చావటంలేదు. డాడీ అయినా లేరు.

యీ భావం ఆ పిల్ల కళ్ళలో చదివేశారు రంగయ్యగారు.

యింతలో ఫోన్ గణగణ మ్రోగింది.

"ధూత్ ! మధ్య మధ్య యీ ఫోన్ గోల ఒకటి !" విసుక్కుంటూ నిర్లక్ష్యంగా అందుకుని,

"హలో సవిత స్పీకింగ్" అంది కుక్కపిల్లని ముద్దాడుతూనే. అవతలనించి యెవరి గొంతు విన్పించిందోగానీ కుక్కపిల్లని గభాలున దించేసి,

"హాయ్ ! నేనే సవితని. అరె గోకుల్...తుమ్ ! ఖమోష్ ... డాడీ ... ఘర్ మే... హై."

సవిత హిందీలో యింకా ఫోనులో మాట్లాడుతూనేవుంది కానీ ఆ ఉచ్ఛారణ ఆదోలా వుండి సరిగా అర్థంకావటంలేదు రంగయ్యగారికి. అయినా సవిత వాలకం గమనిస్తూనే వున్నారు. చాలా హుషారుగా మాట్లాడుతోంది, కాస్సేపు గొంతు తగ్గించీ, కాస్సేపు బిగ్గరగానూ ! ఆ అమ్మాయి ముఖంలో యిందాకటి నించీ చూడని కొత్త వెలుగుని పసికట్టారు.

ఎవరా గోకుల్ ! ఆడా ! మగా ! అర్థంకావటంలేదు. అబ్బాయే అయి వుండచ్చు.

యింతలో కాలింగ్ బెల్ మ్రోగింది. వాసు చకచకా వెళ్ళి తలుపుతెరిచాడు. రాజేశ్వరమ్మ "హుష్ అబ్బ యెండ మండించేస్తోంది ! వాసూ మామగారు వచ్చారా లేదా ?" అడుగుతోంది.

"వచ్చారు" అంటూ వాసు బైటికి వెళ్ళాడు. సవిత తల్లి రావటం గమనించి "గోకుల్ ! మమ్మీ ... టాటా ! బై ..." అంటూ ఫోన్ పెట్టేసింది. రాజేశ్వరమ్మ మామగారు కూర్చున్న దగ్గరికి వచ్చింది.

"మమ్మీ షాపింగ్‌కి వెళ్ళి యింతసేపటి కొచ్చావటం ఏం తెచ్చావ్ ?"



అంటూ వచ్చి తల్లిమెడ వాటేసుకుంది. ఆవిడ సవిత చేతులు మెల్లిగా తీసేస్తూ,

"వాసు అవన్నీ పైకి తెస్తున్నాడు చూసుకోమ్మా" అనటం తడవుగా బైటికి పరుగెత్తింది.

యింక రాజేశ్వరమ్మ మామగారి దగ్గరికి వచ్చి కుశలప్రశ్నలువేస్తూ,

"అత్తగార్ని తీసుకురాలేదేం ?" యెన్నాళ్ళుగా వుత్తరాలు రాస్తున్నాం మేము. యిప్పటికి వచ్చారు ! వాసు కాఫీ యిచ్చాడా ! స్నానం చేశారా ! మళ్ళీ కాస్త కాఫీ యివ్వనా !" ఆత్మీయంగా మాట్లాడే కోడలిని చూసి

"అమ్మయ్య !" అనుకున్నారు. కోడలు అడిగిన ప్రశ్నలన్నింటికీ జవాబులు చెప్పారు.

"యిప్పుడే బట్టలు మార్చుకు వస్తాను" అంటూ మరో గదిలోకి వెళ్ళి వచ్చి మళ్ళీ కబుర్లు మొదలుపెట్టింది రాజేశ్వరమ్మ.

రాజేశ్వరిమాత్రం మారినట్లు లేదు యీ యింట్లో" అనుకున్నారు రంగయ్యగారు.

"రాత్రి అంతా ప్రయాణంచేసి వచ్చారు, నిద్ర వుండి వుండదు. భోజనం చేసేయండి వడ్డించేస్తాను. వాసూ డైనింగ్ టేబిల్ మీద అన్నీ పెట్టు" అంది. వాసూ, సవితా యేవేవో పాకెట్లు తెచ్చి లోపల పెట్టేశారు.

"సవితా ! అందర్నీ పిలమ్మా."

అంటూ వడ్డించేస్తోంది రాజేశ్వరి. జగన్నాధం, యిందాకటి జులపాల అబ్బాయి అనిల్ వచ్చి కుర్చీల్లో కూర్చున్నారు. రంగయ్యగారు షర్ట్ విప్పి తువ్వాలు భుజంనిండా కప్పుకుని వచ్చారు. రెండోవాడు భరత్‌భూషణ్ యింటికి వచ్చేశాడు.

"భరత్ ! తాతగారు" అన్నాడు జగన్నాధం.

నమస్కారం' చేశాడు భరత్ భరత్‌కి యిరవై రెండేళ్ళు దాటి వుండచ్చు. పెరీకాట్ పాంటూ 'బ్లాక్' షర్టూ వేసుకుని యెడంచేతికి నల్లబెల్ట్ రిస్ట్‌వాచ్ పెట్టుకుని చాలా సింపుల్‌గా వున్నాడు. తెల్లటి తెలుపురంగు. విశాలమైన నుదురు. కళ్ళు పెద్దవి. అతన్ని చూడగానే యింకోసారి చూడా లన్పిస్తుంది ప్రతివారికీ.

వీడికి జులపాలు లేవే ! అనుకున్నారు.

"భరత్ త్వరగా బట్టలు మార్చుకురా నాయనా !" తల్లి అలా అనేసరికి భరత్,

"వచ్చేస్తూన్నానమ్మా" అంటూ వెళ్ళాడు. పైజామా లాల్చీ వేసుకుని చేతులు కడుక్కుని వచ్చి కూర్చున్నాడు అన్నగారి ప్రక్కన.

"వీడేం చేస్తూన్నాడూ !" కొడుకుని అడిగారు రంగయ్యగారు

"ఎం. ఏ పాసైనాడు. ఉద్యోగం చేస్తానంటాడు. నేనే వద్దు అంటున్నాను. యేదైనా అవకాశం చూసి ఫారెన్ పంపాలనుకుంటున్నాను. కానీ వాడికి యిష్టం లేదు. ఆంధ్రాకి వెళ్ళి అక్కడ వ్యవసాయంగానీ యేదైనా బిజినెస్‌గానీ చేయాలని వుందని అంటూన్నాడు. మేం యిక్కడా వాడు అక్కడా అయితే యెలా ! అని ఆలోచిస్తున్నాను."

"ఊ ! మరి పెద్దవాడు."

"వాడినే అడగండి" జగన్నాధం భోజనంచేస్తూ అన్నాడు. అనిల్ మాట్లాడ లేదు.

"అనిల్‌కి ఫారెన్ వెళ్ళాలనే వుంది. కానీ—నాకే పంపాలని లేదు" రాజేశ్వరమ్మ కలగజేసుకుంటూ అంది.

"యెందుకని ?"

"ఇదర్ ఫారెన్ వెళితే తిరిగి ఇండియా రానంటాడేమో అని మమ్మీకి భయం."

సవిత చపాతీ, కూరతో తింటూ చెప్పింది.

"ఎందుకుటా ?" ఆశ్చర్యంగా అడిగారు రంగయ్యగారు.

"నిక్షేపంలాంటి చదువు మధ్యలో ఆపి యిక్కడ జులాయిగా తిరుగుతూన్నాడుగా! చాలు" కోపంగా అన్నాడు జగన్నాథం. అనిల్ ముఖం అప్పటికే జేవురించిపోయిందని గ్రహించిన రాజేశ్వరమ్మ విషయం మార్చేస్తూ యింకేదో కబుర్లు చెప్తోంది.

రంగయ్యగారికి జగన్నాథం తనకి రాసిన వుత్తరాల్లోని విషయాలు గుర్తుకి వస్తూన్నాయి. ఒక ఉత్తరంలో యిలా రాశాడు:

పెదనాన్నా!

నమస్కారం పెద్దమ్మ బాగుందా? నా పిల్లలని మీ దగ్గరికి పంపమని రాశారు కానీ వాళ్ళు మిమ్మల్ని ఎరగనే ఎరుగరు. ఒకసారి మీరు వచ్చి కొన్నాళ్ళు వుండి తీసుకువెళ్ళండి

అనిల్‌కి చదువు వంటబట్టటంలేదు. గర్ల్ ఫ్రెండ్స్, ఆవారా ఫ్రెండ్స్, ఖరీదైన దురలవాట్లూ చాలా అయినట్లు తెలుస్తోంది. వాడికి యెన్నోసార్లు మెల్లగా చెప్పాను. భయపెట్టాను. యేంచేసినా మాట వినటంలేదు. వీడిని యేంచేయాలో తెలియటంలేదు. యీ మధ్య 'మేరీ' అనే అమ్మాయితో స్నేహితం యెక్కువైంది. ఆ పిల్ల ఆస్తిమీద కన్నువేసింది. యీ బెడద యెలా తప్పించేయాలో అర్థంకావటంలేదు చాలా 'వర్రీగా' వుంది." అంటూ రాశాడు. దానికి రంగయ్యగారు యిచ్చిన జవాబూ గుర్తుకివస్తోంది.

"ఓ రంభలాంటి పిల్లని చూసి ముడివేసెయ్యి పెళ్ళి అయిపోతే అలాంటి పైత్యాలు దిగిపోతాయి" అని రాశారు.

"అలా చేయాలనే వుంది. కానీ వీడు మన మాట విని పెళ్ళాడేలా లేడు. యేమైనా మేరీనే చేసుకుంటాను అంటున్నాడట."

యిది చదివి తలగోక్కున్నారు. సరే ఓసారి వెళ్ళి వద్దాం అనుకునేంతలో

దేరి వచ్చారు. ముగ్గురు పిల్లలనీ చూస్తున్నారు. వాళ్ళ మనస్తత్వాలని అర్థంచేసు కునే ప్రయత్నంచేస్తూన్నారు.

రాజేశ్వరమ్మ పల్లెటూరి కబుర్లు అడుగుతోంది.

"మామగారూ ! మీరింకా పెరట్లో కూరగాయలు పండిస్తూనే వున్నారా ?"

"యిదివరకంత ఓపిక లేదుగానీ పనిచేయటం అలవాటు అయిన చెయ్యి ఊరుకోదమ్మా" మజ్జిగ కలుపుకుంటూ అన్నారు

"నేను భరత్ పురిటికి అక్కడికి వచ్చినప్పుడు అబ్బ మన పెరట్లో యెంత పొడుగు పొట్లకాయలు కాసేవనీ ! వాటితో అత్తయ్యగారు కమ్మటికూర వండి పెట్టేవారు. పెరుగు, చట్నీ చేసేవారు. యెంత రుచిగా ఉండేవో ! అలాంటివి యిక్కడ యెంత డబ్బుపెట్టినా దొరకవు! అసలా దంపుడు బియ్యం అన్నం, ఆ గాలీ, నీళ్ళూ, కూరల రుచీ అమోఘం. గోంగూర పండు మిరపకాయలు కలిపి నిలవ పచ్చడి పెట్టుకుంటే తినటానికి యెంత రుచిగా వుంటుందనీ !"

జరిగిపోయిన కాలాన్ని గుర్తుకుతెచ్చుకుంటూ వుంది ఆవిడ.

"రాజేశ్వరీ ! నే తెచ్చినవాటిల్లో పులిహోర, గోంగూర పచ్చడికూడా పెట్టాను అని చెప్పింది మీ అత్తగారు. అవన్నీ తీసి సర్దుకున్నావా ?"

భరత్ వాళ్ళ సంభాషణ ఆసక్తిగా వింటూన్నాడు. అనిల్ విసుగ్గా ముఖం పెట్టి, "మమ్మీ చపాతీ" అంటున్నాడు.

"రాజేశ్వరీ ముందు పెద్దనాన్న తెచ్చిన మూటలువిప్పి పులిహోర, గోంగూర తీసుకురా."

జగన్నాథం భోజనంచెయ్యటం ఆపి కూర్చున్నాడు.

"మమ్మీ అదేదో నాకూ్కడా'' సవిత అడిగింది, కుర్చీలో వెనక్కి వాలి కూర్చుంటూ.

"కారం ! చచ్చిపోతావు" అనిల్ సణిగాడు.

"చూద్దాం."

రాజేశ్వరమ్మ తెచ్చి వేసింది. భరత్ అప్పటికే చెయ్యి కడిగేశాడు. అనిల్ "అదేం వద్దు" అని లేచాడు. సవిత కారం అలవాటులేకున్నా కళ్ళనీళ్ళు వస్తున్నా అది తింటూనే వుంది. "తాతగారూ చట్నీ ధాలా బావుంది. మీకు మెనీ మెనీ థాంక్స్."

"సవితా తాతగారికి కాదు, నాయనమ్మకి చెప్పాలి థాంక్స్" అంది తల్లి.

"అలాగా !"




"చూడు సవితా ఆవిడనికూడా రమ్మని వుత్తరం రాయి. నువ్వు రాస్తే పరుగెత్తుకుని వచ్చేస్తుంది."

"నిజంగానా డాడీ."

"ఊఁ ! నిజంగా."

"రాజేశ్వరీ ! అనిల్, భరత్ కారం అని భయపడ్తారుగానీవాళ్ళకి అరిసెలు పెట్టు, తింటారు" రంగయ్యగారు చెయ్యి కడిగిలేస్తూ చెప్పారు. రాజేశ్వరి లోపలికి వెళ్ళింది.

"అనిల్ ! నీకోసం మీ నాయనమ్మ అచ్చంగా నేతితో నువ్వులు అద్దిన అరిసెలుచేసి యిచ్చింది. చిన్నప్పుడవి నీకు బాగా యిష్టంట కదూ !" రంగయ్య గారు తనంత తనుగా అనిల్‌ని పలకరించారు. అనిల్ జవాబు చెప్పలేదు.

"నేనెప్పుడూ అవి తినలేదు తాతగారూ!" అంటూ భరత్ తల్లి ప్లేటులో తెచ్చి యిచ్చినవి తీసుకుని రుచిచూస్తూ "అరె ! చాలా బాగున్నాయి. మరోటి" అన్నాడు. అనిల్ అరిసెల ప్లేటు తీసుకుని తింటూనే తన గదిలోకి వెళ్ళాడు.

"సవితా ! మీ పెద్దన్నకి తెలుగు రాదా" అడిగారు, కోపాన్ని మింగేస్తూ.

"వస్తుంది. కానీ పెద్దన్నకి ఓల్డ్‌మెన్‌లంటే చికాకు."

అమాయకంగా చెప్పేస్తోంది సవిత. జగన్నాథం కూతురికి సంజ్ఞచేసినా

సవిత గ్రహించటంలేదు. ఆయన అక్కడనుంచి గదిలోకి చూశారు. అప్పుడే అనిల్ రేడియో పెట్టుకుని అరిసెలు తింటున్నాడు.

"అలాగా! అయితే వాడు యెప్పుడూ యిలాగే శ్రీకృష్ణపరమాత్మలాగా జులపాలు వేసుకుని తిరుగుతూ 'యంగ్‌మెన్'లా వుంటాడా!"

"ఐ డోంట్ నో" సవిత గాభరాగా అంది.

"నే చెప్తున్నా కదమ్మా, వీడిలాంటివాళ్ళు నలభై యేళ్ళుకూడా రాకుండానే నాకంటే కూడా ఓల్డ్‌మెన్‌లా అయిపోతారు."

"ఐ డోంట్ నో" యీసారి మరీ చికాకుగా అంది సవిత. రంగయ్యగారు నవ్వేసి యింక ఆ విషయం వదిలేశారు.

"జగన్నాథం! మన అనసూయ వుంది చూశావూ, నీకు అక్కవరుస అవుతుంది. అది యీ ఊళ్ళోనే ఉన్నట్లు తెల్సిందిరా అదీ ఆ మధ్య మన ఊరు వచ్చి తన అడ్రస్ యిచ్చి తప్పకుండా రమ్మని చెప్పింది. వాళ్ళు చాలా మంచి స్థితిలో ఉన్నారుట. అతనికి మంచి ఉద్యోగంట. యిల్లు ఉందట. ఒక్కతే అమ్మాయిట. బి. ఏ. ఫైనల్ యియర్ అన్నట్లు చెప్పింది. పిల్ల చాలా బాగుంటుందిట. ఆ యిల్లు తెలుసుకోవాలి."

"అడ్రస్ యిస్తే భరత్ మీ వెంట వచ్చి చూపిస్తాడు యింక నాకు పని వుంది వెళ్ళిపోవాలి."

బట్టలు మార్చుకుని వెళ్ళిపోయాడు. రంగయ్యగారు తనకోసం వేసిన మంచంమీద పడుకున్నారు. రాజేశ్వరమ్మ తెలుగు పత్రిక పట్టుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది. సవిత డ్రెస్ మార్చుకుని యెక్కడికో వెళ్ళిపోయింది.

## 2

వారంరోజులు ప్రొద్దునా సాయంకాలం నిర్విరామంగా బాంబే అంతా తిరిగి చూసినా తనివి తీరలేదు రంగయ్యగారికి. యిక్కడ చూడవల్సినవన్నీ తన మనవలు వెంటవుండి చూపిస్తారనుకున్నారు కానీ జగన్నాథం నౌకరినిచ్చి పంపాడు. యిందుకే చాలా బాధగా వుంది ఆయనకి.

తాతయ్యతో వడతాం అని ఒక్కరూ అనరేం! యేం పిల్లలు వీళ్ళు! పెద్దవాడిని అనే గౌరవంగానీ, అభిమానంగానీ లేదే! అంతా యాంత్రికత. అసలు వీళ్ళకి ఒక్కొక్కరికి ఒక్కొక్కగది యెందుకూ! యెవరి స్నేహితులు వారికి. వారికి టిఫిన్లూ, టీలూ వాసు గదిలోకే అందించాలి! ఆడపిల్ల సవితకి యిదే అలవాటు.

ఆ వచ్చినవాళ్ళని యింట్లోవున్నవాళ్ళకి పరిచయం చేయటంకూడా లేదు. యేం మనుష్యులు వీళ్ళు. వీళ్ళలో ఒక్క భరత్ అలవాట్లుమాత్రం వేరుగా వున్నాయి. తన స్నేహితులతో కాస్సేపు కబుర్లు చెప్పినా తల్లికి. తాత గారికీ పరిచయం చేస్తాడు. వాళ్ళు నమస్కారంచేసి కాస్సేపు కబుర్లు చెప్పి వెళ్ళి పోతారు. యిది చాలా నచ్చింది రంగయ్యగారికి

అసలు భరత్ అలవాట్లే వేరు. తల్లిదండ్రులంటే గౌరవం, చెల్లెలంటే అపేక్ష, అన్నగారంటే ఆత్మీయతా, తాతగారంటే యిష్టం స్పష్టంగా తెలుస్తూ వుంటుంది. అన్నగారి అలవాట్లు నచ్చకపోయినా విమర్శించడు.

యింక సవిత పూటకోరకంగా దుస్తులు మారుస్తూ ఫాషన్ ఫాషన్‌గా అదే జీవితధ్యేయం అన్నట్లుగా యెక్కడెక్కడో తిరుగుతూ చాలా బిజీగా ఉంటుంది.

యింక జగన్నాథం ఆ యింట్లో వుండే టైమే తక్కువ. యింటి బాధ్యత అంతా రాజేశ్వరమ్మదే. జగన్నాథానికి యెన్ని పనులున్నా ఆస్తమానం బైటనే యెలా కాలక్షేపంచేస్తాడబ్బా ! అనిపిస్తుంది రంగయ్యగారికి వారం గడవ కుండానే కొడుకు యింటి పరిస్థితీ, పద్ధతీ అర్థమైపోయింది. రాత్రి పన్నెండు దాటినా యింటికి చేరని భర్తకోసం యెదురుచూస్తూ కూర్చుంటుంది రాజేశ్వరమ్మ. సోఫాలో కూర్చుని కునికిపాట్లు పడే కోడల్ని గమనిస్తూనే వున్నారు మామగారు.

అనిల్ ఒకటి రెండురోజులు అసలు యింటికే రాడు. యెక్కడ వుంటాడో మరి !

రంగయ్యగారు ఒకరోజు రాజేశ్వరిని కోపంచేశారు.

"అబ్బాయి చూస్తే అర్ధరాత్రికానీ రాడు. మనవడు చూస్తే రెండురోజులుగా పత్తాలేడు. యేమిటమ్మా యిదీ !" అని.

రాజేశ్వరమ్మ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. తలవంచుకుని మౌనంగా ఉండి పోయింది.

"ఈ పద్ధతి నాకేం నచ్చలేదు! యెంత సంపాదించుకుంటున్నా యిల్లు ప్రశాంతంగా వుంచుకోవద్దూ ! పిల్లలకి క్రమశిక్షణ యివ్వవద్దూ ! వయస్సు రాగానే ఓ యింటివాళ్ళని చేయెద్దూ ! సత్రాభోజనం మఠానిద్రలాగా యెవరి గోల వాళ్ళదే అయితే యెలా ! అన్నట్లు సవితకి పెళ్ళీడు వచ్చింది, అన్న విషయం

మీరిద్దరూ గుర్తించారా ? యిదిగో పెద్దవాడిని చాలా దూరం ఆలోచించి చెప్తున్నాను. కాస్త నా మాట వినండి. దూరం ఆలోచించండి."

"సవితకి మంచి సంబంధం చూసి పెళ్ళిచేసేయాలనే అనుకుంటున్నాను. కానీ అనిల్‌కి ముందు చేయాలి ; కానీ వాడేమో కలిసిరావటంలేదు. ఆ మేరీ తప్ప నాకు మరెవరూ వద్దు అంటాడు. యెలా ?"

రంగయ్యగారు కోడలు చెప్పేదంతా మౌనంగా విన్నారు.

"యెలాగైనా వాడిని వాళ్ళ వలలోనించి తప్పించకుంటే వాడి భవిష్యత్తే నాశనం అయేలా ఉంది."

"మీకెలాగూ కులాల పట్టింపు లేదుగా ; ఆ పిల్లనే ముడిపెట్టేస్తే పోలా."

"కులం విషయం కాదు మాకు అభ్యంతరం. ఆ పిల్లకి మంచి గుణం అయినా లేదు. వీడి డబ్బుకోసం ఆశ కానీ వీడంటే ప్రేమలేదు. యిదివరకే యిద్దరు, ముగ్గుర్ని యిలాగే పెళ్ళాడతానని డబ్బు గుంజి వదిలేసిందిట. యివన్నీ తెలిసి చూస్తూ చూస్తూ యెలా గోతులో దిగం" నిట్టూర్చింది రాజేశ్వరమ్మ.

"యీ విషయాలన్నీ అనిల్‌కి తెలియవూ."

"తెలియవు ; మేంచెప్పినా నమ్మటంలేదు."

"అయితే కష్టమే. మరి యేం చేస్తే దారికి వస్తాడు వీడూ ; యింతకీ ఆ మేరీ చాలా బాగుంటుందా ; వయస్సు యెంత వుంటుంది?"

"వీడికంటే చాలా పెద్దది. కానీ చిన్నపిల్లలా కన్పిస్తుంది. అందంకంటే వేసుకునే డ్రెస్సులూ; చేసుకునే మేకప్పుతో అందరినీ వలలో వేసేసుకుంటుంది. యేమీ యెరుగని అమాయకురాలిగా నటిస్తుంది. అస లీపీడ యెలా విరగడ అవుతుందో తెలియడంలేదు."

రాజేశ్వరమ్మ ఆవేశంగా చెప్తోంది.

"అనిల్‌కి యెందరో పిల్లని యిస్తాం అంటూ వచ్చారు. కానీ వీడు మాడడే."

"ఊం."

"మామగారూ ; మీ రెలాగైనా అనిల్ పెళ్ళి అయ్యేలా చూడాలి ; యేదైనా ఉపాయం ఆలోచించండి. వాడిని ఆ రాక్షసినుంచి రక్షించండి. అది పిల్లకాదు, అడదెయ్యం. పట్టుకుంది కానీ వదలటంలేదు. దీన్ని వదిలించే ఉపాయం



యెవ్వరికీ తెలియటంలేదు. అసలు అనిల్ మనస్సు ఆ పిల్లమీదనించి మళ్ళించటం యెలా ? అన్నది తల పగలగొట్టుకున్నా అర్థంకావటంలేదు."

యిలా చాలాసేపు యెన్నెన్నో విషయాలు చెప్పింది రాజేశ్వరి.

రంగయ్యగారు కోడలు చెప్పినదంతా శ్రద్ధగా విన్నారు. వీడిని దారికి తేవటం యెలా ? యిదే ఆయన్ని వేధిస్తూన్న ప్రశ్న.

అనిల్‌కి, భరత్‌కీ తూర్పుకి పడమరకీ ఉన్నంత వ్యత్యాసం ఉంది. యిద్దరినీ రాజేశ్వరే పెంచినా యిలా యెలా తయారుఅయారు ? సవిత కూడా వీళ్ళకి సమస్య అయి కూర్చుంటోంది అన్పిస్తోంది. అమ్మ దగ్గరా, నాన్న దగ్గరా అతి అమాయకంగా నటించే సవిత చాలా తెలివిగల దన్పిస్తోంది. ఊ ? యేం పిల్లలో. డబ్బు లేనివాళ్ళకి పిల్లలు సమస్య అయితే డబ్బు ఉండి

వీళ్ళని చక్కగా చదివిస్తూ కావల్సినవన్నీ ఇస్తూన్నా సరైన పద్ధతిలో వీళ్ళు యెందుకు రావటంలేదు? యీనాడు పిల్లలమీద యింటి వాతావరణంకంటే బైటి వాతావరణమే యెక్కువ ప్రభావం చూపుతోంది.

ఆలోచనలు ఆయన్ని తినేస్తున్నాయి. అనిల్‌ని యెలా దారిలోకి తీసుకు రావాలి? పసలీ వయస్సులో ఆగ పిల్ల వ్యామోహంలో పడితే వాళ్ళ మనస్సుని మళ్ళించటం చాలా కష్టం. అయినా ప్రయత్నించాలి? కానీ యెలా? యెన్నో ఆలోచనలు తిరగుతున్నాయి. కానీ వాటివల్ల ప్రయోజనం ఉండదు అని తెలుసు, అనుకున్నారు.

## 3

రాత్రి భోజనంచేసి పడుకున్నారు రంగయ్యగారు. అనిల్ గదిలోనించి ఇంగ్లీషు మ్యూజిక్ విన్పిస్తోంది. భరత్ టేబిల్ లైటుముందు కూర్చుని యేదో చదువుకుంటున్నాడు. సవిత సినిమా పుస్తకాలు తిరగేస్తూ అలాగే నిద్ర పోయింది. రాజేశ్వరి వెళ్ళి కూతురికి దుప్పటి కప్పి లైటు తీసేసి యివతలకి వస్తూ అనిల్ గదిలోకి తొంగిచూసింది రేడియో మోగుతూనే ఉంది. అతను నిద్రపోతూనే వున్నాడు. గది అంతా చిందరవందరగా పుస్తకాలూ, బట్టలూ పడి వున్నాయి. అవన్నీ సరిచేసి 'యేం పిల్లాడు వీడు' అనుకుని గది తలుపు దగ్గరగా లాగి వచ్చి హాలులో కూర్చుంది.

గోడ గడియారం పదకొండు గంటలు కొడుతూంటే రంగయ్యగారికి మెలుకువ వచ్చింది. కళ్ళు తెరిచి చూశారు. రాజేశ్వరి అలా కూర్చునే ఉంది

"అబ్బాయి యింకా యింటికి రానట్లుంది" అనుకున్నారు.

యింతలో కాలింగ్ బెల్ విన్పించి రాజేశ్వరి వెళ్ళి తలుపు తెరిచింది.

జగన్నాధం తూలుతూ వెళ్ళిపోయాడు పడక గదిలోకి. యిదంతా చూస్తున్న రంగయ్యగారికి నిద్రకాస్తా యెగిరి చక్కాపోయింది.

కొడుకు గదిలోనించి మాటలు కాస్త బిగ్గరగా విన్పిస్తూన్నాయి. కోడలు వెక్కి వెక్కి యేడుస్తున్న శబ్దం, జగన్నాధం బాత్‌రూములోకి వెళ్ళి వాంతిచేసుకోవటం విన్పిస్తోంది. రంగయ్యగారు తెల్లవార్లూ జాగరణ చేశారు ఆవేదనతో.

మనిషి నైతికవిలువలకి ప్రాధాన్యత యివ్వటం మానేసినప్పటినించీ అశాంతీ, అసంతృప్తీ ఎక్కువైంది. వీళ్ళు యింత డబ్బు సంపాదించుకుంటున్నా శాంతి వున్నట్లు లేదు. అసలైన శాంతి డబ్బులో దొరుకుతుంది

అనుకుంటారు యీ కాలంవాళ్ళు ! యీనాటి సమాజంలో మనిషిని స్వేచ్ఛా జీవిని చేస్తోందా ! లేక మనిషే స్థిరమైన అభిప్రాయాలూ, ఆలోచనలూ అలవాట్లూ లేక కీలుబొమ్మగా మారిపోతున్నాడా ! అసలు యీ పతనం యెక్కడనించి ప్రారంభమైంది ! యెలా బాగుపడతా రీమనుష్యులు !

డబ్బు సంపాదనకిమాత్రం పడరానిపాట్లు పడుతున్నారు ! దానితో దొరికే సుఖాన్ని కొనుక్కోవటానికీ, అనుభవించటానికీ సిగ్గెగ్గులు లేకుండా ప్రవర్తిస్తున్నారు. యింక పెద్దలు గడ్డి తిని డబ్బు పోగుచేస్తుంటే వీరి పిల్లలకి ఆ కష్టం కూడా లేకుండా నిర్లిప్తత పెంచుకుంటూ జీవితానికి ఓ అర్థం ఉండాలి అన్న విషయం విస్మరించి గాలి యెటు వీస్తే అటు పులిస్తరాకుల్లా కొట్టుకుపోతున్నారు. యిది చాలా అనర్థదాయకమైన విషయం. యీ యింట్లో ఉన్న ముగ్గురు పిల్లలూ మూడు రకాల మనస్తత్వాలు కలవాళ్ళు. పరిస్థితులు యేవైనా తప్పివస్తే వీళ్ళు జీవితంలో నిలదొక్కుకుని బ్రతకగలరా ! నమ్మకంలేదు. యేదేమైనా అనిల్ విషయం యిటో అటో తేల్చేయాలి !

యీలా ఆలోచిస్తూ తెల్లవారుఝామునకిగానీ నిద్రపోలేదు ఆయన.

## 4

భరత్ తాతగారిని వెంటతీసుకుని అనసూయమ్మగారి యిల్లు వెతికాడు కానీ దొరకలేదు. భరత్‌కి విసుగువచ్చి "అడ్రెస్ తప్పు అయి ఉంటుంది తాతగారూ ! లాభంలేదు" అన్నాడు తిరిగీ తిరిగీ అలసిపోయి యింటికి వచ్చి.

అయితే రంగయ్యగారుమాత్రం వదల్లేదు. అడ్రెస్ పట్టుకుని తనే వెతకటం మొదలుపెట్టారు. వారంరోజులు గడిచిపోయాయి ప్రతిరోజూ సాయంకాలం నాలుగు గంటలు కాగానే వంటరిగా బైటికి వెళ్ళి సరిగ్గా యెనిమిది గంటలు అవుతూ ఉండగా యిల్లు చేరటం అలవాటు చేసుకున్నారు. ఆయన యెక్కడెక్కడ తిరుగుతున్నారో యింట్లోవాళ్ళకి తెలియనే తెలియదు.

యీరోజు యెనిమిది గంటలు దాటినా మామగారు యిల్లు చేరకపోయేసరికి రాజేశ్వరమ్మ కంగారుపడింది. కొడుకు లిద్దరూ రాగానే చెప్పింది. అనిల్, భరత్, సవితా సోఫాల్లో కూర్చుని "యీయన యేదో కొత్తచోటుకి వెళ్ళి దారి తప్పి వుండవచ్చు" అని తేల్చేశారు.

"తాతగారు దారి తప్పారు! అని పేపర్లో వేయిద్దామా !"

"కాదు పోలీస్ రిపోర్టిద్దాం !"

"కాదు మనం వెతుకుదాం."

"యింతపట్నంలో యెక్కడని వెతుకుదాం."

యిలా ముగ్గురూ మాట్లాడేస్తున్నారు. రాజేశ్వరమ్మ కోపంగా చూస్తూ అంది-

"కాస్త అలా వెళ్ళి వెతికిరండిరా! అసలే కొత్త వారాయన యీ వూరికి."

"మమ్మీ! దారితప్పిన తాతగార్ని వెతకటానికి యిదేమన్నా మీ గడ్డిపాడు అనుకున్నావా," అన్నాడు అనిల్

"డాడీకి టెలిఫోన్ చేస్తే! క్లబ్బులో ఉంటారుగా" సవిత అయిడియా యిచ్చింది " ఆ...ఆ...యీ మాట వింటే యింక డాడీ యీ రాత్రి టైములో కారులో స్పీడుగా వచ్చేస్తూ నాలుగు కార్లనన్నా గుద్దేస్తారు" అన్నాడు భరత్.

"నోరు మూసుకోండి" కోపంగా అరిచింది రాజేశ్వరమ్మ. ముగ్గురు పిల్లలూ మూతులు ముడుచుకు కూర్చున్నారు.

"క్రియశూన్యం కానీ కబుర్లు కోటలు దాటతాయి, కాళ్ళు గడపదాటవు."

రాజేశ్వరమ్మ అన్నమాట ముగ్గురూ కళ్ళప్పగించి వింటూంటే భరత్-"సవితా! నోట్ బుక్" అన్నాడు. అంతే సవిత క్షణంలో బుక్ తెచ్చింది.

కానీ తల్లి వాడిన సామెత సగంవరకే గుర్తువుంది ముగ్గురికీ...

"కబుర్లు కోటలుదాటతాయి...కాదు..."అనుకుంటూ మళ్ళీ తల్లిని ఆ మాట ఓసారి చెప్పు అని అడిగే ధైర్యంలేక ముగ్గురూ కూడబలుక్కుంటూన్నారు. కానీ పూర్తిగా రావటంలేదు.

"సవితా! అసలు యిది కొత్తదో కాదో చూడు బుక్ తీసి."

సవిత బుక్ తెరిచి చదువుతోంది. అనిల్ పుస్తకంలోకి తొంగిచూసి "అరె! తాతగార్ని మస్కావేసి చాలా సామెతలు కలెక్ట్ చేశావు కదూ!" అన్నాడు. అతని కళ్ళు సంతోషంతో మెరుస్తున్నాయి.

"ఆ! తాతగారు నాకూ మస్కావేసి టెన్‌గుపీన్‌కి ఫైవ్‌రుపీన్ చొప్పున నా సంపాదనలో ఎగేశారు." యేడుపుముఖంపెట్టి అంది సవిత.

"అరెరె!"

"ఊ! నాకు చాలా లాస్."

"అబ్బా! తాతగారి బుర్రలో అంత తెలివివుందా!" అనిల్ ఆశ్చర్యంగా అడిగాడు.

"అబ్బో! చాలా తెలివివుంది. ఇంగ్లీషు చాలా బాగా మాట్లాడతారు. అరేయ్ హిందీకూడా వచ్చు."

"నిజం!"

సవిత కళ్ళు పెద్దవిచేసుకుని చూస్తూ అడిగింది. తాతగార్కి హిందీ రాదులే అనుకుని అప్పుడప్పుడూ ఫోన్‌లో గోకుల్‌తో ఫ్రీగా మాట్లాడేయటం గుర్తుకి వచ్చి, "నిజంగా వచ్చు కానీ అనిల్ తాతగారితో నువ్వు మాట్లాడవేరా'' భరత్ అడిగాడు.

''నా కిష్టంలేదు అంతే. అది సరే కానీ యీ ముసలాయన యిల్లు చేర' కుంటే డాడీవచ్చి గొడవచేస్తారేమో!''

''మమ్మీ అసలు అన్నంకూడా పెడుతుందో లేదో! అసలే ఆకలిగా వుంది' సవిత ఆవులిస్తూ అంది. యింతలో క్రిందనించి కొత్త కారు హారన్ విన్పించింది. అందరూ బాల్కనీలో నిల్చుని క్రిందకి చూశారు యెవరబ్బా అనుకుంటూ, రాజేశ్వరమ్మతోసహా.

విమానంలాంటికారు రోడ్డుని సగం ఆక్రమించేసుకుని ఆగివుంది. అందులో నించి రంగయ్యగారు హుషారుగా దిగారు. ఆయన చెయ్యిపట్టుకుని నొక్కి వది లేస్తోంది అతినాజూకుగా అందంగా వున్న వో ఆడపిల్ల చెయ్యి. అధునాతనంగా ఆ యువతి జుత్తు విరబోసుకుని రిబ్బన్ వెనుకనించి తీసి నడినెత్తిమీదకి ముడి వేసింది.

మేడమీద నిల్చున్నవాళ్ళకి సరిగా కన్పించడంలేదా అమ్మాయి. కానీ రోడ్డులైటు వెల్తురులో కొంత తెలుస్తోంది.

"టాటా'' ఆ అమ్మాయి చెయ్యి వూపింది రంగయ్యగారూ చెయ్యివూపుతూనే అన్నారు. కారు కదిలిపోయింది అయిదు నిమిషాలన్నా కాకుండానే ఆయన పైకి వచ్చేశారు.

అనిల్‌కి అలాంటి కారంటే చచ్చేంత యిష్టం. అలాంటి కారులో తిరిగే అమ్మాయిలంటే మరీ మరీ యిష్టం. అయితే అలాంటి కారు తన స్నేహితుల్లో కూడా ఎవరికీలేదు. తండ్రిని కొనమని యెన్నిసార్లో అడిగాడు. ఆయన గంట ఉపన్యాసం యిచ్చి బోర్ కొట్టించాడు.

"కారు ఉపయోగంకోసం కానీ 'షో' కోసంకాదనీ ఆ కార్లు 'షో'కి తప్ప పనికిరావనీ, అసలలాంటివాటిని కావాలనుకోవటం పెద్ద తప్పు అనీ" యింకా యింకా అన్నాడు. అనిలకి ఒళ్ళుమండిపోతుంది యిలాంటప్పుడు. కానీ యేం చేస్తాడు. తన కోరికని మనస్సులోనే వుంచుకుండి పోయాడు. కానీ యిలా చూసినప్పుడుమాత్రం మళ్ళీ కాస్సేపు 'ఫీల్' అవుతాడు.

అసలు ఆ కారున్నవాళ్ళు యెంత అదృష్టవంతులో. యీ కారులో వచ్చిన

ఆ అమ్మాయి లక్కీగర్ల్ అయివుండాలి. అసలు అలాంటికారులో యీ తాతగారి లాంటి ముసలాళ్ల యెక్కటం ఏమిటి? నాన్సెన్స్, అనుకని పళ్ళు కొరుక్కున్నాడు. తాతగారిమీద అసూయగా వుందికూడా

ఇంక భరత్‌కి యీలాంటి కార్లు చూస్తే మంట. దీని ఖరీదు యెంత? యీ డబ్బుతో ఎతి సామాన్యులు యెన్నాళ్లు తిండి బట్టా సమకూర్చుకోగలరు?

యిలా సాగుతాయి అతని ఆలోచనలు. అతను స్నేహితులతో తరుచుగా అంటాడు. "మన ఇండియాలాంటి దేశంలో యింత ఖరీదైన కార్లు అనవసరం" అని.

యింక సవిత ఆలోచనలు యెలా వుంటాయి అంటే పెళ్ళి అంటూ చేసుకుంటే అతనికి యిలాంటికారు వుందా లేదా అనేదే చూడాలి ముందు. లేకంటే చస్తే పెళ్ళాడకూడదు, అని నిర్ణయించేసుకుంది. యిలాంటి కారుని చూడగానే ఆ అమ్మాయిలో యెన్నెన్నో తీయని భావాలు చెలరేగుతూ ఉంటాయి. యెంచక్కా ఆ కారులో సినిమాలకి షికార్లకి పిక్నిక్‌లకి పార్టీలకి వెడుతూంటే అలాంటప్పుడు పాతఫ్రెండ్స్ కన్పిస్తే యెంతబాగుంటుంది అనుకుని తండ్రిని యెన్నోసార్లు అడిగింది.

"మన కారు మార్చేద్దాం డాడీ" అని. జగన్నాథం కోపగించుకోకుండా చిన్నగా నవ్వి కూతురు మనస్సు నొవ్వకుండా చెప్పాడు.

"కారుకి కావల్సింది అందంకాదు, నాణ్యత. యెక్కువకాలం మన్ని వుండాలి. రిపేర్లు రాకూడదు" అంటూ అక్కడనించి వెళ్ళిపోయాడాయన. యింక తల్లిని అడిగింది ప్రయోజనం లేదు అని తెల్సికూడా. రాజేశ్వరమ్మ పురాణంవిప్పింది.

"అసలీ దేశంలో యీ 'కారు' అనేదికూడా లేనివాళ్ళు యెందరున్నారో తెల్సునా?"

సవితకి వళ్ళు మండిపోయింది. యిద్దరికిద్దరూ కంజూస్‌లే! యీ యింట్లో ఖర్మకొద్దీ పుట్టాను అని బాధపడిపోయింది. తనకంటే యెక్కువ స్తితిలోవున్న స్నేహితులని గుర్తుకి తెచ్చుకుంది. ఆ అమ్మాయికి బాధ మరీ యెక్కువ అయింది.

అసలు మమ్మీకి, డాడీకి బుద్ధిలేదు. లేకుంటే యీ కరువుకాలంలో ముగ్గురు పిల్లలని కనేస్తారా! ఛూత్ నేను చస్తే యిలా చెయ్యను. యీ యింట్లో నేను ఒక్కదాన్నే పుట్టివుంటే యింకా యెంత హైక్లాసుగా బ్రతకవచ్చు! ఆ కారు




హాయిగా మెయింటెయిన్ చేయవచ్చు, యీ వెధవ డొక్కు కారు కాకుండా! అనుకుని తనలో తనే విసుక్కుని ఒకసారి తల్లితో అంది.

రాజేశ్వరమ్మ క్షణం తెల్లబోయింది. మరుక్షణం బాధపడిపోయింది. అంతలోనే కోపపడిపోతూ "నోర్ముయ్! నువ్వు పొట్టబెట్టులా వుండాలని వుంటే అస్సలు సాగనీయను ఏ పల్లెటూరి వెధవనో తెచ్చి పెళ్ళిచేసి వదిలేస్తాను. వాళ్ళ జాయింట్ ఫామిలీల్లో పిక్చరైనా చూసే తీరుబడి లేక యెప్పుడూ పనిలో కొట్టుకుంటూ వుంటారు వాళ్ళలో నువ్వూ ఒకదానివైతే నీ రోగం చక్కగా కుదిరిపోతుంది" అంది.

"అమ్మో! మమ్మీ ఆ పనిమాత్రం చెయ్యకు" అని భయంగా చూసే కూతురిని చూసి కోపాన్ని తగ్గించుకుని యింక సరిగా మాట్లాడేస్తుంది రాజేశ్వరమ్మ. ఆంధ్రాలో పల్లెటూర్లగురించీ వాటికి యీనాటికీ లేని సౌకర్యాల గురించీ సమిష్టి ఫామిలీలగురించీ వాటిలో వుండే కలతలూ ఆవేశాలూ కావేషాలూ యివన్నీ వున్నా మళ్ళీ యేదైనా అవసరం వచ్చేసరికి అందరూ ఒకటి అయిపోయే ఆత్మీయత యింకా చావలేదు వాళ్ళలో అంటూ వో సినిమా కథ చెప్తున్నట్లుగా చెప్తుంది. సవిత నోరుతెరుచుకుని వింటుంది అంతా శ్రద్ధగా. అవన్నీ నిజంగా జరిగేవేనా! అని అనుమానపడుతూ,

"! అలాంటి వాతావరణంలో వాళ్ళు యెలా బ్రతకగలరు?" అంటుంది.

"యేం! యెందుకు బ్రతకలేరు! యీ కాలంలో మీకు స్వార్థం యెక్కువ కానీ పాతకాలంవాళ్ళకి అవన్నీ తెలియవు. వట్టి అమాయకులు. అసలు వాళ్ళే మంచివాళ్ళు అనిపిస్తుంది."

సవిత యింక వినలేక చెవులు మూసుకుంది.

"అబ్బబ్బా! మమ్మీ స్టాప్ స్టాప్!" అంటూ యింక అక్కడనించి వెళ్ళిపోతుంది.

రంగయ్యగారు విమానంలాంటి కారులోంచి దిగేసరికి ఆ యింట్లో అందరికీ యెన్నెన్నో విషయాలు గుర్తుకి వచ్చాయి. ఆ ఆలోచనల్లోనించి యింకా తేరుకోక ముందే పైకి వచ్చిన ముసలాయన్ని ఎవరూ పలకరించనేలేదు. ఆయనే వాళ్ళని చూసి ఆశ్చర్యపోతూ "యేమిటమ్మా రాజేశ్వరీ అందరూ యిక్కడ నిల్చున్నారేమిటీ!" అడిగారు

"అహ యేంలేదు మీరు యెనిమిదిదాటినా యింటికి రాలేదని భయపడ్డాను" అంది.

"యింతేకదా!" అంటూ బట్టలు మార్చేసుకున్నారు.

"వడ్డించేస్తాను రండి" అంటూ అక్కడనించిలోపలికి వెళ్ళింది రాజేశ్వరమ్మ.

రంగయ్యగారు యీ వూరు వచ్చిన కొత్తలోలాగా ముతక నేతపంచా షర్టూ వేసుకోవటంలేదు. ఆ బట్టలని 'టిప్‌టాప్'కి వేసి తెల్లగా చేయించి తెచ్చుకుని అవి సాయంకాలం షికారుకి వెళ్ళేటప్పుడు వేసుకుంటున్నారు. బట్టతలే అయినా డ్రెస్సింగ్ టేబిల్ ముందు కూర్చుని తలదువ్వుకుని అద్దంలో ముఖాన్ని మార్చి మార్చి చూసుకుంటూ వుంటూ వుంటే ఆయన్ని చూసిన అనిల్‌కి అరికాలిమంట నెత్తికెక్కుతూ వుంటుంది. ఆ కోపంతో చెప్పులు చప్పుడుచేస్తూ విసురుగా బైటకి వెళ్ళిపోయే మనవడిని కళ్ళజోడులోనించి వోరగా చూస్తారు. అయితే యీ విషయం అనిల్‌కి తెలియదు.

రాజేశ్వరమ్మ అందరికీ వడ్డించింది. అందరూ నిశ్శబ్దంగా భోజనాలు కానిస్తున్నారు. సవితకి యిదేంబాగులేదు. అందుకే కబుర్లు మొదలుపెట్టింది.

"తాతగారూ" ఆంధ్రాలో విలేజస్ చాలా బావుంటాయటకదూ! మీకు బండీ వుందా! పొలం, తోటా వున్నాయా? షికారుగా వెళ్ళటానికి చాలా బావుంటుందా!"

"ఓ! అంతా బాగుంటుంది. నాకు పొలం లేకుంటే యేం. నువ్వు యీసారి

నాతో అక్కడికి తప్పకరావాలి! అన్నీ చూద్దువుగాని! సవితా ఆంధ్రాలో అమ్మాయిలు యెంతబావుంటారో తెలుసా!"

"ఊహూ! యెంతబావుంటారు?"

"మంచి కళ్ళు, పచ్చటిరంగు. తెల్లగా పొడుగ్గా అందంగా వుంటారు. జడకి కుచ్చులు పెట్టుకుంటారు చేతులకి గాజులూ మెడలో ఒక గొలుసూ చెవులకి జుంకీలూ లేకుంటే 'రింగ్'లూ పెట్టుకుంటారు. యెంచక్కా లంగా వోణీ వేసుకుని ముచ్చటగా వుంటారు."

"నిజంగా!" అన్నంతినటం మర్చిపోయి తాతగారివైపు చూస్తూ అంది.

"నిజంగా"

"అయితే తప్పక వస్తాను తాతగారూ!"

తప్పకుండా తీసుకువెడతాను సవితగారూ! అక్కడ నువ్విలా ప్యాంట్లూ షర్టులూ వేసుకుంటే మాత్రం నవ్వుతారు."

"అయితే రాను" బుంగమూతి పెట్టింది

"వచ్చి తీరాలి."

"తాతగారూ నేనూ మీతో తప్పకవస్తాను అక్కడికి. యెందుకంటే..." భరత్ నసిగాడు

"చిన్నన్న మీతో యెందుకు వస్తానంటూన్నాడో తెల్సునా!" సవిత రహస్యంగా అడింది.

"తెలియదు! ఎందుకు."

"ఆంధ్రాలో తాతగార్లంతా యెలావుంటారు. వాళ్ళ స్వభావం యెలా వుంటుంది! ముఖ్యంగా మాలాంటి యువతరం పద్ధతులని గౌరవిస్తారా లేదా, లేక వాళ్ళకి తెల్సిందే మంచిది అని దబాయిస్తారా! యివన్నీ తెల్సుకునేందుకు వస్తానంటున్నాడు."

భరత్ నవ్వేశాడు. రంగయ్యగారూ పెద్దగా నవ్వేశారు.

"భరత్! నిజంగానా! అయితే తప్పక రా బాబూ! నీకెలాంటివాళ్ళతో యింటర్వ్యూ కావాలన్నా యేర్పాటుచేస్తాను."

"తాతగారూ! ఆంధ్రాలో తాతయ్యలకి గర్ల్ ఫ్రెండ్స్ కూడా వుంటారా!"

విరగబడి నవ్వుతూ అంది సవిత. రాజేశ్వరమ్మ కళ్ళతోనే కూతుర్ని వురిమి చూసింది. కానీ సవిత తల్లిని గమనించటంలేదు. అనిల్, భరత్ తాతగారి జవాబు కోసం కుతూహలంగా చూస్తున్నారు. రంగయ్యగారు సవితకంటె కూడా పెద్దగా

నవ్వి "ఓ వుంటారమ్మా సవితా! చాలామందే వుంటారు తాతయ్యలకి మనవ రాళ్ళంతా గర్ల్‌ఫ్రెండ్సే."

"ఛీ" చీత్కారంచేసింది సవిత. అనిల్ ముఖం తిప్పుకున్నాడు. శరత్ యేదో అనబోయి తల్లిముఖంలోకి చూసి ఆగిపోయి భోజనం కానిచ్చేసి లేచే శాడు. అందరి భోజనాలూ అయిపోయాయి.

సవిత చదువుకోవాలని పుస్తకం తెరిచింది కానీ అంతలోనే నిద్రముంచుకు వచ్చి "రేపు చదవొచ్చులే" అనుకుని లైటు తీసేసి ముసుగుపెట్టుకుని నిద్ర పోయింది. శరత్ తనగదిలో టేబిల్‌లైటు ముందుకూర్చుని చదువులో మునిగి పోయాడు. అనిల్ తనగదిలో రెండు ట్రాన్సిస్టర్‌లు పెట్టుకుని వాటిలో వచ్చే పాటలు వింటూ ఆలోచనల్లో మునిగిపోయాడు. అలా యెప్పటికోగానీ నిద్ర పోడు. ట్రాన్సిస్టర్‌లో పాటలు రేడియో స్టేషన్ బంద్‌అయేవరకూ వస్తూనే వుంటాయి ఆ తర్వాత శబ్దంలేకుండా ఆగిపోతుంది.

## 5

అనిల్ మేరీతో బీచ్‌కి వెళ్ళాడు. యెవ్వరూ లేనిచోటు చూసుకుని యిద్దరూ కూర్చున్నారు. సముద్రం మీదనుంచి వచ్చే చల్లగాలికి మేరీ ముంగురులు చెదరి ముఖంమీద పడుతూంటే అదో వింత అందంగా కన్పించి పారవశ్యంగా చూస్తూ న్నాడు.

నల్లగా వున్నా మేరీ ముఖం బాగుంటుంది. పెద్దకళ్లూ తెల్లని పలువరుసా- రకరకాల ఫ్రాకులూ వేసుకుంటూ వుంటుంది. బట్టలు వంటిని అంటిపెట్టు కున్నంత బిగుతుగా వుంటాయి. వంపులన్నీ కన్పిస్తూంటే అదో ఆకర్షణగా అనిల్‌కి అన్పిస్తూ వుంటుంది.

మేరీ చాలా చురుగ్గా వుంటుంది. తెగ కబుర్లు చెప్తుంది. యీరోజూ అలాగే చెప్తూ అనిల్! మనం మారేజ్ చేసుకున్నా నువ్వే మాయింటికి వచ్చేయాలి. యెందుకంటే నాకు మీవాళ్ళ ఆచారాలూ పద్ధతులూ నచ్చవు. అసలు తెలియదు కూడా. యీ విషయం సూటిగా యెందుకు చెప్తున్నానంటే వర్ణాంతరవివాహాలు సుఖంగాసాగవు. "అంటూ మా అమ్మమ్మ నన్ను భయపెడుతోంది. యిందు కంటున్నాను. నువ్వే నాదగ్గరికి వస్తే అసలు పేచీ అనేదే రాదుగా. అన్నట్లు మీ ఫాదర్ నిన్ను ఫారెన్ యెప్పుడు పంపాలనుకుంటూన్నారు."

అనిల్ చేతిని తనచేతిలోకి తీసుకుని పెదవులకి అద్దుకుంటూ అడిగింది.

"చెప్పలేను. మా ఫాదర్ భరత్‌ని పంపేయేర్పాట్లు చేస్తున్నారు." దిగులుగా చూస్తూ అన్నాడు.

మేరీ హతాశురాలైనట్లుగా చూస్తూ "అదేం?" అంది.

"నేను చదువు ఆపేశానని కోపం. పోనివ్వు ఆ యేర్పాట్లు మీవాళ్ళని చేయమను. యిద్దరం అమెరికా వెళ్ళి అక్కడే సెటిల్ అయిపోదాం! మీవాళ్ళు చాలామంది వున్నారుగా."

"యిది అంత తేలిగ్గా జరిగే పనేనా! యిద్దరం వెళ్ళాలంటే డబ్బు చాలా కావద్దూ! నా మారేజ్ ఖర్చుకే మా ఫాదర్ దగ్గర డబ్బులేదు అంటూన్నారు."

"అలాగా! మరి మీకు చాలాడబ్బువుంది అని చెప్పేదానివిక మా!"

"అదేం అబద్ధంకాదు. డబ్బు అమ్మమ్మదగ్గర వుంది. కానీ..."

"యింకేం! అది తీసుకో! ఇద్దరం వెళ్ళిపోయి అక్కడే జాబ్స్ వెతుక్కుందాం."

"అబ్బ! అమ్మమ్మ ఆస్తి నా కివ్వదుట. ఆమె చెప్పిన అబ్బాయినే పెళ్ళాడితే అదంతా నాకు వస్తుంది."

"అలాగా! అయితే యిప్పుడేం చేద్దాం!'

"యేడ్చినట్లుంది. నీకు సలహా నేను చెప్పాలా అనిల్! అయినా నీవింత చేతకానివాడిలా' నాన్న ఫారన్ పంపటంలేదు నేనేం చెయ్యను అంటే యెలా" అంది కోపంగా.

"కనుకనే నిన్ను అరేంజ్ చెయ్యమంటున్నాను.'' మరీ కోపంగా అన్నాడు అనిల్ అది గ్రహించిన మేరీ కాస్త తగ్గి

"నాకేగనుక మీకున్నంత డబ్బు వుంటేనా! అవన్నీ సరేగానీ నేను యిప్పటికే చాలామంది ఫ్రెండ్స్‌కి నీతో మారేజ్ సెటిల్ అయిపోయింది అనికూడా చెప్పేశాను."

''నే నిప్పుడది కాదన్నానా!"

"అనలేదుకానీ నాకు ఫారెన్ పోయేవాడు కావాలి. అనిల్ నువ్వే యెలాగో అలా డబ్బు సంపాదించెయ్యి. వెళ్ళిపోయి అక్కడే మారేజ్ చేసుకుందాం.''

అనిల్ దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. సముద్రకెరటాలు బెదిరిస్తూన్నట్లుగా ముందుకి వచ్చి వెనక్కి వెళ్ళిపోతూంటే వాటినే చూస్తూ కూర్చున్నాడు. తనకి కాస్త దూరంలో యింగ్లీషు మ్యూజిక్ విన్పిస్తూంటే తలతిప్పి చూశాడు.

ట్రాన్సిస్టర్‌లో యింగ్లీషు మ్యూజిక్ వస్తోంది. దానికి అనుగుణంగా దాదాపు యిరవయ్యేళ్ళ అందమైన అమ్మాయి అడుగులు వేస్తోంది. ఆ పిల్లని అనుకరిస్తూ

అడుగులు 'స్టెప్స్' వేయటం నేర్చుకుంటున్నాడో ముసలాయన. అనిల్ మేడీ మాట మర్చి అటువైపే చూస్తున్నాడు. చటక్కున లేచి వాళ్ళ దగ్గరకి నడిచాడు.

ముసలాయన స్టెప్స్ వేయటం రాక మహా అవస్థపడుతూ, పడుతూ లేస్తూ అచ్చంగా ఆ పిల్లలానే వేయటానికి ప్రయత్నిస్తున్నాడు.

అక్కడ అంత చల్లగా వున్నా ఆయన వళ్ళంతా చెమటపట్టేసింది.

ఆ అమ్మాయి అడుగులు వెయ్యటం ఆపి ట్రాన్సిస్టర్ 'ఆఫ్' చేసి 'హా' అంది వళ్ళు విరుచుకుంటూ. వీళ్ళిద్దరికి బాగా దగ్గరకి వచ్చిన తర్వాత గానీ అనిల్ ఆయన్ని గుర్తించలేదు.

"అరె తాతయ్యా! మీరా!" అన్నాడు అప్రయత్నంగానే.

ఆ అమ్మాయి యితన్ని గమనించకుండా 'అలా నడుచుకుంటూ వెళ్ళిపోదాం' అంటూ బయలుదేరింది.

ట్రాన్సిస్టర్ ఒక చేతికి తగిలించుకుని మరో చేత్తో రంగయ్యగారి చెయ్యిగట్టిగా పట్టుకుని సముద్రంఒడ్డు వెంటనడుస్తూ రంగయ్యగార్ని లాక్కువెడుతోంది. అనిల్ ఆ అమ్మాయిని పరీక్షగా చూశాడు. పచ్చని పసిమిఛాయ. పెద్ద కళ్ళు. వత్తుగా బారుగా వున్న జుత్తు, బారెడు పొడుగున రెండు జడలు వ్రేలాడుతున్నాయి. చెవులకి యెర్రరాళ్ళ జుంకీలూ, మెడలో డాలర్ చైనూ, చేతికి యెర్రరాళ్ళ గాజులూ యెర్ర కంచి పట్టు పావడా, అదే రంగు జార్జెట్ వోణీ, అదే రంగు జాకెట్టూ. యీ దుస్తుల్లో ఆ అమ్మాయి అందం ద్విగుణీకృతం అయినట్లుంది. ముఖాన యెర్రని తిలకం, ఒక జడలో యెర్ర గులాబీ.

అనిల్ మనస్సులో ఆ అమ్మాయి చిత్రం అలా నిల్చిపోయింది, క్షణంలోనే. చెయ్యీ చెయ్యీ పట్టుకుని నీళ్ళలో లోతుకు లాక్కుపోతుంటే రంగయ్యగారు, "అమ్మబాబోయ్. నాకు భయం!" అంటూ భయం ప్రదర్శిస్తున్నారు. ఆ అమ్మాయి కిలకిలా నవ్వుతూ ఆయన్ని లాక్కుపోతూనే వుంది.

అనిల్ తనకు తెలియకుండానే వాళ్ళ వెంట నడిచేశాడు. ఆ అమ్మాయి రంగయ్యగారి చేతిని లాక్కుంటూ కెరటాల్లోకి పోబోతుంటే ఆయన-

"మాలినీ ప్లీజ్ అలా వెళ్ళొద్దు! ప్రమాదం-వద్దు." అంటూన్నా ఆ అమ్మాయి లోపలికి నడవబోయి అంతలోనే పెద్ద కెరటం వచ్చి ముంచెత్తటంతో మాలిని భయంగా 'కెవ్వు' మని అరిచేసింది.

"తాతగారూ!" అంటూ అనిల్ వాళ్ళ దగ్గరికి పరుగెత్తాడు.

తాతగారూ అన్న పిలుపుకి రంగయ్యగారు వెనక్కి తిరిగిచూసి "అరె నువ్వా! యిక్కడికి షికారుగా వచ్చావా! అన్నట్టు యీ అమ్మాయిని యెరగవుకదూ! మిస్ మాలిని. "మాలినీ యితను మా మనవడు అనిల్!" అంటూ పరిచయం చేస్తూ తనలో తనే అనుకున్నారు. వెధవ యెన్నాళ్ళకి 'తాతగారూ' అంటూ పిల్చాడు అని.

అనిల్ మాలిని వైపు స్నేహపూర్వకంగా చూస్తూ చెయ్యి అందించాడు. మాలిని చిరునవ్వు నవ్వి 'నమస్తే' అంటూ చేతులు జోడించింది. అంతే యింక వెళ్ళిపోదాం అని రంగయ్యగార్ని మళ్ళీ లాక్కుపోయింది. అనిల్ యింకా యేదో మాట్లాడాలని ప్రయత్నిస్తూన్నా ఆ అమ్మాయిదగ్గర లాభంలేకపోయింది. అనిల్ 'అహం' దెబ్బతింది.

ఎంత పొగరు! అందం వుందనో, అలంకరణ అతికినట్లు వుందనో, పేరు 'మాలిని' చాలా బాగుంది అహా! అయితేమాత్రం అంత గర్వమా. హూఁ. కోపంతో వళ్ళు మండింది. పళ్ళు కొరుక్కున్నాడు.

మాలిని రంగయ్యగార్ని లాక్కువెళ్ళి విమానం కారులో కూలేసింది. ప్రక్కన తను కూర్చుంది. కారు వెళ్ళిపోయింది.

వెళ్ళిపోయే కారును చూస్తూ అలాగే నిల్చుండిపోయాడు అనిల్. యింతలో అక్కడికి మేరీ భద్రకాళిలా వచ్చింది.

"యేంటి! యిక్కడ అలా నిల్చున్నావ్! నన్నసలు బీచ్‌కి యెందుకు తీసుకువచ్చినట్లు!"

అనిల్ జవాబు చెప్పలేదు.

"నువు చెప్పకున్నా అర్థమైంది, ఆ అమ్మాయి అందానికి బందీవి అయ్యావని. యిదిగో చూడూ నా కిలాంటివి నచ్చవు కనుక కళ్ళు మూసుకో! అదంతా సరే గానీ అంత అందమైన అమ్మాయికి ఆ ముసలాయన ఫ్రెండా! అవ్వ!" మేరీ విరగబడి నవ్వుతోంది.

అనిల్‌కి పిచ్చికోపం వచ్చేసింది. "ఛీ ఛీ" అన్నాడు.

మేరీ కోపం మాలినిమీదనుంచి అనిల్ మీదకి మళ్ళింది.

"యేయ్! నన్ను ఛీ ఛీ అంటావా!" అనేసి వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

"మేరీ! మేరీ!"

అంటూ అరిచాడు. కానీ మేరీ వెనక్కి తిరగలేదు.

'హుంష్ యిదేమిటి యిలా అయింది యీ రోజు' అనుకుంటూ ఆ యిసుకలో అలానే చాలాసేపు కూర్చుండిపోయాడు. చాలా విసుగ్గా వుంది. మనస్సంతా చికాకుగా వుంది. ఆ యిసుకలో అలా పడుకుని ఆకాశంలో కన్పిస్తూన్న చుక్కలని లెక్కపెడుతూ అది సాధ్యంకాక యింక మెల్లగా యిల్లు చేరాడు. అప్పటికి తొమ్మిది గంటలు కావస్తోంది.

డైనింగు టేబుల్ దగ్గర కూర్చుని భోజనంచేస్తూ తన చిన్నప్పటి కబుర్లు చెప్తూ మధ్య మధ్యన 'జోక్' చేస్తూ భరత్‌ని, సవితనీ నవ్విస్తూన్న తాతగార్ని చూసేసరికి అనిల్‌కి ఒళ్ళు మండిపోయింది.

'యీ ముసలాయిన బైటేమో అలా తిరిగి యింట్లో మాత్రం నంగనాచిలా పెద్దమనిషిలా యెలా కబుర్లు చెప్తూన్నాడో! యెంత నటన!' పళ్ళు కొరుకుతూ గదిలోకి వెళ్ళిపోయాడు.

"అనిల్! త్వరగా రా భోజనానికి. నీ కోసం వీళ్ళంతా కూర్చున్నారు" రాజేశ్వరమ్మ పిల్చింది.

"ఆకలి లేదమ్మా" అనేసి తలుపు ధడాలున వేసేసుకున్నాడు.

సవితకి రంగయ్యగారు కొరివి దయ్యాల కథలు చెప్తూంటారు. అవంటే చాలా యిష్టం సవితకి. యింక ప్రతిరోజూ ఒక కథ చెప్పేవరకూ వదలదు. కుక్కపిల్లని వళ్ళో పెట్టుకుని 'షాల్' కప్పుకుని తాతగారు చెప్పే దయ్యాల కథలు వింటూ చిత్ర విచిత్రంగా వూహలు అల్లుకుంటూ పరిసరాలనే మర్చిపోతుంది సవిత.

యింక తన జీవితంలో యెదురైన కష్టసుఖాలకి కొంత కల్పన జోడించి మనవరాలికి ఆనందాన్నిచ్చేందుకు రంగయ్యగారు కథల పంట పండిస్తూన్నారు బొంబే పట్నంలో. తను చెప్పేది నిజంగా యెదుట జరుగుతూన్నట్లే భ్రమిస్తూన్న సవిత ఆలనాటి రాజకుమార్తెని గుర్తుకు తెస్తోంది రంగయ్యగార్కి.

యిది వట్టి అమాయకురాలు. యీ మగపిల్లలూ అంతే. వీళ్ళ ముగ్గురికీ అప్పుడప్పుడూ తెలుగుదేశం చూపిస్తూ వుండాలి. లేకుంటే వీళ్ళు యిక్కడి వాతావరణానికి అలవాటుపడి తెలుగుదనాన్నే మర్చిపోతున్నారు, అనుకున్నారు.

## 6

రోజులు చకచకా పరుగెత్తుతున్నాయ్. రంగయ్యగారు యీ యింట్లో ఒక ముఖ్యవ్యక్తిలా అయిపోయారు. బజారుకి వెళ్ళి కూరలూ వగైరా తేవటం, సవితతో

షాపింగ్‌కి వెళ్ళటం మధ్యాహ్న భోజనం, నిద్ర తర్వాత యింక మూడుగంటల కాగానే చకచకా ముఖం కడుక్కుని బట్టతలకి వాసన నూనె పట్టించి యింత పౌడరు ముఖాన పులుముకుని పంచా షర్టూ వేసుకుని అవి బాగున్నాయో లేదో చూసుకుంటూ.

"అమ్మా సవితా! నా ముఖాన పౌడరు యెక్కువైందా!" అంటారు.

"లేదు బావుంది తాతగారూ." అంటే చాలు బోలెడంత తృప్తిపడిపోయి "అమ్మా రాజేశ్వరీ అలా షికారువెళ్ళి వస్తానమ్మా" అంటూ యింట్లోంచి వెళ్ళిన ఆయన రాత్రి తొమ్మిదింటికికానీ యిల్లు చేరటంలేదు.

రాజేశ్వరమ్మకి మామగారి పద్ధతి యేమీ నచ్చలేదు. అసలు యీ ముసలాయన్ని యిక్కడకి రమ్మని రాసింది యెందుకు! అర్ధరాత్రివరకూ క్లబ్బులో కాలం గడిపే కొడుకుని మందలిస్తాడని కాదూ! కులంగాని పిల్లను పెళ్ళాడుతా అంటూ యెగిరే మనవడికి బుద్ధి చెప్పి దారికోకి తెస్తాడని కాదూ! యివన్నీ పట్టించుకోకుండా యీయన ప్రతిరోజూ యెక్కడ తిరుగుతూన్నట్లు! యేం చేస్తూన్నట్లు! అసలీ ముసలాయనకి యిన్ని షోకులెందుకూ!

అర్థమే కావటంలేదు రాజేశ్వరమ్మకి. ఈ వూరు వచ్చి యీయన నేర్చుకున్నది ఇదా! అవ్వ యెవరన్నా చూస్తే నవ్వుతారనైనా లేదు. లోలోపల యెంత కోపంగా వున్నా పైకి యేమీ అనలేక వూరుకుంది రాజేశ్వరి. జగన్నాధానికి అసలు యివేవీ పట్టవు.

అనిల్‌కి మాత్రం రంగయ్యగారలా మాలినితో షికారు తిరుగుతూ కన్పిస్తూ వుంటే వళ్ళంతా కారం రాచుకున్నట్లు మంటగా వుంది. అంత అందమైన అమ్మాయితోనా యీ ముసలాయన షికార్లు! అని అసూయగానూ వుంది. పోనీ తాతగారితో స్నేహంగా వుండి ఆ మాలినితో పరిచయం పెంచుకుందే? తను రాజీపడినా తాతయ్య అవకాశం యిస్తాడా! యిదివరకల్లా మాట్లాడలేదు అన్న కోపం వుంచుకోడూ! రోజూ బీచ్‌లో షికారుకి నే వెళ్ళే చోటుకే వీళ్ళిద్దరూ వస్తారెందుకు! లేక నేనే వెడుతూన్నానా! యేమో! కాస్తకూడా అర్థం కావటం లేదు. కానీ చికాకు యెక్కువైంది అనిల్‌కి.

రంగయ్యగారూ, మాలినీ కలిసి కనిపించినప్పుడల్లా వెర్రికోపం వచ్చేస్తోంది. ఒకటే అశాంతిగా వుంటోంది. యీ అశాంతిని భరించటం చాలా కష్టమైపోతోంది. ఆ రోజు వీళ్ళిద్దరి మూలంగానే కదూ మేరీ కోపం వచ్చి వెళ్ళిపోయింది. వాళ్ళ

యింటికి వెళ్ళినా మాట్లాతలేదు. ఆ అమ్మాయిని తిరిగి శాంతింపచేయటానికి చాలా అవస్థపడవలిసి వచ్చింది. యివన్నీ యీ తాతగారి మూలంగానే జరుగుతూన్నాయి అని మరీ కోపం పెంచేసుకుంటూన్నాడు అనిల్.

## 7

చాకలి యిస్త్రీ బట్టలు తెచ్చాడు. మాసిన బట్టలు తీసుకువెళ్ళేందుకు తొందర పడిపోతున్నాడు. వాసు అందరి గదుల్లోనూ వెతికి బట్టలు తెచ్చి వేస్తూన్నాడు.

పద్దు రాసుకోబోతూ రంగయ్యగారి విషయం గుర్తుకువచ్చింది.

"తాతగారూ ! చాకలి వచ్చాడు" అని చెప్పాడు.

రంగయ్యగారు అప్పుడే భోజనంచేసి పడుకుని నిద్రపోతున్నారు. వాసు పిలుపుకి మెలుకువ వచ్చింది కానీ కళ్ళు తెరవకుండానే అన్నారు.

"వాసూ ఆ వంకెన షర్టూ పంచె వున్నాయి. వేసేయ్యి! వెధవ చాకలి వచ్చాడంటూ బంగారంలాంటి నిద్ర పాడుచేశావు కదరా !" అంటూ యిటునుంచి అటు వత్తిగిలి పడుకున్నారు. వాసు వాటిని తీసుకుని చాకలికి వేసి పుస్తకం తీసుకుని 'చెప్పు' అంటూ పద్దు రాసుకోబోయాడు.

చాకలి,రంగయ్యగారి షర్టుజేబులోనించి నోట్ బుక్ తీసి వాసుకు అందిస్తూంటే అందులోనించి నాలుగు కార్డు సైజుఫోటోలు క్రిందకి జారిపడ్డాయి. చాకలి కుతూహలంగా వాటిని అందుకునిచూస్తూ "యిహీహీ"అంటూ యికిలిస్తున్నాడు. వాడి నవ్వుకి వాసు తలెత్తిచూసి ఆ ఫోటోలని లాక్కుని చూసాడు ఒక్కొ౽టీ. చాకలీ వాసూ ఒకళ్ళ చేతుల్లోంచి మరొకరు మార్చి మార్చి తీసుకుని చూస్తూన్నారు. వాటిని యెంతసేపు చూసినా తనివితీరటంలేదు.

యింతలో సవిత ఎప్పుడో బైటికి వెళ్ళింది తిరిగి వచ్చింది చాకలిని చూసి "వాసూ నా రూంలోవన్నీ బట్టలు వేసేశావా !" అంటూ వాళ్ళిద్దరూ అంత యేకాగ్రతగా చూసే ఆ వింత యేమైవుంటుందా అనుకుని వాసు దగ్గరగా వచ్చి తొంగిచూసింది. వాసు సవితని చూసి గాభరాపడిపోయి ఆ నాలుగు ఫోటోలనీ బొత్తిగా పెట్టి సవితకి యిచ్చేసి చాకలిపద్దు రాసుకుని యింక తన పనిలోకి వెళ్ళిపోయాడు.

సవిత ఆ ఫొటోలని మార్చి మార్చి చూస్తోంది. తాతయ్యతో వున్న యీ అందమైన అమ్మాయి యెవరు ? అనుకుంటూ వుంది. రాజేశ్వరమ్మ కూతురి



గొంతు విని అక్కడికి వస్తూ "సవితా! ప్రొద్దుననగా వెళ్ళినదానివి యిప్పుడా యిల్లు చేరటం! యింతసేపూ యెక్కడ వున్నావే!" కోపంగా అరుస్తోంది.

తల్లిని శాంతింపచేయటానికి యేసాకూ దొరక్క గభాలున తన చేతిలో వున్న ఫోటోలని ఆవిడ చేతిలో పెట్టి తన గదిలోకి వెళ్ళిపోయింది.

"యెవరివే యివి! అంటూ ఒక్కొక్కటీ చూస్తూ ఆ...యెవరీ అమ్మాయీ! యీయన కేంపోయేకాలం వచ్చిందీ!" అయిదు నిముషాలకిగానీ ఆవిడ తేరుకోలేదు.

శరత్ వచ్చి "మమ్మీ 'టీ' కావాలి! యేం యివాళ యింకా చేయలేదూ! నేను బైటకివెళ్ళాలమ్మా" అంటూ కుర్చీలో కూర్చుని తల్లివైపుచూస్తూఅడిగాడు.

"యెవరివి మమ్మీ ఆ ఫోటోలూ?"

రాజేశ్వరమ్మ కోపాన్ని అణుచుకుంటూ వాటిని కొడుకు చేతిలోపెట్టి వంట గదివైపు వెళ్ళి వాసూ 'టీ' తయారుచెయ్యి అంది.

శరత్ వాటిని చూస్తుండగానే అనిల్ అక్కడికి వచ్చాడు.

"యేమిటీ? యెవరివి?" అనేసరికి భరత్ అన్నగారికి యిచ్చేశాడు.

వాసు అందించిన బిస్కెట్లూ, యాపిల్ ముక్కలూ తింటూ భరత్ మౌనంగా ఉండిపోయాడు, అన్నగారి ముఖంలో మారేరంగులని చూస్తూ.

"మమ్మీ!" యిల్లు యెగిరిపోయేలా అరిచాడు అనిల్.

"యేం మనిషమ్మా యీ ముసలాయనా! వయస్సు పెరిగినా కాస్తకూడా బుద్ధిలేకుండా యేమిటీ ఫోటోలు! ఛీ ఛీ'' అంటూండగానే రంగయ్యగారు లేచి కూర్చున్నారు.

"అమ్మా రాజేశ్వరీ టైమెంత అయిందీ! సవితా కాసిని మంచినీళ్ళు యివ్వమ్మా."

అంటూ హాలులోకి లేచివచ్చి అక్కడున్న అందరినీ ఓసారి చూస్తూ,

"అరె! అప్పుడే టీ టైము అయిందా! ఆలస్యంగా లేచాను కదూ! ఉండండి క్షణంలో వస్తాను. పైగా నాకూ అలా బైటికి వెళ్ళవల్సిన పని ఉంది", అంటూ సవిత అందించిన నీళ్ళు గటగటా తాగేసి బాత్‌రూములోకి వెళ్ళారు.

హాలులో అతి నిశ్శబ్దంగా వుంది. రంగయ్యగారు ముఖం కడుక్కుని వచ్చి ప్రతిరోజులాగా ముస్తాబు అయ్యే తాతగారిని మింగేసేలా చూస్తున్నాడు అనిల్. భరత్ మెల్లగా ముందున్న టేబిల్‌పైన చేత్తో తబలాలా వాయిస్తున్నాడు.

రంగయ్యగారు దిండుకింద మడిచిఉంచిన షర్టూ, పంచా తీసుకుని వేసుకుని అద్దంలో చూసుకుంటూ పౌడర్ కాస్త యెక్కువే రాసుకుని,

"భరత్! బాగుందిరా?" అని అడిగి 'భర్లేదు' అన్న జవాబుకి తృప్తిపడి ఉత్తరీయం అంచులు సరిచేసుకుని భుజంమీద వేసుకుని వాసు యిచ్చిన 'టీ' తాగాడు.

"యింత నిశ్శబ్దంగా ఉన్నారేమిటీ యివాళ మీరంతా!" అని అందరి ముఖాల్లోకి పరీక్షగా చూసి కళ్ళజోడుపెట్టుకుంటూ "అరె! అప్పుడే మూడు దాటిపోయిందా! అయితే ఆలస్యం అయిపోయింది! రాజేశ్వరీ అలా వెళ్ళి వస్తానూ! చూడమ్మా నేను తిరిగి రావటం ఆలస్యం అయినా పిల్లని పాపం ఖంగారుపెట్టి వెతకటానికి పంపకు. యెందుకంటే బొంబే చాలావరకు తెల్సిపోయింది. ఒకవేళ దారితప్పినా యింటి అడ్రెస్ ఉండిగా జేబులో. కనుక వచ్చేయగలను. వాసూ యీ టీ కప్పు తియ్యి. యెవరన్నా చూడకపోతే పగిలి

చక్కాపోతుంది. సరే మరి నే వెళ్ళి వస్తా !" అంటూ చెప్పులు వేసుకుని వెళ్ళి పోయే తాతగారిని భరత్ ఆసక్తిగా చూస్తూ "యీయనలో ఏదో మార్పు వచ్చినట్లు అన్పిస్తోంది" అనుకున్నాడు.

అనిల్ గబగబా గదిలోకి వెళ్ళి చేతిలోని ఫోటోలని మళ్ళీ పరీక్షగా చూశాడు. దివినుంచి భువికి దిగివచ్చిన అప్సరసలా ఉన్న మాలిని రకరకాల ఫాషన్స్ లోనూ ఉంది. చీరెల్లో ! లుంగీల్లో ! పాంటూ, షర్టూ, ఒక్కో ఫోటోలో ఒక్కో ఫాషన్‌లో తయారై రంగయ్యగారి చేతిని గట్టిగా పట్టుకుని ఒకటి, తాతయ్యే మాలిని భుజంచుట్టూ చెయ్యివేసి తలా తలా ఆనించి నవ్వుతూ నిల్చుని ఫోజ్ యిచ్చిన ఆ ఫోటోలోనించి మాలినిని ఒక్కదాన్నే యెలా వేరుచేయాలో అర్థం కాక కత్తెరపట్టుకుని చూస్తున్నాడు.

మరో ఫోటోలో సముద్రంవద్దున పరిగెత్తుతున్న మాలిని రంగయ్యగారిని చెయ్యిపట్టుకుని లాక్కువెడుతోంది. యిలా ఉన్న ఫోటోల్లో ఒక్కదానినైనా రంగయ్యగారి చేతిని మాలిని మీదనించి తీసేయగల శక్తి లేనివాడిలా ఆయన భుజంవరకూ కత్తిరించేసి అవతల పారేశాడు. యిలా ఒక్కటే సాధ్యమైంది. మిగతావి కూడా కత్తిరించాలని చూశాడే కాని మళ్ళీ వాటిని డ్రాయరు సొరుగులో వదేశాడు. యింక మాలిని ఫోటోని తదేకంగా చూస్తూ ఉండిపోయాడు. కాలాన్నీ పరిసరాలనీ అన్నీ మర్చిపోయాడు అనిల్ !

క్రితంరోజు కల్సుకున్న మేరీ "రేపు మాట్నీకి పోదాం. త్వరగా రా ! టికెట్స్ దొరకవు. నే వెళ్ళి క్యూలో నిల్చుంటాను సహాసరి థియేటర్ దగ్గరికి రా" అని మరీ మరీ చెప్పింది.

'తప్పకుండా వస్తాను' అన్న అనిల్ యివాళ్ళే మేరీ మాట మొట్టమొదటి సారిగా మర్చిపోయాడు. యింక థియేటర్ దగ్గర, మేరీ క్యూలో కుస్తీపట్టి యెలాగో రెండు టికెట్లు సంపాదించి యివతలపడింది. అనిల్‌కోసం వెతికింది. హాలులోకి వెళ్ళి కూర్చుంది. సినీమా మొదలైంది. సినీమాతోబాటు తలనొప్పి మొదలయింది. 'వెధవ పిక్చర్' సణుగుతూనే కూర్చుంది యింక అలా వంటరిగా కూర్చోలేక మధ్యలోనే వెళ్ళిపోయింది.

అనిల్‌కి యేం పోయేకాలం వచ్చిందీ ! అనుకుంటూ మనస్సులో యెన్నో తిట్టుకుంది. అనిల్ మాత్రం యింటిదగ్గర మాలిని ఫోటో దగ్గర పెట్టుకుని హాయిగా కూర్చున్నాడు.

రంగయ్యగారు రాత్రి తొమ్మిదిగంటలు అవుతూండగా యింటికి వచ్చారు.

వస్తూనే కంగారుగా తన సామాను అంతా వెతుక్కున్నాడు. సవితని పిలిచి మెల్లగా అడిగాడు.

"తల్లీ! యిక్కడ ఫోటోలు ఉండాలి నాలుగు. తీశావా!"

సవిత ఆశ్చర్యంనటిస్తూ "ఫోటోలా! యెవరివి తాతగారూ!" అంది.

"నావేనమ్మా."

"మీవా! యెప్పుడు తీయించుకున్నారు? యెక్కడ తీయించుకున్నారు?"

"ఆ! అవన్నీ తర్వాత. ముందు చూశావా చెప్పమ్మా."

"మీలాంటి తాతగార్ల ఫోటోలు యెవరిక్కావాలండీ! సరీగా చూసుకోండి, యెక్కడ పెట్టుకున్నారో."

"సరిగ్గానే చూశాను. లేవు. ఆ ... అన్నట్టు గుర్తువచ్చింది. వాసు షర్టు చాకలికి వేసి ఉంటాడు. వాడే పీటిని తీసుకుపోయి ఉంటాడు! అంతే అయి ఉంటుంది. లేకుంటే వాటికి కాళ్ళు వచ్చి నడిచి వెడతాయా!"

"పోనీ మరోసారి తీయించేసుకోండి. బస్! బాధే ఉండదు"

రంగయ్యగారికి వళ్ళుమండిపోయింది–

"ఆ చాకలి వెధవ బట్టలు చూడద్దూ! జేబుల్లో యేమైనా ఉన్నాయేమో అని యీ వాసు అన్నా చూసి చచ్చాడు కాదు. ఆ చాకలి వెధవ రేపొద్దున్న కల్లా ఆ ఫోటోలు తెచ్చి యివ్వకపోతే వాడి అంతు చూస్తాను. రాస్కెల్! స్టుపిడ్."

రంగయ్యగారి కోపాన్ని చూసి వంటగదిలోఉన్న వాసూ, అక్కడేఉన్న సవితా పెదవులు బిగబట్టి వచ్చే నవ్వును ఆపుకుంటున్నారు.

"వాసూ!" బిగ్గరగా అరిచిన అరుపుకి వాసు భయంతో బిగుసుకుపోయి అంతలోనే తెప్పరిల్లి మెల్లగా వచ్చాడు అక్కడికి.

"యిదిగో చూడు! తెల్లవారేసరికి చాకలి వచ్చాడా సరే,లేకుంటే నువ్వే వెళ్ళి నా దగ్గరకు యీడ్చుకురా."

'అమ్మయ్య' అనుకుని మెల్లగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు. రాజేశ్వరమ్మ తన గదినించే యిదంతా వింటూ కూర్చుంది.

రంగయ్యగారు భోజనం కూడా సరిగా చేయకుండా పడుకున్నారు. రాత్రి పన్నెండింటికి వచ్చిన జగన్నాధానికి యిల్లంతా నిశ్శబ్దంగా కన్పించింది. ప్రొద్దుటినించి రాత్రివరకూ ఆ యిల్లు అలా నిశ్శబ్దంగానే ఉండి ఉంటుంది అనుకుంటాడు ఆయన. మత్తుగా గదిలోకి నడిచి బట్టలు మార్చుకునే అంత తెలివికూడా లేకుండా మంచంమీద అడ్డంగా పడిపోతాడు.

కోటునీ, బూటునీ భార్య విప్పాల్సిందే : యిది రాజేశ్వరికి రోజూ అలవాటే.

## 8

యివాళ సవిత పుట్టినరోజు. తలంటుకుని కొత్తబట్టలు వేసుకుని ముందుగా తాతగార్కే నమస్కరించటానికి వచ్చింది. రంగయ్యగారు దినపత్రిక చదివేది అవతలపెట్టి "హేపీ బర్త్‌డే టు యూ" అంటూంటే సవిత కిలకిలా నవ్వుతూ నమస్కారం పెట్టింది.

'శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు' అంటూ దీవించి 'తల్లీ ఉండు ఒక క్షణం' అని తన సంచీలో యెప్పుడో కొని దాచిన 'ఫారెన్ వూలి వూలి' చీరె తెచ్చి యిచ్చారు.

"ముందు కట్టుకుని చూపించు" అన్నారు.

"అరె : ఆరంజ్ కలర్ అంటే నాకు చచ్చేంత యిష్టం. బ్లౌజ్ పీస్ కూడా ఉందే. యిది ఫాషన్ అని మీకెలా తెల్సు తాతగారూ ? అసలెప్పుడు కొన్నారిది?"

"కొన్నానుగా యెప్పుడో :"

"యింత ఖరీదుపెట్టి యెలా కొన్నారు?"

"సంపాదించాను."

"యీ ఊళ్ళోనా : యెప్పుడూ ? యెక్కడా ? యెలా ?"

"నీ దగ్గరే" అంటూ రంగయ్యగారు నవ్వేశారు.

"ఆ :" అంటూ నవ్వేసింది.

"ముందు కట్టుకుని చూపించమ్మా."

సవిత లోపలికి పరుగెత్తి అయిదు నిమిషాల్లో చీరెకట్టుకుని వచ్చింది.

"బాగుందా తాతగారూ?"

"బ్రహ్మాండంగా వుంది" మనవరాలిని ఆత్మీయంగా చూస్తూ-

"నువ్విలా చీరెలు కట్టుకుంటేనే బాగుంటుందమ్మా. బంగారుతల్లిలా ఉన్నావు."

"ఊ :"

మూతి తిప్పింది సవిత.

భరత్ లిల్లీ పువ్వులు పట్టుకువచ్చి యిచ్చాడు చెల్లాయికి. అనిల్ యింతా

న్రిదలేవలేదు. సవిత అన్నయ్యా అంటూ వెళ్ళి లేపింది. జగన్నాథరావు తల్లికి నమస్కరించింది సవిత.

రంగయ్యగారు అనుకున్నారు, వీళ్ళలో ఉన్నది ఈ ఒక్క మంచి అలవాటు మాత్రమే అని

సవితా, పిక్చర్ ప్రోగ్రాం వేద్దాం ; నీ కే పిక్చర్ కావాలమ్మా చెప్పు. రిజర్ చేయిస్తాను.

"షోలే."

'ఓకే' అన్నాడు తండ్రి. రాజేశ్వరమ్మ అందించిన స్వీట్లు అందరికీ పం వాసూకి కూడా యిచ్చి ''తాతగారూ ; నోరు తెరవండి''అని నోట్లో స్వీట్ పె యిదిగో తాతగారూ సాయంకాలం చెప్పకుండా పారిపోకండి. పిక్చర్ ప్రోగ్రా వుంది."

"లాభంలేదు నేను రాను."

"యేం ;" అప్పటికే సవిత ముఖంలో కోపం కన్పిస్తోంది.

"నా ఫ్రెండ్‌కి కోపం వస్తుంది."

"పోనీ ఆమెనీ రమ్మని పిలుద్దాం."

"అలా అన్నావ్, బాగుంది. కానీ నువ్వు పిలవందే రాదే ;"

"అయ్యో యెలా ;"

"పోనీ సవితా తాతగారూ, నువ్వూ వాళ్ళింటికి వెళ్ళి 'టీ' కి రమ్మని పిలి రండి."

జగన్నాథం యిలా అనేసరికి రాజేశ్వరీ 'అవును పిలిచి రండి' అంది.

అసలు ఆ యింట్లో అందరికీ మాలినిని చూడాలని ఆసక్తిగా వుంది కూడా.

జగన్నాథం బైటికి వెళ్ళటానికి బట్టలు వేసుకుంటూంటే సవిత వచ్చి "డాడీ కారు కావాలి ;" అంది.

"అలాగే ; వదిలివెడతానుగానీ కాస్త జాగ్రత్తగా డ్రైవ్‌చేసి తీసుకువెళ్ళు తాతగారిని" అంటూ వెళ్ళిపోయాడాయన.

సవితకి చాలా సంతోషంగా ఉంది, మాలినితో పరిచయంచేసుకోబోతున్నానని. భలే అవకాశం దొరికింది అనుకుంది. భరత్ అసలీ విషయాలేం పట్టించుకోనే

"తాతగారూ పోదాం రండి. యిల్లు గుర్తు తెల్సుగా ;"

"ఓ ;" రంగయ్యగారు క్షణంలో బయలుదేరారు. కానీ ఆయన మనస్సులో భయంగా ఉంది. ఈ పిల్ల కారు సరిగా నడుపుతుందా, అని.




కారు చాలా దూరం వెళ్ళి మాలిని యింటిముందు ఆగింది. యిద్దరూ దిగారు. సవిత కారు లాక్‌చేసి తాతగారి వెంట లోపలికి నడిచింది. పెద్ద మేడ. దాని చుట్టూ ప్రహరీ. ముందు పూవుల మొక్కలు. అందంగా పూసి ఉన్నాయి. ఖరీదైన కర్టెన్‌లు తప్పించుకుని హాలులోకి అడుగుపెట్టారు.

నౌకరు వచ్చి రంగయ్యగారికి నమస్కారం పెట్టి,

"కూర్చోండి బాబూ! అమ్మగారు వస్తారు" అన్నాడు. యిద్దరూ కూర్చున్నారు.

సవిత ఆ యింటి ఖరీదుని అంచనా వేస్తూ 'అబ్బో! చాలా భాగ్యవంతులై ఉండాలి' అనుకుంది.

"అనసూయా!" అని రంగయ్యగారు కేకపెట్టగానే యాభై యేళ్ళ ఆమె, ఆమె భర్తా వచ్చారు. రంగయ్యగారి పక్కన కూర్చున్న సవితని చూస్తూ ఉంటే పరిచయం చేశారు.

"అనసూయా, రంగారావూ. వీళ్ళు మాలిని తల్లిదండ్రులు అని, 'సవిత' నా మనమరాలు" సవిత వాళ్ళిద్దరికీ నమస్కారం చేసింది.

"చాలా సంతోషమమ్మా! నువ్వు వచ్చావు. మీ నాన్న నాకు బాగా తెలుసు. కానీ యిన్నాళ్ళనించీ మీ యింటి అడ్రెస్ తెలియక రాలేదు. యిదిగో మీ తాతగారు మమ్మల్ని వెతుక్కుంటూ రావటంతో మన చుట్టరికం మళ్ళీ మొదలైంది." అంటూ వాళ్ళిద్దరూ యేవేవో కబుర్లు చెప్తున్నారు అవేవీ చెవికెక్కటంలేదు సవితకి.

"మాలిని రాదేం ?" అనే ధ్యాస మనవరాలి ముఖంచూసి గ్రహించి అడిగాడు.

"అనసూయా ! మాలిని యేదీ ?"

"ఫ్రెండ్ యింటికి వెళ్ళింది. సాయంకాలం వస్తుంది" అన్నది ఆవిడ.

"అరెరె ! మా సవిత మాలినిని టీకి పిలవటానికి వచ్చింది. యివాళ దీని పుట్టినరోజు కూడా !" అంటూ మాలిని వెళ్ళిన యింటికి ఫోన్‌చేసి మాట్లాడారు.

"సాయంకాలం తప్పకుండా వస్తాను" చెప్పింది అవతలనుంచి.

అనసూయమ్మ టిఫినూ, కాఫీ యిచ్చి సవితకి పువ్వులూ, పళ్ళూ యిచ్చింది. కారులో యిద్దరూ తిరిగి యింటికి వచ్చేశారు. సవిత బట్టలు మార్చుకుంది. కానీ మాలిని వాళ్ళయిల్లూ, ఖరీదైన ఫర్నిచరూ అంతా కళ్ళ ముందు తిరుగుతూండే తల్లితో చాలాసార్లు చెప్పింది యివన్నీ.

రాజేశ్వరమ్మకి అనసూయావాళ్ళు తమకంటే భాగ్యవంతులనీ ఒకే ఒక్క కూతురు ఉందనీ, ఆ పిల్ల అందమైనదనీ తెలిసి తమ పాతచుట్టరికాన్ని కొత్త చేసుకోవాలని తహతహగా ఉంది.

"మామగారూ ! వాళ్ళు కాస్త దూరం చుట్టాలే. అయితేమాత్రం ఈ దూర దేశంలో దగ్గరవాళ్ళే అవుతారు. మనింటి కోసారి రమ్మని చెప్పవల్సింది. మన అబ్బాయిని కూడా వాళ్ళు చూసేవాళ్ళు" అంది.

"అలాగే , చూద్దాంగా !" అన్నారు నవ్వేస్తూ.

"యివాళే పిలిస్తే పోలా ?"

"కాదు ! మరొకప్పుడు."

అబ్బ ఈ ముసలాయన మనస్సులో యేంవుందో ఆ బ్రహ్మదేవుడికే తెలియాలి అనుకుంటూ అక్కడినించి వెళ్ళిపోయింది రాజేశ్వరమ్మ. సవిత స్నేహితులు నలుగురు వచ్చారు. శుభాకాంక్షలు చెప్పారు. వాసు వాళ్ళకి టిఫినూ, కాఫీ అందించాడు.

యింక మధ్యాహ్నం పిండివంటలతో భోజనాలు అయ్యాయి. రంగయ్యగారు కాసేపు విశ్రాంతిగా పడుకుని లేచి ఇస్త్రీబట్టలు వేసుకుని కూర్చుని రికార్డు ప్లేయర్ పెట్టటం మొదలెట్టారు. యెక్కడనించి తెచ్చారో మరి.

అన్నీ పాత సినిమా పాటలే ! 'ఆహా హా' అంటూ ఆ పాటలని వింటూ వాటికి తాళంవేస్తూ ఆ పాటల్లో కొన్నింటికి గొంతుకలిపి రాగంతీస్తూ



"అమ్మాయ్ ! రాజేశ్వరీ ! యిలా వచ్చి కూర్చోమ్మా ! ఈ పాట విను. యెంత బాగుందో !

"సర్వమంగళనామా !" విన్పిస్తోంది. రాజేశ్వరి సంబరపడిపోతూ "యెన్నాళ్ళయిందో ఈ మంచి పాట విని" అంటూ మెచ్చుకుంటూ ఉంది.

'ఘంటసాలగారి పుష్పవిలాపం', 'టంగుటూరి సూర్యకుమారి మా తెలుగు తల్లి', 'సీయస్సార్ రంగస్థల పద్యాలు' 'కుంతీ విలాపం', యింకా 'రామతిలకం పద్యాలు' అంటూ పెట్టిన రికార్డు 'గుర్ గుర్' మంటూ యేవేవో శబ్దాలు వస్తున్నాయి. ఆమె గొంతు కీచుమంటూ విన్పిస్తోంది అయినా రాజేశ్వరమ్మా, రంగయ్యగారూ ఆహా హా అంటున్నారు. కానీ యివతలగదిలో ఉన్న సవితకి ఘంటసాలగారి పద్యాలుతప్ప మరేం నచ్చలేదు. 'అబ్బబ్బా !' అంటూ చెవులు మూసుకుంది.

"'మా తెలుగుతల్లికి మల్లెపూదండ' మళ్ళీ పెట్టండి మామగారూ."

"ఓ ఒకసారేం ఖర్మ నాలుగుసార్లు పెడతాను"

యిలా విన్పిస్తూనే ఉన్నాయి పాతపాటలు.

సవిత, మాలిని వచ్చే టైము అయిపోతోంది అని త్వరత్వరగా మస్తాబు ముగించుకుంటూ వాసుని యిల్లంతా సరిగా సర్దమని పదిసార్లు చెప్పింది.

పుట్టినరోజుకోసం కొనుక్కున్న పెద్ద గళ్ళున్న లుంగీ దానిమీద ఫుల్ హాండ్స్ షర్టూ వేసుకుంది. జుత్తు వదిలేసి రిబ్బన్ ముడివేసింది. మెడలో ఒక్క డాలర్ చైన్‌వేసుకుని తాతగారి దగ్గరికి వచ్చింది. మనవరాలిని కిందనించి పైకి చూసి "ఈ ఫాషనూ బాగానే ఉన్నట్లుంది కానీ పుట్టినరోజు చీరెకట్టుకుంటే బావుంటుంది."

"ఆ...మీరెప్పుడూ యిలానే అంటారు తాతగారూ! అవునూ మాలిని యింకా రాలేదేం?" అంది టైము చూసుకుంటూ.

"తప్పకుండా వస్తుంది."

సవిత అనిల్‌కోసం అతని గదిలోకి పరుగెత్తింది. అతను మంచం మధ్యలో కూర్చుని చెవుల్లో వేళ్ళు దూర్చి ముఖం మాడ్చుకుని కూర్చుని సవితని చూడగానే,

"తల్లీ! తాతగారి ముద్దుల మనవరాలా! కాస్త వెళ్ళి ఆ పాత పాటలు ఆఫ్ చెయ్యి. చస్తున్నాను వినలేక." ప్రాధేయపడుతూన్నట్లుగా అడిగాడు.

"అబ్బబ్బ! అవన్నీ సరేగానీ మాలిని మనింటికి వస్తోంది బ్రదర్."

"ఆ! నిజంగా" యెగిరి గంతేశాడు అనిల్.

"చూడు. యెక్కడికీ వెళ్ళకూ!" హెచ్చరించింది సవిత.

"వెళ్ళను. కానీ మీ తాతగారు అంత సౌండ్ యిచ్చి పెట్టే తెలుగుపాటలు వినటం పెద్ద పనిష్‌మెంట్ సిస్టర్."

"కాస్త ఓర్పు అవసరం బ్రదర్."

"ఈ విషయంలోమాత్రం కాదు. చూడమ్మా ఆ రికార్డులు ముసలాయన చూడకుండా రోడ్డుమీద గిరాటుకొట్టు. పీడ వదలిపోతుంది." కోపంగా అన్నాడు.

"అమ్మో" భయం నటిస్తూ అంది. అనిల్ 'అబ్బా' అంటూ తలపట్టుకు కూర్చున్నాడు.

యింక రంగయ్యగారి దగ్గర కూర్చున్న భరత్ పాతరికార్డులు బాగున్నవి బాగులేనివీ అన్నీ వింటూ ఆ పాడినవారి వివరాలు అడిగి తెలుసుకుంటున్నాడు.

యింతలో ఫోన్ మ్రోగింది. సవిత అందుకుంది.

"యెవరిదగ్గర నుంచమ్మా?" రంగయ్యగారు అడిగారు.

"మాలినికి కాస్త జ్వరం వచ్చిందిట. రాలేకపోయినందుకు 'సారీ' చెప్తోంది వాళ్ళ అమ్మ." నీరసంగా చెప్పింది సవిత.

'అయ్యో' రంగయ్యగారి ముఖం చిన్నబోయింది. యింక పాటలు వేయటం ఆపేసి లేచారు. 'అలా వెళ్ళి వస్తాను' అంటూ కోడలికి చెప్పి వెళ్ళిపోయారు. "అరె ! సినీమా !" అనుకుంది సవిత.

"ఊః ! నా ప్రోగ్రాం అంతా ఖరాబైపోయింది" అనిల్ విసుక్కున్నాడు.

సవిత బర్త్‌డే పార్టీ చప్పగా జరిగింది. భరత్ మాత్రం సినీమాకి సవితతో బయలుదేరాడు.

## 9

రాత్రి యెనిమిదిగంటలకి అనిల్ నడిచి వస్తూంఉండగా గుర్తుతెలియని వ్యక్తులు యిద్దరు వెనకగా వచ్చి నెత్తిమీద బలంగా కొట్టి పారిపోయారు. అనిల్ ఆ దెబ్బకి స్పృహతప్పి పడిపోగా యెవరో స్నేహితులు చూసి ముందు హాస్పిటల్‌లో చేర్పించి యింటికి ఫోన్ చేశారు. భరత్ సమయానికి యింట్లో వుండబట్టి తల్లిని తీసుకుని హాస్పిటల్‌కి పరుగెత్తాడు. "దెబ్బ తీవ్రమైనదే అయినా మరేం ఫర్లేదు" అన్న తర్వాత గానీ రాజేశ్వరమ్మ యేడుపు ఆపలేదు. యింక రాత్రి తొమ్మిది దాటినతర్వాత యిల్లు చేరిన రంగయ్యగారు యీ విషయం విని ఆశ్చర్యపోయారు.

"అనిల్‌కి విరోధులెవరున్నారురా భరత్?" మెల్లగా అడిగారు. భరత్ మాట్లాడలేదు.

అయినా రంగయ్యగారు వదల్లేదు. యింక తప్పక చెప్పాడు.

"ఓ నెల్రకితం చిన్నతగువులో అనిల్ ఒక ఫ్రెండ్‌ని అవమానించాడు. ఘర్షణ పెరిగి రెండు చెంపదెబ్బలు వేశాడుకూడా. వాడు అప్పటికి వెళ్ళిపోయాడు. కానీ ఆ కోపం యిప్పుడు తీర్చుకున్నాడు. యింకా నయం ప్రాణం తియ్యకుండా వదిలారు. యిందుకు సంతోషించాలి. అయినా అలాంటి గుండాలతో స్నేహం వద్దు అని యెన్నిసార్లు చెప్పినా వీడికి తలకెక్కలేదు. ఫలితం అనుభవించాడు."

"అసలు వాళ్ళతో ఘర్షణ యెందుకొచ్చింది?"

"గర్ల్ ఫ్రెండ్స్" యింక వివరాలు చెప్పటం అంతగా యిష్టంలేనట్లుగా అక్కడినించి వెళ్ళిపోయాడు.

యింక అర్ధరాత్రి యిల్లుచేరిన జగన్నాధరావు భార్యచెప్పింది అంతావిని ఒక్క మాటకూడా మాట్లాడకపోవటం రంగయ్యగారిక్కి ఆశ్చర్యం కల్గించింది. యేమిటీ వీడి పద్ధతి? యిలానే పిల్లలని పెంచటం? వాళ్ళపట్ల తండ్రిగా బాధ్యత యిదేనా? అనలు వీడే సరైనదారిలో లేడు? యింక పిల్లలని యేందారిలోకి తెస్తాడు? వూ? తెల్లవారనీ చెప్తాను? అనుకుంటున్న ఆయన మనస్సులో కోపం బాధా వుక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. చాలా అశాంతిగా వుంది. నిద్రరావటంలేదు కూడా.

యీనాటి యువతరంకి సరైన శిక్షణ లేకుండావుందా? వీళ్ళ ఆలోచనలు వక్రమార్గాన పడటానికి కారణం యేమిటి? యెందుకిలా ప్రవర్తిస్తూన్నారు. మనజాతి భవిష్యత్తు యీ యువతరం మీదనే వుంది. అన్న విషయం మర్చిపోతే యెలా? వీళ్ళని సరైన దారిలో కనుక పెడితే యెందరో మేధావులుగా తయారవుతారు. నిజమేకానీ యీ యువతరాన్ని సంప్రదించటం యెలా? ఒకే యింట్లో పెరిగిన భరత్‌కీ? అనిల్‌కీ యెంత వ్యత్యాసం?

రంగయ్యగారు ఆవేదన పడిపోతూన్నారు. అనిల్ సహజంగా చాలా తెలివైనవాడు. కానీ చెడుప్రభావం పడింది. దాన్ని మెల్లగా తప్పించగల్గాలి. ఔను, అంతే?

యిలా ఆలోచిస్తూ యెప్పుడో నిద్రపోయారు.

తెల్లవారింది. రంగయ్యగారు స్నానం కాఫీ పూర్తిచేసుకుని పేపరు చూస్తూన్నారు. జగన్నాధం టిఫిన్ తింటున్నాడు. సవిత యింకా నిద్రలేవలేదు.

"జగన్నాధా? అనిల్ విషయం పట్టించుకోకపోతే యెలారా?" అన్నారు.

"యేంచెయను పెదనాన్నా? అసలు వీడిని వెళ్ళి ఆ వెధవలతో అవాళ దెబ్బలాడి రమ్మన్నానా? యివాళ తలబద్దలు కొట్టించుకు రమ్మన్నానా?"

"అలా అంటే యెలారా? తెలిసీ తెలియని వయస్సు? అసలు యిలాంటప్పుడే తల్లిదండ్రుల అవసరం యెక్కువ. వాడి దారి సరిదిద్దితే భవిష్యత్తు బంగారంలా వుంటుంది."

"నిజమే? కానీ యెలా? నేనేం చేయను?" అసహనంగా అన్నాడు.

"పెళ్ళి చేయమంటాను" కోపంగా అన్నారు రంగయ్యగారు.

"పెళ్ళా? యీ హిప్పీగాడికి అయినింటి పిల్లని యిస్తామని యెవరు వస్తారు?"

రంగయ్యగారు మాట్లాడలేదు. జగన్నాధం అనిల్ యెప్పటినించీ యిలా తయారయాడో చెప్తూ వీడికి వేరేకులంపిల్ల తప్ప మరెవరూ దొరకలా! ఆసుపత్రినించి రాగానే 'యింట్లోనించి పో! ఆ పిల్లనే పెళ్ళాడు! ఆస్తిలో చిల్లి గవ్వ యివ్వను' అని చెప్పేస్తాను! వీడిలా తల పగలగొట్టించుకున్నాడంటే నాకెంత అవమానంగావుందో తెల్సునా ? బైట తలెత్తుకు తిరగలేకపోతున్నాను. అసలు యిలాంటివాళ్ళని వాళ్ళఖర్మకి వదిలేయటమే సరైన పనిష్మెంట్" ఆగ్రహంతో వూగిపోతూ అన్నాడు.

"అరేయ్! యిదిసరైన నిర్ణయం కాదురా. వాడు తెలియక బురదలోకి దిగుతుంటే పెద్దవాళ్ళం తెలియజెప్పాలి కానీ వదలటం అవివేకం. చేతులు కాలిన తర్వాత మనమీదపడి యేడవడూ! పిచ్చిసన్యాసి, నిండా ముప్పయ్యేళ్ళు లేవు. వాడికేం తెల్సురా!"

"మీరు చెప్పేమాటలు పాతకాలంనాటివి పెదనాన్నా! యిప్పటి పిల్లలకి బుద్ధి లేదు. చెప్పినా రాదు."

"అసలు పిల్లలకి బుద్ధిఅనేది యెలా వస్తుందిరా?"

"పెద్దవాళ్ళన్నా, వాళ్ళ మాటన్నా గౌరవం వుంటే?"

"అసలా గౌరవం యెలావస్తుందంటావ్?" రంగయ్యగారు సూటిగా అడిగారు.

జగన్నాధం కాఫీ తాగేసి కప్పు విసురుగా టేబిల్పైనపెట్టి కర్చీఫ్తో ముఖాన్ని ఓసారి గట్టిగా తుడుచుకుని జవాబు చెప్పకుండా వూరుకున్నాడు. అప్పటికే ఆతనిముఖం యెర్రబడిపోయింది. చూశారు రంగయ్యగారు. ఆయినా వదలదల్చుకోలేదు.

"చూడూ వాళ్ళు మనని గౌరవించాలి అంటే ముందు మన ప్రవర్తన సరిగా వుండాలి! నీతులు చెప్పటానికి కాదురా వున్నది. ప్రతివ్యక్తీ ఆచరించటానికి. చేసి చూపించటానికి. పెద్దలు అలావుండి పిల్లలకి చెప్పిననాడు వాళ్ళు యెదురు తిరగ్గలరా ! జవాబివ్వగలరా! అలా యిచ్చేశక్తి వాళ్ళకి వుంటుందా?"

రంగయ్యగారి కంఠం ఖంగ్ మంటోంది. వంటగదిలో వున్న రాజేశ్వరమ్మ క్షణం వణికింది. అప్పుడే నిద్రలేచి యివతలకి వస్తూన్న సవిత గదిలోపలే నిలిచిపోయింది. తనగదిలో కూర్చునే చదువుకుంటూన్న శరత్ తండ్రీ, తాతగారూ మాట్లేడేవి వింటూ ఆఖరున తాతగారు వేసిన ప్రశ్నకి జవాబు యేం వస్తుందా అని అతి నిశ్శబ్దంగా కూర్చున్నాడు. జగన్నాధం జవాబు చెప్ప లేదు.

రంగయ్యగారు తిరిగి తీవ్రంగా అంటూన్నారు.

''డబ్బు సంపాదించటం, మేడలూ కార్లూ కొనటం, బ్యాంక్ బాలెన్సు పెంచటంతో నీ బాధ్యత పూర్తికాలేదురా! పిల్లలకి సరైన శిక్షణ అలవడిందా లేదా? అని చూడాలిరా! వాళ్ళని కాలేజీలకి పంపి చదివించటంతో సరిపోదు. వాళ్ళు వేసే ప్రతిఅడుగూ గమనిస్తూ వుండాలి పెద్దలు. నాయనా యివన్నీ నీకు తెలియవని కాదు నే చెప్పేది, తెల్సినా అలక్ష్యం చేస్తూన్నావు, అని మాత్రమే చెప్తూన్నాను! యిలా చేయకు, అని నీ కర్తవ్యాన్ని గుర్తుచేస్తూన్నాను."

జగన్నాథం చెప్పులు వేసుకున్నాడు బైటకి వెళ్ళిపోవటానికి.

"అనిల్‌కి ఒక మంచి సంబంధం చూశాను, యీ పూళ్ళోనే!" అనేసరికి ఆశ్చర్యపోతూ

"యెవరా పిల్ల?'' అన్నాతు.

"ఆ విషయాలన్నీ తర్వాత! వాడిని దారిలోకి తేగల పిల్లనే చూశాను. వజ్రాన్ని వజ్రంతోనే కోయాలి ఒక్కొక్కప్పుడు."

"మంచిదే! యీ విషయంలో నాదేంలేదు. అంతా అనిల్‌దీ, మీ కోడలిదీ యిష్టం. అయినా అనిల్ మీ మాట మన్నించి మీరు చూసిన పిల్లని చేసుకుంటా డన్న నమ్మకం నాకులేదు. మీ శ్రమంతా వృధా కావచ్చు'' అంటూ వెళ్ళిపోయాడు. సవిత తండ్రి వెళ్ళగానే పరుగున వచ్చి "తాతగారూ! యెవరా పిల్ల? చదువుకుందా? అందంగావుందా! వాళ్ళకి బాగా డబ్బుందా ? ఫాషన్‌గా వుంటుందా?'' గుక్కతిప్పుకోకుండా అంది.

"యీ ప్రశ్నలు కావమ్మా నువ్వు అడిగేది! గుణవంతురాలేనా? కులమింటి పిల్లేనా? అని అడగాలి."

"అంటే?"

"కులమింటి 'కోతి' నైనా కోడలుగా తెచ్చుకోవచ్చుగానీ గుణంలేని 'రూపం', నిరర్థకం అని మన తెలుగు సామెత. దీనిలో చాలా సత్యంవుంది అంటారు పెద్దలు."

అంటూండగానే సవిత నోట్‌బుక్ తెచ్చి అందులో రాసేసుకుంది. సవితని చూస్తూంటే నవ్వూ కోపమూ కూడా వస్తోంది, యీ అమ్మాయి ప్రవర్తనకి. తర్వాత సవిత "యింతకీ ఆ అమ్మాయి యెవరు?" అని అడిగినా సీక్రెట్ అనేసి.

"యేదీ నా ఫైవ్‌రుపీస్! అర్జెంట్‌గా కావాలి." అని వసూలుచేసి యేడుపు ముఖం పెట్టిన సవితని చూసి కొంటెగానవ్వి-

"సవితా త్వరగా కాఫీ యివ్వమ్మా కూరలకి మార్కెట్‌కివెడదాం" అన్నాడు వూ: తాతయ్యదగ్గర మన ఆటలు 'కట్' అనుకుని అక్కడనించి వెళ్ళింది.

## 10

అనిల్ హాస్పిటల్లో వుండగా మాలిని రంగయ్యగారివెంట రెండు మూడు సార్లు వచ్చింది. చూసి క్లుప్తంగా పల్కరించి కాస్సేపు కూర్చుంది. వస్తూ వస్తూ యాపిల్స్ డజను పట్టుకువచ్చి అనిల్‌కి యిచ్చి మరీ వెళ్ళిపోయింది. అనిల్ స్నేహితులు చాలామంది వచ్చి చూసిపోతూన్నారు.

వారంతర్వాత అనిల్‌ని యింటికి తీసుకువచ్చేశారు.

గాయం మాను పట్టేసింది. జులపాలజుట్టుని యిదే మంచి అవకాశం అనుకుని తీయించేశాడు జగన్నాధం.

యెందరు వచ్చిచూసినా అసలైన మేరీమాత్రం రాలేదు. సరికదా 'యెలావున్నాడు?' అని కబురైనా పంపలేదు. అనిల్ లోలోపల బాధ పడిపోతూన్నాడు. ఒక ఫ్రెండ్ ఓ వార్త పట్టుకొచ్చాడు మేరీ తన బంధువే ఒకతను ఫారెన్‌లో వున్నవాడిని పెళ్ళాడి అమెరికా వెళ్ళిపోయింది అనీ, యీ వుత్తరం నీకు యిమ్మన్నదనీ చేతిలో పెట్టాడు.

అనిల్ ముఖాన కత్తివాటుకి నెత్తురుచుక్కలేదు యీ విషయం నమ్మలేక వుత్తరం విప్పాడు. మేరీ రాసింది.

అనివార్య పరిస్థితిల్లో యిలా పెళ్ళిచేసుకుని వెళ్ళిపోవల్సి వచ్చింది.

నాకీ యిండియాలో వుండాలని అస్సలులేదు.నువ్వు నన్ను మర్చిపో అనిల్. వేరే మీవాళ్ళ అమ్మాయిని చేసుకో. నేను తిరిగి యిండియా రాను.

యింతే
మేరీ

అనిల్ స్థాణువులా అయిపోయాడు, యిది నిజంగా జరిగిన విషయమేనా అని రెండునిమిషాల తర్వాత ముఖం చేతుల్లో మూసేసుకుని గదితలుపు ఘడియ బిగించేసుకుని ఆరోజుకి తలుపు తెరవలేదు రాజేశ్వరమ్మ మొత్తుకుంది. సవిత అన్నగార్ని బ్రతిమిలాడింది. శరత్ యెన్నిసార్లో పిల్చాడు. తండ్రివచ్చి కోపంచేశాడు.

"రంగయ్యగారు మాత్రం యేమీ మాట్లాడకుండా అంతా చూస్తూ యేంజరిగిందో సవితవల్ల తెల్సుకున్నారు.తలవంచుకుని వూరుకున్నారు.

రాజేశ్వరమ్మ యేడ్చి యేడ్చి చివరికి యెలాగో కొడుకుచేత తలుపు

తీయించగల్గింది. కానీ అనిల్ యెంతో నీరసపడిపోయినట్లుఅయి ముఖం నల్లగా వుంది. అదోలా అయిపోయాడు. అతన్ని బాధా అవమానం యింకా యెన్నెన్నో వేధిస్తూన్నాయి.

సవిత అన్నగారి దగ్గరే కూర్చుని కబుర్లు చెప్తోంది. కానీ యివేవీ అతని బుర్రలోకి యెక్కటంలేదు. మేరీ డబ్బుకోసం ఆశపడి నన్ను వదిలి వెళ్ళిపోయిందా!

అతని తల దిమ్ముగా అయిపోయి కళ్ళు గట్టిగా మూసేసుకున్నాడు.

## 11

మరోవారానికి అనిల్ మామూలు మనిషి అయాడు. తలకి తగిలిన దెబ్బ తగ్గినా మనస్సుకి తగిలినగాయం మానలేదింకా. యేంచేయటానికీ వుత్సాహం చూపక నిర్లిప్తంగా వుండిపోతూన్నాడు. మాలిని ప్రతిరోజూ రంగయ్యగారి కోసం వీళ్ళయింటికి విమానంకారులో వచ్చి అనిల్‌తోనూ రాజేశ్వరమ్మతోనూ కాస్సేపు కబుర్లుచెప్పి వెళ్ళిపోతుంది. వెళ్ళేటప్పుడు రంగయ్యగార్ని తీసుకుని మరీ వెళ్ళిపోతుంది.

యీ ఒక్కవిషయం అనిల్ భరించలేకపోతూన్నాడు. సవిత సరేసరి. అవమానంతో వూగిపోతూంది.

"తాతగారు ఓ అమ్మాయిని చూశారట. త్వరలో నీ పెళ్ళి చేస్తారట" సవిత అన్నగారి చెవిలో రహస్యం అంటూ వూదేసింది.

"యెవరా అమ్మాయి?" అనిల్ ముఖం ముడుచుకుని అడిగాడు.

"వాళ్ళు చాలా పేదవాళ్ళుట! అయినా మర్యాదకలవాళ్ళు? పిల్ల అందగత్తె కాకున్నా గుణవంతురాలు. పైస కట్నంలేకున్నా లక్ష్మిలాంటి పిల్ల!'' తాతగారి మాటలని తూ.చా తప్పకుండా అన్నగారిదగ్గర వర్ణించి ఆఖరికి అంది.

"అన్నాయ్! నీకు కాబోయే భార్య కులమింటికోతి అయివుంటుంది."

సవిత తీరుబడిగా యీ కబుర్లన్నీ చెప్తూంటే అనిల్ ముఖం యెర్రబడి పోయింది.

''అయితే మమ్మీ, డాడీ 'ఓకే' చేశారా?"

''యస్."

"నువ్వు వద్దు అని చెప్పకపోయావా!"

"అమ్మో! నావల్ల కాదు."

"యేం యెందుకనీ! తాతగారంటే భయమా?'' కోపంగా అడిగాడు.




"కాదు, భక్తి."

"యిదెన్నాళ్ళనుంచీ."

సవిత జవాబు చెప్పలేదు. భరత్ యిదంతా వింటూ-

"అన్నయ్యా! నువ్వొట్టి అమాయకుడివి. తాతయ్య పార్టీలో సవిత యెప్పుడో చేరిపోయింది. యీ విషయం నీకు తెలియదూ!"

"తెలియదు. కానీ కారణం యేమిటి?"

"చాలా పెద్దదే! సవిత 'లా' చేసిన గోకుల్‌ని—చూసివచ్చారు తాతగారు. అతను మహారాష్ట్రియన్ అయినా కుర్రాడు బుద్ధిమంతుడు. వాళ్ళ సాంప్రదాయంకూడా బాగానేవుంది కనుక..."

"కనుక...త్వరగా చెప్పరా!" ఆతురతగా అడిగాడు.

"వాళ్ళిద్దరికీ పెళ్ళి త్వరలో సెటిల్ చేయబోతున్నారు."

భరత్ అన్నగార్కి అంతా చెప్తూంటే సవిత నేలచూపులుచూస్తూ కూర్చుండిపోయింది. సిగ్గుతో ఆ అమ్మాయి ముఖం యెర్రబడింది.

"వర్ణాంతరమేకాక భాషాంతర వివాహానిక్కూడా తాతయ్య ఒప్పుకున్నారా!" ఆశ్చర్యంగా అడిగాడు అనిల్.

"మనిషికి మంచితనం ప్రాధాన్యంకానీ కులమతాలు కావు అన్నారు తాతగారు. కులాంతర వివాహాలు మంచివేకానీ యిలా చేసుకునేవాళ్ళకి కొంతం ఓర్పు

యెక్కువ వుండాలి. అలవాట్లలో ఆచారవ్యవహారాల్లో తటస్థపడే సమస్యలని సర్దుకుపోగలగాలి. యిలా జరిగితే వర్ణాంతర వివాహాలు సత్ఫలితాలే యిస్తాయి. అని అర్థగంట లెక్చర్ యిచ్చారు గోకుల్‌వాళ్ళయింట్లో. అంతే, వాళ్ళు సవితని చేసుకుంటాం అన్నారు."

భరత్ యిలా చెప్తూంటే తాతగారిమీద కోపం తెచ్చుకోలేకో అలా అని చెల్లెలి అదృష్టానికి సంతోషపడకుండా వుండలేకాపోయాడు అనిల్.

"సవితా! నువ్వు చాలా అదృష్టవంతురాలివమ్మా! ప్రేమ వివాహం అయినా పెద్దల ఆమోదం లభించింది!" దీర్ఘంగా నిట్టూరుస్తూ అన్నాడు.

"అన్నయ్యా నీకు మాత్రం యేం! నీకూ కాబోయే భార్య బాగానే వుండి వుంటుంది."

"వుండదు! నాకుతెల్సు. తాతగారికి నేనంటే సదభిప్రాయంలేదు. నాకూ యిందివరకు అంతే అనుకో."

"ఆ అభిప్రాయం మార్చుకుని నిశ్చింతగా వుండు అన్నయ్యా!"

"వుండను. వుండలేను, తాతయ్య చేస్తూన్న అన్యాయానికి ప్రతీకారం చేసి తీరతాను. చేసితీరాలి. కాని యెలా!" ఆలోచనలో మునిగిపోయిన అనిల్ అర్థ రాత్రివరకూ నిద్రపోలేదు. ఆలోచించగా ఆలోచించగా ఆఖరుకి ఒక ఐడియా తట్టింది. అంతే సవితగదిలోకి వెళ్ళాడు. గాఢనిద్రలోవున్న చెల్లెలిని లేపి కూర్చోపెట్టాడు. సలహా అడిగాడు సవిత కళ్ళు నలుముకుంటూ లేచికూర్చుంది. అన్నగారి ప్లాన్ వినేసరికి నిద్రమత్తు యెగిరి చక్కాపోయింది.

"వండర్‌ఫుల్ అయిడియా!రేపే చేసేయి." అని పడుకుని ముసుకు పెట్టేసుకుంది.

అనిల్ హుషారుగా మళ్ళీ తనగదిలోకి వచ్చి టేబిల్ సొరుగులోవున్న మాలతీ, తాతగారూ కల్సి తీయించుకున్న ఫోటోలను తీశాడు. అమ్మయ్య ఆవాళ కోపంలో అన్న కత్తిరించి పారేయలేదు, అనుకుని యేదో వుత్తరం రాస్తూ చించేస్తూ తెల్లకాయితాలు పోగుచేశాడు. తెల్లవారి పదిగంటలు కాకుండానే "పనివుందమ్మా" అంటూ బైటకి వెళ్ళిపోయాడు. సవిత యిటు అన్నగార్ని ప్రోత్సహిస్తోంది. అటు తాతగారితో మంతనాలు సాగిస్తోంది.

రాజేశ్వరమ్మ మాత్రం పెద్దకొడుకు చాలారోజులకి మళ్ళీ మామూలుగా యిల్లు వదిగి బైటకి వెళ్ళాడు అని తృప్తిగా నిట్టూర్చింది.

## 12

మాణిక్యమ్మగారు కూతురు పురిటిస్నానం అయిన మరుసటిరోజే బొంబే రైలు యెక్కేస్తూ "వస్తూన్నాను" అంటూ టెలిగ్రాం యిచ్చింది. ఆ టెలిగ్రాం చూసి రాజేశ్వరమ్మ కంగారుపడింది.

"యిదేమిటి. ఉరమని పిడుగులా యింత హటాత్తుగా వచ్చేస్తోంది యీవిడ."

యీ మాటవిన్న సవిత అమాంతం గదిలోకి పరుగెత్తి ఆ మాటని నోట్ చేసేసి 'అమ్మయ్య తాతగార్కి ఫైవ్‌రుపీస్ యిచ్చేబాధ తప్పింది,' అనుకుంది సంతోషంగా.

"అమ్మా! రైల్లో వచ్చేది బామ్మగారా! అయితే స్టేషన్‌కి యెవరిని పంపిస్తావ్?" అడిగింది.

"అయ్యో! తాతగారుకూడా లేరే! యిప్పుడప్పుడే రారే! యెలా! ఆవిడని మీరెవరూ యెరగనుకూడా యెరగరు!"

"ఆవిడ యెలావుంటుందో గుర్తుచెప్పమ్మా! నేనూ, పెద్దన్నా వెళ్ళివస్తాం!"

రాజేశ్వరమ్మ మరీ ఆశ్చర్యపోయింది కూతురి శ్రద్ధకి.

అనిల్‌కూడా రెడీఅయాడు. అన్నా చెల్లెలూ స్టేషనుకి వెళ్ళారు జగన్నాధం, వూరిలోలేడు. రంగయ్యగారు యింట్లోలేరు. యెప్పుడు తిరిగివస్తారో అంత కన్నా తెలియదు. యెలాగైతేనేం బామ్మగార్ని స్టేషనునుంచి యింటికి తీసుకు వచ్చారు అనిల్ సవితా. అసలు రాజేశ్వరమ్మకి పెద్దకొడుకు యిలా నాయనమ్మ కోసం స్టేషనుకి వెళ్ళటం మరీ ఆశ్చర్యం కల్గించింది.

వీడి తల పగలగొడితే పగలగొట్టారు కానీ ఆ తల్లోవున్న పురుగు తిరిగి నట్టుంది వెధవకి అనుకుంది. వీడు అందరిలా మామూలుగా అయితే భగవాన్ నీకు కల్యాణం చేయిస్తాను అని మొక్కుకుంది.

మాణిక్యమ్మగార్ని అరక్షణం కూడా వదలటంలేదు సవితా, అనిల్. వీళ్ళిద్ద రికీ అప్పుడే యింత చనువు యెలా వచ్చిందబ్బా అనుకుని మరీ ఆశ్చర్య పోతోంది రాజేశ్వరి.

"అత్తగారూ! ముందు కాస్త కాఫీతాగి స్నానం చెయ్యండి." వినయంగా అంది కోడలు.

"అహా! ముందు స్నానం, తర్వాత కాఫీగానీ, యింతకీ మీమామగారు యేరే రాజేశ్వరీ?" యిల్లంతా కలయజూసి మరీ అడిగింది ఆవిడ. భరత్ బామ్మ వచ్చింది అనితెలిసి హాలులోకి వచ్చాడు. బామ్మని చూస్తూన్నాడు. మాణిక్యమ్మ

గారిది అసలు తెల్లటిరంగే అయినా వయస్సు మీరటంవల్ల రంగు కాస్త తక్కువగా కన్పిస్తోంది. ముడతలుపడిన ముఖం అయినా య్యెర్రటి కుంకుమబొట్టు ఉదయిస్తూన్న బాలభానుడిలా య్యెర్రనికాంతిని వెదజల్లుతోంది. తెల్లగా వెండి తీగల్లా మెరుస్తూన్న జుత్తు పట్టుకుచ్చులా జారిపోతున్నట్లుంది. బిగించి వేసుకున్న బర్మాముడి దానిమీద క్రితంరోజు పెట్టుకున్న చేమంతి పూలదండలోని దారం కుడిభుజం మీదకి జారిపోతూవుంది. నెమలిపింఛంరంగు గుంటూరు చేనేత జరీచీరెలో తెలుగు ముత్తైదువ అలవాటుగా కట్టుకునే కట్టు ముందుకి కుచ్చెళ్ల జీరాడుతూన్నాయి. పొడుగుపాటి పమిట చేతికిందనించి తిప్పి నడుం దగ్గర దోపుకున్న ఆవిడ చీరెలాంటి రంగుదే కణుమంచు రెవికె వేసుకుంది. ఆవిడమెడలో పచ్చని పసుపుతాడు నల్లపూసల గొలుసూతప్ప మరే నగలూ లేవు. చేతులకి రంగురంగుల మట్టిగాజులు నిండుగా వున్నాయి.

శరత్ ఆవిడని తదేకంగా చూస్తూన్నాడు. ఆమె కళ్ళలో అమాయకత్వం, దాని వెనక అతి నిరాడంబరత్వం కన్పిస్తోంది. ఆవిడ ముఖంలోని ప్రశాంతత శరత్ ని ఆకర్షించింది.

అత్తగారు అడిగిన ప్రశ్నకి కోడలు జవాబు చెప్పింది.

"మామగారు కూరలకి వెళ్ళారు. యిప్పుడే వస్తారు." అని అదుగో అనిల్ నీ, సవితనీ చూశారుగా. యింక వీడే రెండోవాడు శరత్. మీరు పురుడుపోసి వుయ్యాల్లోవేసి పేరుపెట్టి ముద్దకుడుములు యిప్పించి పంపినవాడు వీడే."

"అవునా!" శరత్ ముఖంలోకి ఆత్మీయంగా చూస్తూఅంది.

"ఔను. వాడు పెద్ద అయిన తర్వాత మిమ్మల్ని చూడలేదు. కానీ 'బామ్మ అంటే యెలావుంటారమ్మా' అని యెప్పుడూ అడుగుతూవుంటాడు"

శరత్ నమస్కారం చేస్తూంటే మాణిక్యమ్మగారు అతని చేతులు పట్టుకుని దగ్గరగా తీసుకుని సోఫాలో ప్రక్కన కూర్చోపెట్టుకుంది.

"శరత్! యింతపెద్దవాడివైనావుకదా! నన్ను ఒక్కసారన్నా చూడాలని అన్పించలేదా!" అంది ఆత్మీయంగా వీపునిమురుతూ.

శరత్ కి సిగ్గూ సంకోచంగా వుంది. రాజేశ్వరమ్మ ఎప్పటివో కబుర్లుచెప్తూ "శరత్! నీ కీపేరు నానమ్మ కావాలని పెట్టించారు. తాతగారితో దెబ్బలాడి మరీ పెట్టించారు'' అంది.

"నిజంగా" ఆశ్చర్యంగా అన్నాడు. అసలు అతనిస్నేహితులు చాలామంది నీ పేరు చాలాబావుంది అంటూవుంటారు. ఆడపిల్లలు యెరగకపోయినా పేరు

విని అతన్ని చూడాలని తహతహ లాడతారు. పేరులో యేదో ఆకర్షణ వుంది అనిపిస్తూంటుంది భరత్‌కి

"బామ్మగారూ మీరెంతదాకా చదువుకున్నారు?" అడిగాడు భరత్.

"పెద్దప్రశ్నే వేశావు. చదువు అంతగారాదు. పాతకాలంనాటివాళ్ళం కదూ!" నవ్వింది మాణిక్యమ్మ

"బామ్మగారి చదువు నీవే తెలుసుకోవాలి. ఆవిడ రామాయణం, భారతం భాగవతం, భగవద్గీతా వగైరా అన్నీ చదివి అర్థంచేసుకోవటమేకాదు యెదటి వాళ్ళకి అర్థమయేలా చెప్పగలరు!" రాజేశ్వరి కొడుక్కి చెప్పింది.

"రాజేశ్వరీ! అవన్నీ చదువుకిందకి యెలావస్తాయమ్మా. సరేగానీ ముందు స్నానంచేస్తాను. అన్నట్టు అబ్బాయి సాయంకాలం అయినా వస్తాడా? వంటిల్లు చూపించు వంటచేస్తాను."

"స్నానంచెయ్యండి కానీ వంట చేయనక్కరలేదు. వాసు వున్నాడు, చేస్తాడు. నేనూ దగ్గరవుండి చూస్తూంటాను. మీరు మనవళ్ళతో డైనింగ్ టేబిల్‌ముందు కూర్చుని భోజనం చేద్దురుగాని," అంది.

"అవ్వ! అరవైయేళ్ళు వచ్చినతర్వాత చదువుకోక మన్నుకొట్టుకోనా! అన్నట్లు యిప్పుడు నాకు యీ భోజనం యేమిటి."

బామ్మనోట్లోనించి సామెతరాగానే సవిత నోట్‌బుక్‌తో రెడీగావచ్చింది. అది నోట్‌చేసుకుంటూ 'తాతగార్కి ఫైవ్‌రుపీస్ లాస్' అనుకుంది.

అనిల్ పరుగునవెళ్ళి తన పుస్తకం తెచ్చుకునేసరికే సవిత నోట్‌చేసుకోవటం చూసి "చెల్లాయ్! నీకింత డబ్బుపిచ్చి పనికిరాదు. యెప్పుడూ గెలుపు నీదేనా!"అంటూ నవ్వి సవితచెవిలో "తాతగారు నాయనమ్మని చూడగానే ముఖం యెలా పెడతారో చూడాలి! కళ్ళ కరువుతీరా చూద్దాం చెల్లాయ్!" అన్నాడు హుషారుగా.

మాణిక్యమ్మ స్నానం, పూజా పూర్తిచేసుకుని నీలంజరీచీరె కట్టుకుని ముడిలో ముద్దమందారపువ్వు తురుముకుని హాలులోకి వచ్చి కూర్చుంది.

సవితా నేతెచ్చిన నీలంసంచీలో అప్పడాలూ వడియాలూ,అరిసెలూ వున్నాయి తీసి అమ్మకి యివ్వమ్మా. ఆ చేత్తోనే మరో పొట్లంలో పనసపొట్టూ పూతరేకులూ కూడా వున్నాయి. అన్నీ డబ్బాల్లో సర్దుకోండమ్మా. అర్జెంట్‌గావచ్చిన టెలిగ్రాం చూసుకుని ఆదరాబాదరా పరుగెత్తుకొచ్చాను."

"టెలిగ్రామా? యెవరిచ్చారూ!" రాజేశ్వరి అంటూంటే సవితా, అనిల్

"అహ అదేంకాదు. మమ్మీ, నిన్ను పక్కింటి ఆంటీ యెందుకో పిలుస్తోందిట" అంటూ అక్కడనించి పంపేసి యింక బామ్మని అనిల్‌రూములోకి తీసుకు పోయి ఆవిడతో రహస్యచర్చలు ప్రారంభించబోతూ ఓ ఫోటో చేతికిచ్చారు.

యింతలో హాలులో ఫోన్ మ్రోగింది. అవతలినించి రంగయ్యగారు మాట్లాడు తూన్నారు. "హలో! సవితా! నేనూ మాలిని యింటినించి మాట్లాడుతూ న్నాను. అనివార్యకారణాలవల్ల భోజనానికి రావటంలేదు అని అమ్మకి చెప్పమ్మా. రాత్రికే వస్తాను. సరేనా. యిక పెట్టేస్తూన్నాను."

సవిత అంతా వింటూ కళ్ళతో అన్నగార్ని ప్రశ్నించింది.

"బామ్మవచ్చిందని చెప్పనా?" అని.

"వద్దు" అనిల్ భావంగ్రహించి ఫోన్‌పెట్టేసింది. నీరసంగా వచ్చి అన్నగారి ప్రక్కన కూలబడింది. "మనప్లాన్‌అంతా పాడైపోయింది బ్రదర్" అంది. మాణిక్యమ్మగారు నోటమాటేరాక చేతిలోని ఫోటోలోకి తదేకంగా చూస్తూ కూర్చుంది.

"సిస్టర్ యిప్పుడింక కర్తవ్యం యేమిటి?'

కొన్నిక్షణాల్లోనే రసవత్తరమైన 'సీను' చూడవచ్చు అని గొప్పగా ప్లాను వేస్తే అది కాస్తా ఫెయిల్‌అయిపోయింది రంగయ్యగారు రాకపోవటంతో. యింక ముఖం వేళ్ళాడేశాడు అనిల్. సవిత మరోప్లానుకోసం ఆలోచిస్తోంది.

"సవితా! యెవరే నీతో ఫోనులో మాట్లాడింది?" మాణిక్యమ్మగారు అడిగింది.

"తాతయ్య! భోజనానికి రావటానికి వీలుకాదుట అని చెప్పారు."

"యెందుకనిటా! అక్కడ యే రాచకార్యాలు వెలగబెడుతూన్నారుటా!"

"ఓ ఫ్రెండ్‌తో విందారగించాలట!"

"ఎవరాఫ్రెండ్? యీ ఫోటోలో కన్పిస్తూన్న సిగ్గుమాలినదేనా?"

"గర్ల్‌ఫ్రెండ్? తాతయ్య గర్ల్‌ఫ్రెండ్" సవిత కళ్ళుమిటకరిస్తూ నానమ్మకి యింకాచెప్పింది.కోపం యెక్కువచేయాలన్నట్లు అక్షరం అక్షరం వత్తిపల్కుతూ

"ఫ్రెండా! పెటాకులా! వూరుపొమ్మంటోంది! కాడి రమ్మంటోంది. యిప్పు డీయనకి యీ వేషాలా! నాడూ నేడూ లేని యివాళ యీ వూరువచ్చి నేర్చు కునేవి యివా! రామరామ. యీ ఫోటో చూడాలంటే నాకే సిగ్గేస్తోంది. యీ పిల్ల యెవరే?"

ఆవిడ యింకా యింకా మాట్లాడుతూనేవుంది. అనిల్ సామెతలని గభాలున బుక్‌లో నోట్ చేసుకన్నాడు. సవిత తనలో తనే అనుకుంది.

"తాతయ్యకి మరో పైప్‌రుపీస్ లాన్."

"సవితా! నల్లరాయిలా మాట్లాడవేమే!" అంది కోపంగా.

"ఆ... బామ్మా నేను నీదగ్గరేవున్నాగా." యిలా వుండటం రెండువిధాల లాభం. యే సమయానికి యే మణులూ మాణిక్యాలూ రాలతాయో నోటినించి. యీ అవకాశం పోగొట్టుకోకూడదు అనుకుంది తనలో తను.

రాజేశ్వరి అందరినీ భోజనానికి రమ్మని పిల్చింది. అంతవరకూ సవితా, అనిల్, మాణిక్యమ్మా రహస్య సమాలోచనలు సాగుతూనే వున్నాయి.

మాణిక్యమ్మ నేను పీటమీద కూర్చుని భోజనం చేస్తాను మొర్రో అన్నా అనిల్ సవితా వినలేదు. ఆవిడ యెలాగో భోజనం చేసింది కానీ కడుపునిండి నట్లే లేదు. తేలిగ్గా యేమిటోగా వుంది. ఆవిడలేచి రంగయ్యగారికీగాను వేసిన మంచంమీద పడుకుంది. కానీ నిద్రే రావటంలేదు.

రాత్రి అంతా రైల్లో నిద్రలేదు. యిప్పుడూ లేదు. ఆవిడ ఆవేదనగా యిటూ అటూ కదులుతూనే వుంది.

"బామ్మా నిద్రరావటంలా?" అని అనిల్ సవితా వచ్చి దగ్గరకూర్చుని ఆవిడచెవిలో యేదో రహస్యంగా చెప్పారు ఆవిడా ఆలోచిస్తూనే 'సరే' అన్న ట్లుగా తలవూపింది.

"అమ్మయ్య" అనిల్, సవితా యెగిరి గంతేసినంత పనిచేశారు. అనిల్ హుషారుగా యెన్నినెలల తర్వాతనో యీలపాట పాడుతూంటే రాజేశ్వరమ్మ ఆశ్చర్యపోయి సవితని అడిగింది. "ఏమిటే యిదంతా!" అని.

"నాకేం తెలియదమ్మా" అమాయకంగా ముఖంపెట్టి అంది.

"బామ్మతో మీ యిద్దరూ ఆ గుసగుసలు యేమిటే?"

"యేంలేదమ్మా! బామ్మ వూరు చూస్తాను, కాస్త మీరిద్దరూ వెంటవుండి చూపిస్తారా అని అడిగితే 'సరే' అన్నాం అంతే."

"అప్పుడే యింత తొందర యెందుకూ, యివాళేగా వూరినించి వచ్చింది."

"అనే నేనూ అన్నాను. కానీ ఆవిడ వినటంలేదు. పోనీలే అని 'సరే' అన్నాను."

సవిత అలా చెప్తూంటే నమ్మకం కలగక ఆ పిల్ల ముఖంలోకి చూస్తూ "నీకూ అనిల్‌కీ యింత నమ్రతా పెద్దవాళ్ళంటే భక్తీ యెప్పటినించి మొదలైందమ్మా?"

యీ మాటకి సవితకి ఛర్రున కోపం వచ్చింది.

"మమ్మీ, నన్ను గురించి నీ వెప్పుడూ తప్పుఅంచనాయే వేస్తూంటావు," అనేసి బుంగమూతి పెట్టుకుని అక్కడినించి వెళ్ళిపోయింది.

అనిల్ బామ్మని 'బీచ్' కి తీసుకువెళ్ళాలని ప్లాన్ వేశాడు. యింక అక్కడ సీను యెలా వుంటుందో ఊహిస్తూ ఆ దృశ్యాలని కలర్‌లో చూస్తూ హుషారుగా పొంగిపోతున్నాడు.

## 13

బామ్మని తీసుకుని సవితా అనిల్ బీచ్‌కి చేరుకున్నారు. అక్కడ మామూలుగా రంగయ్యగారూ, మాలినీ తరుచుగా తిరిగేచోట్లు అన్నీ చూశారు. కానీ వాళ్ళిద్దరూ కన్పించలేదు.

"అబ్బ! తిరిగి తిరిగీ కాళ్ళు నొప్పి పెడుతూన్నాయిరా?" అని మాణిక్యమ్మగారు మొత్తుకుంటూన్నా అంతలోనే ఆవేశం తెచుక్కుని రంగయ్యగారు కన్పిస్తే చాలు ఆదిశక్తిలా విరుచుకుపడాలని ఆత్రంగా మనవడూ మనవరాలివెంట కాళ్ళీడ్చుకుంటూ ఆ యిసుకలో నడవలేక నడుస్తోంది ఆవిడ. ఛత్రీమీద కారాలూ మిరియాలూ నూరేస్తోంది. లేనివోపిక తెచ్చుకుని మరీ నడుస్తోంది సవితవెంట.

అనిల్ చుట్టూ కన్పించినంత దూరంవరకూ చూశాడు. ఆ... అంటూ సంతోషంతో వుబ్బితబ్బిబ్బు అయిపోయాడు.

"అబ్బ! సవితా! యింక ఒక్క అడుగుకూడా వెయ్యలేనేమ్మా" అని యిసుకలో కూలబడిపోయింది బామ్మ. అయ్యో యిప్పుడిలాఅంటే యెలా! అవతల బంగారంలాంటి అవకాశం పాడైపోతుంది అని బామ్మమీద కోపం వస్తూన్నా అనిల్ దాన్ని మింగేసుకుని 'సవితా మన యిద్దరం సాయం చేద్దాం రా' అని చెరోభుజమూ ఆసరాయిచ్చారు ఆవిడకి.

సూర్యుడు అస్తమించి చీకటులు నలుమూలలా అలుముకుంటూన్నాయి. జనం అందరూ తిరిగి యిళ్ళకి వెళ్ళిపోతున్నారు. సముద్రుడు మాత్రం ఉత్సాహంగా పురకలు వేస్తూన్నట్లుగా పెద్ద పెద్ద అలలు వచ్చి ఒడ్డుని తాకి వెనక్కి వెళ్ళిపోతూన్నాయి. చల్లటిగాలి వీస్తోంది. హాయిగా అన్పిస్తోంది. అయినా మాణిక్యమ్మ కోపంతో వుడికిపోతోంది. పిచ్చిశక్తితో సవితా అనిల్‌ల ఆసరాతో ముందుకి నడుస్తోంది.

యింక కాస్తదూరంలో మాలిని చెయ్యి అతిసుతారంగా పట్టుకుని డాన్స్ 'స్టెప్స్' నేర్చుకుంటూన్నారు రంగయ్యగారు. అనిల్ ఆశ్చర్యంగా చూస్తూన్నాడు ట్రాన్సిస్టర్ విన్పించే యింగ్లీషు మ్యూజిక్‌కి అనుగుణంగా అవలీలగా




మాలినితోబాటు అడుగులు వేసే తాతగార్ని. అనిల్ మనసు కుతకుతా వుడికి పోయింది. రంగయ్యగారు చేతిని మాలిని నడుంచుట్టూ వేశారు. ట్రాన్సిస్టర్‌లో మ్యూజిక్ ఆగినా యింకా రంగయ్యగారు అడుగులు వేస్తూంటే మాలిని విరగబడి నవ్వుతోంది. మాలినివైపు అలాగే చూస్తూ వుండిపోయింది మాణిక్యమ్మ.

పెద్ద పెద్ద గళ్ళలుంగీ, ఫుల్‌హాండ్స్ షర్టూ జుత్తుఅంతా విరబోసుకుని యేదో తాడుతో మొదట్లో కట్టినట్లుగా వుంది. ఆ యిద్దరినీ మార్చి మార్చి చూసిన మాణిక్యమ్మ మహాకాళిలా విరుచుకు పడింది.

"మీ కిదేంపోయేకాలం! వూరుపొమ్మంటూంది. కాడురమ్మంటూవుంది. మీకీ వయస్సులో యీ వయ్యారిభామతో డాన్సు కావల్సివచ్చిందా! ఛీ సిగ్గులేకపోతే సరి! అసలిందుకా యీవూరు వచ్చింది!"

ఆవిడ కంఠం ఖంగ్ మంటోంది. ఆవిడని అప్పుడు అక్కడ చూసిన రంగయ్యగారు స్థాణుశేఖరయారు. సవితవైపూ భార్యవైపూ చూసి ఆఖరుకి అనిల్‌వైపు చూసి "ఏరా! యిలా వచ్చావీవేళ. యేం నీకేం పనిలేదా! బామ్మని నా మీదకి దండయాత్రకి తీసుకువచ్చావురా! వూ... చాలా మంచిపని చేశావు కదూ!"

మాలిని వీళ్ళందరినీ చూసి కంగారుపడిపోయి రంగయ్యగారి చేతిని గట్టిగా పట్టేసుకుని భయంగా ముఖంపెట్టి "నాకు భయంగావుంది" అంటూన్న మాలినిని

మరీ దగ్గరగా లాక్కున్న రంగయ్యగారు. ఆ పిల్ల వీపుమీద చెయ్యివేసి నిమురుతూనే "సవితా! మీ బామ్మ యివాళ వస్తుందని కానీ వచ్చిందని కానీ నీవైనా చెప్పలేదేం."

సవిత మౌనంగా వుండిపోయింది.

"పోనీ బామ్మని రమ్మని టెలిగ్రాం యిచ్చాం అని అయినా చెప్పలేదేం."

ఆయనగొంతు అతి సహజంగా వుంది. కానీ కళ్ళలో కొంటెతనం విసరంత కన్పిస్తోంది. అదేం పట్టించుకోని మాణిక్యమ్మగారు

"ఎం! యెందుకూ మీకు చెప్పటం?" అంటూ గయ్‌మంది.

"స్టేషన్‌కి వచ్చేందుకు."

రంగయ్యగారి వీపుని అంటిపెట్టుకున్న మాలిని, 'మనం వెళ్ళిపోదాం' అంది

మాణిక్యమ్మ వళ్ళుమండి "ఏమే యెవరేనీవూ! సీతాకోకలా సింగారించుకుని యిలా యీ ముసలాయన్ని వెంటేసుకుని విమానంకారులో షికార్లుతిరగటమేనా నీ పని అసలునువ్వు ఆయన్ని వదిలి దూరంగావుండు. వుండు ముందు."

మాలిని మరీ దగ్గరైంది రంగయ్యగార్కి. మాణిక్యమ్మ మాలిని చెయ్యిపట్టుకుని విసురుగా ఒక్క లాగులాగింది. ముందు దూరంగా నుంచో. లేకుంటే మర్యాద దక్కదు. నువ్వసలు ఆడపిల్లవి కాదూ! సిగ్గెగ్గులులేవూ! నీవెవరి అమ్మాయివమ్మా. నీవాళ్ళు యిలా వదిలివూరుకున్నారా? నీకు యీ ముసలాయన తప్ప మరెవరూ దొరకలేదూ!

రంగయ్యగారికి కోపం వచ్చేసింది.

"ఒసే! నీ నోటిదురుసుతనం మండిపోనూ. యిది యెవరనుకున్నావ్!" కోపంగా అన్నారు.

"మీ గర్ల్‌ఫ్రెండ్ అని తెలుస్తూనే వుందిగా." పళ్ళుకొరుకుతూ అంది

"ఒసే... ఒసే... గర్ల్‌ఫ్రెండ్ అంటే కుర్రాళ్ళకిగాని నాలాంటి ముసలి తాతయ్యలకిటే!" సర్ది చెప్పాలన్నట్లుగా అన్నారు

"ఆహాహా! మీలాంటివాడే వెనకటికి తాటిచెట్టు క్రింద కూర్చుని నీళ్ళు తాగుతూన్నా అని మభ్యపెట్ట చూశాడట."

మాణిక్యమ్మగారు యింకా ఏదో అంటూన్నా సవిత విన్పించుకోలేదు. "అన్నాయ్! రా అంది. ఒక మాణిక్యం త్వరగా బుక్‌యివ్వు" అంటూ వెనక్కి తిరిగింది.

అనిల్ అప్పటికే ఆ సామెత నోట్ చేసేసుకున్నాడు.

"వెల్డాయ్! నీకు ఫైవూ తాతగార్కి ఫైవూ లాస్" అంటూ షర్టు జేబులో పెట్టేసుకుంటూంటే సవిత వుసూరుమంది.

"ఒసే మాణిక్యం యిదీ అనసూయ కూతురే. పేరు మాలిని మాలినీ అమ్మమ్మకి నమస్కారం చెయ్యమ్మా" అనటమే తడవుగా మాలిని రెండు చేతులూ జోడించింది. అవేం పాతకుండా "చూడు పిల్లా నువ్వు అనసూయ కూతురివి అయినా వైదేహి కూతురివే అయినా నా కనవసరం. యింకోసారి నా మొగుడితో కనుక కన్పించావో మర్యాద దక్కదు. తెల్సిందా! వెళ్ళు ముందు యిక్కడనించి."

మాలిని ముఖం యెర్రబడిపోయింది. కళ్ళు యెర్రబడ్డాయి. ఫెడీమని జవాబు చెప్పబోతూంటే రంగయ్యగారు రెక్క పట్టుకుని బర బరా లాక్కువెళుతూ

"యిదిగో నువ్వు యింటికి వెళ్ళు. నేను మాలినిని వాళ్ళ యింటిదగ్గర దించి వచ్చేస్తాను" అంటూ ట్రాన్సిస్టర్ అందుకున్నారు.

"ఆగండి! ఆ పిల్ల ఒక్కర్తీ వెళ్ళలేదూ?" అంది తీవ్రంగా.

అనిల్ చాలా హుషారుగా చూస్తూన్నాడు యిద్దరినీ. అతని మనస్సు సంతోషంతో గంతులు వేస్తోంది. తాతగారి ఆట 'కట్' చేయగలిగాను అని మురిసి పోతున్నాడు. షర్టు కాలరు యెగరేశాడు. సన్నగా యీలపాట పాడుతున్నాడు.

రంగయ్యగార్ని మాలినితో వెళ్ళటానికి ససేమీ ఒప్పుకోవటంలేదు బామ్మ.

"కారు వుందిగా తాతగారూ!" గుర్తుచేసింది సవిత.

"వుంది కాని ఆడపిల్లని ఒక్కదాన్నీ డ్రైవర్ని నమ్మి పంపమంటావుటే?"

"ఏం పంపిస్తే?" కోపంగా అంది.

"యిదిగో! యిది విజయవాడా బందరూ కాదు. బొంబే మహాపట్నం తెల్సిందా!"

"బొంబే! అని మీకంటె నాకు బాగా తెల్సు. ఒరే అనిల్ నువ్వెళ్ళి ఆ పిల్లని యింటిదగ్గర దించి వచ్చెయ్యి. వెళ్ళు." అనిల్ క్షణం తొట్రుపడి మళ్ళీ నిల దొక్కుకున్నాడు.

"వెళ్ళరా!" మాణిక్యమ్మగారి గావుకేకతో హడిలిపోయి ముందుకు నడిచాడు. అతన్ని అనుసరించింది మాలిని. అనిల్ విమానం కారులో యెక్కాడు. మాలిని మౌనంగా వచ్చి వెనకసీటులో కూర్చుంది. కారు కదిలింది.

కదిలిపోతూన్న కారునీ ప్రతిరోజూ తను కూర్చునే సీటులో కూర్చున్న అనిల్ను అతని ప్రక్కన బొమ్మలా కూర్చున్న మాలినినీ కళ్ళింత చేసుకుని

చూస్తూన్నారు రంగయ్యగారు. ఆయన ముఖంలో క్షణం ఆనందం మెరిసి మాయమైంది.

"యిదిగో! యింతా యెంతసేపు వెళ్ళిపోయే కారువైపు చూస్తారు గానీ యిదేం పనీ! అసలు మీరెందుకొచ్చినట్లు యీ వూరికి. యీ పిల్లతో షికార్లు కొట్టటానికా?"

నిలదీసింది మళ్ళీ. రంగయ్యగార్కి మరీ చిర్రెత్తుకొచ్చింది.

"అసలు నువ్వెందుకు వచ్చినట్లు?" పళ్ళు కొరుకుతూ అన్నారు.

"యెందుకా, యీ వేషాలు యేమిటో కనుక్కోనేందుకు" అంటూ పైట కొంగున వున్న ఫొటోని ఆయన చేతిలో పెట్టింది.

ఆయన దాన్ని చూసి "అరె! యిది పోయిందనుకున్నా, ఆ చాకలి వెధవ కాజేశాడని తిట్టాను. యేది! యేది!" అపురూపంగా తీసి చూసుకున్నారు. అది మాలినీ, రంగయ్యగారు కల్సి తీయించుకున్న ఫోటో.

"ఆ...యిప్పుడు అర్ధమైంది. యిది నీకెలా వచ్చిందో! సరే కానీ యింతకీ నీవు అనేదేమిటి?"

"ముందు పదండి యింటికి. అక్కడ చెప్తాను. యిలా ఫోటోలు తీయించు కోను సిగ్గు వుండక్కర్లా."

"ఏయ్! యిందాకటినించీ చూస్తూన్నా. యేమిటా వాగుడు! ముందు నోరు ముయ్!"

తాతగారికి యింత కోపం వుందని తెలియని సవిత అమ్మో అనుకుంది.

బామ్మని కొట్టడుకదా కొంపదీసి యీ అనిల్ విమానంకారు దొరికిందే చాలు అన్నట్లు నన్ను వదిలి పరిగెత్తాడు. ఛీ ఛీ. నా యీ కష్టమంతా వాడి కోసమే కదూ భయంగా చూస్తూ అనుకుంది సవిత

యిదిగో తాటాకు చప్పుళ్ళకి కుందేళ్ళు భయపడవు. మీరిక్కడికి వచ్చింది అనిల్‌కీ, సవితకీ పెళ్ళిచేయటానికి. అది మీకు చేతకాకుండే అలా కూర్చోండి. నేను చేయిస్తాను. వారంరోజుల్లో మిమ్మల్ని రైలెక్కించి తీసుకుపోతాను. సవితా పదమ్మా వెడదాం యింటికి."

మాణిక్యమ్మ రంగయ్యగార్నీ సవితనీ చెరో చేత్తోనూ పట్టుకుని యిద్దరి మధ్యనా నడుస్తోంది. సవితమాత్రం తను విన్న సరికొత్త సామెతని నోట్ చేసుకోను పుస్తకంలేక యెక్కడ మర్చిపోతానో అనుకుంటూ ఆ మాటలే లోలోపల జపిస్తోంది. తాటాకు చప్పుళ్ళకి కుందేళ్ళు...బెదరవు...కాదు భయ

పదవు...అదీ కాదు ధదవ్వు—కాదు...అరే...అసలైన ముందు పదవే మర్చాను. కొబ్బరాకుల...కాదు. మామిడాకుల చప్పుడుకి...చీ...చీ...పూర్తిగ మర్చాను. యెలా యిప్పుడూ ! బామ్మని అడిగితే ! లాభంలేదు. అసలే కోపంగా వుంది. తాతగార్ని అడిగితే...

ముందు ఫైవ్ రుపీస్ అక్కడ పెట్టు అంటారు. ఛత్... జ్ఞాపకశక్తి యింత తక్కువేంటి నాకు. గుర్తు వున్నట్లే వుంది. కానీ పూర్తిగా రావటంలేదు. బామ్మ మూడ్ బాగున్నప్పుడు అడిగేస్తాను.

'గుర్తు లేదు' అంటే ! సీన్ గుర్తుచేస్తే సరి. సవిత ఆలోచనల్లో వుండగానే యిల్లు చేరారు ముగ్గురూ మౌనంగా.

## 14

అనిల్ మాలినిని వాళ్ళ ఇంటిదగ్గర దించి అక్కడే టిఫెనూ 'టీ' తీసుకుని చాలాసేపు కూర్చుని కబుర్లు చెప్పి యింటికి వచ్చేశాడు. అడుగులు నేలమీద పడినట్లు లేవు. గాలిలో తేలిపోతున్నట్లుగా వుంది. అతని మనస్సు దూదిపింజలా తేలిపోతూ వుంది. తాతగారి ముఖంలోకి చూడాలన్పిస్తోంది. అందుకు అవకాశం లేకుండా రంగయ్యగారు మంచంమీద ముసుగు బిగించి నిద్రపోతూన్నట్లే వున్నారు. మాణిక్యమ్మగారు కూడా ఆయనకి దగ్గరగా కింద పరుపు పర్చుకుని పడుకుని వుంది.

అనిల్ తనగదిలో బట్టలు మార్చుకుంటూంటే సవిత వచ్చి అన్నాయ్ ! అంటూ చెవిలో రహస్యంగా యేదో వూదింది. అనిల్ ఆలోచించి అవును. వీళ్ళిద్దరినీ కల్సి మాట్లాడనిస్తే మన ప్లాన్ పాడైపోతుంది అనుకుని "బామ్మా నువ్వు యీ చల్లగాలిలో వద్దు. నా గదిలో పడుకుందువు గాని రా" అని సవితా అనిల్ బలవంతం చేశారు. అనిల్ పరుపూ సవిత చాపా దిండూ తెచ్చి తన గదిలో వేస్తూ "బామ్మా నువు క్రింద పడుకోలేవుగానీ నా మంచంమీద పడుకో" అంటూ దోమతెరా డన్‌లప్ పరుపూ వున్న పక్క యిచ్చేసింది.

యిది బాగానేవుంది కానీ ఆయనతో కాస్త మంచీ చెడూ మాట్లాడాలనుకుంటే యీ పిల్లలిద్దరూ యిలా చేశారేంటీ. మమ్మల్నిద్దరినీ దూరంచేస్తున్నారెందుకు వీళ్ళు.

అనుకున్నా మనవరాలి వెంట నడిచే భార్యని రంగయ్యగారు ముఖంమీద ముసుగు కాస్త తప్పించి విసుగ్గా చూడటం భరత్ చూస్తూనే వున్నాడు.

కానీ తాతగారికి కోపం యెందుకో భరత్‌కి అర్థం కాలేదు. యింక రాత్రి

అంతా సవితా అనిల్ నిశ్చింతగా నిద్రపోయారు. అయితే భరత్‌కి యెందుక నిద్రపట్టలేదు. ఒక రాత్రివేళ లేచి బాత్‌రూమ్‌లోకి వెడుతూ తాతగా మంచందగ్గరనించి యేవేవో గుసగుసలు విన్పిస్తూంటే తల తిప్పి చూశాడు.

రంగయ్యగారూ, మాణిక్యమ్మా యేదో సీరియస్‌గా చర్చిస్తున్నారు

మాణిక్యమ్మ బారలు చాస్తూ ఆవేశపడి యేదేదో అనేస్తోంది. తాతగార మాత్రం చిరునవ్వు చిందిస్తూ ఆవిడని శాంతపర్చటానికి ప్రయత్నిస్తున్నారు యింక యేదో చర్చిస్తూ ఆవిడ కాస్త శాంతించింది. ఒకరు చెప్పింది మరొకరికి నచ్చటంలేదని యిద్దరి ముఖాల్లోనూ తెలుస్తోంది. తర్వాత యిద్దరూ రాజీ ధోర ణికి వచ్చి యింతాస్సేపటికి ఆలోచనలు పూర్తిచేసి బామ్మ లేచి వచ్చిసవితగదిలో మంచంమీద పడుకుని దుప్పటీ కప్పేసుకొంది. భరత్‌కి యిదంతా వింతగా కన్పించింది. విషయం యేమిటో అర్ధంకావేదు కానీ యింట్లో జరిగే ప్రతి విష యమూ పరిశీలనగా గమనిస్తున్నాడు. అతనికి ముందుగా గుర్తుకి వచ్చిన విషయం తన తండ్రి యిదివరకులా కాక యీ మధ్య రాత్రి తొమ్మిదింటికల్లా యిల్లు చేరుకోవటం పెద్ద విశేషముగా అన్పిస్తోంది తొమ్మిదింటికి యిల్లు చేరిన జగన్నాథం యిదివరకులాకాక కాస్త వళ్ళు తెలిసే స్థితిలోనే వుంటూన్నాడు. అంటే ఆయన 'డోస్' తగ్గించే ప్రయత్నంలో వున్నారని తెలుస్తూనే వుం?.

## 15

వారంరోజులు గడిచాయి బామ్మ వచ్చి. అయితే యింట్లో యెన్నో మార్పులు వచ్చాయి. ముఖ్యంగా సవిత పెళ్ళి గోకుల్‌తో సెటిల్ అయింది. అనిల్ పెళ్ళి సెటిల్ అయింది కానీ పెళ్ళికూతురి వివరాలు అనిల్‌కి యెవరూ చెప్పటంలేదు. తనుగా తెల్సుకోవాలంటే అహంభావం అడ్డువస్తుంది. పెళ్ళికి యింకా నాలుగు రోజులైనా టైము లేదు.

యేం చేయాలి ! అనిల్‌కి అశాంతి పెరిగిపోతోంది. యిల్లు వదిలి వెళ్ళిపోతే ! యీ లోపలే మరో పిల్లని రిజిష్టర్ మారేజ్ చేసుకుని తీసుకువస్తే ! ఆశీర్వ దించండి తాతగారూ అంటే! అప్పుడాయన ముఖం యెంత మాడిపోతుందో చూడాలని వుంది కానీ యిప్పుడు అర్జెంట్‌గా అమ్మాయి యెవరు దొరుకుతారు ?

యిలా యెన్నెన్నో ఆలోచనలు చేస్తున్నాడు కానీ చేయటానికి దారిమాత్రం దొరక్క వేధన పడిపోతూన్నాడు. పోనీ తాతగారి యిష్టప్రకారమే పెళ్ళాడితే ? ఆయన కుదిర్చిన పిల్ల మెడలోనే దండ వేస్తే ! మూడు ముళ్ళు వేస్తే ! ఛీ ! చస్తే చెయ్యను. బామ్మని పెద్దప్లాను వేసి పిలిపించినా ఆవిడ అన్నింటికీ 'సరే'




అని తల వూపుతున్నా అనిల్‌కి నమ్మబుద్ధి కావటంలేదు. తాతగారితో రహస్యంగా సంప్రదిస్తోందా! అన్న అనుమానం అనిల్‌ని పీకిస్తుంది. పోనీ సవిత దగ్గరనుంచి అసలు విషయం యేమిటో తెల్సుకోవాలన్నా లాభంలేకపోయింది. సవిత అనిల్‌పార్టీ అని తెల్సినందువల్ల కాబోలు అసలువిషయం సవిత అంతు చిక్కనీయటంలేదు.

యింక తల్లి వూపిరి సలపని పనులతో సతమతమైపోతోంది. అనిల్ రక్తం వుడికెత్తిపోతోంది. లాభంలేదు. యివాళ విషయం తేల్చేసుకోవాలి! నా పెళ్ళి నా యిష్టప్రకారం నాకు నచ్చిన పిల్లతో జరగాల్సిందే! యీ విషయం సరాసరి తన తండ్రితో మాట్లాడి లాభంలేదు అని తెల్సి తాతగారికోసం హాలులో కూర్చున్నాడు అనిల్. మధ్యాన్నం పన్నెండు గంటలు కావస్తోంది.

రంగయ్యగారూ, మాణిక్యమ్మా యేవేవో పాకెట్టులుపట్టుకుని కారు దిగి పైకి వచ్చారు. కాలింగ్ బెల్ మోగగానే వాసు వెళ్ళి తలుపు తెరిచాడు.

యిద్దరూ ఒకేసారి లోపలికి వచ్చారు. అనిల్ ఆగ్రహంతో ఊగిపోతూ—

"ఆగు తాతయ్యా! అక్కడే ఆగు. ముందు నా ప్రశ్నలకి జవాబు చెప్పు? నా పెళ్ళి నాతో ఆలోచించకుండానే నువ్వు సెటిల్ చేయటంలో ఉద్దేశ్యం యేమిటి?"

రంగయ్యగారూ, మాణిక్యమ్మా బొమ్మల్లా నిలబడిపోయారు.

"చెప్పు! నేను అసమర్థుడినా? అమాయకుడినా? చదువు లేనివాడినా?"

"అ వేవీ కావు, నా మనవడివి!" శాంతంగా అన్నారు.

"అయితే కావచ్చు కానీ పెళ్ళి నీ యిష్టం వచ్చిన పిల్లతో చేసే హక్కు లేదు."

"మీ నాన్న యిచ్చాడు."

"యివ్వటానికి ఆయనా పుచ్చుకోవటానికి మీరూ యెవరు ? అని అడుగుతున్నాను."

" అనిల్ నీ సంతోషంకోసం నీ సుఖంకోసమేరా యిదంతా చేసేదీ !"

లోపలఉన్న రాజేశ్వరమ్మ వచ్చి కొడుకుని శాంతింపచేయాలని అంది. అనిల్ బిగ్గరగా నవ్వి—

" తాతగారిది నీవనుకున్నంత మంచి మనస్సు కాదు మమ్మీ !" ఈయన వట్టి స్వార్థపరుడు...అసూయాపరుడు...యింకా..."

"అనిల్" తల్లి పెద్దగా అరిచి "మాట్లాతకు, మర్యాద దక్కదు. నోరు మూసుకో అనిల్" అంది.

"మన వెధవ ఇండియాలోనే యింటింటా యిలాంటి ముసలి నక్కలైన తాతగారి పెత్తనాలు ! ఫారెన్‌లో అయితేనా ! యిలాంటివాళ్ళని దూరంగా తరిమి కొడతారు. యెందుకంటే అలా చేయటమే మంచిది కనుక." యింకా ఆవేశంలో యేదో అనేయబోయే అనిల్‌ని మాణిక్యమ్మగారు విసురుగా వచ్చి చాచి చెంప పగిలేలా కొట్టింది. ఆవేశంతో ఊగిపోతోంది.

"ఛీ ఛీ ! ఏం తూగావురా ! మళ్ళీ అను ఆ మాట పళ్ళు ఊడగొట్టేస్తాను వెధవా ! వేలెడంత లేవు. నువ్వు కష్టసుఖాల్లో, మంచి చెడ్డల్లో తల పండిన తాతగారిని అంతమాట అంటావా ! బొడ్డూడని వెధవా ! నీవింత సంస్కారం లేనివాడివని అనుకోలేదురా ! నీ భవిష్యత్తుకోసం, నీ అభివృద్ధికోసం, నిన్ను అందలంలో ఎక్కించాలని ఎంతో కష్టపడి ఈ పెళ్ళి ఖాయం చేయించిన దేవుడిలాంటి ఈ తాతగార్నిరా నువ్వు అలా మాట్లాడేది ! ఛీ ఛీ ఈ యింట్లో యింకొక్క క్షణంకూడా వుండవల్సిన పనిలేదు మాకు. మేం వెళ్ళిపోతాం. రాజేశ్వరీ మా పెట్టే బేడా యివతల పారేయ్ ! యివిగో నీకోసం మీ తాతగారు వేయించుకొచ్చిన శుభలేఖలు."

అంటూ చేతిలోని కట్టని అనిల్ ముఖాన గిరాట్టు కొట్టింది. రంగయ్యగారు మౌనవ్రతం పట్టారు. అనిల్ ముఖంలోకి తదేకంగా చూస్తున్నారు.

యిన్ని తిట్టినా ఆయన ముఖంలో కోపంలేనందుకు అందరూ ఆశ్చర్యపోతున్నారు.

మాణిక్యమ్మ గబగబా గదిలోకి వెళ్ళి యిద్దరి బట్టలూ సర్దేస్తోంది.

రాజేశ్వరమ్మ ఆవిడని బ్రతిమిలాడుతోంది. సవిత విభ్రాంతిగా చూస్తోంది.

రాజేశ్వరమ్మ పెద్దకొడుకుని తిడుతూ వుంది. అత్తగారి చేతిలోని బట్టలు లాక్కుంటోంది.

ఎక్కడికో వెళ్ళిన భరత్ యింటికి వచ్చాడు. వస్తూనే-

"అరె! ఏమైంది తాతగారూ! పలకరేం. నాన్నగారు యింటికి రాలేదా యింకా!" అన్నాడు. రంగయ్యగారు జవాబు చెప్పలేదు. భరత్ మళ్ళీ పిల్చాడు.



'ఆ' అన్న ఆయనవైపు ఆశ్చర్యంగా చూస్తూ క్రింద చిందరవందరగాపడివున్న శుభలేఖలని చూస్తూ "అయ్యో! యివన్నీ యిలా పారేశారేం" అంటూ ఏరి కొత్తిగా పెడుతూ 'సవితా! గోకుల్' శుభలేఖలని ఒక ప్రక్కగా పెట్టి-

"అనిల్ కుమార్‌ని మాలినికి యిచ్చి..."అరే...అన్నయ్యా కంగ్రాచులేషన్స్ అంటూ అమాంతం అన్నగారి దగ్గరికి వచ్చి చెయ్యిపట్టుకుని ఊపేస్తూ వుంటే అనిల్ విభ్రాంతిగా చూస్తూ అలాగే కూర్చుండిపోయాడు.

అనిల్! 'ఏదీ' అంటూ శుభలేఖని తీసుకుని గబగబా నాలుగుసార్లు చదివేశాడు. తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ తన పేరు ప్రక్కన మాలినీదేవి పేరు వుంది. యిప్పటికి నమ్మకం కల్గింది అనిల్‌కి. మాలినితో తన వివాహం అని.

"భరత్! యిది నిజమే కదూ! కల కాదు కదూ! చెప్పు. ఔనూ ఈ సంగతి యిన్నాళ్ళూ నాకెందుకు చెప్పలేదు" భరత్ భుజంపట్టుకుని ఊపేస్తూ అడిగాడు.

"పిచ్చి అన్నయ్యా! ఈ పెళ్ళిని ఖాయంచేసిన తాతగారు ఎదురుగావుండగా యింకా 'కలా' అని అనుమానపడతావెందుకురా."

అనిల్ ఆశ్చర్యంనుంచి తేరుకోకముందే మాణిక్యమ్మ బట్టలున్న సూట్ కేస్ సర్ది తెచ్చి రంగయ్యగారితో 'పదండి పోదాం' అంటూ వచ్చేసింది. సవితకి కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. యిప్పుడెలా! ఏంచెయ్యాలి. డాడీ కూడా లేరే.

గబగబా వెళ్ళి తండ్రి ఆఫీసుకి ఫోన్‌చేసింది.

"యింటికి వెళ్ళిపోయారు యిప్పుడే" అని జవాబు వచ్చింది. రాజేశ్వరమ్మ ఎంత బ్రతిమిలాడినా అత్తగారు వినటంలేదు. భర్త చెయ్యిపట్టుకుని గబగబా వెళ్ళబోతూంటే భరత్ బామ్మకి అడ్డం వెళ్ళాడు. సవిత మాలినికి ఫోన్ చేసింది.

"నేనిప్పుడే వస్తాను సవితా! అంతవరకూ వాళ్ళని ఆపండి." అంది మాలిని.

భరత్ తాతగారిని అమాంతం పట్టుకుని

"అన్నయ్య తరఫున నేను సారీ చెప్తున్నాను తాతయ్యా. మీరు వెళ్ళవద్దు."

మాణిక్యమ్మగారు భరత్‌ని మాట్లాడనీయలేదు. యిప్పటివరకూ విగ్రహంలా నిల్చున్న అనిల్ ముందుకొచ్చాడు. "తాతగారూ నన్ను క్షమించండి. అసలు విషయం నాకు తెలియక ఏవేవో అనేశాను."

రంగయ్యగారు ఏ భావాన్నీ ముఖంలో వ్యక్తంకానీయకుండా భార్యవైపు చూశారు.

"లాభంలేదు. వెళ్ళిపోవల్సిందే! వాసూ ఆ పెట్టె కిందికి తెచ్చిపెట్టు."

ముందుకు వెళ్ళబోతుంటే జగన్నాధం ఎదురువచ్చాడు. వీళ్ళందరినీ చూసి "ఏమైంది? ఎక్కడికి ప్రయాణం?" ఆతురతగా అడిగాడు.

రాజేశ్వరమ్మ గబగబా అంతా చెప్పేసింది. జగన్నాధం అనిల్‌వైపు కోపంగా చూసి "పెద్దమ్మా యిప్పుడు మీరిద్దరూ వెళ్ళిపోతే ఈ రెండు పెళ్ళిళ్ళు మేం ఏంచెయ్యగలం?"

అంటూ పెద్దకొడుకుమీదకి కోపంగా వెళ్ళబోతూంటే భరత్ అడ్డు వచ్చాడు. "నాన్నగారూ!" అంటూ, జగన్నాధం ఆగేలాలేదు. అనిల్ రాయిలా నిల్చున్నాడు.

యింతలో మాలిని వచ్చేసింది. "సవితా!" అంది వస్తూనే.

రంగయ్యగార్నీ, మాణిక్యమ్మనీ లోపలికి తీసుకువచ్చి సోఫాలో కూర్చోపెట్టింది.

రంగయ్యగారి చెవిలో ఏదో చెప్పి రాజేశ్వరమ్మ అందించిన కాఫీ తాగి

'వెళ్ళివస్తాను' అంటూ అందరికీ నమస్కారంచేసి అనిల్ వైపు క్రీగంట చూస్తూ-

"తాతగారు మా పార్టీ. మా అమ్మ తీసుకురమ్మంది. వెడుతున్నాం." ఆయన చెయ్యిపట్టుకుని తీసుకు వెళ్ళిపోయింది.

'ఓసి నీ కడుపుడుకా ! ఎంత తెలివైనదానివే ! రాజేశ్వరీ ! చూశావా నీ కోడలి గడుసుదనం.''

మాణిక్యమ్మగారు కోపం తగ్గి అంది. అనిల్ ఆనందంతో ముందుకువచ్చి 'బామ్మా' అంటూ ఆవిడ దగ్గరగా కూర్చున్నాడు. జగన్నాధం 'అమ్మయ్య' అనుకుని తన గదిలోకి వెళ్ళిపోయాడు. కాస్తలో ఎంత హడావుడి అయింది, అబ్బ, అనుకుంది రాజేశ్వరమ్మ.

సవిత రహస్యంగా గోకుల్‌కి ఫోన్‌చేసి "వెడ్డింగ్ కార్డు డిజైన్ చాలా బావుంది కదూ" అంటూ కబుర్లు చెప్తోంది. భరత్ దగ్గరగా రావటంతో గభాలన పెట్టేసింది. అవతలగా వెళ్ళిపోయింది.

కానీ ఫోన్ మళ్ళీ 'రింగ్' అయింది. భరత్ అందుకున్నాడు. ''హలో భరత్ స్పీకింగ్.
'రాంగ్ నంబర్' అన్నారెవరో అవతలనించి భరత్ పెట్టేశాడు. వాసు అందరికీ భోజనాలు వడ్డించేశాడు. రాజేశ్వరమ్మ అందరినీ పిల్చింది.

## 16

'అనిల్, మాలినీ' 'సవితా, గోకుల్'ల పెళ్ళి వైభవంగా జరిగిపోయింది. నూతన దంపతులకి యివాళే మొదటిరాత్రి. వేడుక జరపటానికి ప్రయత్నం చేస్తున్నారు.

''మేం వచ్చిన పని అయిపోయింది. వెళ్ళిపోతాం'' అని రంగయ్యగారు ప్రయాణం అయారు.

"ఈ ఒక్కరోజూ కాసీయండి" అని జగన్నాధమూ, రాజేశ్వరీ ఎంత బ్రతిమిలాడినా రంగయ్యగారు వి్ంచుకోలేదు. రైలుకి టికెట్లు ముందే రిజర్వేషన్ చేయించేశారు రంగయ్యగారు.

"అబ్బ ! ఈ ఒక్కరోజూ వేడుక కళ్ళజూసి వెళ్ళిపోదాం. యింతలో ఏంపోయిందీ" మాణిక్యమ్మ భర్తమీద చికాకుపడింది.

''లాభంలేదు" అని పట్టుబట్టాను. అంతే దానికి తిరుగులేదు అన్నారు. ఆయన్ని కాదని తను వుండగలదా ! బయలుదేరింది. రంగయ్యగారు కొడుకు

పెట్టిన కొత్త బట్టలు కట్టుకుని తనకి నమస్కరించిన నూతన వధూవరులని ఆశీర్వదించి అనిల్‌ని గట్టిగా కౌగలించుకుని,

"ఒరే! నిన్ను చాలా బాధపెట్టాను కదూ! పెళ్ళిపీటలమీద నువ్వు ఆశ్చర్య పడేలా చేద్దాం అనుకున్నాను కానీ ముందే తెల్సిపోయిందిగా. సరే ఏది ఏమైనా అంతా సుఖాంతం అయింది, భగవంతుని దయవల్ల. అనిల్ ఒక్క సత్యం తెల్సుకోరా!

ఫారెన్‌లోలాగా తాతగార్లని దూరంగా తరమవచ్చు మనదేశంలో కూడా. కాని ఇండియాలోవాళ్ళు అలా చేయలేరురా! భారతీయులకి సెంటిమెంట్ ఎక్కువ. వయస్సుతోబాటు మనస్సు ఎదిగిపోతుంది. కనుక ఈ తాతగార్లూ బామ్మలూ మీలాంటి యువకులకి నా గర్ల్ ఫ్రెండ్ మాలినికి చేయగల్గితే ఉపకారం తప్ప అపకారం మాత్రం ఎప్పుడూ చేయరురా! మన భారతీయులకి 'అసలుకంటే వడ్డీ ముద్దు' ఏం సవితా నోట్ చేసుకో కానీ ఫైవ్ రుపీస్ వద్దులే. ఆ సామెతకి అర్థం చెప్పనా! అసలుకంటే వడ్డీ ముద్దు అంటే కన్నబిడ్డల కంటే కూడా మనవలూ, మనవరాళ్ళూ అంటే పిచ్చిప్రేమా, అభిమానం, ఆప్యాయతా. యింతకుమించి వీళ్ళమీద వెర్రిమమకారం పెంచుకుని వీళ్ళ భవిష్యత్తు బంగారంలా ఉండాలని కోరుకుంటారు మన భారతీయులు. యిదంతా మంచిది కావచ్చు, కాకపోవచ్చు. కానీ యిలా జరిగిపోతూనే ఉంది. మాలాంటి వృద్ధులకి మీ సుఖశాంతులు తప్ప మరేం కావాలి నాయనా! మేం ఎక్కడ ఉన్నా మీ సుఖాన్నే కాంక్షిస్తాం. యింక మేం వెళ్ళి వస్తాం.

"చూడూ భరత్, సవితా! మీకు యింకా యింకా ఏదేదో చెప్పాలని అన్పిస్తోంది. కానీ నా వయస్సు పెరిగిన జ్ఞానం. కానీ మీకులా ఉన్నత విద్యతో లభించింది కాదు. కనుక నే చెప్పినదానిలో తప్పు, ఒప్పులున్నా ఏం అనుకోకండి." మాలినికీ, సవితకీ మరీ మరీ చెప్పి వచ్చి కారులో కూర్చున్నారు ఆయన. మాణిక్యమ్మ తన కోరిక నిరాకరించిన భర్తమీద కాస్త అలకవచ్చినా వచ్చేసింది.

రైలు ఎక్కేశారు. రైలు పరుగు తీస్తోంది. రంగయ్యగారు కిటికీలోనించి బైటకి చూస్తున్నారు. బొంబేకి చాలా దూరంగా వెళ్ళిపోతున్నారు.

ఆయన మనస్సు తన ఊరి దగ్గరికి పరుగుతీస్తోంది. క్రమపద్ధతి అయిన ఆ జీవితంలో సుఖంకంటే శాంతి ఎక్కువ ఉంది అనీ ఆడంబరంకంటే నిరాడంబరం ఉందనీ బాగా తెల్సిపోయింది. బొంబే రావటం యిక్కడ యిన్నాళ్ళూ ఉండటంతో యిదివరకెన్నడూ చూడని కొత్త కోణంలోనించి తన జీవితాన్ని ఓసారి అవలోకించుకున్నారు.

ఆయన తీవ్రాలోచనలో పడిపోయారు. మనస్సులో ఎక్కడో చిన్న అసూయలాంటి బాధ ఉందని గుర్తించి ఆయన పెద్దగా నవ్వుకున్నారు. మనస్సుని సంబాళించుకుంటూ తన ఊరిలో ప్రతి నిత్యం పూజించే యిలవేల్పు వేణుగోపాలస్వామి ముఖం మసగ మసగ్గా కన్పిస్తోంది. ఆ ముఖంలో తన ఆత్మీయులెందరెందరి ముఖాలో కన్పిస్తున్నాయి అస్పష్టంగా.

తను బొంబేలో రైలు దిగి తిరిగి రైలు ఎక్కేవరకూ జరిగిన సంఘటనలు గిర్రున కళ్ళముందు తిరిగాయి ఒకసారి. రైలు వేగంగా పోతోంది. మాణిక్యమ్మ భర్త ముఖంలోకి చూస్తూ అనుకుంది. నలభై ఏళ్ళుగా ఈయన నీడలో నీడనై నడవటం తప్ప మనస్సులో ఏముందో ఒక్కనాడూ అర్థంచేసుకోలేకపోయాను." మాణిక్యమ్మ నిద్రపోతుంటే రంగయ్యగారు చూసి ఆవిడని తన వడిలోకి తీసుకున్నారు. 'ఛీ' అంటూ లేవబోతున్నా ఆవిడని 'ఫర్లేదు పడుకో' అంటూ భుజాలు పట్టుకుని ఆపారు. ఆవిడకి చాలా సిగ్గుగా ఉంది.

"చిన్నప్పుడెప్పుడూ లేదు. యింక యిప్పుడా మీ వళ్ళో పడుకోవటం. "ఏమిటో. నాకేం బాగా లేదు." సణుక్కుంటున్న ఆవిడకి వచ్చిన నిద్ర ఎగిరి చక్కాపోయింది.

''ఏమండీ ! యివాళ కొత్త జంటలకి మొదటిరాత్రి వేడుక నన్ను చూడనీయకుండా ఎందుకిలా లాక్కుపోతున్నారూ" అంది భర్త ముఖంలోకి చూస్తూ. ఒకప్పటి తన యవ్వనపు రోజులు గుర్తుకు తెచ్చుకుంటూ. రంగయ్యగారు యువకుడిగా ఉన్నప్పుడు ఎంత అందంగా ఉండేవారో ! అని ఆలోచిస్తూనే భర్త మౌనంగా ఉండటం చూసి మరోసారి అడిగింది. రంగయ్యగారు తదేకంగా బైటి ప్రకృతిని చూస్తూ

"మాణిక్యం! అలా చూడు. ప్రకృతి ఎంత అందంగా ఉందో ! పిండారబోసినట్లు వెన్నెల. ఈ వెన్నెలలో ప్రకృతి గాఢ తపస్సులో ఉన్నట్లుగా అన్పిస్తోంది నాకు.

మన ఊరు ఎంత త్వరగా చేరుకుందామా అన్న తహతహగా ఉంది. ఆ గాలీ, ఆ నీళ్ళూ, ఆ ప్రకృతీ ... అదంతా విడిచి యింతదూరంలో తప్పనిసరికి ఉండవల్సి వచ్చిoది. అమ్మయ్య యింక వెళ్ళిపోతున్నాం.

మాణిక్యమ్మ తన్మయత్వంలో ఆయన ముఖంలోని ప్రశాంత గంభీర ముద్రని చూస్తూ ఉండిపోయింది. ఆయన కిటికీలోంచి ప్రకృతిని చూస్తూనే ఉన్నారు. రైలువేగంగా ముందుకు పరుగుతీస్తూనే వుంది.




**ఆ** రోజు వరదరాజు చాలా కోపంగా వున్నాడు.

"చచ్చేంత అర్జంటు పనుందీ, సి. యల్. గ్రాంటు చేస్తే యింటికి పోతాను" అంటే, "ఛట్ ! వల్లకాదు – హ్యాండ్సు లేరు" అన్నాడు ఏజంటు.

రుసరుసలాడుతూ, ఛీఫ్ క్యాషియర్ దగ్గర క్యాష్ తీసుకుని, కౌంటర్ ఎక్కాడు వరదరాజు. 'రిసీవ్, పేమెంటు ఒక్కడే చావాలి. గంగాధరం గాడు కూడా యీవాళే శెలవు పెట్టి చావాలీ'—చిరచిరలాడుతూనే డస్క్ లాగి, రూపాయల కట్టలన్నీ వేటికి వాటికి వేరుగా సర్దుతున్నాడు.

"సరైన సూపర్విజన్ లేకపోతే యిలాగే ఏడుస్తుందండీ. ఇదే కాదు—ప్రతి బ్యాంకూ యిలాగే ఏడుస్తోంది. డైమూలేదూ – ఏ వల్లకాడూ లేదు."

అప్పటికే అరగంటనుంచీ కౌంటర్ని పట్టుకుని, అధ్యక్షుడి రాకకోసం ఆతృతగా ఎదురుచూస్తున్న కార్యనిర్వాహకుల్లా, నీరసించిపోయిన పార్టీల్లోంచి అంటున్నారెవరో.

వరదరాజు మింగేసేలా చూసాడు.

గొంతు వినిపించినవైపు. తన వెనక కిటికీ దగ్గరున్న పాసైన చెక్కుల్నీ, వాటిని పాస్‌చేసిన - కటకటా లవత లున్న — ఆఫీసర్ని భయంకరంగా చూసాడు.

రిసీవింగ్, పేమెంటు మొదల య్యింది. అందరిమీదా తెగ ఉరిచేస్తున్నాడు వరదరాజు.

"చూడండీ — ఇచ్చిన నోట్లు తీసు కోండి. అందరికీ కొత్తవి అంటే ఎక్క డొస్తాయి ?"

"దీనికే వొచ్చిందండీ ? ఆఁ— దీనికేఁ వొచ్చింది ? ఒక మూల నలిగితే చెల్లదా ? మేమేమైఁనా నోట్లు అచ్చేస్తు న్నామా ?"

"ఆ రెండు నోట్లూ వేరేవి యివ్వండి. ఏఁవాఁ ?? ఆ నగిలిన నోట్లు నేను పుచ్చుకోను. పోయి ఏజంటుగారికి రిపోర్టు చేసుకోండి కావలిస్తే. 'రిస్కు' మాదండీ— ఆయనిది కాదు."

"చిల్లరా ? చిల్లరివ్వడానికి యిదే మైఁనా చిల్లర దుకాణమఁనుకున్నారా ? - ఏజంటు గారివ్వమన్నారా ? — కౌంటరు 'బిజీ'గా వుందట - ఇవ్వట్ట అని చెప్పండి."

"ఏవిటండీ యీ నోటునిండా యీ సంతకాలూ ? ఆఁ ? నే తీసుకోను - అది అంతేనండి."

- ఈ విధంగా వరదరాజు ఎవర్నీ 'ఒబ్లయిజ్' చెయ్యలేదు. కౌంటర్ దగ్గర జనం ఖాళీ అవటానికి రెండుగంటలు పట్టింది.

'హమ్మయ్య' అనుకుని, షర్ట్‌లోకి 'వుఫ్'మని వూదుకుంటూ వెనక్కి వార్ల పడుతూ, ఏజంటు రూమువైపు చూసాడు వరదరాజు.

ఈ రోజు తనచేత 'రిసీవ్' రిజెక్ట్ చెయ్యబడ్డవాళ్ళు పదిమందిదాకా వున్నా రక్కడ. ఏజంటు మాత్రం ఏఁవఁన గల్డు ? లీవు 'గ్రాంటు' చెయ్యనందుకు ఈ విషయంలో తేలుకుట్టిన దొంగలా వూరుకుంటాడు. కొంచెం కోపం తగ్గి గర్వంగా ఫీలయ్యాడు వరదరాజు.

"హాయ్ రాజూ ! హౌ డూ యు డూ ?"—స్వీట్ వాయిస్.

చటుక్కున తలతిప్పాడు రాజు. పోల్చుకోవటానికి ఒక్క క్షణంకంటే ఎక్కువ పట్టలేదు. 'ఫ్లాష్ బ్యాక్' లోకి పరిగెట్టబోయిన మెదడు — మధ్యలోనే భార్య రాధ గుర్తురావటంతో ఆగి పోయింది.

"హాయ్ లల్లీ ! హౌ డూ యు డూ ?" — ఆనందం, ఆశ్చర్యం కల బోసి అంటూ, కౌంటర్‌లోకి చాపిన ఆమె చేతిలోని వందరూపాయల నోటుని అందుకుంటూ, ఆమెకేసి ప్రశ్నార్థకంగా చూసాడు.

"చిల్లరియ్యి. ఊఁ— ఏవిటి చెప్పు. పెళ్ళయిందా ?" ఆతృతగా అడిగింది.

ఆమెమీద ఎప్పుడో చల్లారిపోయిన

కోపం గబుక్కున వుబికిరాబోతే, 'ఛప్ నోర్మయ్' అని లోలోనే నొక్కేసి, చిరునవ్వు అరువు తెచ్చుకున్నాడు.

"ఈ మధ్యే. ఎలా వుంది నీ సంసారం?"

"నా సంసారమే చెప్పాలి — పచ్చటి సంసారం" వెటకారంగా అంది.

"ఏం? ఏం వొచ్చింది? మీ ఆయన..." వరదరాజులో ఏదో చెప్పలేని ఆతృత.

"ఆయనా?! 'వాడు' — నాకు ఆయనేవిటి నా బొంద! ఆ రోజు అహంకారంతో నిన్ను కాదని వెళ్ళినందుకు నిజంగా నాకు మాంచి ప్రాయశ్చిత్తవేఁ జరిగింది. బుద్ధితక్కువై డబ్బుకు అమ్ముడుపోయాను. నిజంగా చూస్తే నీలో ఎన్నోవంతు అందముంది వాడికి?! గుణంలో - నీ ముందు వాడు ఖలాదూరు."

ముఖస్తుతిని భరించడానికి వరదరాజు యిబ్బంది ఫీలయినవాడై చిరునవ్వుతో నోటు బల్లమీద వుంచి, డెస్క్‌లోంచి చిల్లర కాగితాలు తీయడంలో నిమగ్నుడయ్యాడు.

"వాడికి లేని చెడు గుణం లేదు. నా గొంతు కోసాడు" ఆమె గొంతు కొంచెం వణికిన మాట నిజం.

"నీ జీవితం యిలా అయినందుకు నిజంగా నేను ఛాలా బాధపడ్తున్నాను లల్లీ! ఈ—పిల్లలా?!" అన్నాడు చిల్లర నోట్లు అందిస్తూ, లల్లీ భర్త కంటె ఆమె పాత ప్రియుడైన తను ఎన్నో విధాల గొప్పవాడని ఆమె నోటే వినేసరికి అతను చాలా గర్వంగా ఫీలవుతున్నాడు. కానీ అది పైకి ఏమాత్రం కనిపించకుండా 'తను మంచివాడ్ని, నిగర్విని' అని యింకోసారి నిరూపించుకోదలిచాడు వరదరాజు. తన్ను కాదని వెళ్ళినందుకు ఆమెకి మంచి శాస్తే జరిగింది.

"పిల్లలు లేరు యింకా. అదొకటి అదృష్ట అనుకో" అంది నోట్లు బ్యాగ్‌లో పెట్టుకుంటూ.

"మకాం ఎక్కడా?"

"మాకో మకాం, ఓ వూరూ అని వుందా? ఏ రోజు ఏ వూరో ఆ భగవంతుడికూడా తెలియదు. నా వెనక కొంచెం దూరంగా నల్ల కళ్ళద్దాల వాడొకడున్నాడు చూడు. గళ్ళచొక్కా, నల్ల ప్యాంటు- మరీ అంత 'డైరెక్టు'గా చూసెయ్యకు. అసలే అనుమానపు మనిషి. వాడే నా మొగుడు. ఈ పదికి ఒకట్లెయ్యి చెప్తుతాను. 'ఇంత సేపయ్యిందేం?' అని వాడడిగినాగానీ, సమాధానం చెప్పడాని కుంటుంది" అంది.

ఒకట్లు తీసుకుంటూ వరదరాజు వ్రేళ్ళని తాకింది లల్లీ.

"వస్తా రాజూ! బహుశా యిదే




ఆఖరి కలయికేమో మనది. బై.కిసెన్" అంటూ వెళ్ళిపోయింది.

లల్లీ ...! ఒకప్పుడు పబ్లిక్ గార్డెన్స్, టాంక్‌బండ్, గండిపేట... ఒకటేమిటి తన జంటనగరాలు మొత్తం జంటగా తిరిగిన లల్లీ — తన్ని పెళ్ళాడి సుఖపడవలసిన లల్లీ — అహంకారంతో తన్ని కాదని, ఒక దుర్మార్గుడి భార్య అయి, అష్టకష్టాలూ పడుతూ, యిప్పుడు 'రిపెంటు' అవుతోంది.

మనిషి మునుపటికంటె బాగా చిక్కింది. ముఖంలోనూ, మాటల్లోనూ మాత్రం పూర్వపు ఆకర్షణ పోలేదు.

వేరొకడి భార్య అయికూడా లల్లీ తనని ప్రేమిస్తోంది.

తను నిజంగా 'హి-మేన్.'

ఆనందంతో పుబ్బితబ్బిబ్బవుతూ, అర్ధనిమీలిత నేత్రుడై వరదరాజు ఆమె యిచ్చిన వందరూపాయల నోటుని "కిసెన్" అంటూ పెదవులకు అద్దుకున్నాడు.

పెదవులకు ఏదో గరుగ్గా తగిలింది.

చటుక్కున ఉలిక్కిపడి, నోటువైపు చూసిన వరదరాజు తలపై పిడుగుపడ్డట్టయింది. నోటుమీద ఏటవాలుగా ప్లాస్టిక్ కాగితం అంటించి వుంది. లైటువైపుకి నోటుని ఎత్తిపట్టుకుని చూస్తూ, నోటుకి ఎదురు మూలల్లో వున్న నెంబర్లు 'టాలీ' కాకపోవడంతో నోటు వదిలేస్తూ, 'యూ — చీట్' అంటూ ముందు బల్లమీదకి వాలిపోయాడు వరదరాజు.

# అద్దం

జి.సి.జీవి



"కమిన్!" అన్నాడు చిరంజీవి కాన్ఫిడెన్షియల్ ఫైల్లోంచి తల ఎత్తకుండానే స్వింగ్ డోర్ తలుపులు నెట్టుకుని లోపలికొచ్చేడు అతను

"కూర్చోండి" అని ఫైలుమూసి టేబిలు డ్రాయరు సొరుగులో పెట్టాడు చిరంజీవి. తనకెదురుగా కుర్చీలో కూర్చున్న అతనికేసి కొద్దిక్షణాలు పరిశీలనగా చూశాడు. ఆ వచ్చిన వ్యక్తికి దాదాపు నలభైయేళ్ళుంటాయి అతను గడ్డంగీసుకుని చాలారోజులైనట్టుంది తలంతా అక్కడక్కడ నెరిసుంది. పొట్టిచేతుల చొక్కా, మాసిపోయిన పంచె ధరించి వున్నాడు.

"డిటెక్టివ్ చిరంజీవిగారిని కలుసుకుందామని వచ్చాను" అన్నాడు అతను.

చిన్నగానవ్వి "నేనే, చెప్పండి. ఏం పనిమీదొచ్చారో" అన్నాడు చిరంజీవి. ఆ వ్యక్తి ఒక క్షణం విస్తుపోయి కుర్చీలో సర్దుకుని కూర్చున్నాడు. ఆ గదిలో ఓ మూల టైపుమిషను ముందు కూర్చుని దీక్షగా ఏవో కాగితాలు టైపుచేసుకుంటూన్న అందమైన అమ్మాయి వంక చూసి కాసేపు తటపటాయించాడు.

"ఆవిడ నా పర్సనల్ సెక్రటరీ. డాక్టర్లదగ్గర, లాయర్లదగ్గర రహస్యాలు పనికిరావంటారు. అలాగే మా విషయంలోనూ. మా సహాయం మీకు కావాలంటే మిమ్మల్ని గురించి మాకు తెలియాలి. క్లయింట్సుని గురించిన సమాచారాన్ని రహస్యంగా వుంచడం మా వృత్తి ధర్మాలలో మొదటిది. ఈ

నియమం పాటించనందువల్లనే ఈ నగరంలో వెలసిన ఎన్నో ప్రైవేటు డిటెక్టివ్ ఏజెన్సీలు సంవత్సరంపాటు కూడా నిలబడలేకపోయాయి. ప్రారంభించి ఐదేళ్ళయినా మా ఏజెన్సీ స్థిరంగా నిలదొక్కుకుందంటే 'ప్రొఫెషనల్ హానెస్టీ'ని మేము పాటిస్తూన్నందువల్లనే. ఇప్పుడు చెప్పండి మీ పేరూ?" అని సిగరెట్టు వెలిగించేడు చిరంజీవి.

చొక్కా జేబులోంచి ఒక ఫోటో బయటకి తీసి చిరంజీవి చేతికిచ్చాడు అతను

"ఈ అమ్మాయి పేరు జరీనా. వర్కింగ్ విమెన్సు హాస్టల్లో వుంటోంది. ఈమెనుగురించిన పూర్తి భోగట్టా మీరు సేకరించాలి నా ప్రాణమిత్రుడొకడు ఈ అమ్మాయిని గాఢంగా ప్రేమిస్తున్నాడు త్వరలో ఇద్దరూ పెళ్ళికూడా చేసుకోవాలనుకుంటున్నారు. కాని నాకిష్టంలేదు" అన్నాడు అతను.

"ఎందుకని?" అడిగాడు చిరంజీవి.

"ఆ అమ్మాయి నడవడి మీద చాలా అనుమానాలున్నాయి నాకు. కాని నేనెంత చెప్పినా వినిపించుకోవటంలేదు, మా వాడు. నా సందేహాలన్నీ కేవలం నిరాధారమైనవని తేలిగ్గా కొట్టిపారేస్తున్నాడు. వాడి నమ్మకమే నిజమయ్యే పక్షంలో నాకన్న ఎక్కువగా సంతోషించే వాళ్ళుండరు. కాని..." అని ఒక్కక్షణం ఆగేడు అతను.

"ఊఁ... చెప్పండి." అన్నాడు చిరంజీవి

"జరీనాను గురించిన నా అనుమానాలే నిజమైతే చూస్తూ చూస్తూ వాడి జీవితం బలికావటం నేను సహించలేను" అని ముగించేడు అతను

తన చేతిలోని కార్డుసైజు ఫోటోని మరొకసారి పరిశీలనగా చూశాడు చిరంజీవి. ఫోటోలోని అమ్మాయి చాలా అందంగా, ఆరోగ్యంగా కనిపిస్తోంది. పాతికేళ్ళుకూడా నిండివుండవు. స్లీవ్‌లెస్ జాకెట్టు తొడుక్కుని, బాబ్డ్ హెయిర్ స్టయిల్లో ఎంతో ముచ్చటగా వుంది.

"ఇంతకీ మీ పేరు చెప్పనేలేదు." అన్నాడు చిరంజీవి ఫోటోని కవరులో పెట్టేస్తూ.

"క్షమించాలి. కొన్ని కారణాంతరాల చేత నా పేరు ప్రస్తుతానికి రహస్యంగా వుంచాలనుకుంటున్నాను. దయచేసి బలవంతపెట్టకండి అయినా జరీనాను గురించిన సమాచారం సేకరించడంలో నా పేరు మీ కేవిధంగానూ వుపయోగపడదు."

"మీరలా అనుకోవటం పొరపాటు. పని పూర్తయిపోయాక రేపు ఫీజు వసూలు చేసుకోవటానికైనా మీ పేరూ, అడ్రసూ తెలియాలిగదా మాకు" అన్నాడు చిరంజీవి నవ్వుతూ.

"ఎంతమాట! మీకా సందేహం అక్కరలేదు. మీ ఫీజు ఇప్పుడే ఇస్తాను"

అంటూ చేతి సంచీలోంచి పదిరూపాయల నోట్లకట్టలు రెండు తీసి టేబులుమీద పెట్టాడు అతను.

"మీరు జరీనాను గురించి రిపోర్టు తయారుచేసి ఇవ్వగానే మిగతా బేలెన్సు ఇచ్చేస్తాను "

నోట్ల కట్టల్ని చేతిలోకి తీసుకుని విలాసంగా విరుస్తూ 'ఇక మీరేమీ ఇవ్వ నవసరం లేదు. ఈ పనికి మా ఫీజు రెండువేలే." అని డబ్బుని డ్రాయరు సొరుగులో పెట్టి తాళం వేశాడు చిరంజీవి.

"చాలా థాంక్స్ మళ్ళీ ఎప్పుడు రమ్మంటారు" అంటూ లేచాడు అతను.

"నెల రోజులు పోయాక రండి. రిపోర్టు రెడీగా వుంటుంది."

అతను వెళ్ళిపోయాడు.

"మిస్ రేఖా!" పిలిచాడు చిరంజీవి.

టైపుచేయడం ఆపి అతని దగ్గర కొచ్చి నిలబడింది మిస్ రేఖ.

"ఈ పని నీకప్పగిస్తున్నాను, చెయ్య గలవా ?"

"ష్యూర్" నవ్వుతూ అంది.

"గుడ్ ! అయితే రేపట్నుంచే ఇన్వెస్టిగేషన్ ప్రారంభించు" అని జరీనా ఫోటోని ఆమె చేతికిచ్చాడు.

* * *

ఇంటికితిరిగొచ్చి నిలువుటద్దంముందర నిలబడ్డాడు అతను. ఈ వేషంలో తనని తాను పోల్చుకోవటమే కష్టంగావుంది. ఎంత డిటెక్టివ్ అయితే మాత్రం బోల్తా పడకుండా ఎలా వుంటాడు. స్నేహితుని తరపున వచ్చేనంటే నిజంగా నమ్మే సేడు పాపం అందుకే అన్ని ప్రశ్న లడిగేశాడు తనకి జరీనా మంచి అమ్మాయిలాగే కనిపిస్తోంది. మొదటి పరిచయంలోనే ఆమెను శాశ్వతంగా సొంతం చేసుకోవాలనే కోరిక స్థిరపడింది మనసులో. ఇంతకాలమూ గాడులేని బొంగరంలా తయారైన తన జీవితాన్ని క్రమబద్ధం చేసుకోవాలనే ఆలోచన కలి గింది. అందుకు అన్ని విధాలా తగిన వ్యక్తి జరీనా. ఎందుకైనా మంచిది తుది నిర్ణయం తీసుకునేముందు ఆమె పుట్టు పూర్వోత్తరాలు గురించి కొంత తెలుసు కోవడం మంచిదనిపించింది. కాని ఆ ప్రసక్తి ఎప్పుడు తెచ్చినా అదోరకంగా ముఖం మాడ్చుకునేది జరీనా.

"నామీద నమ్మకంలేదా మీకు?' అని మాట తప్పించేది. తన గతాన్ని గుప్తంగా వుంచాలని ఆమె ప్రయత్నించే కొద్దీ ఆమెని గురించి తెలుసుకోవాలనే పట్టుదల పెరిగింది తనలో. ఫలితంగా ఈరోజు 'చిరంజీవి ఏజెన్సీస్' సహాయం పొందాల్సి వచ్చింది

విగ్గు తీసి మూలకు విసిరేసేడు అతడు. బాగా పెరిగిన గడ్డాన్ని నున్నగా గీసుకున్నాడు. స్నానంచేసి వచ్చి ముఖానికి 'ఫేర్ అండ్ లౌలీ' రాసు కున్నాడు. ఎప్పటిలా టిప్‌టాపుగా తయారయ్యాడు. హుషారుగా ఈల వేసుకుంటూ 'పామ్‌గ్రోవ్' కి బయలు దేరాడు జరీనాని కలుసుకోవటానికి.

* * *

నెల రోజుల తరవాత...

అదే మాసిసిపంచె, పొట్టిచేతుల చొక్కా, పెరిగిన గడ్డం అక్కడక్కడా నెరిసిన జుట్టుతో చిరంజీవి ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు అతను.

"రిపోర్టు తయారయిందా?"

"మూడ్రోజుల కిందటే రెడీ అయింది" టేబిలు సొరుగులోంచి సీలు వేసిన ఒక పొడుగాటి కవరు తీసి చేతికిచ్చాడు చిరంజీవి.

"చాలా థాంక్సండీ. వస్తాను" అని సెలవు తీసుకున్నాడు అతను. ఆగమేఘాలమీద ఇల్లు చేరుకున్నాడు. గదిలో తలుపులు బిగించుకుని, ఆత్రంగా కవరు చింపి రిపోర్టుకాయితాన్ని బయటికి తీశాడు...

**జరీనా పుట్టుపూర్వోత్తరాలు:**

జరీనా పుట్టింది ఇండోనీషియాలో. ఇరవైయేళ్ళ కిందట ఆమె తల్లిదండ్రులు స్వదేశం వదలిపెట్టి భారతదేశంలో స్థిరపడ్డారు. ఇక్కడికొచ్చిన మూడేళ్ళకి ఒక కారుప్రమాదంలో తల్లిదండ్రులిద్దరినీ కోల్పోయింది జరీనా. బొంబాయిలోని ఒక అనాథాశ్రమంలో పెరిగి, అక్కడే చదువుకుని మెట్రిక్ పాసయింది. ఇండియన్ ఏర్‌లైన్సులో టైపిస్టుగా చేరింది. అయిదేళ్ళక్రితం ఈ వూళ్ళోని బ్రాంచి ఆఫీసుకి ట్రాన్స్‌ఫరయి వచ్చింది. మెట్రిక్యులేషన్ స్కూల్ రికార్డు ప్రకారం ఆమె వయసు ఇప్పుడు ఇరవైనాలుగు సంవత్సరాల ఆరునెలలు.

**ఇటీవల సంగతులు.**

జరీనా చాలా అమాయకురాలు. మనుషుల్లోని మోసాల్ని పసిగట్టే లౌక్యం ఆమెకింకా అలవడలేదు. కొంతకాలంగా అంటే సుమారు అయిదారు మాసాలుగా జరీనా ఒక 'పెద్దమనిషి'తో తిరుగుతూంది. అసలు రంగు తెలిస్తే అతని వల్లో పడేదికాదు. అతనకి లేని దుర్వ్యసనాలు లేవు. అంటని సుఖవ్యాధి లేదు. కంపెనీ డబ్బుని కొన్నివేలు కాజెయ్యటమేగాక, పన్నులు ఎగవేసి ప్రభుత్వాన్ని కూడా అనేక రకాలుగా మోసం చేస్తూన్నాడు. ఈతడు ఏ విషయంలోనైనా ప్రభుత్వానికి పట్టుబడి జైలుకు పోవల్సిన పరిస్థితిలో వున్నాడు. ఈ వూళ్ళో ఎరువుల తయారీకి సంబంధించిన ఒక ప్రముఖ వ్యాపారసంస్థకి మేనేజింగు పార్ట్‌నరు ఈ పెద్దమనిషి.

**మా సలహా:**

జరీనాను ఈ పెద్దమనిషి బారినుండి ఎంత త్వరగా రక్షిస్తే అంత మంచిది.

చదవటం ముగించి కసితో రిపోర్టు కాయితాన్ని ముక్కలుగా చించి, వుండ చుట్టి నేలకేసి విసిరికొట్టాడు అతను.

"ఛీ! నన్ను గురించి నేను తెలుసుకోటానికి ఈ డిటెక్టివ్ వెధవలకి రెండు వేలు ధారపోశాను" అని తనని తిట్టుకున్నాడు. విసురుగా తలుపులు తెరుచుకుని హాల్లోకొచ్చి అద్దంముందు నిలబడ్డాడు. ఇప్పుడతనికి అద్దంలో తన మారువేషం కనిపించటంలేదు. పోలీసాఫీసర్లూ, సి.బి.ఐ. అధికారులూ కనిపించేరు. నివ్వెరపోయి వెనక్కి తిరిగేడు అతను.




(గత సంచిక తరువాయి)

**12**

పోస్ట్ డబ్బాలో కవరు వేసి ఇంటి ముఖం పట్టింది పార్వతి. బజారులో కొనాల్సిన రెండుమూడు సరుకులు కొనటం పూర్తి అయింది.

"అమ్మా!" అన్న పిలుపు విని చటుక్కున ఆగిపోయింది నడిరోడ్డు మధ్యలో. రఘూ రెండంగల్లో పార్వతి వద్దకు వచ్చాడు.

"బజారులో పనివుండి వచ్చావా అమ్మా"! అన్నాడు రఘు.

"అవును."! ముక్తసరిగా అంది పార్వతి.

టానికి కృష్ణ వస్తున్నాడు. పండక్కి వారంరోజుల ముందుగా వెళదామా ?"

"వెళదామా ? అని అడగకు వెళ్ళాలి ఆఫీసుకి శలవు పెట్టండి అని ఆజ్ఞాపించు. మీ నాన్నగారు రావటం విచిత్రంగా వుంది."

"మీరు మారటం నాకూ చిత్రంగానే వుంది.''

"వాళ్ళ మాటలు వినకపోతే నన్ను మార్చటం నీ తరం అయ్యేది కాదేమో శకూ ! నిన్ను ఇష్టంవచ్చినటు అంటుంటే నా మనసు తూట్లు పడింది. నేను ఆడిన మాట తప్పనని తెలుసుకదా ? అలాంటి చోట్లకు రానని, ఆ గుమ్మం తొక్కనని ప్రతిజ్ఞ చేసివచ్చాను. నీ మీద ప్రమాణం చేశాను. నా కంఠంలో ప్రాణం వుండగా ఆడినమాట తప్పను.'' శ్రీపతి ఆవేశంగా అన్నాడు.

గడియారం ఠంగ్‌మని అరగంట కొట్టింది.

"గంట కొట్టింది చూచారా ?'' అంది ఆనందంతో శకుంతల.

''అవును. అరగంట అంటే ఎనిమిదిన్నర అయింది. అయితే ఏమిటి ?''

"మీరు ఆడినమాట తప్పరు. మొండి మనిషి అని తను సాక్ష్యం ఇచ్చింది." తృప్తిగా శ్రీపతివైపు చూస్తూ అంది శకుంతల.

''అంటే ?"

"బుద్ధావతారంగారూ! మనమేదయినా అనుకున్నప్పుడు తుమ్ము వినిపించటం అశుభ లక్షణం. గంట మోగటం శుభ లక్షణం." మంచంమీదనుంచి లేచి వంటగదికేసి బయలుదేరుతూ అంది శకుంతల.

శకుంతలను చూస్తూ అనుకున్నాడు శ్రీపతి.

"మగవాడి తప్పు ఆడది క్షమించినంత తొందరగా ఆడదాని తప్పు మగవాడు క్షమించడు. ఆడది క్షమాధరిత్రి. అవసరమయితే ఆదిశక్తి. అందుకే ఆడదాన్ని అబల సబల అన్నారు పెద్దలు."

శ్రీపతి అనుకున్నది పూర్తి నిజమే. తన సంసారంకోసం స్త్రీ అన్ని అవతారాలూ ఎత్తుతుంది.

అదే స్త్రీలో ప్రత్యేకత.

(సమాప్తం)





# మాటలు చేతలు

సుమైత్రాంగి

ఆవూరు వచ్చినప్పటినుంచీ, సావిత్రికి భర్తను సాధించడం అలవాటయ్యింది. "ఓ అడివిలో తీసుకొచ్చి పారేసారు నన్ను. చూట్టానికి సినిమాలు వున్నాయా, చలగాలిలో తిరగడానికి అందమైన పార్కులున్నాయా? సరదాగా కబుర్లు చెప్పుకోవడానికి ఇరుగా, పొరుగా ఏవుంది ఇక్కడ?" అంటూ. సావిత్రి భర్త సాంబమూర్తి ఇదివరకు ఓ పెద్ద సిటీ పనిచేసేవాడు. అటు కోర్టుపనిమీ

వచ్చేవారికి, ఇటు రోగాలు నయం చేయించుకోవడానికి, సరదాగా తిరగ డానికి ఆ సిటీ సెంటరుగా ఉపయో గిస్తూ వుంటుంది.

కోర్టు పనిమీద వచ్చి ఆ పని పూర్తి చేసుకుని, ఓపూట సాంబమూర్తి ఇంట్లో చేయి కడిగేవారు కొందరైతే, తగ్గని రోగాలను తగ్గించుకోవడానికి పెద్ద డాక్టర్ల దగ్గరికొచ్చి ఆ జబ్బు తగ్గించు కుని వెళ్తూ సాంబమూర్తిఇంట్లో ఓ రోజు మకాంపెట్టేవాళ్ళు మరి కొందరు. జేబు నిండా నోట్లు పెట్టుకొచ్చి జల్సాగా ఖర్చుపెట్టుకుని, ఇంటికి వెళ్తూ ఓసారి సాంబమూర్తిని చూసి ఆపొద్దు అక్కడే గడిపి వెళ్ళేవాళ్ళు ఇంకొందరు ఇలా వచ్చే పోయే బంధుబలగంతో వాళ్ళ యిల్లు పెళ్ళివారియిళ్ళలా ఎప్పుడూ సందడిగా వుండేది, సాంబమూర్తికివచ్చే రాబడికన్న ఖర్చులే అధికంగా వుండేవి. ఇల్లాలు సావిత్రికి ఇంటిచాకిరీతో వంటా వార్పుతో క్షణం తీరిక వుండేదికాదు.

చుట్టాల వత్తిడికి తట్టుకోలేకే సాంబ మూర్తి ఏరికోరి ఈ మారుమూలప్రాంతా నికి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాడు. వచ్చిన కొత్తలో నాలుగు రోజులు, ఆ ఊరిని, అందమైన ఆ ఊరి పరిసరాలను సూర్యోదయానికి ముందు సూర్యాస్త మయం తర్వాత ఆకాశంలో ప్రస్ఫుట మయ్యే వింత అందాలను కనుచూపు దూరంలోవున్న కొండల్ని, నీరెండలో తళతళ మెరిసె వాటి అంద చందాలను వాటిమీంచిదూకే సీటిధారలను చూస్తూ తన్మయురాలయ్యేది సావిత్రి, "అబ్బ ఎంత అందమైన దృశ్యమండీ, అని మురిసిపోయేది, పైగా అదంతా ఏజన్సీ ప్రాంతమేమో, ఎటుచూసినా గిరిజనులే కనిపిస్తారు. సాయం సమయాల్లో త్వరగా వంటపని పూర్తిచేసుకుని గుమ్మంలో నిల్చుంటేచాలు కావలసినంత కాలక్షేపం కాని తినగా తినగా గారెలు చేదైనట్లు, రోజూ ఒకేరకమైన దృశ్యా లను చూస్తుంటే, నూతనత్వం కోరుకునే మనసుకి వెగటు పుట్టడం సహజమే.

సావిత్రి అతి సామాన్యురాలైన యువతి, ప్రకృతిలోని అందచందాలను ఆస్వాదించే భావుకురాలసలేకాదు. అందుకే భర్తను సతాయించడం మొదలు పెట్టింది. "నన్ను తీసుకొచ్చి ఓ అడ విలో పారేసారు" అంటూ.

"మీకేం మగమహారాజులు ఆఫీసు పనిమీద టౌనుకెళ్ళి సరదాగా గడిపి వస్తుంటారు. సినిమాలు, షికార్లు అంటూ ఇక నా ముఖానికే ఓ సినిమా, సరదాగా ఏమీ లేదు అని పుస్తకాలతో రేడియోతో ఎంతసేపని కాలక్షేపం చేస్తుంది. పోనీ ఎవరితో అయినా స్నేహం చేసుకోవా లంటే, కొత్తవారితో అస్సలు మాట్లాడ లేదు.పైగా ఆ చుట్టుప్రక్కల వున్నవా రంతా బాగా కలిగిన కుటుంబాలవారేను. అందుచేత కొంతా ఆమెకు స్నేహితులే

తరువై పోయారు ఆరోజు ఉదయమే చెప్పింది సావిత్రి త్వరలో ఇక్కడ మంచి మార్పించు కోకపోతే తనకు నిజంగానే పిచ్చి ఎక్కుతుందని"

"వచ్చేపోయే బంధువులకు, వండి, వడ్డించలేక పోతున్నానని, కోరి ఇక్కడకు మార్పించుకుంటే మళ్ళీ ఇంతలోనే ట్రాన్స్ఫర్‌కి పెట్టుకుంటే అధికారులు ఒప్పుకోవద్దూ, ఒక్క ఏడాది ఓపిక పట్టే తప్పకుండా మార్పించుకుంటాను. ప్లీజ్ శాంతించు సావిత్రీ" సాంబమూర్తి బతిమాలసాగాడు. "వండిపెట్టడానికి బాధగావున్నా, సందడిగా అయినా ఉండేది. ఇక్కడ ఎవరున్నారు మనకు? మీకు నేనూ, నాకు మీరూను, ఈ ఊళ్లో మనల్ని వెతుక్కుంటూ ఏ చుట్టమూ రాడు ఓవేళ వచ్చినా, తోచక వెంటనే పారిపోతాడు తెలుసా'' రుసరుస లాడుతూ వంటగదికేసి వెళ్ళిపోయింది, సావిత్రి.

అర్జెంటుగా తన భార్యకు ఓమంచి స్నేహితురాల్ని కుదిర్చిపెట్టాలి అను కున్నాడు సాంబమూర్తి.

ఆ సాయంత్రం, సావిత్రి ఆవారం వీక్లీలో చెప్పబడిన పిండివంట చేసే ప్రయత్నంలో వుండగా "సావిత్రీ గుడ్‌న్యూస్'' అంటూ వచ్చాడు సాంబమూర్తి. భర్త ఏ కబురో తీసుకొనివచ్చి వుంటాడని అనుకున్న సావిత్రి వెనక్కి చూడకుండానే "ఊఁ చెప్పండి ఆ గుడ్ న్యూస్" అంది వెటకారంగా.

"నీకోసం ఎవర్ని తీసుకొచ్చానో చూడు" అన్నాడు ఉత్సాహంగా. "ఇంకెవర్ని తీసుకొస్తారు ఏమేకపిల్లనో, కుక్కపిల్లనో, తీసుకొచ్చివుంటారు." అంతేగా మీ నిర్వాకం అన్నట్లు నిర్లక్ష్యంగా నవ్వేస్తూ తిరిగి చూసిన సావిత్రి నిజంగానే స్టన్‌అయిపోయింది. తనూహించినట్లుగా భర్తచేతిలో కుక్కపిల్లగాని, మేకపిల్లగాని లేకపోగా పైగా ఓ అందమైన అబ్బాయి భర్తవెనక నిలబడి తన వైపు చూసి కొంటెగా నవ్వడం నిజంగా ఆమెకు మతిపోయినట్లుగానే చేసింది. ఎవరీ అబ్బాయి? ఎందుకువచ్చినట్లు? షాక్‌నుంచి తేరుకుని 'ఎవరండీ ఈ అబ్బాయి' అన్నట్లు భర్తవైపు చూసింది భయంగా.

చెప్తానుగాని ఆ చేతిలో పని ఆపిరా, అన్నట్లు సౌంజ్ఞచేసి ముందు గదిలోకి నడిచాడు సాంబమూర్తి, అతని వెనకాలే నడిచాడు ఆ అబ్బాయి.

ఆ అబ్బాయి తెల్లగా బొద్దుగా. ఉంగరాలు తిరిగిన క్రాపుతో, పెద్ద పెద్ద కళ్ళతో చాల అందంగా వున్నాడు.

చప్పున చేతులు కడుక్కొని, ముందు గదిలోకి వచ్చి "ఊఁ ఇప్పుడు చెప్పండి" అన్నట్లు భర్తవైపు చూసింది సావిత్రి.

"ఈ అబ్బాయి, ఈ ఊళ్ళోప్రముఖ కంట్రాక్టరు జోగినాధంగారి అబ్బాయి.

పేరు రవీంద్ర. ఈ సంవత్సరం కాలే జీలో చేరాడు. సెలవులకు ఇక్కడ కొచ్చాడు. సెలవులన్నాళ్ళూ నీకు కాల క్షేపంగా వుంటాడని పరిచయం చేయ డానికి తీసుకొచ్చాను." అని ఆ అబ్బా యిని సావిత్రికి పరిచయంచేస్తూ చూడవోయ్ రవీ, నీకు ఖాళీగా వున్నప్పుడొచ్చి "ఈ అక్కదగ్గర కూర్చుని-కబుర్లు చెప్పవోయ్''అన్నాడు సాంబమూర్తి ఆ అబ్బాయివైపు చూసి నవ్వుతూ.

"అబ్బ అక్కయ్యా ... బోరండీ నాకు, ఈ అక్కయ్యలను చూస్తే. నాకు ఇద్దరు అక్కయ్యలున్నారు. ఓ సినిమా చూడనివ్వరు. రేడియో పెట్టుకోనివ్వరు, సరదాగా పాడుకోనివ్వరు. కనీసం కథల పుస్తకమన్నా చదువుకోనివ్వరు. ఏపని చేయబోయినా అక్కయ్యలమనే అధికారంతో అడ్డువస్తూ వుంటారు. మాట్లాడినా వసపిట్టలా అలావాగుతావేం అంటారు, నవ్వినా తంటాయే ఈఅక్క లతో. కనుక మరోవరుస చెప్పండి,సర దాగా పిలిచేవరుస అన్నాడు రవి, చటుక్కున, ఏమాత్రమూ కొత్తన్నా లేకుండా.

ఆ అబ్బాయి అలా అంటుంటే సావి త్రికి ఎంతయినా ముచ్చటేసింది. ఇటు వంటి తమ్ముడు నాకూ ఒకడు ఉంటే ఎంతబాగుండును అనుకుంది. తమ్ముడు లేడుకనుక అలా అనుకుంటున్నది గాని వుంటే బహుశా ఈ అబ్బాయిలాగా తన తమ్ముడూ తనని ద్వేషిం వాడేమో అంతర్యంలో అనుకుంది "పోనీ, 'వదినా' అని పిల స్తావా?" అన్నాడు సాంబమూర్తి.

"అబ్బ, ఆ పిలుపూ బాగోదండీ, 'వదినగారూ' అని మన్నిస్తూ పిలవాలి, పైగా సరదాగా మాట్లాడటానికే వీలుం డదు అప్పుడిక" రవీంద్ర బుంగమూతి పెట్టాడు. ఆ అబ్బాయిని చూసి పక పకా నవ్వేసింది సావిత్రి అయితే ఏమనిపిలుస్తావబ్బా అంది సావిత్రిగారూ అని పిలుస్తాను మీకభ్యంతరమా? అడి గాడు రవీంద్ర.

"ఓ నిక్షేపంగా పిలవొచ్చు. మరి నిన్నేమని పిలవనూ, తమ్ముడూ అని పిలవనా" కొంటెగా అడిగింది సావిత్రి.

తమ్ముడూ అని పిలిచి నా నెత్తిమీద మొట్టడానికా అదేమీ కుదరదు 'రవీ' అని పిలవండి చాలు'' అన్నాడు ఆ అబ్బాయి తనూ నవ్వేస్తూ.

రవి ఏదో మాట చెప్పడం భార్యా భర్త లిద్దరూ గలగల నవ్వడం ఇలా ఓ గంట కాలక్షేపం తర్వాత, నేను వెళ్తానండీ, రేపటినుంచి వీలైనప్పుడల్లా వచ్చి హాజరు వేయించుకుని వెళ్తాను" అని చెప్పి వెళ్ళిపోయాడు రవి.

"చాలా సరదా అయిన కుర్రాడు. వున్నంతసేపూ టైమే తెలిసిందికాదు"

మనస్ఫూర్తిగా ఆ అబ్బాయిని మెచ్చు కుంది సావిత్రి.

ఇకనుంచయినా భార్య సతాయింపు తగ్గుతుందికదా అనుకున్నాడు సాంబ మూర్తి.

*   *   *

అన్నమాట ప్రకారము రోజూ ఏదో ఒ వేళలో వచ్చి సావిత్రితో కబుర్లు చెప్తూ కూర్చునేవాడు రవి. ఆ కబుర్లల్లో తన కాలేజీ అనుభవాలనుంచి, వాళ్ళింట్లో పనిమనిషి ఆగడాలవరకూ దొర్లిపోయేవి ఒక్కోసారి కబుర్లలోపడి పొద్దుపోతే, ఇక్కడే భోంచేసి వెళ్ళవోయ్" అనేది సావిత్రి. ఏమాత్రమూ బెట్టుచూపకుండా సావిత్రి చేతివంట రుచిచూసి మరీ, వెళ్ళేవాడు రవీంద్ర. ఇలా చాలాసార్లు సావిత్రి చేతివంట రుచిచూసాడు రవి.

రోజు లెంత వేగలగా గడిచిపో తున్నదీ సావిత్రికి తెలిసేదికాదు. సెల వులు పూర్తయ్యి 'రవి' వెళ్ళిపోయాక తిరిగి కాలం స్థబించిపోయినట్లే అయ్యిం దామెకు.

అడపా దడపా రవి దగ్గర నుంచి ఉత్తరాలు వచ్చేవి. వాటినిండా తను చూసిన సినిమా వర్ణనో, తను చదివిన పుస్తకంలోని మంచిచెడులో, లేదా కాలే జీలో పిల్లలు చేసే అల్లరి చేష్టలో, నిండి వుండేవి. అవి చదివికాస్త సంతృప్తిపడేది సావిత్రి ఆ ఉత్తరాలకు జవాబు రాసేది వెంటనే నీ ఉత్తరాలుకూడా నీలాగే ఎన్నోకబుర్లు చెప్తూ ఆనందింపజేస్తు న్నాయి రవీ అంటూ, తను కొన్న పుస్త కాలను బుక్‌పోస్టుద్వారా పంపేవాడు. ఆ అబ్బాయి చూపించే అభిమానానికి, ఆప్యాయతకు కరిగిపోయేది. రవిది ఎంత మంచి మనసు అంత మంచిమనసు ఎక్కడో, ఎవరికోగాని వుండదు. అంత మంచి మనసున్న కుర్రాడు తనకి స్నేహం అయినందుకు ఎంతయినా పొంగిపోయేది.

తిరిగి కాలేజీలు మూసివేయడం, 'రవి' రాక ఆమె కెంతో ఆనందాన్ని కలిగించాయి ఇలా నాలుగేళ్ళు గడిచి పోయాయి. నాలుగేళ్ళల్లో వాళ్ళ మధ్య స్నేహం చెరిగిపోలేదు. వాళ్ళ వయసుకి నాలుగేళ్ళు పెరిగినా 'రవి' లోని చిలిపి తనం, కొంటెమాటలు తగ్గలేదు అదే మనసు, అదే మంచితనం.

ఆ సంవత్సరం ఫైనల్ ఇయర్‌లో అటుగు పెట్టాడు తను కథలు రాస్తు న్నట్లు అవి పత్రికల్లో అచ్చయినట్లు అచ్చయిన ప్రతులు తెచ్చి చూపించాడు కూడా రవి ఆ కథలు చదివి చాలా బాగున్నవంటూ మనస్ఫూర్తిగా మెచ్చు కుంది సావిత్రి.

ఆ రోజు సాంబమూర్తి చెప్పాడు "త్వరలో నీ చిరకాలవాంఛ నెరవేర బోతున్నది సావిత్రీ" అంటూ.

"నా చిరకాలవాంఛా! అదేమిటి?" తెల్లబోతూ చూసిందామె.

"అదే ఈ ఊరినుంచి మార్పించు కోమని కోరేదానివిగా ; మన ప్రయత్నం లేకుండానే అది తీరేలావుంది."

"మనల్ని మారుస్తారా? ఎందుకూ? ఇక్కడ బాగానేవుంది కదా" దిగులుగా చూసింది.

"నీకు బాగుంటేమాత్రం ఉంచుతా రనుకున్నావా ? అదేమీ కుదరదు. మన కిష్టంవున్నా లేకపోయినా వెళ్ళాల్సిందేను ఈసారి విజయవాడ వేయించుకోవాలని అనుకుంటున్నాను" అన్నాడు సాంబ మూర్తి హుషారుగా.

ఆ మాట విన్నప్పటినుంచీ సావిత్రికి బెంగపట్టుకుంది. ఈ నాలుగేళ్ళల్లో అల వాటైన ఊరు, ముఖ్యంగా 'రవి'కి దూరంగా వెళ్ళిపోవాల్సి వస్తుందేమో అని మరీ దిగులుపడసాగింది. ఒక్కొ క్కళ్ళతో స్నేహంకలిసిన వేళావిశేషం ఎటువంటిదోగాని ఆ స్నేహం మరుపు రానిదిగా, మరిచిపోనిదిగా పరిణమిస్తుంది రవి తనకంటే చిన్నవాడే అయినా స్నేహానికి వయసు అడ్డంరాలేదు వాళ్ళి ద్దరికీను, పిడుగులాంటివార్త భర్త నోట్లోంచి ఏక్షణంలో వినిపిస్తుందో అని భయపడుతూనేవుంది,

ఓ రోజు మధ్యాహ్నం హడావిడిగా వచ్చాడు రవి. అతనిచేతిలో ఓ వీక్లీ పత్రికవుంది. సావిత్రి నవ్వుతూ "కూర్చో రవీ" అనేంతలోనే "కూర్చోవడాని కిప్పుడు నాకు టైమ్‌లేదుగాని, ఈ పుస్తకం ఇవ్వాలని వచ్చాను. చదివి రేపు ఇవ్వాలి" అంటూనే ఎంతవేగంగా వచ్చాడో అంత వేగంగానూ బయటకు వెళ్ళిపోయాడు.

ఏమిటో అంత అర్జంట్" అనుకున్న సావిత్రి రవి ఇచ్చిపోయిన వీక్లీతిరగేస్తూ కూర్చుంది అలా తిగేయడంలో ఓ కథ దగ్గర 'రవీంద్ర' అనే పేరుచూసి ఆగి పోయిందామె చూపు. అది రవీంద్ర రాసిన కథ అనుకోగానే ఎనలేని కుతూహలంతో ఆ కథని చదివేసింది : గబగబా, కథ చిన్నదేను. కథపేరు మళ్ళా వసంతం వచ్చింది.

ఓ అందమైన అమ్మాయి, ఆ అమ్మా యికి బాల్యంలోనే వివాహం అవుతుంది కాని దురదృష్టవశాత్తూ ఆ అమ్మాయి కాపురానికి వెళ్ళకముందే సౌభాగ్యం చెరిగిపోతుంది. తండ్రి ఉధునిక భావాలు కలవాడు కనుక వైధవ్యంపొందిన కూతురిని ఓ హాస్టల్లో పెట్టి చదివిస్తాడు కాలేజీ చదువు పూర్తిచేసాక ఉద్యోగం కూడా చేస్తుంది ఆ అమ్మాయి.

ఆ అమ్మాయి పనిచేసే అఫీసులోనే పనిచేసే ఒక యువకుడు ఆమెను ప్రేమి స్తాడు పెళ్ళిచేసుకుంటానని చెప్తాడు. కాని ఆ అమ్మాయి "తను 'విడో' అని. మళ్ళా పెళ్ళికి అనర్హురాలనని చెప్పి ఆ పెళ్ళికి అంగీకరించదు.

భార్యపోతే మగవాడు తిరిగి మళ్ళీ పెళ్ళిచేసుకోవడంలేదా ? అలా ఆడది

కూడా పునర్వివాహం చేసుకోవడంలో తప్పులేదని బోధిస్తాడు. వసంతఋతువుతో, ప్రకృతి పచ్చని ఆకులతో, పూలతో పిందెలతో ఎలా కలకల్లాడుతుందో అలా మోడైపోయిన స్త్రీ జీవితంలోకూడా వసంతం ప్రవేశించాలంటే ఆ స్త్రీ విధిగా తిరిగి వివాహం చేసుకోవాలని, ప్రకృతిలాగానే ఆమె జీవితం కూడా పిల్లాపాపలతో సౌభాగ్యంతో కలకల్లాడాలని నచ్చచెప్పి ఎలాగైతేనేం ఆమెను పునర్వివాహానికి అంగీకరింపజేస్తాడు

క్లుప్తంగా ఇదీ కథలోని ఇతి వృత్తం ఆ కథ చదివి నచ్చనట్టు పెదవి విరిచింది సావిత్రి, వుండి వుండి రవి ఇటువంటికథ ఎన్నుకున్నాడేం? ఈ కథకూ అతని జీవితానికీ ఏమైనా సంబంధం వుందా, అని తరచి తరచి ప్రశ్నించుకుంది సావిత్రి.

"ఆ కథ చదివారా? ఎలావుంది?" ఆ మర్నాడు రవి వస్తూనే ఆమెను అడిగిన ప్రశ్న అది.

"ఏదో వుందిలే ఓ మోస్తరుగా" పెదవి విరిచిందామె.

"అదేం మీకు నచ్చలేదా? ఆ కథ మీకు నచ్చుతుందని అనుకున్నానే" మీ ఆడవారికి సంబంధించిన కథే మీకు నచ్చలేదా అనే భావంతో నిరాశగా పలికింది అతని గొంతు

"కథ చదవడానికి బాగానే వుంది కాని ఇటువంటి సంఘటనలు నిజజీవితంలో మాత్రం జరగవు" అంది కన్వింసుగా "ఎందుకు జరగవు? మనిషి తలుచుకుంటే జరగంది వుంటుందా?" ఆవేశంగా రెట్టించాడు రవీంద్ర. అతనలా వుద్రేకపడటానికి కారణం లేకపోలేదు తను రాసిన ఆ కథ కేవలం ఊహాగానంతో రాసిందికాదు.

తనతోనే కాలేజీలో చదివే ఓ అమ్మాయిని ప్రేమిస్తున్నాడు తను ఆ అమ్మాయి వితంతువని తెలిసింది. తనెలాగూ ఆ అమ్మాయిని వివాహం చేసుకోవాలని అనుకుంటున్నాడు గనుక, తన ఆదర్శ భావాలను అలా కథలా మలిస్తే పాఠకులనుంచి ఎటువంటి ప్రోత్సాహం లభిస్తుందో చూడాలని అతని ఉద్దేశ్యం, అతని మొదటి పాఠకురాలు సావిత్రి, ఆవిడే అలా తేల్చిగా తన కథని తీసిపారేయడం ఏమాత్రమూ నచ్చలేదు రవీంద్రకు.

సావిత్రి అలా అనడంలో, ఆమె మనసులో ఉద్దేశం వేరేవుంది. తన కజిన్ సిస్టర్ ఒకామె బాల్య వితంతువేను, ఆ అమ్మాయిప్పుడు జూనియర్ ఇంటర్‌లోవుంది. ఇటువంటి కథలు చదివి ప్రభావితులైన యువకులు, అటువంటి యువతులకు వివాహం చేసుకోవడానికి ముందువస్తారా ఆదర్శాను కేవలం కథలకే పరిమితంచేస్తారా అనేభావంతోనే రవీంద్రను అలా కవ్వించింది. అతని

లాంటి అబ్బాయిలు సాహసించి ముందడుగు వేస్తేనే తన సిస్టర్‌లాంటి అమ్మాయిల జీవితాల్లోకి తిరిగి వసంతంవస్తుంది తప్పకుండా.

రవీంద్ర అలా ఉద్రేకపడుతూ అన్న మాటకు మందహాసంచేస్తూ అంది. "రాతల్లోనూ, మాటల్లోనూ ఎన్ని ఆదర్శాలయినా వల్లిస్తారు మీకుర్రాళ్ళు, తీరా ఆచరణలోకి వచ్చేసరికి పెద్ద వాళ్ళమీద నెపంవేసి అతి లాఘవంగా తప్పుకుంటారు "అని ఆ మాట చురుక్కున తగిలింది రవీంద్రకు" అందరి మాట నేను చెప్పలేనుకాని, పెళ్ళంటూ చేసుకుంటే యంగ్ విడోనే చేసుకుంటాను. ఇదిమాత్రం నిజం. మీరు ఎక్కడ వున్నా, ఎప్పుడువిన్నా రవీంద్ర అన్న మాట నిలబెట్టుకున్నాడు. అని వింటారు సుమా! అన్నాడు పట్టుదల సూచించే స్వరంతో,

"అలా విన్నరోజున నిన్ను తప్పకుండా అభినందిస్తానోయ్" మనస్ఫూర్తిగానే అందామాట సావిత్రి.

ఇది జరిగిన నాలుగురోజులకే, ఊరు వెళ్ళాల్సి వచ్చింది సావిత్రి. 'తండ్రికి వంట్లో బాగులేదు.' అనే కబురు రావడంతో, అకస్మాత్తుగా ప్రయాణమై వెళ్ళిపోయింది. వెళ్ళేముందు రవీంద్రను ఓసారి కలుసుకోవాలని ప్రయత్నించి.ది కాని వీలయ్యిందికాదు. తిరిగి రాకుండానే భర్తకు రోపూరు ట్రాన్సఫరే అవ్వడమూ అటునుంచి అటే ఆ ఊరు వెళ్ళిపోవడమూ జరిగి, రవీంద్రను చూడటం అసలు పడలేదు.

అయిదారేళ్ళు గడిచిపోయాయి కాలగర్భంలో, సావిత్రికిప్పుడు ఇద్దరు పిల్లలు ఒక ప్లస్సూ, ఒక మైనస్సూను ఇక పిల్లలు చాలనుకున్నారు. ఇంట్లో పనిపాటలు ముగించుని ఖాళీగా కూర్చున్నప్పుడు చటుక్కున రవీంద్ర గుర్తు వచ్చేవాడు. అతని మాటలు గుర్తు వచ్చేవి ఇప్పుడు ఎక్కడ వున్నాడో? ఏంచేస్తున్నాడో? బహుశా ఈపాటికి పెళ్ళయ్యే వుంటుంది ఆదర్శాల వేడిలో ఆరోజు ఏదో అన్నా అది నిలబెట్టుకునేంతధైర్యం వుందొద్దూ, చివరకుఅమ్మానాన్నలు చూసి చేసిన సంబంధమే చేసుకుని వుంటాడు. అనుకునేది. ఒక రెండేళ్ళు అతనిపేరు పత్రికల్లోచూసింది. కాని ఇప్పుడు తీరుబడి లేక రాయడం విరమించుకున్నాడేమో, లేదా పేరు మార్చుకుని వ్రాస్తున్నాడో. ఏ సంగతీ ఆమెకు తెలియదు.

వున్నట్టుండి సావిత్రికి తన కజిన్ సిస్టర్ దగ్గరనుంచి ఓఉత్తరం వచ్చింది. ఆ అమ్మాయి బియ్యేవరకూ చదువుకుని ఓ ఆఫీసులో పనిచేస్తున్నది రెండేళ్ళనుంచీ, ఆ ఉత్తరాన్ని ఆత్రంగా చదివిందామె. దానిలో సారాంశం ఏమంటే తను వాళ్ళ ఆఫీసులో పనిచేసే అతన్ని రిజిష్టర్ మారేజి చేసుకొన్నట్టు, కొన్నిరోజుల కలవుమీద అతనూ,

తనూ ఊళ్ళు తిరగాలని నిర్ణయించు కున్నట్లు, మొదటి మకామ్ మీ ఇల్లేను, త్వరలో బయలుదేరి వస్తున్నాము, అంటూ రాసింది ఆ అమ్మాయి.

అప్పటినుంచీ, వాళ్ళిద్దరిరాక కోసం ఎంతో ఆతృతగా ఎదురుచూడసాగింది సావిత్రి. ముఖ్యంగా ఆమెకు, తనకజిన్ సిస్టర్‌ని ఏరికోరి చేసుకున్న ఆ ఆదర్శ యువకుడిని చూడాలని వుంది. తన చెల్లెలి జీవితంలో తిరిగి వసంతం వచ్చేలా చేసిన ఆ యువకుడు ఆమె దృష్టిలో ఎంతో గొప్పవ్యక్తిగా అని పించసాగాడు ; అంత ఉన్నతమైన వ్యక్తిని ఎప్పుడెప్పుడు చూద్దునా అని మనసు తహతహలాడుతున్నది.

ఆ రోజు, భోంచేసి భర్త ఆఫీసుకి పిల్లలు స్కూలుకి వెళ్ళిపోయాక తనూ భోంచేసి వీక్లీ తిరగేస్తూ కూర్చున్న ఆమెకు వీధిలో ఏదో కారు వచ్చి ఆగి నట్లయింది, కాస్సేపటికి 'అక్కా' తలుపుతీయవే 'అనే మాలతి పిలుపు వినిపించి' అరే మాలతివాళ్ళు వచ్చినట్లు న్నారే! అనుకుంటూ ఉత్సాహంగా ఉరుక్కుంటూ వెళ్ళి తలుపుతీసింది.

"ఇంట్లో ఉన్నావుకదా. అమ్మయ్య పరవాలేదు." అంటూ లోపలకొచ్చింది సావిత్రి చెల్లెలు మాలతి.

"మరిదిగారు ఏరీ?" తలవంచి వీధిలోకిచూసిన సావిత్రి, తెల్లగా పొడుగ్గా, నల్లకళ్ళద్దాలతో, నిలువెత్తు మనిషి, కారులోంచి సామాన్లు దింపించు కొస్తుంటే కంగారుగా లోపలికి తప్పు కుంది అక్క, మరీ అంత పొడుగ్గా వున్నాడేం బాబూ అతను అనికూడా అనుకుంది మనసులో.

'ఫలాన రోజున బయలుదేరి వస్తు న్నట్లుగా ఓ ఉత్తరం ముక్క రాసి పారేస్తే ఏంపోయింది అని చెల్లెలిమీద కోప్పడుతూ, వంటగదిలోకి వెళ్ళింది. ఏవేళప్పుడు భోంచేసారో, త్వరగా వండి వడ్డించాలి . అనుకుంటూ.

"అకస్మాత్తుగా వచ్చి మిమ్మల్ని అవస్థపెట్టాలని, ముందు రాయకుండా బయలుదేరి వచ్చాము వదినగారూ" వంట గది గుమ్మంలోకి వచ్చి మాలతి భర్త కళ్ళనున్న జోడు తీసి అంటుంటే ఆ గొంతు ఎప్పుడో ఎక్కడో వినిపించి నట్లుగా తోచి చటుక్కున తిరిగి చూసిన సావిత్రి నిర్ఘాంతపోతూ "రవీంద్ర," అంది తడబడ్తూ.

"ఊఁ నేనే గుర్తున్నానన్నమాట మీకు." గలగల నవ్వేడు అతను. ఆ నవ్వులో చూసారా ఆనాడు మీకిచ్చిన మాట నిలబెట్టుకున్నానా లేదా, ఆదర్శాలు రాతల్లోనేకాదు, చేతల్లోకూడా నిరూ పించుకున్నానా లేదా, అనే భావాలు ఎన్నో తొంగిచూసాయి. సావిత్రి సంతృప్తిగా నవ్వుకుంది. అంత మంచి మనసుగల అతనితో బంధుత్వము కలిసి నందుకు లోలోపల ఎంతయినా ఆనం దించింది.



# ఇలాగే జరిగేడుంటుంది

మల్లాది వెంకట కృష్ణమూర్తి

"చాలా అర్జెంట్ అండి. వందరూపాయలు కావాలి. మా పెద్దమ్మాయికి పరీక్ష ఫీజ్ కట్టాలి. ఇవాళే ఆఖరిరోజు. ఫైన్‌తో కూడా కట్టడానికి." చేతులు నలుపుకుంటూ అడిగాడు గోపీచంద్ తన మిత్రుడిని.

గోపీచంద్ మిత్రుడు వెనక్కి తిరిగి సికింద్రాబాద్ స్టేషన్‌క్లాక్ టవర్‌వైపు చూసాడు. ఉదయం తొమ్మిదిన్నర.

"సారీ అండి. నా దగ్గర నెలాఖరులో అంత డబ్బు వుండదు" అన్నాడు నొచ్చుకున్నట్లుగా.

గోపీచంద్ మొహంలో బాధ క్షణకాలం నాట్యంచేసింది. మొహంమీది భావం గోపీచంద్ మాటల్లోకి దొర్లింది- బాధ.

"ఏడాది చదువూ వృథా అవుతుంది. రెండురోజులనుంచి అనేకమంది దగ్గర ప్రయత్నిస్తున్నాను. నెలాఖరు కాబట్టి దొరకలేదు."

గోపీచంద్ మిత్రుడు మౌనంగా వుండిపోయాడు.

"ప్చ్ ! ప్రాప్తం వుంటే పరీక్ష కెళ్తుంది. బేంక్‌లో చలాన్ కట్టడానికి

అక్కడ సమయం కూడా లేదు. ఆఫీస్‌లో ప్రయత్నించినా దొరకదు."

కండక్టర్ 'టికెట్ ప్లీజ్' అన్నాడు. "సారీ" అన్నాడు గోపీచంద్. నలభై రెండో నంబర్ బస్ స్టాప్‌లో, గోపీచంద్ పక్కన నిలబడివున్న అతని మిత్రుడు అర్ధరూపాయి బిళ్ళ కండక్టర్‌కి పర్సులోంచి తీసిచ్చి 'లిబర్టీ' అన్నాడు.

గోపీచంద్ ఆలోచనలో పడ్డాడు. నలభై రెండో నంబర్ బస్ వచ్చింది. సింగిల్ డెకర్. ఎక్స్‌ప్రెస్ బస్ అది. గోపీచంద్ దిగాల్సిన స్టాప్‌లో ఆగదది.

గోపీచంద్ మిత్రుడు ఆ బస్ ఎక్కాడు, క్యూలోంచి బయటకి వచ్చి, గోపీచంద్‌కి మరోసారి తన 'సారీ' ని చెప్పి.

బస్‌లో ఎక్కి కూర్చుని అనుకున్నాడు గోపీచంద్ మిత్రుడు. 'వందేగా ! దిగి ఇస్తే.'

మళ్ళీ వెంటనే అనుకున్నాడు. 'నా దగ్గరున్నదే నాలుగొందలు. జాక్‌పాట్ ఆడటానికి ఎంతైనా చాలదు. ఆ వంద వీడికి ఇచ్చేస్తే పది కాంబినేషన్స్ మిస్ అవుతాను. నా అదృష్టం ఎలా వుందో, ఏమిటో ! ఇవ్వను.

మళ్ళీ అనిపించింది. 'వెధవ రేసులకి తగలేసే ఐదులు వంద సర్దుబాటు చేస్తే, సంవత్సరం చదువు వృధా కాకుండా వుంటుంది.'

కాని గోపీచంద్ మిత్రుడికి మనసు ఒప్పలేదు, వందరూపాయలు అప్పు ఇవ్వడానికి. ఎటూ నిర్ణయించుకోలేక పోయాడు. ఇంతలో బస్ కదిలింది.

'ఇంకెక్కడయినా సంపాదించు కుంటాడులే' అనుకున్నాడు.

లిబర్టీ బస్‌స్టాప్ దగ్గర దిగాడు గోపీచంద్ మిత్రుడు.

జేబు వెలితిగా వుందనిపించి, అనుమానంగా కుడిచేతివైపున్న పేంట్ జేబులోకి పోనిచ్చాడు చేతిని.

జేబు ఖాళీగా వుంది !

* * *

గోపీచంద్ డబల్ డెకర్ బస్ ఎక్కి, తను దిగాల్సిన స్టాప్‌లో దిగాడు పదీ పదికి. సరాసరి ఆఫీస్‌కి వెళ్ళకుండా ఆఫీస్ దగ్గరేవున్న ఓ మనీ లెండర్ షాప్‌కి వెళ్ళాడు.

అయిష్టంగానే తన వుంగరాన్ని ఆ షాప్‌లోని మార్వాడీకి తాకట్టు పెట్టి, నూట పాతిక తీసుకున్నాడు. ఆఫీస్ కెళ్ళి, అటెండెన్స్ రిజిస్టర్‌లో సంతకం చేసి, ఆఫీసర్ దగ్గర అరగంట పర్మిషన్ తీసుకున్నాడు గోపీచంద్.

బేంక్‌కి వెళ్ళి, చలాన్ కట్టి ఆఫీసుకి బస్‌లో వచ్చాడు ముప్పావుగంట తర్వాత. పదకొండున్నరకి కాఫీ వచ్చింది. కాఫీ తాగి, డబ్బివ్వాలని పర్స్‌కోసం జేబులో చెయ్యిపెట్టాడు గోపీచంద్. -

గుండె ఝల్లుమంది ! జేబు ఖాళీగా వుంది !!

దాదాపుగా ఏడుపు వచ్చినంత పని యింది గోపీచంద్‌కి. బేంక్‌లో డబ్బు కట్టాక బయటకి వచ్చి, ఓ ఇరానీ రెస్టారెంట్‌లో టీ తాగాడు. అప్పటి దాకా వుంది పర్స్ జేబులోనే. బహుశా బస్‌లో ఎవరో కొట్టేసి వుంటారు. లేదా అది బస్‌లో తన జేబులోంచి జారిపోయి వుంటుంది. తనకి తెలియకుండా.

పాతిక రూపాయల పైన కొంత చిల్లర వుంది దాన్లో. ఆ డబ్బు పోయినందుకు ఎంత బాధపడ్డాడో, ఆ డబ్బున్న పర్స్ పోయినందుకు కూడా అంత బాధపడ్డాడు

క్రిందటి నెల ఆఫీస్ పనిమీద ఢిల్లీ వెళ్ళినప్పుడు కొన్నాడా పర్స్‌ని, ఎంతో ముచ్చటపడి. నోట్లు, చిల్లర, ఫోటో కాగితాలు, విజిటింగ్ కార్డ్ మొదలయినవి పెట్టుకోడానికి అనువుగా వుందా పర్స్. పర్స్‌మీద అందంగా తాజ్‌మహల్ బొమ్మకూడా వుంది.

ఎవరైనా కొట్టేసి వుంటే, ఇక అది తిరిగి దొరకదు. జేబులోంచి జారి పోయి వుంటే, ఎవరైనా మంచి వాళ్ళ కళ్ళబడివుంటే, తిరిగి దొరకచ్చని ఆశించాడు. ఆ పర్స్‌లో తన ఆఫీస్ ఎడ్రసు, టెలిఫోన్ నంబర్ వున్నాయి.

మర్నాడు మధ్యాహ్నందాకా ఫోన్ చేయలేదు ఎవరూ, పర్స్ దొరికినట్లుగా. ఇక అది తనకి దొరకటం దుర్లభం అనుకున్నాడు గోపీచంద్

“పోన్లెండి ఆ వందయినా మిగిలింది. పిల్ల చదువు వృథా కాలేదు.” అన్నది గోపీచంద్ భార్య అనునయంగా.

కాని గోపీచంద్ ఎదురు చూడని సంఘటన ఒకటి మర్నాడు రాత్రి జరిగింది.

* * *

మర్నాడు రాత్రి గోపీచంద్ అద్దెకుంటున్న ఇంటాయన గోపీచంద్ ఇంటికి వచ్చాడు.

“మీ పర్స్ పోయిందనుకుంటాను?” అడిగాడు.

అవునన్నట్లుగా తలూపాడు గోపీచంద్ విస్మయంగా.

“ఇంత అజాగ్రత్తయితే ఎలా? వందా, రెండు వందలా? నాలుగు వందల చిల్లర” అన్నాడు.

గోపీచంద్ అయోమయంగా చూసాడు ఆయనవంక.

“మా అమ్మాయికి దొరికింది కాబట్టి సరిపోయింది. మరెవరి కళ్ళబడ్డా దొరికేదికాదు. మీ అదృష్టం బావుందీరోజు.”

అతడు పర్స్‌తీసి గోపీచంద్ చేతిలో వుంచాడాయన.

"ఎక్కడ దొరికింది ?" ఆత్రంగా అడిగాడు గోపీచంద్.

"నాంపల్లి బస్ స్టాండులో నేలమీద పడివుంటే, మా రెండో అమ్మాయి కాలేజీనుంచి వస్తూ చూసింది. నిన్న రాత్రి నాకిచ్చింది దొరికిందని. దీంట్లో మీ ఫోటో, చిరునామా, కాగితాలు చూసి మీవని గుర్తుపట్టాను ఇక నుంచయినా జాగ్రత్తగా వుండండి" మందలింపు ధోరణిలో అన్నాడు ఆ మంచివాడు.

గోపీచంద్ సతీమణి ఇచ్చిన కాఫీ తాగి వెళ్ళిపోయాడాయన.

గోపీచంద్ పర్స్ తెరచి చూసాడు. నిజంగా తనదే అది. పాతిక రూపాయల చిల్లర వుండటానికి బదులు, నాలుగు వందల పాతిక రూపాయల చిల్లర వుంది ! అంటే నాలుగు వందలు—నాలుగు కొత్త వంద రూపాయల నోట్లు ఎక్కువ వున్నాయి ! !

"ఈ డబ్బెక్కడిది ?" అడిగింది గోపీచంద్ కూతురు సంభ్రమంగా.

"నాకు తెలియదు. ఎవరివో అయి వుండాలి" అన్నాడు.

కొన్ని క్షణాలాగి అన్నాడు ఆలోచించి.

"ఇప్పుడు తెలిసింది. బస్‌లో నా పర్స్ ఎవరో కొట్టేసి వుంటాడు. బహుశ ఇంకెవరి పర్స్ అయినా కూడా కొట్టేసి, ఆ పర్స్‌లోని నాలుగువందలు నా పర్స్‌లో వుంచి వుంటాడు. నా పర్స్ ముచ్చటగా వుంది కాబట్టి దీన్ని పారేసి వుండడు. ఆ జేబుదొంగ దురదృష్ట వశాత్తు ఆ పర్స్ నాంపల్లి బస్ స్టాప్‌లో అతని జేబులోంచి జారిపోయి నేలమీద పడిపోయి వుంటుంది. అది సరిగ్గా మన ఇంటాయన కూతురు కళ్ళబడి మనకి చేరింది."

"అవును. అలాగే జరిగి వుంటుంది. మీ ఫోటో, కాగితాలు పర్స్‌లోంచి తీసి పారేయలే దా దొంగ ఎందుకనో" అన్నది గోపీచంద్ భార్య.

"ఇలాగే జరిగి వుంటుంది. అదృష్టం మన పక్షం వుంది కాబట్టే" అన్నాడు గోపీచంద్ ఆనందంగా నవ్వుతూ.






ఆనాడు తిరుమలరావుకు కొంచెం గూడా శాంతి లేదు.

అర్ధరాత్రి సమయం! తిరుమలరావుకు ఇంట్లో నిద్రపట్టక మంచంమీదనుండి లేచి వచ్చి, పెరట్లో జాజిపందిరి ప్రక్కన 'రోలు' మీద కూర్చున్నాడు—కాళ్ళమీద మోచేతు లానించి, అరచేతుల మధ్య తలను పటుకుని.

ఆకాశంలో తెల్లని, చల్లని వెన్నెల జల్లులు కురిపిస్తున్నాడు జాబిల్లి. జాజి పందిరిమీద విరబూసిన పువ్వులు హాయి గాలిపై పరిమళాలు వెదజల్లుతున్నాయి. అవేవీగూడా తిరుమలరావుకు లేశ మాత్రమూ ఉపశమనం కలిగింపజాలక పోతున్నాయి.

అరచేతులమధ్య ఎంతగట్టిగా నొక్కేస్తున్నా బ్రద్దలయేటట్లుగానే ఉంది శిరస్సు. తీవ్రమైన సంఘర్షణలో సతమతమవుతోంది మనస్సు. ఆ మనస్సులో పెనుభూతంలా ఒకప్రశ్న. ఆ ప్రశ్నకు సమాధానమేమిటి? తేలటంలేదు.

గతం, వర్తమానం, భవిష్యత్తు—మూడూ కన్నులముందు నిలబడి వెక్కిరిస్తున్న భ్రాంతి కలుగుతోంది.

గతం——

సంవత్సరం క్రితం జరిగిన సంఘటన ఒకటి పదిరోజుల్నుంచీ ముల్లులా పొడుస్తోంది తనను!

అత్తగారింటినుంచి చుట్టపు చూపుగా వచ్చింది పెద్దకూతురు సరోజ. ఆమె రాకతో ఇంట్లో అందరూ సంతోషించారు. ఆదివారం కావటంవల్ల, ఇంట్లో అందరూ కలిసి మాట్నీషోకు వెళ్ళారు. సాయంకాలం వచ్చేశాక, ఎవరిపనుల్లో వారుండగా, తను డ్రాయింగ్ రూంలో కూర్చుని ఏదో వ్రాసుకుంటూండగా సరోజ తన దగ్గరకు వచ్చింది.

"రామ్మా . కూర్చో."

"మిమ్మల్నొక సహాయం అడగాలని వచ్చాను నాన్నగారూ."

"అడుగమ్మా."

"తప్పకుండా చేస్తారు కదూ."

"పిచ్చిదానా! ప్రతిదీ సందేహమే అయితే ఎలా? నీకు సహాయపడటానికి నేను వెనుకాడతానా? అడుగు ఏమిటది?"

"మీ అల్లుడిగారి చిన్నతమ్ముడు హరి తెలుసుగదా. బి. ఏ. పాసై మూడేళ్ళయింది ఇంతవరకు ఉద్యోగం రాలేదు. ఉద్యోగం రాలేదన్న బాధకు తోడు ఇంత వయసొచ్చి, ఇంకా అన్నగారిమీదే ఆధారపడి బ్రతుకుతున్నాననే దిగులుకూడా అతనిలో ఉన్నట్లుంది. మేం అతణ్ణి బాగానే చూసుకుంటున్నాం. అయినా ఎప్పుడూ తనలో తనే ఏదో మధనపడుతూ బాధపడుతుంటాడు. సరిగ్గా ఇంటిపట్టున ఉండడు. రాత్రుళ్ళు తరచూ భోజనం మానేస్తుంటాడు. తన చేతగాని తనాన్ని పదింతలుగా ఊహించుకుని కుమిలిపోతుంటాడు. దిగులుతో చిక్కి సగమయాడు. అతని పరిస్థితి మేం చూడలేకపోతున్నాం. ఇంకా కొంతకాలం ఇలానే ఉద్యోగం లేకుండా ఉంటే, అసలు ఇల్లు వదలిపెట్టి ఎటైనా వెళ్ళిపోతాడేమోనని మీ అల్లుడుగారు భయపడుతున్నారు——" చెప్పటం ఆపి, తన ముఖంలోకి చూసింది సరోజ.

"చెప్పమ్మా. వింటున్నాను." అన్నాడు తను.

"హరికిప్పుడు ఉద్యోగం కావాలి నాన్నగారూ. మీరైనంత తొందరలో ఉద్యోగం దొరికితేగాని అతడు మళ్ళీ మామూలు మనిషికాడు."

తనలో సన్నగా కల్లోలం మొదలయింది. సరోజ ఏం అడగాలనుకుంటుందో తన ఊహకు అందుతూనే ఉంది. ఆ ఊహనుసైతం భరించలేకపోతున్నాడు తను!

"నాన్నగారూ! ఏమిటి ఆలోచిస్తున్నారు?"

"ఈ విషయాన్ని గురించేనమ్మా."

ఆ మాటల్ని అనుకూలంగా అర్థం చేసుకున్న సరోజ ముఖం వికసించింది.






"నాకు తెలుసు నాన్నగారూ! మీరు నా 'మాట' కాదనరు."

"ఇంతకూ ఆ 'మాటే'మిటో చెప్పు."

"ఇంకా చెప్పటానికేముంది? మీరు ఊహించారనుకుంటాను హరికి ఉద్యోగం కావాలి. మీ ఆఫీసులో ఖాళీలున్నాయట గదా. ఎంప్లాయ్‌మెంట్ ఎక్ఛేంజినుంచి హరికి కాల్ లెటర్ వచ్చింది."

"మంచిదేగదమ్మా"— అంతరంగంలో విజృంభిస్తున్న తుఫానును ప్రయత్నంమీద అణచివేస్తూ, పైకి మామూలుగా, ఏ భావమూ వ్యక్తపరచకుండా అన్నాడు తను — సిగరెట్ తీసి అంటిస్తూ. అప్పటికి తనొక నిర్ణయానికి వచ్చేశాడు.

తన నిర్లక్ష్యవైఖరిని చూచేసరికి సరోజ ముఖం అవమానంతో ఎర్రబడింది. కొంచెం గట్టిగా అన్నది.

"మంచిజరగాలనే నాన్నగారూ నాకోర్కె. ఆ ఉద్యోగం హరికి ఇచ్చేయాలి మీరు."

"అర్హతలు ఉంటే ఇవ్వక తప్పదు గదమ్మా."

రోషంతో తలెగరేసింది సరోజ. "అంతేగాని మీరేం సహాయం చెయ్యనంటారు."

"ఆవేశం వద్దు సరోజా. మామూలుగా ఆలోచించు. నా తత్వమెలాంటిదో నీకు తెలియంది కాదు. అర్హతలు ఉన్నవాళ్ళను కాదని, అర్హతలు లేనివాళ్ళకు ఉద్యోగాలివ్వటం క్లాస్‌వన్ ద్రోహం. ఆఫీసర్నైనందుకు అధికారంతోపాటు బాధ్యతలు కూడా ఉన్నాయి. ఆత్మవంచన చేసుకోమని నీ తండ్రిని బలవంత పెట్టకు."

"ఇంత గడ్డుపరిస్థితుల్లో ఉన్నప్పుడు గూడా, అవకాశం ఉండిగూడా, అదు

కోకపోతే మీ అల్లుడుగారు నన్నెంతగా అసహ్యించుకుంటారో ఆలోచించండి నాన్నా."

"నాకు తెలుసమ్మా. కానీ, నేనేం చేయలేను."

"అంతే? నేనెంత చులకనైపోయినా మీకు ఫర్వాలేదు. నా మనస్సెంత కష్ట పెట్టుకున్నా మీకు బాధలేదు. నా కోసం ఈ మాత్రం సహాయం కూడా చెయ్యరు? ఇంతేనా నేనంటే మీకున్న ప్రేమ?"

"సరోజా!" అరిచాడు తను. "అనవసరంగా నోరు పారేసుకోకు"—ఏదో అనబోయి, అనకుండా తమాయించుకుని సిగిరెట్టు విసిరి నేలకేసి కొట్టి, చరచరా బయటకు వెళ్ళిపోయాడు తను!

మర్నాడు ప్రొద్దున్నే వెళ్ళిపోయింది సరోజ!—

'రోలు' మీదనుండి లేచాడు తిరుమలరావు. విపరీతమైన ఘర్షణతో తల తిరుగుతున్నట్లుగా ఉంది. మెల్లగా అడుగులు వేసుకుంటూ ఇంట్లోకి నడిచాడు. రెండు గ్లాసులు మంచినీళ్ళు త్రాగి, వెళ్ళి మంచంమీద పడుకున్నాడు. మంచం అంపశయ్యలా ఉంది.

తను మొదట్లో చిన్న ఉద్యోగంలో చేరి స్వశక్తితో పైకి వచ్చాడు. చాలా కాలం హెడ్‌క్లర్కుగా పనిచేశాడు. రిటైరు కాబోయేముందు రెండు సంవత్సరాలు మాత్రమే ఆఫీసరుగా చేశాడు.

ఉద్యోగంనుంచి రిటైరై ఏడాదయింది. వచ్చిన ప్రావిడెంట్ ఫండ్‌తో అప్పుడే నాలుగో కూతురు ప్రభావతి పెళ్ళిచేశాడు. ఇప్పుడిక మూడోవాడు కమలాకరం, ఐదో కూతురు ఉమ, మిగిలి ఉన్నారు.

చేతిలో ఉన్న డబ్బంతా కూతురు పెళ్ళికే అయిపోయింది. ఇప్పుడుకుటుంబం గడవటమే చాలా కష్టంగా ఉంది. ఎన్నో బాధలు భరించవలసి వస్తోంది. బాధలు భరిస్తున్నది తనొక్కడేకాదు. నిరుద్యోగిగా మనోవ్యధ ననుభవించే కమలాకరం, ఇరవయ్యేళ్ళు నిండి, ఇంకా అవివాహితగా మిగిలిఉన్న ఉమ, వీళ్ళిద్దర్నీ చూచి కుమిలి కుమిలి రోధించే ఇల్లాలు రుక్మి!

వీళ్ళందరికీ తనేం సమాధానం చెప్పాలి?

మంచంమీదనుండి లేచాడు తిరుమలరావు. కళ్ళు మూసుకోగానే మంటలు రగులుతున్నాయి! దారిద్ర్యం అతి భయంకరమైంది. దానిని ఈ వయస్సులో ఇప్పుడే అనుభవిస్తున్నాడు తిరుమలరావు. ఒకనాడు పరుగెత్తకుండానే పాలు త్రాగిన చోట, ఈనాడు పరుగెత్తి నీళ్ళు త్రాగుదామన్నా లేవు! ఒకనాడు పూలమ్మిన చోట ఈ నాడు అమ్ముకొనటానికి కట్టెపుల్లలు సైతం లేవు!

అసహనంగా గదిలో అటూ ఇటూ పచార్లు చేయసాగాడు తిరుమలరావు.

హృదయంలో దావానలం ప్రజ్వరిల్లుతోంది!

పదిరోజుల క్రితం—

ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసునుండి కాల్ లెటర్ వచ్చింది కమలాకరానికి. తాను పనిచేసి రిటైరైన ఆఫీసులోనే క్లర్కు పోస్టుకొరకు వెకెన్సీ వచ్చిందట!

'కాల్ లెటర్' తీసుకొచ్చి, ఇంట్లో అందరికీ చూపించి, ఆనందం పట్టలేక గంతులేశాడు కమలాకరం. రుక్మిణి సంతోషానికి పట్టుపగ్గాల్లేవు. చాలా కాలం తర్వాత ఇంట్లో మళ్ళీ జీవకళ వచ్చింది.

కానీ, తనకు మాత్రం లేశమాత్రమూ ఆనందం కలగలేదు. బియ్యే పార్టుల వారీ పాసైనవాడికి ఉద్యోగం వస్తుందా? ఇంటర్వ్యూలో సెలక్టవుతాడా?

"మన కష్టాలిక కడతేరాయి నాన్నగారూ," అన్నాడు కమలాకరం తన దగ్గరగావచ్చి.

"అదే జరిగితే ఇంక కావలసిందేముందిరా? కానీ—"

"కానీ—? ఏమిటి నాన్నగారూ? చెప్పండి."

"ఆ ఉద్యోగం మనకు రావొద్దురా!"

కమలాకరం నవ్వి అన్నాడు. "మీకన్నీ అనుమానాలే నాన్నగారూ. మీరు అడగాలేగానీ, వెంకటరత్నంగారు కాదంటారా?"

కష్టై అయ్యాడు తను!

తను ఆఫీసరుగా ఉన్న రోజుల్లో వెంకటరత్నం హెడ్‌క్లర్కు. తనంటే అతనికెంతో గౌరవం. తనను గురువులా భావించేవాడు. తను రిటైరయ్యాక ప్రమోషన్‌మీద ఆఫీసరయ్యాడు.

తనకు కొన్ని ప్రిన్సిపుల్స్ ఉన్నాయి! జీవితంలో ఇంతవరకూ ఆ ప్రిన్సిపుల్స్‌కు లోబడే ప్రవర్తిస్తూ వచ్చాడు. కాలం తనకెన్నో అగ్ని పరీక్షలు పెట్టింది. అన్నింటికీ తట్టుకుని మేరువులా నిలబడ్డాడు. ఈనాడు— ఈనాడు ఓడిపోక తప్పదా?

"ఏమిటి నాన్నగారూ ఆలోచిస్తున్నారు?" తన ముఖంలోని భావాలను చదువుతూ ప్రశ్నించాడు కమల్.

"ఏం—లేదురా." తన కలవరపాటు తనకే వినిపించింది స్పష్టంగా.

"ఉద్యోగంకోసం వెంకటరత్నంగారిని ఎలా అడగాలని ఆలోచిస్తున్నారా?" అనునయంగా అడిగాడు కమలాకరం.

వాడి కంఠంలోని మృదుత్వానికి తను పొంగిపోయి, ఆత్రంగా అన్నాడు. "సరిగ్గా ఊహించావు కమల్! నేనెలాంటివాడినో నీకు తెలియందికాదు. ఇన్నాళ్ళనుండీ నమ్ముకున్న ధర్మాన్ని ఈనాడు నరికివేయలేను. బొందిలో ప్రాణమున్నంతవరకూ మనస్సును చంపుకోలేను. నేనేం చేయలేను. సారీ. ఎక్స్‌ట్రీమ్లీ సారీ!"

"సారీ కాదు నాన్నగారూ. సారో! ఇప్పుడు మన కుటుంబ పరిస్థితి పుల్లావ్ సారో! ఇక్కడ 'సారీ'లకు తావులేదు."

"కమల్! నా మాట—"

"వినను. మీరే ఆలోచించుకుని తేల్చుకోండి. మీ కొడుక్కి ఉద్యోగం వచ్చి, మీ కూతురుకి పెళ్ళియోగం కలిగి, అందరూ హాయిగా బ్రతకాలనుకుంటారో అలాకాక. అందరూ దుర్భరదారిద్ర్యంలో మ్రగ్గుతూ అతిహీనమైన బ్రతుకు బ్రతకాలనుకుంటారో తేల్చుకోండి."— కరకుగా అనేసి, గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు కమలాకరం.

తల పట్టుకుని కుర్చీలో కూలబడ్డాడు తను.

క్షణంలో శరీరాన్ని విపరీతమైన నిస్సత్తువ ఆవహించింది. కన్నులముందు చీకట్లు క్రమ్మినట్లు భ్రాంతి కలిగింది.

ఈ సవాల్‌ను ఏవిధంగా ఎదుర్కోవాలి?

కమల్ వెళ్ళి తానలా అన్నట్లు తల్లితో చెప్పానట్లుంది— రుక్మిణి నెత్తీ నోరూ మొత్తుకుంటూ తన దగ్గరకు వచ్చింది—

ఈ పదిరోజులనుంచీ తనకు అందరూ అనేక రకాలుగా చెప్తున్నారు. తను వింటున్నాడు— అంతర్గతంగా చెలరేగే అలజడిని ప్రయత్నంమీద నిబ్బరించుకుంటూ!

రేపే ఇంటర్వ్యూ.

ఈ రాత్రి పోయి కొద్దిగంటల్లో తెల్లవారుతుంది.

తనేం చేయాలి?

* * *

ఉదయం తొమ్మిది గంటలవుతోంది.

ఇంట్లో అందరూ నిరుత్సాహంగా ఉన్నారు. అందరికీ తిరుమలరావుమీద పట్టలేనంత కోపంగా ఉంది. నోటివరకూ వచ్చిన ముద్ద జారి నేలమీద పడుతున్నదనే గుబులు అందరినీ క్రుంగదీస్తోంది.

ఇంటర్వ్యూకి వెళ్ళవలసిన కమలాకరంలో ఆ ఉత్సాహమేలేదు. నిరాసక్తంగా, నిస్తేజంగా ఉండిపోయాడు.

మానవుడు తన జీవిత పోరాటంలో తనకు సహాయపడటానికి ప్రక్కనుండి ఎవరో వస్తారనీ, ఆ సహాయం వస్తే తాను తప్పకుండా విజయం సాధిస్తాననీ నమ్మకం పెట్టుకోవటమే జరిగితే— తీరా అవసరానికి ఆ సహాయం అందకపోయిందా! ఆ కలవరంలో తన స్వశక్తి మీద కూడా నమ్మకం చచ్చిపోయి నిర్వీర్యుడై పోతాడు.

కమలాకరం ఆ స్థితిలోనే ఉన్నాడు.

"బాబూ! టైమవుతోంది. వెళ్ళవూ?" రుక్మిణి ఉండబట్టలేక అడిగింది.

"వెళ్ళినా వెళ్ళకపోయినా ఒకటే నమ్మా. ఇంతకుముందు ఎన్నిసార్లు వెళ్ళలేదు! ఏం జరిగింది?"

"అలా అంటే ఎట్లారా? ఏ పుట్టలో ఏ పాముందో!"

"ఏదో ఒకపాము ప్రతి పుట్టలోనూ ఉంటుందమ్మా. ఎటొచ్చీ పామును పట్టుకోవటానికి మనదగ్గర 'నాదస్వర' మనేది ఒకటుండాలి. అది లేనప్పుడు పుట్టదగ్గర కెళ్ళటమెందుకూ ?"

అతడికేం సమాధానం చెప్పాలో తోచలేదు రుక్మిణికి. 'ఖర్మ' అని తల కొట్టుకుంటూ ప్రక్కకు వెళ్ళిపోయింది.

ప్రక్క గదిలోంచి అంతా వింటూనే ఉన్నాడు తిరుమలరావు.

ప్రొద్దుటినుండీ అంతా గమనిస్తూనే ఉన్నాడు.

"కమలాకరం ! ఇలారా." కేక వేశాడు తిరుమలరావు.

కమలాకరం వచ్చాడు.

"త్వరగా తయారై ఆఫీసుకు పద. నేనూ వస్తున్నాను. వెంకటరత్నాన్ని కలుస్తాను."

ఆ ఒక్కమాటతో ఆ యింట్లో వాతావరణం మారిపోయింది.

హఠాత్తుగా వసంతం వచ్చేసినట్లయింది.

ఆ మార్పుకు మనస్సోకింత తేలిక పడగా తాను తీసుకున్న నిర్ణయాన్ని మరొకసారి నెమరువేసుకున్నాడు తిరుమలరావు.

"కాలే కడుపుతో ఏ మానవుడూ దేశభక్తుడు కాలేడు !_ఇది జగమెరిగిన సత్యం. ఆకలితో మాడే మనిషికి తక్షణం కావలసింది ఆహారం. అంతే కానీ ధర్మపనాలుకావు. నీతులు, న్యాయాలు, ధర్మాలు, అన్నీకూడా కడుపునిండాక కావలసినవి. ఆకలి తీరాక ఆలోచించవలసినవి. మంచి చేయాలనే ఆశయంతో తనను తాను వంచన చేసుకోవటం అవివేకం.

ఆదర్శాలుండటం మంచిదే. కానీ అవి ఎంతవరకుండాలి ?

'నువ్వు పాపమార్గంలోనే వెళుతున్నావు. సందులు గొందులు తిరగటం నీ ఉద్దేశం కాదు. రాచమార్గంనుండి ప్రక్కలకు దిగగూడదనే నడుస్తున్నావు. నీ ఆశయం గొప్పదే. కానీ ఎదురుగా పులి వస్తుందనుకో. పులిని చంపే శక్తి నీ దగ్గర లేదనుకో. పిక్కబలం చూపి ప్రక్క సందుల్లోకి పరుగెత్తక ఏంచేస్తావోయ్ ప్రియ మిత్రుడా ?'

జీవితం బహు విచిత్రమైనది.

ఎక్కడ, ఎప్పుడు, ఏ క్షణంలో, ఏ పులి గాండ్రిస్తూ ఎదురు వస్తుందో, ఎటునుండి ఏ పాము బుసలుకొడుతూ పైన బడుతుందో ముందుగా తెలీదు. తెలిశాక వెంటనే ఆత్మరక్షణకోసం మార్గం ఆలోచించుకోక తప్పదు."

"తప్పదు!"—అనుకుంటూ ఎందుకో కళ్ళు ఒత్తుకున్నాడు తిరుమలరావు పది గంటల ప్రాంతంలో ఆఫీసుకు చేరుకున్నాడు తిరుమలరావు. అక్కడ ఉద్యోగార్థులు చాలామంది ఉన్నారు. అందరి ముఖాల్లోనూ భవి

ష్యత్తుమీద ఆశ ప్రస్ఫుటంగా గోచరిస్తోంది. కళ్ళల్లో 'నేటి' చీకట్లను పటాపంచలు చేసి కాంతి కిరణాలను 'రేపు' తెస్తుందనే నమ్మకం తొంగిచూస్తోంది! వాళ్ళందర్నీ చూసేసరికి తిరుమలరావుకు తన హృదయాన్నెవరో పిండినట్లయింది.

ఎంతమంది యువకులిలా జీవనాధారంకోసం అల్లాడిపోతున్నారు! ఆ నవ్వే ముఖాలవెనుక ఎన్ని కుటుంబాల కన్నీటి కథలున్నాయి!

మనస్సంచలాన్ని అణచివేస్తూ లోపలికి నడిచాడు తిరుమలరావు.

"లొంగిపోకూడదు. గుండె రాయి చేసుకోవాలి" అనుకున్నాడు.

నమస్కారం చేసిన ఆఫీసుప్యూనుకు ప్రతినమస్కారంచేసి, ఆఫీసరు గదిలోకి నడిచాడు.

నమస్కార ప్రతి నమస్కారాలయాయి.

తిరుమలరావు రాక వెంకటరత్నంకు ఆనందం కలిగించింది.

ప్యూనుచేత కాఫీ తెప్పించాడు వెంకటరత్నం.

తిరుమలరావు ఆరోగ్యాన్ని గురించీ పిల్లల్నిగురించీ మంచిచెడ్డలు విచారించాడు వెంకటరత్నం.

ఏదో చెప్తున్నాడనేగానీ తిరుమలరావు మనస్సు మనసులోలేదు. ఏదో దుస్సహమైన సంచలనం! మోయలేని వేదన! కనుపించని బడబాగ్ని ఆయనలో కల్లోలాన్ని సృజించాయి.

అన్నీ ప్రశ్నలే. వెక్కిరించే ప్రశ్నలు లెక్కలేనన్ని ప్రశ్నలు.

"ఇంతకూ మీరు వచ్చిన పనేమిటో చెప్పారుకారు." అన్నాడు వెంకటరత్నం కాఫీ త్రాగటం ముగిశాక.

ఏదో చెప్పబోయాడు తిరుమలరావు. కానీ, గొంతుకలో ఏదో అడ్డుపడినట్లయి మాట పెగల్లేదు. సూటిగా వెంకటరత్నం ముఖంలోకి చూడలేక తల దించుకున్నాడు గానీ తలదించుకోవటాన్ని సహించలేక వెంటనే తలెత్తి అన్నాడు.

"స్వంత పనిమీద ఈ వైపుకు వచ్చాను. ఎలాను వచ్చానుగదా మిమ్మల్ని కలిసిపోదామని ఇలా వచ్చాను. దట్సాల్. వేరే పనంటూ ఏమీ లే...దు! ఓకె. మళ్ళీ కలుద్దాం."

అనేసి, కన్నుల్లో ఉబుకుతున్న అశ్రువుల్ని వెంకటరత్నంకు చూపించలేక చటుక్కున లేచి, చరచరా బయటకు నడిచాడు తిరుమలరావు.

తిరుమలరావలా హఠాత్తుగా లేచిపోవటం చూచి తెల్లబోయాడు, వెంకటరత్నం.

"అసమర్థుణ్ణి! నేను అ.. స.. మ.. ర్థు.. ణ్ణి!" గొణుక్కున్నాడు తిరుమలరావు ఆఫీసు మెట్లుదిగుతూ.




మర్నాడు రాత్రి మంత్రి కుమార్తె తిరిగి ఇలా కథ కొనసాగించింది.

షేక్ అబ్దల్ కద్దూస్ తెల్ల ఏనుగు మీద తన వెనక హసన్‌ను ఎక్కించుకుని, దాని చెవిలో ఏదో చెప్పాడు. మరుక్షణమే అది గాలిలోకి లేచి. వాయువేగ, మనోవేగాలతో ప్రయాణం చెయ్యసాగింది. అలా వాళ్ళు మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ ప్రయాణం చేసి, ఏడు సంవత్సరాలు పట్టేదూరం గడిచి, నీలి శిఖరాలుగల నీలి పర్వతాన్ని చేరుకున్నారు. ఆ పర్వతం మధ్య ఒక బిలమూ, దానికి అడ్డంగా నీలి ఉక్కు తలుపూ ఉన్నాయి.

వృద్ధుడు తలుపుమీద తట్టగానే ఒక నీలిరంగు నీగ్రో, నీలి ఖడ్గమూ, నీలి డాలూ ధరించి వచ్చాడు. షేక్ ఆ ఆయుధాలను చప్పున లాగేశాడు. వెంటనే నీగ్రో వెనక్కు తగ్గి దారి ఇచ్చాడు. ఇద్దరూ బిలం ప్రవేశించారు.

వాళ్ళు లోపలికి పోగానే నీగ్రో తలుపు మూసేశాడు.

వాళ్ళు ఒక మైలుదూరం కృత్రిమ సొరంగంకుండా నడిచి, రెండు బ్రహ్మాండమైన బంగారు ద్వారాలను చేరుకున్నారు. హసన్‌ను అక్కడే ఉండమని, అబ్దల్ కద్దూస్ ఒక ద్వారం కుండా ఎటో వెళ్ళాడు. ఒక గంట తరవాత ఆయన ఒక నీలి గుర్రాన్ని వెంట తీసుకువచ్చి, హసన్‌ను దాని మీద ఎక్కమన్నాడు. తరవాత ఆయన రెండో ద్వారం తెరిచాడు. కనుచూపు మేరదాకా పైన నీలాకాశమూ, కింద ఆకుపచ్చ మైదానమూ వారి కంట పడ్డాయి.

ఆయన హసన్‌తో, "నాయనా, నీకు ఎదురుగానున్న అసంఖ్యాకమైన ప్రమాదాలకు సిద్ధంగా ఉన్నావా ? లేక ఏడుగురు అక్కలవద్దకు తిరిగి పోవటమే మంచిదంటావా ?" అని అడిగాడు.

"వెయ్యి చావులను ఎదుర్కోవటానికైనా నేను సిద్ధమే. ఈ ఎడబాటు మాత్రం సహించలేను," అన్నాడు హసన్.

"నీకోసం కడవలతో కన్నీరు గార్చే తల్లి లేదా ? ఆమెను ఓదార్చటం మేలేమో ?"

"నేను నా భార్యనూ, బిడ్డలనూ వెంటపెట్టుకునిగాని మా అమ్మదగ్గిరికి వెళ్ళను," అన్నాడు హసన్.

అబ్దల్ కద్దూస్ ఇంకేమీ అనక, అతని చేతికి ఒక ఉత్తరం ఇచ్చాడు.

"అలాగే కానీ, హసన్. అల్లా రక్షణతో బయలుదేరు. ఈ ఉత్తరం తీసుకో. గుర్రాన్ని దాని ఇష్టప్రకారం వెళ్ళనీ. అది నిన్ను ఒక నల్ల పర్వతం వద్దకు చేర్చుతుంది. దాని శిఖరాలు నల్లగా ఉంటాయి. ఈ గుర్రం నిన్ను ఒక నల్లని బిలంవద్ద దించుతుంది. గుర్రాన్ని ఆ బిలంలోకి వెళ్ళనీ. ద్వారం వద్దనే వేచి ఉండే ఒక నల్లని ముసలాడు నల్లని దుస్తులు ధరించి వస్తాడు. వాడి మోకాళ్ళదాకా వేళ్ళాడే తెల్లని గడ్డంతప్ప వాడు ఆపాదమస్తకమూ నల్లగానే ఉంటాడు. వాడి చెయ్యిముద్దు పెట్టుకుని, వాడి బట్ట చెంగు తీసుకుని నీ నెత్తినపెట్టుకుని. వాడికి ఈ ఉత్తరం ఇయ్యి. ఆయనేనా ఏలిక, నా యజమాని. ఆయన తప్ప నీకు సహాయం చెయ్యగలవాడు ప్రపంచంలో మరొకడు లేడు. అందుచేత నువు ఆయనను అన్నివిధాలా మంచి చేసుకుని, ఆయన చెప్పినట్టు అక్షరాలా చెయ్యాలి. అల్లా నిన్ను కాపాడాలి !" అన్నాడు.

హసన్ అబ్దల్ కద్దూస్‌వద్ద సెలవు పుచ్చుకోగానే నీలం గుర్రం బాణం లాగా ఆకాశంలోకి లేచింది. అతను పది రోజుల ప్రయాణం సాగించి, పదేళ్ళలో వెళ్ళినంతదూరం వెళ్ళాడు. చివరకు గుర్రం నల్లకొండల శ్రేణిని చేరు

తున్నది. అవి తూర్పు పడమరలుగా విస్తరించి ఉన్నాయి.

నీలం గుర్రం ఆగగానే అన్నివైపుల నుంచీ నల్లగుర్రాలు వచ్చి, దాన్ని మూసి, దానికేసి రుద్దుకున్నాయి. అవి చాలా ఉండటంచేత తనను ముందుకు వెళ్ళనియ్యవేమోనని హసన్ భయపడ్డాడుగాని, నీలి గుర్రం ముందుకు వెళ్ళి, నల్లని కొండరాళ్ళమధ్య నల్లని బిలాన్ని చేరింది.

హసన్ గుర్రం దిగి, పగ్గాలను జీనుకు కట్టి, దాన్ని బిలంలోకి వెళ్ళిపోనిచ్చాడు. అతను ద్వారంవద్ద ఒక గంటసేపు వేచి ఉన్నాడేమో, ఇంతలో ఒక వయోవృద్ధుడు బయటికి వచ్చాడు. ఆయన నల్లగా ఉండి, నల్లని దుస్తులు ధరించి ఉన్నాడు. ఆయనలో తెల్లగా ఉన్నది గడ్డంమాత్రమే. అది ఆయన నడుము కిందికి పెరిగి ఉన్నది. ఆయనే షేక్ అలీ.

హసన్ ఆయనముందు మోకరించి, ఆయన పాదాలూ, హస్తాలూ ముద్దు పెట్టుకుని, ఆయన చేలాంచలం తన తలమీద కప్పుకున్నాడు. ఆ వృద్ధుడు హసన్ ఇచ్చిన ఉత్తరం తీసుకుని, తిరిగి బిలంలోకి వెళ్ళిపోయాడు.

ఆయన తిరిగి రాడని హసన్ అధైర్యపడుతూండగా, ఆయన ఈసారి తెల్లదుస్తులు ధరించి తిరిగివచ్చి, హసన్‌ను తన వెంట రమ్మని సైగచేసి, బిలంకుండా ఒక నలచదరంగా ఉన్న హాలులోకి తీసుకుపోయాడు. దాని నేల రత్నాలు పరిచి ఉన్నది. హాలు నాలుగు మూలలా తివాసీలమీద నలుగురు వృద్ధులు, నల్లదుస్తులు ధరించి, కూర్చుని ఉన్నారు. ఒక్కొక్కడి సమీపంలోనూ ఎన్నెన్నో లిఖిత గ్రంథాలున్నాయి. ఒక్కొక్కడి ముందూ ఒక్కొక్క బంగారు ధూపపాత్ర సువాసనలు వెదజల్లుతున్నది.

హసన్‌ను లోపలికి తెచ్చిన షేక్ అలీని చూడగానే హాలులో అందరూ లేచి నిలబడి, హాలుమధ్య ఆయన చుట్టూ కూర్చున్నారు. హసన్‌ను తన కథ చెప్పమని షేక్ అలీ అడిగాడు. హసన్ తన కథ ఆరంభంనుంచీ చెబుతూంటే, వృద్ధులు మౌనంగా అంతా విని, చివరకు, "ఈ యువకుడు సానుభూతి చూపదగినవాడు ! భర్తగానూ, తండ్రిగానూ కూడా ఇతనికి అన్యాయం జరిగింది. అతనికి భార్యా, బిడ్డలూ లభించేటందుకు మనం సహాయం చెయ్యగలగవచ్చు," అన్నారు.

షేక్ అలీ వారితో," సోదరులారా ! అది తేలికకాదు. వక్-వక్ దీవులకు పోవటం ఎంత కష్టమో మీకు తెలుసు. తిరిగి రావటం మరింత కష్టం. ఆ దీవులలో రాజునూ, ఆయన కుమార్తెలనూ రక్షించే భూతకి కన్యలను సమీపించటం దుస్సాధ్యం. అలాటప్పుడు ఈయువకుడు

కోవడానికి సమస్యాన్ని చేరుకోవటం ఎలా ?" అన్నాడు

"నిజమే, తండ్రీ. కాని మన సోదరుడైన అబ్దుల్ కద్దూస్ ప్రత్యేకంగా ఈ కుర్రవాణ్ణి శిఫార్సు చేసినప్పుడు మనం ఇతనికి సహాయం పడక తప్పదు," అన్నారు మిగిలిన వృద్ధులు.

హసన్ షేక్ అలీ పాదాలమీదపడి, తనకు తన భార్యనూ, పిల్లలనూ ఇప్పించమని ప్రాధేయపడ్డాడు.

"తన ప్రాణాలపట్ల ఇంత నిర్లక్ష్యం గలవాణ్ణి నేను ఎక్కడా చూడలేదు. అతని కోరిక అతని కళ్ళు కప్పి, అందులోని ప్రమాదాన్ని చూడనియ్యకుండా ఉన్నది. కాని నా చేతనైన సహాయం చెయ్యటానికి నాకేమీ అభ్యంతరంలేదు" అని షేక్ అలీ దీర్ఘంగా ఆలోచించి, "ముందు నీకు ప్రమాదంనుంచి రక్షణ కలిగేటట్టు చూడాలి ;" అంటూ తన గడ్డంనుంచి కొన్ని వెంట్రుకలు తీసి హసన్‌కు ఇస్తూ.

"నీకు ప్రమాదం ఎదురైనప్పుడు ఒక వెంట్రుక కాల్చావంటే, మరుక్షణమే నేను నీ వెంట ఉంటాను," అన్నాడు.

తరవాత అయన పైకప్పుకేసి తల ఎత్తిచూసి, ఎవరినో పిలుస్తున్నట్టుగా చప్పట్లు చరిచాడు. వెంటనే కప్పునుంచి ఒక భూతం దిగివచ్చి, ఆయన ముందు నిలిచింది.

"నీ పేరేమిటి ?" అని షేక్ అలీ భూతాన్ని అడిగాడు.

"నా పేరు దానష్, వక్తష్ కొడుకును, మీ బానిసను," అన్నది భూతం.

అలీ ఆ భూతం చెవిలో రహస్యంగా ఏదో చెప్పి, హసన్‌కేసి తిరిగి, "నాయనా, ఈ భూతం వీపుమీద కూర్చుని తెల్ల కర్పూర ద్వీపందాకా వెళ్ళు. వీడు అంతవరకే పోగలడు. కర్పూర మైదానంమీదుగా నువు ఒంటరిగా నడిచి వెళ్ళాలి. ఆ మైదానం దాటినాక వక్-వక్ దీవులు ఎదురుగా కనిపిస్తాయి. ఆ తరవాత అల్లా కటాక్షం;" అన్నాడు.

హసన్ షేక్ ఆలీ చెయ్యి ముద్దు పెట్టుకుని, అందరికీ కృతజ్ఞతాపూర్వకంగా వీడ్కోలు చెప్పి, దానష్ భూతం భుజస్కంధంమీద ఎక్కి కూర్చున్నాడు. భూతం కప్పుగుండా ఆకాశంలోకి ఎగిరి, మేఘమండలంమీదుగా, తెల్లకర్పూరపు మైదానంవద్ద చల్లగా దించింది.

హసన్ మైదానంమీదుగా నడుస్తూ, ఆ కర్పూరపు ఎడారి మధ్యలో చాలా దూరాన డేరాలాటిది ఒకటి చూశాడు. దాన్ని చేరబోయేటప్పుడు గడ్డిలో ఏదో కాలికితగిలి అతను పడిపోయాడు. అతని కాలికి తగిలినది ఒక మహాకాయుడి తెల్లని శరీరం. అతనికి డేరాలాగా కనిపించినది ఆ మహాకాయుడి చెవి.

ఆ రాక్షసుడు, నిద్రాభంగమై, భయంకరంగా అరుస్తూ, కోపావేశంతో ఒళ్ళు పెంచి, భయంతో గుడ్లు వెళ్ళ బెట్టిన హసన్‌ను మెడపట్టుకుని పైకెత్తాడు. హసన్‌ను వాడు నేలకేసి కొట్టబోతూండగా, హసన్ పెనగులాడుతూ, "ఎవరూ రక్షించేవారు లేరా? రాక్షసుడా, కనికరించు," అని అరిచాడు.

రాక్షసుడు ఈ మాటలు విని, "ఈ పిట్ట బాగానే పాడుతుందే! దీన్ని మా రాజుకు చూపించాలి," అనుకుని, హసన్ కాలును సుతారంగా తన వేళ్ళమధ్య పట్టుకుని, ఒక దట్టమైన అరణ్యంగుండా ఖాళీప్రదేశం ఉండేచోటికి వెళ్ళాడు. రాక్షసుల రాజు అక్కడ ఒక గుట్టమీద కూర్చుని ఉన్నాడు.

హసన్‌ను పట్టుకున్నవాడు, "దొరా, ఈ పిట్టను చూశావా? మహా చిత్రంగా కూస్తుంది," అని హసన్ ముక్కుమీద పొడుస్తూ, "పాడవే, పిట్టా! పాడు!" అన్నాడు.

వాడి భాష అర్థంకాని హసన్ తన ఆఖరు ఘడియ సమీపించిందనుకుని, "నన్ను రక్షించేవారు లేరా?" అని కేకలు పెట్టాడు.

రాక్షసరాజు పరమానందంచెంది, "దీన్ని తీసుకుపోయి, వెంటనే నా కూతురికి ఇయ్యి. దీన్ని ఒక పంజరంలో పెట్టి, అమ్మాయి మంచం దగ్గిరగా వేళ్ళాడగట్టు. దీని పాట విని అమ్మాయి ఆనందిస్తుంది." అన్నాడు రాక్షసుడితో.

రాక్షసుడు ఒక పెద్ద పంజరంచేసి, అందులో హసన్ తినటానికీ, తాగటానికీ పాత్రలు ఏర్పాటుచేసి, హసన్‌ను అందులోపెట్టి రాక్షసరాజు కూతురు పక్కకు ఎదురుగా వేళ్ళాడదీశాడు.

రాక్షసరాజు కూతురు హసన్‌ను చూసి ముచ్చటపడి, అతన్ని రకరకాలుగా ముద్దుచేసి, మచ్చికచేసుకునే ప్రయత్నాలు చేసింది. ఆమె మాటలేవీ అర్థంకాకపోయినా, ఆమె తనకు ద్రోహంచేసే ధోరణిలోలేదని గ్రహించి, ఆమె మనసు కరగగలందులకు ముక్కి, మూలగసాగాడు. రాక్షసరాజు కూతురు ఆ ధ్వనులు విని పాటలనుకున్నది రాను రాను ఆ అమ్మాయి పంచప్రాణాలూ ఆ పిట్టమీదే ఉండసాగాయి. అంత చిన్నప్రాణికి తన హృదయం అర్థమయేటట్టు చేయడం ఎలాగో ఆమెకు తోచలేదు. అతనిమటుకు అతను కూడా అంత పెద్ద శరీరంగల ఆ పిల్ల శరీరం మూలంగా ఏ క్షణాన ఏమైనా జరగవచ్చునని అతను భయపడ్డాడు.

అతని దఫ్పూ, వెంట్రుకల కట్టా అతని విమోచనానికి ఉపయోగపడేవేమోగాని, రాక్షసరాజు కూతురు వాటిని తీసి దాచింది. ఒకనాడు ఆమె

ఏమరుపాటుగా ఉన్న సమయంలో అతను ఆమెనుంచి పారిపోయి, వెంట్రుకలను తీసుకుని, షేక్ అలీని స్మరిస్తూ ఒక వెంట్రుక కాల్చాడు.

మరుక్షణమే ఆ వృద్ధుడు నల్లి దుస్తులు ధరించి ప్రత్యక్షమై "ఏం కావాలి, హసన్?" అని అడిగాడు.

"నీకు పుణ్యం ఉంటుంది, గట్టిగా మాట్లాడకండి. ఆ రాక్షసి నిద్ర లేస్తుంది. లేచిందంటే నన్ను పంజరంలో బంధించేస్తుంది," అన్నాడు, హసన్.

వృద్ధుడు హసన్ చెయ్యిపట్టుకుని, రాజభవనంనుంచి అదృశ్యంగా బయటికి తీసుకుపోయాడు. తరవాత హసన్ ఆయనతో తన పాట్లు చెప్పుకున్నాడు.

"నేను ముందే చెప్పాను. అప్పుడే ఏమయింది. ఆవగింజలో అరభాగం కాలేదు. ఇప్పటికైనా మించిపోలేదు. నీ ప్రయత్నం మానుకో. వక్-వక్ దీవులలో నా వెంట్రుకల ప్రభావం ఏమీ పారదు, తెలుసుకో. నీకు నీవే దిక్కవు తావు."

"ఆరు నూరయేది. నేను నా భార్యనూ, బిడ్డలనూ కలుసుకోవాలి. అంతగా అపాయంవస్తే, ఇబ్రాహీంగాడి దప్పున్నది," అన్నాడు హసన్.

"వక్-వక్ దీవులలో ఆ దప్పుకూడా ఎందుకూ పనికిరాదు."

"పదేళ్ళు బతకాలిసినవాడు తొమ్మిదేళ్ళకే చావడు. నా చావు ఆ దీవులలోనే రాసిపెట్టి ఉంటే అలాగే జరగనియ్యండి. మీరుమాత్రం దయచేసి నేను ఎటు వెళ్ళాలో చెప్పండి," అన్నాడు హసన్.

వృద్ధుడు అతని చెయ్యిపట్టుకుని, కళ్ళు మూసి తెరవమన్నాడు. హసన్ కళ్ళు తెరిచేసరికి, పక్కన వృద్ధుడు లేడు, కర్పూరద్వీపం లేదు; అతను ఒక దీవి అంచున నిలబడి ఉన్నాడు. సముద్రతీరం నిండా రంగురంగుల రత్నాలున్నాయి.

అతను గట్టిగా చుట్టూ కలయ చూశాడో లేదో, అతనిచుట్టూ తెల్లటి పక్షులు గుంపులు గుంపులుగా, "వక్-వక్" అని అరుస్తూ మూగాయి. ఆ అరుపులనుబట్టి తాను గమ్యస్థానం చేరినట్టు హసన్ గ్రహించాడు. ఆ పక్షులు అతన్ని సముద్రంలోకి నెట్టేసే లోపుగా, అతను సమీపంలోనే ఒక కుటీరం చూసి, అందులోకి దూరిపోయాడు.

మంత్రి కుమార్తె తూర్పు తెల్లవారుతూండటం గమనించి మౌనం దాల్చింది.






చిన్నారావు ఆఫీసులో ఫైల్సు చాటు చేసుకుని స్వంత లెక్కలేవో వేసుకుంటున్నాడు. అతని తలమీద ఫాను ఈడుస్తున్నట్టుగానో, ఏడుస్తున్నట్టుగానో గరగరలాడుతూ తిరుగుతోంది నిరుద్యోగులకు ఇంద్రభవనంలాగానూ, చిరుద్యోగులకు యమసదనంలాగానూ కనిపించే ఆఫీసు భవనంలో తానున్న ఆ గది అతని కిప్పుడు యిరుగ్గా ఇబ్బందిగా ఉంది. అతని చేతి వాచీ పని చెయ్యటంలేదు. టైమెంత అయి ఉంటుందో? చిన్నారావుకి మనసంతా చికాగ్గా ఉంది. పేరుకుపోయిన ఫైల్సు అతనికి భయాన్ని కలిగిస్తున్నాయి. పక్కసీట్లోకి చూసాడు అందమైన నాగరత్నం షోగ్గా కూర్చుంది. ఆమె చేతి వ్రేళ్ళు టైపుమిషన్ కీబోర్డుమీద మెరుపు తీగెల్లా కదులుతున్నాయి. "వాటే ప్రెటీ గళ్!" అనుకున్నాడు చిన్నారావు. అతని కా సమయంలో

చప్పుడు భార్య అనసూయ గుర్తు కొచ్చింది.

పిల్లల డబ్బులకోసం చొక్కా జేబులు తడిమే ఆమె చేతి వ్రేళ్లు, మొద్దుల్లాగా, అతనికి గుర్తొచ్చి చిరాగ్గా నిట్టూర్చాడు.

సాగరత్నం అతనివేపు నవ్వుతూ చూసి, "ఏమిటి చూస్తున్నారు రావు గారూ ?" అంది.

"అబ్బే...టైము ... నా వాచీ ఆగి పోయింది ..." నంగిగా అన్నాడు చిన్నారావు. "మూడూ ఇరవై అయిం దండీ."

"థాంక్స్." వాచీ దిద్దుకున్నాడు చిన్నారావు. తిరిగి తన లెక్కల గొడవలో పడ్డాడు. ఆ రోజు జీతాల రోజు. జీతం తీసుకోడానికి యింకా సేపట్లో అతనికి పిలుపొస్తుంది. అన్ని రకాల కోతలూ పోగా చేతికి అందేవి రెండువందల తొంభై రూపాయలు. తను చేసిన అప్పులు తీర్చడానికీ, తన ఖర్చులకీ అవెలాగూ సరిపోవు. ఎవరి బాకీలు తీర్చాలో, ఎవరికి వాయిదా పెట్టాలో ఆలోచిస్తున్నా డతను. వ్రాయడం, కొట్టెయ్యడం, మళ్ళీ వ్రాయటం ... చిన్నారావుకి ఆ జాబితా ఒకంతకి తెమిలేలా తోచలేదు అతనికి జీతంమీద, జీవితంమీద కూడా కోపం ముంచుకు వస్తోంది.

ఎర్ర సిరా పెన్ను తీసి తను వ్రాసిన దానిమీద అడ్డంగా ఓ గీత గీసి కొట్టేసాడు.

అలా చేసాక పెన్ను టేబిలుమీద పెట్టి మెటికలు విరుచుకుని ఆలోచిం చాడు. వెంటనే పెన్ను తీసి ఆ క్రిందన ఓ వాక్యం వ్రాసాడు : మిత్రులతో పార్టీకి నలభై రూపాయలు...

చిన్నారావు గుండె ఝల్లుమంది ! అతని చేతన స్తంభించిపోయిన ట్లయింది. పెదిమలు తడి చేసుకున్నాడు. నలభై రూపాయలు ! ఈ జీతంలోంచి అంత మొత్తం పార్టీకోసం ఖర్చు చేసెయ్యడమే ?

కాని...కాని తప్పదు ... ఎప్పుడూ వాళ్ళూ వీళ్ళూ యిచ్చే పార్టీలలో తేరగా పాల్గొని మజా చెయ్యడమేకాని తనెప్పు డయినా ఒక్క పైసా ఖర్చు చేసాడూ ? ఏం బాగుంటుంది ! అప్పటికీ ఆ రంగనాథం అక్కసు పట్టలేక అనేసాడు కూడా ! "ఈసారి పార్టీ మన చిన్నా రావుగా రిస్తారు ... ఏమంటారు రావు గారూ ! ఓ. కె ?"

మండుతున్న గొంతుని చేత్తో రాసు కుని వేయించిన జీడిపప్పు నవుల్తూ ఆ ఉత్సాహంలో "ఓ యస్ దాన్దేముంది !" అనేసాడు తను. ఛ ... ఎంత నాసి రకంగా చూసినా కనీసం నలభై రూపాయలయినా ఈ సాయంత్రం ఖర్చు చేయాలి తను ... గుట్టుచప్పుడు కాకుండా ఏ సినిమాకైనా చెక్కేస్తేనో? ఛ...ఎంత అప్రతిష్ఠ ! అంతా ఏమను కుంటారు !... వెధవ ... డర్టీ డెవిల్

ఆ రంగనాథంగాడు తనని ఛాలెంజ్ చెయ్యడానికే అలా అన్నాడు. వాడి దగ్గర తను చులకనై పోకూడదు. ఎంత ఖర్చయినా సరే వెనుదియ్య కూడదు...

లెక్కలు వేసిన కాగితాన్ని నలిపి ఉండగా చుట్టి చిత్తుబుట్టలో పారేసాడు.

"సార్."

తలెత్తి చూసాడు.

"బాస్ రమ్మంటున్నారు సార్."

చిన్నారావు గుండెల్లో రైళ్లు.

"పద ... పద ... " సీట్లోంచి లేచాడు. "నమస్తే సార్."

"యస్ ... యస్ ... ఆఁ చూడు చిన్నారావ్ ... మా అమ్మాయి సునీత లేదూ, రేపు టెన్త్‌ని తోటపల్లి టెంపుల్‌లో అమ్మాయి మారేజ్ చేస్తున్నాం.మోయ్ ... ఇదిగో వెడ్డింగు కార్డు ... మీరంతా సహకరించాలి సుమా !"

చిన్నారావు వినయంగా కార్డు అందుకున్నాడు. ముఖానికి నవ్వు పులుముకుని "అమ్మమ్మ ! ఎంత మాట సార్ .. మా యింట్లో కార్యంలాగా పని చెయ్యమూ ! సంతోషం సార్" అన్నాడు.

బాస్ దగ్గరనుంచి తిరిగి తన సీట్లోకి వచ్చేడు చిన్నారావు. ఆఫీసరు గారమ్మాయి పెళ్ళికి ఎంత కటింగవుతుందో ? ! అతని మనసు బెంగగా పీకుతోంది. పులిమీద పుట్రలాగా ఈ ఖర్చొకటి యీ నెలే వచ్చి మీదపడాలా! చిన్నారావుకి అసహనంగా ఉంది. తన కోపం ఎవరినీ ఏమీ చెయ్యలేదని తెలుసు కనుక దిగులుగా నిట్టూర్పు విడిచాడు.

ఆ తరువాత అతను జీతం అందుకున్నప్పుడు స్టాఫ్ సెక్రటరీ వచ్చి "బాస్ వెడ్డింగు యిన్విటేషన్ యిచ్చారు కదూ రావుగారూ! మన స్టాఫంతా కలిసి మంచి ప్రజంటేషన్ నివ్వాలి అందుకని ఒక్కొక్కరి దగ్గరా ఇరవై రూపాయలు కలెక్ట్ చేస్తున్నాం..." అని చల్లగా చెప్పాడు.

చిన్నారావు వంటిమీద కొరడాతో ఛళ్ మనిపించినట్లయింది. ఎదురుతిరుగుతున్న మనసుని అదుపులోకి తెచ్చుకునేందుకు ప్రయత్నిస్తూ రెండు పదులు తీసి అతని చేతిలో ఉంచాడు. ఆ తరువాత విసురుగా ఆ గదిలోంచి బయటపడ్డాడు.

## 2

అప్పులవాళ్ళకి ముఖం చాటేసి అడ్డదార్లు తొక్కుతూ దీపాలు పెట్టే వేళకి యిల్లు చేరాడు చిన్నారావు.

చొక్కా తీసి చిలక కొయ్యకి తగిలించాడు. పెరట్లో కెళ్ళి సబ్బుతో ముఖం కడుక్కున్నాడు.

ఇవాళ ఎలాగయినా మిత్రులకి తను పార్టీ చేసి తీరాలి ఇవాళ చెయ్యలేక

పోతే మళ్ళీ మొదటి తేదీవరకూ తన చేతిలో ఒక్క పైసా ఉండదు...

ఆఫీసులో కుర్రకారంతటికీ వయసులో తనే పెద్ద. మొదట్లో తనేమిటో తన పనేమిటో అని ఉండేవాడు. కాని ఎవరితోనూ మెలగక అలా ఒంటరిగా దర్గా ఉండటం తనకీ కష్టంగానే ఉండేది.

రాఘవరావు, మూర్తి, రంగనాథం, వెంకటచయనులు వీళ్ళంతా సరదాగా నవ్వుతూ కులాసాగా తిరుగుతూ ఉంటే తనొక్కడే కట్టి పడేసినట్లుండటం తనకీ చిరాగ్గానే ఉంది. ముఖ్యంగా నాగరత్నం జాయినయేక వాళ్ళ ఉత్సాహం మరింత ఎక్కువయింది. వాళ్ళందరూ ఒకటిగా సరదాగా ఉంటే తనుమాత్రం గోడకి కొట్టిన మేకులా స్తబ్దుగా ఉండిపోవటం చాలా యిబ్బందిగా ఉండేది.

నెమ్మదిగా వాళ్ళతో కలిసి తిరగటం మొదలుపెట్టాడు. వాళ్ళతో కలసి సినిమాలు చూడటం, షికార్లు చెయ్యడం ప్రారంభించాడు.

చివరికి ఓమారు వాళ్ళతో మొదటి సారిగా పార్టీలో గొంతు తడుపుకున్నప్పుడు అసహ్యంగా, క్రొత్తగా అదో రకంగా తోచింది...

వ్యసనం ప్రారంభమవడం అంటూ జరిగితే ఎంత ప్రమాదమో తెలుసుకో లేకపోయాడు. వాళ్ళెవరికీ డబ్బు యిబ్బందులు ఉన్నట్టే తోచదు. ధారాళంగా ఖర్చుపెడుతూ ఉంటారు. చిన్నారావుకి వాళ్ళ పార్టీలలో పాల్గొనడం ఒక సరదాగా ప్రారంభమై అరికట్టలేని వ్యసనంగా పరిణమించింది...

ముఖం కడుక్కొని, తువ్వాలుతో తుడుచుకుంటూ గదిలోకి వచ్చిన చిన్నారావు దృష్టి తన జేబులు సవరిస్తున్న భార్యమీద పడింది...

"ఏమిటే ... ఏమిటాపని ?" అని కసిరాడు

అతని భార్య ఇలాంటి గర్జనలకి భయపడటం ఎప్పుడో మానేసింది.

"మీ షికార్లకీ, సినిమాలకీ వచ్చిన జీతమంతా తగలెయ్యకుండా జాగ్రత్త పడదామని ... " అంటూ ఓ చురక అంటించింది.

"నోర్మూయ్ ... నేను దుబారా చేస్తున్నా ననా నీ ఉద్దేశం ?" చిన్నారావు చిందులువేస్తూ అరిచాడు.

"లేదు...లేదు... ఈ కొంపకోసమే అన్నీ చేస్తున్నారు కదూ ! ఛీ... సిగ్గు వెయ్యటంలేదూ మీకు ? ఇంట్లో ఎదిగిన ఆడపిల్ల ఉందన్న సంగతి మీ కెప్పుడయినా పట్టిందా ? చెట్టంత కొడుకు అదుపు తప్పి చిల్లర తిరుగుళ్ళు తిరుగుతూ ఉంటే పట్టించుకున్నారూ ! ఆ చంటి వెధవకి అక్షరం ముక్కయినా రాక చెడిపోతూ ఉంటే వాడ్ని దగ్గరకు పిలిచి ఓసారయినా మందలించిన




పాపాన పోయారూ ? కొంపెలా గడుస్తుందన్న ఆలోచనయినా మీకుందా ? ఈ నెల మరింక నేను వాళ్ళదగ్గరా వీళ్ళదగ్గరా అప్పులు తేలేను ... ఏం చేసుకుంటారో మీ యిష్టం..." అనసూయ కళ్ళవెంట నీళ్లు దుఃఖంతో ఉబికి వస్తున్నాయి.

భార్య కన్నీళ్ళు చూసి చిన్నారావు కొంచెం చలించినా, తను చెయ్యవలసిన పార్టీ సంగతి గుర్తుకు రాగానే తిరిగి శివమెత్తిపోయాడు.

"ఆపవే, వెధవరాగాలు ... ఎందుకలా పెదబొబ్బలు పెడ్తావ్ ? ఏదీ అందులోంచి యాభై రూపాయలిలాతే— తక్కిందాంతో యింటి ఖర్చులు చూసుకో" అని జీతంలోంచి ఐదుపదులు

కొని తీసుకుని తక్కినవి భార్య చేతిలో ఉంచాడు

"నా నెత్తిలా ఉంది – ఈ డబ్బులు ఏ మూలకి సరిపోతాయండీ – పాల వాడికి రెండొందలివ్వాలి – కిరాణా కొట్టువాడికి క్రితంనెల బియ్యం డబ్బులు యింకా యివ్వనేలేదు — వాడింక మరొక్కపైసా అరువియ్యడు...ఇంట్లో దినుసులన్నీ నిండుకున్నాయి..."

"అయితే నన్నేం చెయ్యమంటావ్ ? ఏట్లోపడి చావమంటావా ?" తన మాటలు తనకే అసహ్యంగానూ, వికృతంగానూ తోచేయి చిన్నారావుకి. ఎంత బాధ్యతారహితంగా అనగలిగేడు తను! కాని ... ఆ సత్యాన్ని అంగీకరించ గలిగే ధైర్యం చిన్నారావులో యిప్పుడు లేదు.

బాధ్యతలనుంచి, బరువులనుంచి, బెంగలనుంచి, ఆ యింట్లోంచి–ఎక్కడి కయినా వెంటనే పారిపోవాలనిపిస్తోం దతనికి. ఒక పెద్ద అబద్ధం ఊబిలోకి– కమ్మని కలలోకి–నిషా ప్రపంచంలోకి — పరిగెత్తి పారిపోయి, అది ఊపి రాడ నివ్వని ఊబికావచ్చు కాని అందులో కూరుకు పోవాలనిపిస్తోందతనికి...

తనని చుట్టుముట్టి బుసలు విడుస్తున్న ఆలోచనల పాముల దాడికి తట్టుకోలేక పోయాడతను

చెప్పులు తొడుక్కుని, జుత్తు చేత్తో సవరించుకుని, వీధిలోకి వచ్చి పడ్డాడు. అతని జేబులో యిప్పుడు యాభై రూపాయలున్నాయి. పైన కొంచెం చిల్లర కూడా ఉంది కిళ్ళీ కొట్లో సోడా త్రాగి వక్కపొడి నముల్తూ సిగరెట్ వెలిగించాడు.

ఇప్పుడు మొదట రాఘవరావు దగ్గరికి వెళ్ళాలి అక్కడికే తతిమ్మా ముగ్గురూ వస్తారు.

'ఇవాళ పార్టీ ఖర్చు తానే భరిస్తా' నని గర్వంగా చెప్పాలి. అప్పుడు వాళ్ళ ముఖాలలో ఆశ్చర్యం చూడాలి. ముఖ్యంగా రంగనాధం — ఆ వెధవ — వాడి ఫీలింగ్స్ చూడాలి ... వాడ్నివాళ చిత్తుచేసెయ్యాలి...

ఆలోచిస్తూ నడుస్తూన్న చిన్నారావు కాళ్ళు హఠాత్తుగా ఆగిపోయాయి. ఉద్రిక్తతతో అతని రక్తం తిరగబడింది. పళ్ళు గిట్టకరచుకుని చూసాడు.

ఎదురుగా కూతురు నిర్మల– రాఘవరావులు ! నవ్వుతూ, కబుర్లు చెప్పుకుంటూ– ప్రపంచాన్నే లెక్కచేయనంత ధీమాతో ఒకరిపై ఒకరు ఒరిగిపోతూ–

బిగించిపట్టిన పిడికిలిలో చిన్నారావు అరచెయ్యి చెమటతో ముద్దయిపోతోంది.

తండ్రిని ఆ సమయంలో చూసి నిర్మల భయంతో చిన్నగా వణికింది. రాఘవరావు చలించినా, నిభాయించుకున్నాడు. విష్ చేసాడు "హల్లో రావుగారూ ! మీ యింటికే వస్తున్నాను – యివాళ పార్టీకి రారూ ?" అని.

చిన్నారావు బదులు చెప్పలేదు.

రాఘవరావు నవ్వి, "మీ యింటికి వస్తూంటే నిర్మల సరస్వతీటాకీస్ జంక్షన్‌లో కలిసిందండీ —మేటి నీ చూసి వస్తోందిట —" తాను కలసి రావటానికి సంజాయిషీ యిచ్చుకున్నట్టుగా అన్నాడు రాఘవరావు.

చిన్నారావు అతనికి జవాబివ్వకుండా "పదండి" అంటూ యింటివేపు దారితీసాడు. ముగ్గురూ యిల్లు చేరారు.

కాఫీ త్రాగేక "పదండి రావుగారూ" అంటూ లేచాడు రాఘవరావు. "మీరు పదండి – నే నొస్తాను" అని అతడిని పంపేశాడు చిన్నారావు.

"తప్పకుండా వస్తారుగా? మేమంతా మీకోసం చూస్తుంటాం" అని నవ్వి వెళ్ళిపోయాడు రాఘవరావు.

రాఘవరావు వెళ్ళిపోయాక చిన్నారావు ఉగ్రుడై నిర్మలవేపు చూస్తూ "ఆ వెధవతో నీకు కబుర్లేమిటే" అని గద్దించి అడిగాడు.

నిర్మల జవాబుగా కళ్ళవెంట నీళ్ళు కుక్కుకుంది. అనసూయ వచ్చింది, "దానిమీద అలా అరుస్తూ విరుచుకు పడతారెందుకండీ ?" అంటూ.

"మా ఆఫీసులో పనిచేసే రాఘవ లేడూ—మనింటికి వచ్చిపోతూ ఉంటాడు —వాడితో కలసి వస్తోంది ... ఆ మీది మీదికి పడి నడుస్తూ కబుర్లేమిటి దీనికి వాడితో..."

"చాల్లెండి—కాస్త గొంతుతగ్గించండి— ఇంతకీ అదేం నేరం చేసిందని అలా గొంతు చించుకుంటారు ? మీ స్నేహితుడే కదా అని కాస్త చనువుగా అతనితో మాట్లాడితే అలా దానిమీద మండిపడతా రేమిటండీ – వయసొచ్చిన పిల్లని అలా నిలవేస్తారేమిటి మరి" అంది కోపంగా.

చిన్నారావు భార్యమీద విరుచుకు పడ్డాడు.

"వయసొచ్చిన పిల్ల కనుకనే అడుగుతున్నానే బుద్ధిలేనిదానా ! వాడి సంగతి నీకు తెలీదు. వాడికి లేని వ్యసనం లేదు ...ఆఫీసు టైపిస్టు చుట్టూ అస్తమానూ తిరుగుతూ ఉంటాడు – రోగ్ – ఇంటికొచ్చి పోయినంతమాత్రాన యిదెందుకు వాడితో చనువుగా తిరగాలి ? వాడు బద్మాష్ – తెలుసా ! – పేకాట – తాగుడు ... " చివరి వాక్యాలు అంటున్నప్పుడు అతని కడుపులో వెలితిగా దేవినట్లయింది. నరనరమూ లజ్జాభారంతో ముడుచుకుపోయినట్లయింది. నిర్మల వెక్కి వెక్కి ఏడుస్తోంది. చిన్నారావు విసురుగా కుర్చీలో కూలబడ్డాడు.

ఇదంతా ఎందుకిలా జరుగుతోంది ? తను బాధ్యతలనుంచి పారిపోవటానికి ప్రయత్నించటంవల్లనే కదూ ! చిన్నారావు తలలో ఆలోచనల తూటాలు పేలుతున్నాయి. అతని మనసు నెవరో ఇనుప

తొడుగులతో నొక్కుతున్నట్లనిపించ సాగింది.

కుర్చీలోంచి లేచి, బీరువా తలుపు తెరచి జేబులో ఉన్న డబ్బు అందులో ఉంచాడు. బీరువా తలుపులు మూసుకుపోతూ ఉంటే అతని దృష్టి ఓ కవరుమీద పడింది. కవరు తీసి చూసాడు పెద్ద కొడుకు రవి ఉద్యోగానికి పంపించాల్సిన అప్లికేషను ఫారం అది. అది పంపవలసిన గడువు నిన్నటి తోనే ముగిసిపోయింది.

భార్యని కేకేసి అడిగాడు: "ఏమే - వీడు ఈ అప్లికేషను పంపించనే లేదేం ? ఏవో సర్టిఫికెట్లూ అవీ జతపరచాలని అడిగితే అప్పుచేసి ఓ పదిరూపాయలు కూడా యిచ్చాను - దీన్ని పంపకుండా యిలా పడేసి ఉంచాడేం ?" అని.

"ఖర్మ ... నన్నడుగుతా రేమిటండీ ?"

చిన్నారావుకి కోపం తారస్థాయి నందుకుంది. ఏమీ చెయ్యలేని అశక్తత అతనిని పట్టి కుదిపేస్తోంది. సమస్యలతో అతని తల బ్రద్దలైపోతున్నట్లుంది కుర్చీలో కూలబడి నుదురు అరచేత్తో రుద్దుకున్నాడు.

## 3

కాస్సేపటికి రవి యింట్లోకి అడుగు పెట్టాడు. "ఏరా రవీ - ఆ అప్లికేషను పంపించలేదేం ? యింట్లో పెట్టు కూర్చుంటే ఉద్యోగా లొస్తాయను కున్నావా ? ఇచ్చిన పదిరూపాయలూ ఏంచేసావు ?" కోపంగా అడిగాడు చిన్నారావు

"అవి ... అవి బస్సులో వస్తూంటే ... ఎక్కడో పోయాయి నాన్నా ..." భయం భయంగా అన్నాడు రవి.

"ఆ సంగతి అప్పుడే ఎందుకని చెప్పలేదు ?" అంటూ విసురుగా రవి మీదకి వెళ్ళిన చిన్నారావు - ఎవరో జబ్బ పట్టుకుని ఆపినట్లుగా ఆగి పోయాడు.

అతని నరాలు పేలిపోతున్నట్లు...

అతని మెదడు చిల్లులు పడ్డట్లు...

అతని గుండె బ్రద్దలై సెగలు కక్కుతున్నట్లు...

అతని సమస్త ఇంద్రియాలూ ఎదురు తిరిగి శపిస్తున్నట్లు ... చిన్నారావు దిగ్భ్రాంతిచెంది ఆగిపోయాడు. నోట మాటరాక వెర్రిగా చూస్తూ ఉండి పోయాడు.

రవి దగ్గర - అబ్బ ! ముక్కు పుటాలు అదరగొట్టే వాసన ! అవును ...ఆ వాసనని తను పోల్చుకోగలడు— తన పతనానికి ముఖ్యకారణమయిన నీచాతినీచమయిన వ్యసనాన్ని బట్ట బయలుచేసే దుర్భరమయిన వాసన అది !

రవి...రవి కూడా చెడిపోయాడా ?





"భగవాన్!" చిన్నారావు హృదయం కకావికలైపోయింది.

*    *    *    *

చాలాసేపటికి తేరుకున్నాడు చిన్నారావు. ఛీ. తను మూరాలి. తను మేల్కొనాలి ... పరిస్థితులనుండి, వాస్తవం నుండి పారిపోకుండా నిబ్బరంగా నిలబడటం నేర్చుకోవాలి. బాధ్యతలను గుర్తించాలి ... మనిషిగా నిలబడగలగాలి...తననీ ఈ కుటుంబాన్నీ కాపాడుకోవాలి...

తన కుటుంబంలో ప్రతి ఒక్కరూ జీవితపు ఒరవడి దిద్దుకోవటానికి మేలుబంతి కావాలిసిన తనే యిలా పతనమయిపోతే వీళ్ళ కెవరు దిక్కు ? చిన్నారావు మనసు విలవిలలాడిపోయింది.

ఇంతలో వీధిలో సైకిలు బెల్లు మ్రోగింది.

చిన్నారావు తలెత్తి చూసాడు.

రాఘవరావు పంపిన కుర్రాడు, సైకిలు స్టాండు వేసి వచ్చేడు. "రాఘవరావుగారు మిమ్మల్ని అర్జంటుగా రమ్మంటున్నారండీ – ఇవాళ పార్టీ ఉందిట కదండీ–" అన్నాడు.

చిన్నారావు దిగ్గున లేచి నించున్నాడు. అతని శరీరం ఉద్వేగంతో సన్నగా వణుకుతోంది. అసహనంగా క్రింది పెదవి కరచి వదిలిపెట్టాడు.

రెండు చేతులూ నడుంమీద పెట్టుకుని, దృఢంగా అన్నాడు "నేను రాననీ, రాలేననీ చెప్పు– ఇప్పుడే కాదు, మరెప్పుడూ కూడా ఆ పార్టీలకి రానన్నానని చెప్పు – ఫో !" అని.

ఆ అబ్బాయి తెల్లబోయి, తలూపి సైకిలెక్కి వెళ్ళిపోయాడు.

తను తీసుకొన్న మంచి నిర్ణయం అంత కొత్త బలాన్నీ – క్రొత్త ఉత్తేజాన్నీ యివ్వగలదని చిన్నారావు ఊహించనయినా లేదు !

చిన్నారావు తృప్తిగా నిట్టూర్చాడు.

# జ్యోతిషం ఆధారం

(గల్పిక)

గంగదేశం వాళ్ళకు గంగపురాణం ఉన్నది. అదే వాళ్ళకు చరిత్రా, పవిత్ర గ్రంథము కూడానూ. గంగ ఆ దేశానికి మూలదేవత. ముప్ఫైఏళ్ళ క్రితం దాకా గంగనుగురించి అంతగా ఎవరూ పట్టించుకోలేదు. గంగకు భర్తలేదనీ, అనేకమంది భర్తలున్నారనీ, పిల్లలున్నారనీ, లేరనీ, గంగ అంటే సీత అనీ, కాదు లక్ష్మీదేవి అనీ, భయంకరమైన వ్యాధులకు మూలదేవత అనీ, ఆరోగ్యాన్నీ, దీర్ఘాయువునూ ఇచ్చేదనీ, రకరకాల నమ్మకాలు ప్రజలలో ఉండేవి. చదువుకున్నవాళ్ళు ఏదీ నమ్మేవాళ్ళు కారు.

అయితే గంగదేశంలో రాజకీయ-సామాజిక పరిస్థితి అధ్వాన్నమైనది మొదలు గంగపురాణం గురించి అందరికీ వల్లమాలిన ఆసక్తి పుట్టుకొచ్చింది. అన్ని పురాణాలలాగే దాన్నికూడా వ్యాసుడు రాశాడన్నారు. అందులో ధూమశకటాలూ, ఆకాశ శకటాలూ ఉన్నాయి. ద్వాపరయుగంలో అవి ఉన్నాయని శాస్త్రులుగార్లు వాదించారు.

గంగ పుట్టినరోజూ, నక్షత్రమూ, తిథీ, ఘడియా గంగపురాణంలో వ్యాసులవారు ఇచ్చారు. దాన్నిబట్టి అంచనా వెయ్యగా గంగ 39,542ఏళ్ళ క్రితం పుట్టిఉండాలి; లేదా 3,954 ఫిబ్రవరి 5 న అయినా పుట్టబోతుంది. గంగపురాణం భవిష్యపురాణం కాదు గనక పాత తేదీ ఖాయంచేసి, గంగ నివసించిన ఏడంతస్తుల మేడకోసం త్రవ్వకాలు ప్రారంభించారు.

"ఈ దెబ్బతో గంగసంగతి అటో ఇటో తేలుతుంది," అన్నారు గంగ మేధావులు. కాని అది నిజంకాదు. గంగ పురాణానికున్న పవిత్రత ఆర్కియాలజీకి ఎక్కడిది?

*కొడవటిగంటి కుటుంబరావు*



# బలహీనపు ఘడియ

ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

మేడమీద గదిలో పడకకుర్చీలో పడుకుని పాతపత్రికలు తిరగేస్తోంది హేమ. తెగచదవటం మొదటినుంచీ అలవాటు. ఏ పత్రిక కనిపించినాసరే సాంతం చదవందే కదలదు ఇప్పటికి ఎన్ని కథలు, ఎన్ని నవలలు చదివిందో అంతులేదు. రకరకాల మనస్తత్వాలు, రకరకాల పరిస్థితులు యెన్నెన్నో అవగాహన చేసుకుంది. ఆత్మవిశ్వాసం యెన్నోరెట్లు పెరిగిపోయింది.

ఎం. ఏ. ప్యాసయినా అంత పెద్ద చదువు చదివినట్టుగా అసలే కనబడదు.

అణకువ ఆమె ప్రధాన లక్షణం. ఓనాడు ఎప్పుడయినా పనిమనిషి రావటం ఆలస్యమయితే అమాంతం ఓ చీపిరికట్ట పట్టుకుని కసువు వూడుస్తుంది. వంటమనిషికోసం ఎదురుచూస్తూ కూర్చోదు. టైముప్రకారం భోజనాలు కావాల్సిందే. ఒళ్లొంచి పనిచెయ్యటం ఆమెకు మొదటినుంచీ అలవాటే.

ఎంత పని వత్తిడిలోవున్నా మాట్లాడే టప్పుడు తూచి తూచి మాట్లాడుతున్నట్లు కనిపిస్తుంది. ఎంతసేపూ యితరుల అభిప్రాయం యేమిటా అని తెలుసుకోవ టానికి తంటాలు పడుతుంది. అందు వల్లనే ఆమెతో మాట్లాడటం యెవరికైనా సరదాగానే వుంటుంది. ఇతరులను నొప్పిస్తూ తాను యెట్లాగూ మాట్లాడదు. ఇంకొకరెవరైనా మాట్లాడినా కూడా ఓర్చుకోలేదు, విలవిలలాడిపోతుంది. సూటిపోటి మాటలనటం అసలామెకు గిట్టదు. అవగాహన ఆమెలో ఒక ప్రత్యేకత.

కృష్ణకూడా నిజానికి భార్యకంటె సరదా మనిషే. పెద్ద ఉద్యోగం, మంచి ప్రాపకంగల వ్యక్తి ఎప్పటికప్పుడు ఎవరికో ఒకరికి తా నేవిధంగానైనాసరే ఉపయోగపడాలని తహతహలాడుతూ వుంటాడు. ఎవరొచ్చి ఏదడిగినా తన కున్నంతలో కాదనే స్వభావం లేదు. ఏ బంధువో, స్నేహితుడో వస్తే సరి, తనింట్లో రెండు మూడురోజులు ఆతిథ్యం యిస్తేగాని పంపించడు. అది అతనికి మహాసంతోషం. ఇతరులను 'రిసీవ్' చేసుకోవటం అంటే మహా సరదా. హేమ సభ్యతకు అవగాహనకు యెంతగానో మురిసిపోతూవుంటాడు. ఆమెమీద అపరిమితమైన గౌరవం, అభిమానమూను. ప్రేమ సరేసరి. ఆమె తెలివితేటలమీద యెంతో నమ్మకం. ఆమె ఏం పనిచేసినా, ఏ మాట మాట్లా డినా దాంట్లో యెంతో అర్థంవుందని ఆమెను పొగడుతూవుంటాడు. తన కేదైనా సమస్య ఆఫీసులోగాని, యింట్లో గాని యెదురయితే చప్పున కళ్లు మూసుకుని 'హేమా' అనుకుంటాడు. ఏదో పరిష్కారమార్గం ఆ సమయానికి తనకు స్ఫురించినట్లు ఆనందపడిపోతూ వుంటాడు. ఆఫీసునుంచి యింటికి యెప్పుడొచ్చిపడదామా అని పనులన్నీ చకచక పూర్తిచేసుకుంటూ వుంటాడు. ఆమె కూడా అతనికోసం వెయ్యి కళ్ళు పెట్టుకుని ఎదురుచూస్తూ వుంటుంది.

ఆనాడు సాయంత్రం తీరిగ్గా కూర్చుని ఏవేవో చదువుతోంది. టైము తెలియలేదు అప్పటికే ఆరుగంటలు దాటింది ఆయన ఇంకా రాలేదేమా అను కుంటూ బద్ధకంగా లేచి ఒళ్ళు విరుచు కుంటూ గది కిటికీ దగ్గర నిలబడింది. అన్నిచోట్ల దీపాలు వెలిగి వున్నాయి. చీకటి వెలుగులు ఒకదానివెంట ఒకటి చెట్టా పట్టాలేసుకుని తిరుగుతున్నాయి.

వచ్చేకారు పోయేకారు, బజారంతా జనంతో కిటకిటలాడుతోంది. అట్లాగే చూస్తూ చాలాసేపటికివరకు ఏవో ఆలోచనల్లో మునిగిపోయింది.

ఎప్పుడయినా ఆయన లేటుగా రావటంకూడా కద్దు. బహుశా అనుకోకుండా యివ్వాళ యేదో అర్జంటు పని వచ్చి వుంటుంది. అందువల్లనే యింత ఆలస్యమయింది. తనలో తాను సమాధానపడుతోంది. కాని క్షణంలో మనస్సు పరిపరి విధాల పోతోంది. వెనక్కు తిరిగివచ్చి కుర్చీలోకూర్చుంది. అప్రయత్నంగా చేతిలోకి ఓ నవల తీసుకుంది. పేజీలు తిప్పుతోందే కాని చదవబుద్ధి పుట్టటంలేదు. కృష్ణ అన్న మాటలు యిట్టే గుర్తుకొచ్చాయి.

'అవును నే కూడా నవలలను రాయగలను' సందేహం యేమిటి అనుకుంది తనలో తాను.

'ముందర ఓ చిన్న కథ రాసి ఆయనకు చూపిస్తాను. దేన్ని గురించి రాయాలి, ఎవర్ని గురించి రాయాలి.' మళ్ళీ ఆలోచన మొదలుపెట్టింది. చప్పున కళ్ళుమూసుకుంది. ఆలోచన తళుక్కున మెరిసింది.

నేనే కనక రాయటం మొదలుపెడితే ముందరగా ఆ శ్రీధర్‌ను గురించే రాయాలి. అచ్చవంగానే వెంటనే ఓ కాపీ అతనికి పంపుతా—బహుశా నా సహనాన్ని పరీక్షచెయ్యటానికి అతను దాపరించాడనుకుంటా. ఛీ ? అతన్ని గురించి ఆలోచించటం యేమిటి ? తల విదిలించేసుకుంది. కసిగా, విసుగ్గా ఆ పుస్తకాన్ని గిరాటు పెట్టింది. కళ్లుమూసుకుని నిట్టూరుస్తోందేగాని శ్రీధర్ తన కళ్ళల్లోంచి కదిలిపోలేదు.

'మీ భర్తగా రొస్తున్నట్టున్నారు. మనిద్దరం యిట్లా కబుర్లు చెప్పుకుంటుంటే ఆయనేమైనా అనుమానపడచ్చు...' శ్రీధర్ మాటలు గుర్తుకొచ్చి గగుర్పొడిచింది. ఆయన్ని గురించి యెంత అవమానంగా మాట్లాడాడు ! ఎంత ధీమా దిలాసా అనుకుంది.

'మా వారిమీద మీకున్న అభిప్రాయానికి చాలా థాంక్స్...' బాగానే బుద్ధి చెప్పా. ఆమాత్రం అతనికి తెలిసి వుంటే మళ్ళీ యింకోసారి అలాంటి పొరపాటు మాటలు అనడు. తనలో తాను తృప్తిపడింది.

శ్రీధర్ నోటి దూకుడుకు ఆయనా మంచి సమాధానమే చెప్పారు.

'మీ మాటలకు పిచ్చివాడినయిపోయి హేమను శంకించేటంత నీచుణ్ణిమాత్రం కాదు...శ్రీధర్ యిహ నీ ప్రయత్నాలు విరమించచ్చు...' అబ్బ ఎంత స్ట్రెయిట్‌గా పాయింటెడ్‌గా సమాధానం చెప్పారు అనుకుంది.

'ఏమిటీ అప్పుడే ఎనిమిదికూడా అవుతోందా !' రిస్ట్ వాచ్ చూసుకుని

ఆశ్చర్యపోయింది. తాను కూర్చున్న మేడ పైగదిలోనే పచార్లు చేస్తోంది అల సటగా. అప్పుడప్పుడు ఏదో అలికి డయినట్టు ఊహించుకుంటూ మెట్లవైపు చూస్తోంది.

'అబ్బా యివ్వాళ యింటికి యింకా రాలేదేమిటి !...' అలజడిగా అనుకుంటోంది.

'అసలు ఆయన చేసిన పనే. నా కేమాత్రం యిష్టంలేదు. శ్రీధర్ చీటికి మాటికి మనింటికి రావటం !...అవునూ శ్రీధర్ అంటే నాకు చెడ్డ అసహ్యం నీకు తెలుసా హేమా' అని నాతో అన్నారు కూడా...ఆయనకు అసహ్యం. నాకేనా అతనంటే ప్రేమ ... తనలో తాను నవ్వుకుంది. తాను అప్రయ త్నంగా 'ప్రేమ' అన్నందుకు నొచ్చు కుంది. ఏమిటిట్లా అన్నాను. శరీరం ఒక్క క్షణం వణికింది — ఉలిక్కిపడ్డ ట్టయింది. వీపుమీద యెవరో చరిచి నట్లు చప్పున వెనక్కు తిరిగింది.

'ఆయన మరీ సెంటిమెంటల్. పైకి ఏమీ అనలేరు. శ్రీధర్ వస్తే ఒళ్లు పై తెలీదు. గంటలు గంటలు కూర్చుని మాట్లాడతారు. దానికి అంతుండదు. పైగా నన్నుకూడా అక్కడ కూర్చో మంటారు. నా కక్కడ ఒక్క క్షణం కూడా కూర్చోబుద్ధి పుట్టదు. కర్టెసీ కోసం కూర్చోక తప్పదు. కూర్చోక పోతే అనవసరమైన మిసండర్ స్టాండింగ్స్ ... ఏమైనా కాని యీసారి కనక వస్తే నేనే చెప్పేస్తా...ఎవరేమను కున్నాసరే ...' హేమ మొహాన్ని అద్దుకుంటూ కిటికీలోంచి తొంగి చూస్తోంది.

మళ్ళీ చప్పునవచ్చి కుర్చీలో చేరగిల పడింది. బాగా అలసిపోయింది. కొంచెం ఆయాసంగా కూడా వుంది. తనకు తెలియకుండానే భయమేస్తున్నట్లు అదిరిపడుతోంది. మధ్య మధ్య తూలు తోంది. గుటకలువేస్తూ మంచినీళ్ళ గ్లాసెడు గబగబ తాగేసింది.

చప్పున ఎవరో వస్తున్నట్లు మెట్ల మీద అలికిడి వినిపించింది. అటువైపు తిరిగింది. ఆయన కాదు. ఆయన బూట్లచప్పుడు యిట్లా వుండదు. టకటక మని ధ్వని వస్తుంది. ఈ రాత్రివేళ యెవరొస్తారు. మొహం కురచ చేసుకుని ఆలోచిస్తోంది. చప్పున తట్టటంలేదు. శరీరంలోంచి వణుకు పుట్టుకొస్తోంది. భయం పూర్తిగా ఆవహించేసింది. హిచ్‌కాక్ పిక్చర్‌లో మెల్లిమెల్లిగా చీకట్ల లోంచి మనిషి వస్తున్నట్లుగా ధ్వని మాదిరి చప్పుడు వినిపిస్తోంది. కాళ్ళూ, చేతులు వణికిపోతున్నాయి. గుండెల్లో దడ బయలుదేరింది. కుర్చీలోంచి లేద్దామని యెంత ప్రయత్నంచేసినా లేవలేకపోతోంది. మొహమంతా చెమటలు పట్టేసినాయి. తల వెనక్కు తిప్పేసి





ఓరకంటితో మెట్లమీదికి చూస్తోంది. పైమెట్టుమీదికి వచ్చేస్తున్నట్టుగా తెలుస్తోంది. కెవ్వున కేక పెట్టాలనిపించింది. కాని మాట పెగిలిరాలేదు. కుర్చీతో పాటు ఊగిపోతుంది. కుర్చీ లోంచి కిందపడిపోతుందేమో అనిపించింది. మేడమీదికి రాగానే అతన్ని చూసి గతుక్కుమంది. బాగా ఆయాసపడిపోతోంది. శ్వాస పీల్చటం తగ్గించుకుంటూ మామూలు పరిస్థితికి రావటానికి ప్రయత్నం చేస్తోంది.

శ్రీధర్‌ను చూసినప్పుడు యింత యిదిగా అదివర కెప్పుడూ భయపడలేదు. ఈనాడు అంత ఇదిగా వణికిపోవటానికి కారణమూ అర్థంకావటంలేదు. మనస్సులో ఆందోళనా, ఆందోళనకు తగిన ఊహలు, ఆ ఊహకు అనుగుణంగా వస్తున్న వ్యక్తీ అన్నీ తనను క్రుంగతీసేసినాయి. తన అనుమానమే పెనుభూతమయి ఆవహించింది. మనస్సును స్వైరవిహారానికి వదిలేసింది. తన కంట్రోలు తప్పింది. మనస్సు ఆడించినట్టు ఆడిపోయింది. నిభాయించుకోలేకపోయింది. మనస్సును గట్టిగా పట్టేసి నిలకడగా తీసుకురావటానికి హేమకు పెద్ద సమస్యయిపోయింది. ఆ డిటెక్టివ్ పిక్చర్ని తన కళ్ళల్లోంచి తీసెయ్యటానికి ఎంతగానో తంటాలు పడింది. బరువుగా వుంది హృదయం. తన ఆరాటం శ్రీధర్‌కు తెలియనీయకుండానే ఎంతో బిగువుగా "మీరా, రండి" అన్నది.

"థాంక్స్" అంటూ ఓ కుర్చీ లాక్కుని కూర్చున్నాడు శ్రీధర్.

"ఏడి కృష్ణ ? " అంటూ గదంతా కలయచూశాడు ఒక్కనిమిషం.

"ఇంకా వారింటికి రాలేదు తాపీగా అనేసింది.

'ఈ సమయంలో యితనెందుకు వచ్చినట్టు? వెళ్ళిపొమ్మని డైరెక్ట్‌గా చెప్పేస్తే సరిపోతుంది — అసలే నా మనస్సు బాగాలేదు...' రెండు మూడు సార్లు గుటకలువేసి ఆ ముక్క చెప్ప టానికి నోరు తెరవబోతుంటే "కృష్ణ యింట్లోనే వున్నాడనుకున్నాను ఇవ్వాళ యింత ఆలస్యం అయిందేమిటి ...?" తలవంచుకున్నాడు శ్రీధర్.

హేమ ఏమీ మాట్లాడలేకపోయింది. కాని బుసలుకొడుతూ ఏం చెప్పాలా ఏమనాలా అని మథనపడుతోంది తీవ్రంగా.

"వస్తూ వుంటాడు..." అంటూనే టేబుల్ మీద పుస్తకాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

'అసూయలేని అనసూయ.' బాగా వుంది టైటిల్... చదివేశారా ... మీరు చదివింతర్వాత నాకోసారి యివ్వండి.' ఈ టైటిల్ బాగా ఎట్రాక్టివ్‌గా వుంది.

అతనితో మాట్లాడే మూడ్‌లో లేదు. ఆమె మనస్సు మళ్ళీ చంచలమవు తోంది. ఏవేమిటో వచ్చేసి కలవరపెడు తున్నాయి.

"ఈ అసూయ అనేది ఆడవాళ్ళలోనే యెక్కువగా వుంటుందనుకుంటాను... సారీ...మీరేమి అనుకోవద్దు. జనరల్‌గా అంటున్నాను. ఎక్సెప్షన్స్ ప్రతిదానికీ వుంటాయి..."

"... మీరన్నది నిజమే అయితే దానికి కారణం మగవాళ్లే అంటాను..." కొరకొర చూసింది. ఆ మాటల్లో కసి, అక్కసూ అంతా వెళ్ళబుచ్చింది.

"కారణాలయితే యెవరికి తోచినవి వాళ్ళు చెప్పుకోవచు . కాని నేనన్నది మాత్రం నిజమని మీరు ఒప్పుకోక తప్పదు..."

"...నా ఉద్దేశం మీకు తెలిసినప్పుడు వేరే నన్నడగటం యెందుకు ..." విసురున సమాధానం చెప్పింది.

ఆమెలో చిరాకు, అసహనం శ్రీధర్ యిట్టే తెలుసుకున్నాడు.

"మీ అభిప్రాయం యేమిటో కొంత వరకు నేను ఊహించగలుగుతున్నానని మీ రొప్పుకున్నారు, నా కదే చాలు..." నిండుగా అన్నాడు.

అతని మాటలు చాలా కటువుగా ధ్వనించినాయి. వింతగా అతని మొహంలోకి క్షణం చూసి మొహం చిట్లించేసింది.

అయినా శ్రీధర్ మనస్సు వేరే విధంగా వుంది. ఒంటరిగా అప్పుడప్పుడు హేమతో మాట్లాడటం తటస్థించినా యిలాంటి సమయం మాత్రం అదివర కెప్పుడూ రాలేదు. ఆమెతో మాట్లాడాలని ఉబలాటపడుతున్నాడు. తన మనస్సు

విప్పి చెప్పాలని తహతహ లాడు తున్నాడు.

"మీరేమీ అనుకోకండా వుంటే నా మనస్సులో మాట చెపుతాను. మీతో మాట్లాడుతున్నంత సేపు నాకు యెంతో హాయిగా వుంటుంది. ఆ సంతోషం చెప్పటానికి వీల్లేదు ... నా ఉద్దేశం ... మీ దగ్గర యెన్నో విషయాలు నేర్చు కున్నానంటే నమ్మండి. అసలు మీతో మాట్లాడటం అనేది ఒక పెద్ద ఫీస్ట్ అనుకోండి..." ఉద్వేగంగానూ ఆవేశం గానూ అన్నాడు శ్రీధర్.

హేమ ఆశ్చర్యపడిపోతోంది. ఏమిటీ యీ ధోరణి అని బిత్తర పోతోంది. అంతా అయోమయంగా వుంది. ఎనిమిదిన్నర కూడా అయింది. ఇంకా ఆయన యింటికి రాలేదేమా అని తల్లడిల్లిపోతోంది. ఆ ఆందోళన అట్లా వుంటే శ్రీధర్ వచ్చి యిక్కడ కూర్చో వటం ఏవేవో మాట్లాడటం, మరీ అలజడి గానూ, భయంగానూ వుంది.

"చూడండి ..." అన్నాడు శ్రీధర్ గుటకలు వేస్తూ.

చప్పున తలెత్తి చూసింది. అతని కళ్ళల్లోకి వాడిగా వేడిగా ఆమె దృష్టులు గుచ్చుకునిపోయినాయి. ఆ తాకిడికి అతని కళ్లు చెదిరిపోయినాయి. కను రెప్పలు టపటపమనిపిస్తూ తన కుర్చీని యింకొంచెం ముందుకు జరిపాడు శ్రీధర్. ఏదో మాట్లాడాలని అనుకుంటూనే తిక మక పడిపోతున్నాడు. అతని వాలకం చూస్తూ హేమ ఉక్కిరిబిక్కిరయి పోయింది.

"...ఈ రాత్రిపూట మీరు ఒంట రిగా వున్నప్పుడు నేను వచ్చానని మీ రనుకోవద్దు. నా ఆత్మవిశ్వాసం, మీ మంచితనం, కృష్ణ అవగాహన నన్నీ కాసేపైనా కూర్చోబెట్ట కలిగినాయి. మీరు నన్ను అపార్థంచేసుకున్నారని నా మనస్సుకు తోచి యిట్లా అంటున్నాను, అంతకంటె యేంలేదు..."

హేమ హృదయం ఒక్కసారిగా తేలి కయిపోయినట్లనిపించింది. ఆ క్షణంలో శ్రీధర్ మీద అభిమానం, గౌరవం పెరిగిపోయినాయి.

శ్రీధర్ లేచి నిలబడ్డాడు.

"నమస్తే ... వెళ్లొస్తా..." అంటూ గంభీరంగా వెనక్కు తిరిగాడు. చప్పున యిట్టే లైట్లు ఆరిపోయినాయి.

హేమ గుండె ఝల్లుమంది. కళ్ళు పొడుచుకున్నా కనిపించటంలేదు. కదిలితే ఏమి తగులుతుందో ఎక్కడ కాలు జారుతుందో అన్నట్టుగా ఎవరున్న చోట వాళ్ళుండిపోయారు ఇద్దరూను. నిశ్శబ్దం ఆవరించుకుంది. గాలి స్తంభించి పోయినట్లయింది. హేమకు గుండె ఆగినంత పనయింది.

మెట్లమీదనుంచి టకటకమని బూట్ల చప్పుడు వినిపించింది. తన హృదయం

మీద తొక్కుతున్నట్లుగా తల్లడిల్లి పోయింది. శ్రీధర్ తత్తరపడిపోతు న్నాడు. మనస్సు చిక్కపట్టుకోలేక పోతున్నాడు – కృష్ణ వస్తున్నాడు అని లోపల గుణించుకుంటున్నాడు.

'నేనిప్పుడు యెక్కడికి వెళతాను ... నా కేమిటో భయంగా వుంది ...' అంటూ హడలిపోతూ గది తలుపు వెనకాల ఒదిగి ఒదిగి నక్కి నిల బడ్డాడు.

హేమ కొయ్యబారిపోయింది. నోట మాటలేదు.

కృష్ణ పైమెట్టుమీదికి రాగానే లైట్లు యిట్టే వెలిగినాయి.

వస్తూ వస్తూనే... "సారీ యివ్వాళ బాగా లేటయింది ... లైట్లు చాలా సేపటి నుంచీ లేవా ..." హేమ భుజం మీద చెయ్యివేసి ప్రక్కకుర్చీలో కూర్చున్నాడు.

హేమ శరీరం కంపిస్తున్నట్టుగా అనిపించింది – ఆమె వేడి నిట్టూర్పులు ఘాటుగా తాకినాయి.

"ఏమిటి హేమా అట్లావున్నావు ... ... ..." చెక్కిళ్ళమీద రెండు చేతులూ పెట్టి ఆమె మొహంలోకి దగ్గరగా చూశాడు.

ఆమె యేమీ మాట్లాడలేకపోతోంది.

"ఏమీ ... లేదు ... " అంటూ పేలవంగా భర్త మొహంలోకి చూస్తూ నవ్వటానికి పెనుగులాడింది.

కృష్ణ లేచి నిలబడి గది తలుపులు రెండూ వెయ్యబోయాడు.

ఆశ్చర్యంగా "ఆ ! ... శ్రీధర్ ... నువ్వా ! ..." అంటూ బిత్తర పోయాడు. అతనివైపు, హేమవైపు తీక్షణంగానూ, తీవ్రంగానూ చకచక చూశాడు. ఒళ్ళు ఉడికిపోయింది, తల బరువెక్కింది.

"హేమా ! ... " పళ్లు పటపట మనిపిస్తూ గట్టిగా అరిచాడు కృష్ణ, గదంతా దద్దరిల్లిపోయేటట్టు.



# యుగధర్మం

'ఎలెక్ట్రాన్'



సాయంత్రం అయిదు దాటినా, వడ గాడుపు తగ్గలేదు. రోజల్లా శ్రమించి పనిచేసిన తర్వాత, అంతటి వేడిలో ఇంటికి వెళ్ళాలంటే నిజంగా ప్రాణం పోతుంది. స్కూటర్ పాడవడంవల్ల బాగుచెయ్యడానికి యిచ్చాను. సోమవారంనాడు కాని అది తయారవ్వదు. సిటీబస్సులు పేరుకే కాని, సమయానికి రావు. వచ్చినా, విపరీతమైన రద్దీ. ఆఫీసువదిలి, కాలినడకను ఇంటిదారి పట్టాను.

"రిక్షాకావాలా సార్," ఓ రిక్షా అతను పక్కగావచ్చి అడిగాడు.

"దానవాయిపేటకి ఏం కావాలి?" ప్రశ్నించాను. నాలోని నీరసాన్ని కనిపెట్టి ఉండాలి. "రెండురూపాయలిప్పించండి," అన్నాడతను.

"అరె కంతుంగాలయ్యా! దానవాయిపేటకి రెండురూపాయలా?"

"చదువుకున్న బాబులు- మీరే ఇలా అంటే ఎలా? ఎంత గాడుపుగా ఉందో చూడండి. అందులోనూ అంతా మెరకలాగాలి," అన్నాడతను.

నా జేబులో సరిగ్గా రెండురూపాయలే ఉన్నాయి. ఉదయం ఆఫీసుకు వెళ్ళేటప్పుడు పర్సునిండుగానే ఉంది. అవసరంగా ఉందంటే ఆఫీసు జీప్‌డ్రైవర్‌కి ఏభై యివ్వగా రెండురూపాయలు మిగిలాయి. అతగాడు డబ్బుతీసుకొని, నెమ్మదిగా అన్నాడు. "మీ స్కూటర్ పాడైపోయిందనుకొంటాను. సాయంత్రం మిమ్మల్ని ఇంటిదగ్గర దిగబెడ్తాను." అతగాడి సన్నాయి నొక్కులకి నాకు చిర్రెత్తుకొచ్చింది. "ఆఫీసు జీప్‌ని నా స్వంతపనులకు ఉపయోగించనని నీకు తెలుసు. ఇక్కణ్ణుంచి వెళ్ళు!" అని కసిరాను. "ఎందుకుసార్ అలా కోప్పడ్తారు! పెద్దమ్మగారు (ఇంజనీరుగారి భార్య) షాపింగ్‌కి వెడ్తారట. జీప్ తీసుకు పొమ్మని అయ్యగారు చెప్పారు. జీప్ ఎలాగా అటువైపు వెళ్ళాలికదా, మిమ్మల్ని దింపవచ్చునూ అని..." అని నసిగాడు. అతగాడి మాటలు నాలో మార్పుని తీసుకురాలేదు. నేను సమా

ధానం యివ్వకపోవటంతో, "మీ యిష్టం" అంటూ వెళ్ళిపోయాడు.

"ఏం బాబయ్యా, ఏమంటారు ?" అన్న రిక్షా అతని మాటలతో ఈ లోకంలో పడ్డాను.

"రెండురూపాయలు చాలా ఎక్కువ. మరో బేరం చూసుకో" అన్నాను. అతను నిజంగానే మరో బేరం చూసుకొన్నాడు. చలవ కళ్ళజోడు పెట్టుకొన్న ఓ వన్నె లాడి, "ఏయ్ అబ్బీ, దానవాయిపేట రిక్షా కడ్తావా ?" అని అడిగింది.

"రెండురూపాయలు," అన్నాడతను.

"ఎవరైనా నవ్విపోతారు ; రూపా యిస్తాను." ఆమె నిక్కచ్చిగా అనేసింది.

"సరే, రండి !" ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయాను. ఆమె రిక్షాలో కూర్చోగానే హుషారుగా అతగాడు రిక్షా తొక్కుకుంటూ వెళ్ళిపోయాడు. షివర్లీ అనేది ఒక్క చదువుకొన్నవాళ్ళ సొత్తే కాదు. మగవాడు పుట్టడంలో వచ్చే గుణాల్లో ఇదొకటనుకొంటాను.

స్కూటర్ సుఖానికి అలవాటుపడ్డ ప్రాణం, నడవడానికి ఒప్పుకోవడం లేదు. గాస్ అయిపోయిన తర్వాత, సిలెండరు మళ్ళీ వచ్చేవరకూ— మా ఆవిడ విసుగుకీ, కోపానికి అర్థంలేదని ఎన్నోసార్లు అంటూంటాను. 'ఓ రెండు పూటలు కిరస్నాయిలు స్టవ్‌మీద వండితే ఏంపోయింది ?' అని ప్రశ్నిస్తే 'మీ స్కూటర్ పాడయితే, ఓ నాలుగు పూటలు నడిచి వెడ్తే మీకూ తెలుస్తుంది కష్టం !' అంటుంది ఆ మాటల్లో నిజం లేకపోలేదని అనిపించింది.

రిక్షాకోసం డబ్బులు ఖర్చుపెట్టడానికి మనసు ఒప్పుకోలేదు. వచ్చేపోయే రిక్షాల్ని, కార్లనీ తప్పించుకొంటూ, మురుక్కాలవల వాసనకి ముక్కు మూసుకొంటూ, జాంపేట జంక్షన్ చేరు కొనేసరికి, కాళ్ళలో సత్తువపోయింది. గొంతుక తడారిపోయింది. అవసరమైన దానికన్నా ఎక్కువ ప్రాణాల్ని కష్టపెట్టి నందుకు మనసులో నొచ్చుకొంటూ, కూల్‌డ్రింక్‌షాపులో ఓ రూపాయి తగ లెట్టి 'లిమ్కా' తాగాను. కొట్టుపక్కనే, రకరకాల ప్లాస్టిక్ బొమ్మలు ఓ బల్లమీద పెట్టుకొని 'ఏవస్తువైనా రూపాయి !' అంటూ ఓ నల్లబట్టలతను అరుస్తున్నాడు. బాబిగాడి కోసమని, ఓ మరబొంగరాన్ని తీసుకొని బయలుదేరాను. రిక్షామీద అన వసరంగా ఖర్చుపెట్టడంకంటే ఇదే నయ మనిపించింది.

గేటుతలుపు తోసుకొని, ఆవరణలో అడుగుపెట్టాను. యింటికి తాళంవేసిఉంది. పుస్తకాలసంచి మల్లెపందిరి రాటకి తగి లించి, పందిరికింద బాబిగాడు గొప్పులు తవ్వుతున్నాడు. పంపుకి తగిలించిన రబ్బరుగొట్టంలోంచి నీళ్లు పక్కనేఉన్న గులాబిచెట్లని తడుపుతున్నాయి. "అమ్మ ఎక్కడికెళ్ళిందిరా ?" అని అడిగాను. తవ్వుగోల పక్కనపెడ్తూ "నాకేం

తెలుసు! స్కూల్‌నుంచి వచ్చేసరికి తాళంవేసిఉంది!" అన్నాడు బాబి.

"అక్క...?"

"అక్కా నేనూ కలిసే వచ్చాం. యింటికి తాళంవేసి ఉండడంచూసి, సరళావాళ్ళింటికి గచ్చకాయలాడుకో డానికి వెళ్ళిపోయింది!" బాబిగాడి గొంతుకలో, ఏదో కసి కొట్టవచ్చినట్లు కనబడింది. ఏమనాలో తెలియక ఊరు కొన్నాను. ఉండలేక మళ్ళీ వాడే అన్నాడు. "రాణిగారిలా ఊర్లమ్మట షికార్లు కొట్టడానికి శ్రమ ఉండదు. మొక్కలకి గొప్పులుతవ్వి నీళ్ళుపెడ్దామే అంటే, ఓ వెకిలినవ్వు నవ్వేసి గచ్చ కాయలాడ్డానికి చెక్కేసింది. పువ్వుల్ని మట్టుకు మొగ్గల్లోనే తుంపేసి తల్లో తురుముకోడానికి మట్టుకు తయ్యారు!"

"పువ్వులు వాళ్ళు పెట్టుకోకపోతే, నువ్వు పెట్టుకొంటావట్రా? మరి ఈ పువ్వులు ఎవరికోసమని?"

"దానికోసంమట్టుకు కాదు. మన యింటి అందంకోసం! అయినా కొంచెం సాయం చెయ్యవచ్చునుగా?"

నాకు నవ్వొచ్చింది. బాబికి కోపం రెచ్చిపోయింది. నేను మరబొంగరాన్ని పైకితీసి చూపించాను. బాబి కళ్ళు మిల మిలా మెరిసాయి. మరబొంగరాన్ని వాడి చేతిలోపెడ్తూ, "నువ్వు పోయి దీంతో ఆడుకో. నేను మొక్కలకి గొప్పులు తవ్వుతాను," అన్నాను. వాడి కోపం యిట్టే ఎగిరిపోయింది. బొంగ రాన్ని తీసుకొని వరండాలోకి పరు గెత్తాడు.

ఓ అరగంటపోయిన తర్వాత సరోజ ఓ రిక్షాలోంచి దిగి వచ్చింది. వరండా మెట్లమీద కూర్చున్న నన్ను చూసి నవ్వుతూ, "ఓ రూపాయుంటే ఇవ్వండి. రిక్షా అతనికి యివ్వాలి," అంది. "లేదు!" అన్న నా ముక్తసరి సమా ధానం విని, తెల్లబోయింది సరోజ. కాని తమాయించుకొని అన్నది, "పొద్దున్న ఆఫీసుకు వెళ్ళేటప్పుడు చాలా డబ్బే ఉండాలే!!" ఈ విసురుతో నాకు వళ్ళు మండింది.

"నీకెలాతెలుసు? జేబులు తడమడం మొదలెట్టావా?" అన్నాను. ఇంక మాట్లాడి లాభంలేదనుకొంది కాబోలు తలుపుతాళంతీసి లోపలికివెళ్ళింది. ఓ రూపాయి తీసుకొచ్చి, రిక్షాఅతనికిచ్చి, గేటుతలుపువేసి వరండాలోకి వచ్చింది.

"కాంత ఏదిరా బాబీ?" వాణ్ణి ప్రశ్నించింది.

"నీలాగే, అదీ షికార్లకి వెళ్ళింది," కొంచెం కటువుగానే అన్నాను.

"వెంకటలక్ష్మిగారమ్మాయి హైద్రా బాద్ వెళ్ళిపోతోందని తెలిసి చూడ్డానికి వెళ్ళాను. కొత్తగా కాపురానికి వెడ్తోంది కదా, చూడకపోతే బావుండదు! తీరా వెళ్ళినతర్వాత వాళ్ళు నన్ను ఓ పట్టాన కదలనివ్వలేదు. అందుకనే ఆలస్యం

అయిపోయింది కదా అని రిక్షామీద వచ్చేశాను"

"రెండువీధులవతల్నించి యిక్కడికి రూపాయా రిక్షాకి ? ?"

"ఇంత గాడుపుల్లో వాళ్ళుమట్టుకు తక్కువబేరానికి వస్తారా ? మీరెంత ఉద్యారేమిటి, ఆఫీసునుంచి యింటికి రావడానికి ?''

"నడిచివచ్చాను." డబ్బువిలువ నీకు తెలియదులే అన్న అర్థం వచ్చేటట్లుగా ఉంది కాబోలు నా సమాధానం- సరోజ చిన్నబోయిన మొహంతో లోపలికి వెళ్ళింది.

నేనూ లేచి ముందుగదిలోకి పోయి, ఫాన్ వేసుకొని సోఫాలో కూలబడ్డాను. పేపరు తీసుకొని చదవడం మొదలు పెట్టాను. ''ఉత్తరంవచ్చింది, మీకు-" అంటూ సరోజవచ్చి, ఓ కవరిచ్చింది.

"ఎక్కణ్ణించి ? ఎవరు వ్రాశారు ?" ప్రశ్నించాను. సరోజకు అనకాశం దొరికింది.

"నేనేమైనా విప్పి చదివానా- ఎవరు ఎక్కణ్ణించి వ్రాసిందీ తెలియడానికి ? సరే, మీతో గొడవెందుకు కానీ, ఉత్తరం చదువుకోండి. ఈ లోపులో కాఫీ తీసుకొస్తాను.'' సరోజ లోపలికి వెళ్ళింది.

కవరుచింపి ఉత్తరం చదివాను. సరోజ కాఫీ తీసుకొచ్చి, చేతికందిస్తూ, "ఎక్కణ్ణించేమిటి ?" అని కుతూహలంగా అడిగింది. ఓ క్షణం సందేహించాను. ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

"అక్కయ్యరాసింది. వాళ్ళ శ్యామలకి పెళ్ళి కుదిరిందిట. ఉన్న ఎకరం పొలం అమ్మేసినా, ఇంకా కట్నానికి రెండు వేలు తక్కువొచ్చిందసీనూ, ఎంత ప్రయత్నించినా ఆ డబ్బు సర్దుబాటు కాలేదనీను" సరోజ మొహంలోకి చూస్తూ అన్నాను. కొంచెంగా రంగు మార్పు మొహంలో గమనించాను. సరోజ మౌనంగా ఉండిపోయింది.

"నాకు ప్రమోషన్ వచ్చినతర్వాత నెలనెలా మనం ఆదా చెయ్యకలిగిన డబ్బు నీ పేర బాంక్‌లో వేస్తున్నాను కదా. అది ఈపాటికి రెండువేలకు పైగా ఉందనుకొంటాను." సరోజతో లాలనగా అన్నాను. నా ఉద్దేశానికి వేరే మాటలు అనవసరం. సరోజ సంగతి గ్రహించింది.

''పెళ్ళిళ్ళూ అవీ అయి, ఎవరి సంసారాలు వాళ్ళు చూసుకొంటున్నప్పుడు- ఎవరికష్టాలు వారికుంటాయి. మనకీ పిల్లలు పెరుగుతున్నారు. ఈ రెండువేలూ కూడబెట్టడానికి రెండేళ్ళు పట్టింది"సరోజ కఠినంగానే అన్నది.

"అదికాదు సరోజా ! అక్కయ్యకి ఈ డబ్బు చాలా అవసరం, నా తోడబుట్టినదానికి ఈమాత్రం సహాయం చెయ్యకపోతే ఎలా ?"

"మనకి వేలకువేలు మూలుగుతోంటే



అనుకోవచ్చు. ఏదో రెండుపూట్లా ఆఫీసుకి వెళ్ళి వెళ్ళుతున్నంతమాత్రాన మనదగ్గర మూటలు మూలుగుతున్నాయనుకొంటే ఎలా ?" సరోజలో కఠినత్వం, ఇన్నేళ్ళ వైవాహిక జీవితంలోనూ మొదటిసారిగా చూడకలిగాను.

"మనకి జరుగుతోంది కనకనే, ఈ మాత్రం సహాయం చెయ్యవచ్చునను కొంటున్నాను ! అక్కయ్య ఏమీ పరాయిది కాదు కదా ? !" అనకూడని మాట అన్నాననుకొంటాను సరోజ దృష్టిలో. విరుచుకుపడింది. "అవును, నేనే పరాయిదాన్ని. అయినా ఆ డబ్బు మీది. మీ యిష్టంవచ్చినట్టు చేసుకోడానికి మీకు హక్కుంది. కాదనడానికి నేనెవర్తిని ?" సరోజ విసురుగాలేచి వెళ్ళిపోయింది.

"అమ్మా, ఆకలేస్తోందే," అంటూ బాబిగాడు లోపలికి వచ్చాడు. "వంటింట్లో ఇల్లమీద పాలున్నాయి. తాగి తగలడు." సరోజ సమాధానం పక్కగదిలోంచి వచ్చింది.

ఆడదాని స్వార్థాన్నిగురించి ఆలోచిస్తూ అలానే కూర్చుండిపోయాను, చాలాసేపు. ఏడింటికి చన్నీళ్ళతో హాయిగా స్నానంచేసి బట్టలు మార్చుకొన్నాను. డాబామీదకుపోయి, సిగరెట్ ముట్టించి పచార్లు మొదలుపెట్టాను. కింద తులసికోటదగ్గర, బాబిగాడూ, శాంతా ఘర్షణ పడ్తున్నారు.

"ఆ బొంగరం నాది. నీకెందుకివ్వాలి?" బాబిగాడు తిక్కగా అన్నాడు.

"నాన్నగారు మనిద్దరికోసం కొన్నారు. నాకూ్కడా యివ్వు." శాంత దబాయిస్తోంది.

"నేనివ్వను. కష్టపడి పనిచేసినందుకు నేను సంపాదించిన బహుమతి ఇది."

"అక్కడికి నువ్వొక్కడివే కష్టపడిపోతున్నట్లు! ఏంచేశావేమిటి?"

"మొక్కలకి గొప్పులుతవ్వి నీళ్ళుపెట్టాను."

"అది కష్టమైన పనా?"

"లేకపోతే గచ్చకాయలాడ్డం-షికార్లుకొట్టడం- కష్టంకదూ! రేపట్నుంచి ఒక్క పువ్వుకోసి చూడు, ఏంచేస్తానో?"

"రేపటిదాకా ఎందుకు? ఇప్పుడే కోస్తాను! ఏం చేస్తావో చూస్తాను!" శాంత అక్కణ్ణించి కదలబోయిందనుకొంటాను, ఏం జరిగిందో కాని, "అమ్మా చూడవే- తమ్ముడు వీపుమీద గుద్దుతున్నాడు!" అంటూ అరవడం మొదలుపెట్టింది. అక్కడే అరుగుమీద కండిపచ్చడి రుబ్బుతోన్న సరోజ పిల్లల్ని గదమాయిస్తోంది. "అలా దెబ్బలాడుకోకండి. అయినా బాబీ- అక్కని కొట్టడం తప్పుకాదురా? బొంగరం నీకో సమే అయినా, అక్కకికూడా యివ్వాలి. నువ్వు యివ్వకపోతే ఇంకెవరిస్తారు దానికి?"

''దాని మొగుడు!''

"అదెప్పుడో తర్వాతమాట. అయినా నువ్వు మరి దాని తమ్ముడివికదా! నువ్వు కష్టపడి ఏం చేసి ఏం సంపాదించినా, అక్కకూ్కడా యివ్వాలి. అప్పుడది 'మా తమ్ముడెంతమంచివాడూ' అని పొంగిపోతుంది."

"ఇప్పటికెన్నిసార్లు పువ్వులు కోసుకోనిచ్చాను. ఒక్కసారైనా నేను మంచివాణ్ణని అనలేదు!"

"అదిప్పుడు బొంగరంకోసం సరదాపడ్తోంది కదా! బొంగరం దానికిస్తే సంతోషిస్తుంది. నువ్వింకొాటి కొనుక్కుందువుగాని" సరోజ బాబిగాణ్ణి బుజ్జగించడం మొదలుపెట్టింది. ఇదే అదనుగా శాంత స్థాయి హెచ్చిస్తూ ఏడవడం మొదలుపెట్టింది. బాబిగాడు కరిగిపోయాడనుకొంటాను. "ఏడవకే, ఇంద బొంగరంతీసుకో. రేపొద్దున్నకి రెండు గులాబీలు విచ్చుకొంటాయి. అవి కోసుకో."




చిన్నగా నవ్వుకొంటూ, మరోసిగరెట్ ముట్టించాను. సరోజమీదకు బాణం వదలడానికి మరో అవకాశం దొరికిందనుకొన్నాను.

రాత్రిభోజనం వడ్డిస్తుంటే, "నువ్విందాకా బాబిగాడికేదో హితబోధ చేసినట్టున్నావు?'' అన్నాను, సరోజతో. నా మాటల్లోని వ్యంగ్యాన్ని గుర్తించలేనంత మూర్ఖురాలుకాదు సరోజ.

"మీ మాటల్లోని అర్థం తెలుస్తోనేఉంది. బావుంది- సాయంత్రం భార్యగా మాట్లాడాను. ఇందాకా తల్లిగా మాట్లాను. ఇది యుగధర్మం!" సరోజ సమాధానంలో చాలా పెద్ద పదాలే దొర్లాయి. అర్థాలే యిమిడాయి. అవాక్కయిపోయాను. బాబిగాడూ, కాంతా అర్థంకాక నా మొహంకేసి చూడసాగారు. మౌనంగా భోజనం ముగించాను.

అయితే సరోజ సమాధానంతో, నాకు జ్ఞానోదయమైంది.

ఆ మర్నాడు ఆఫీసుకు వెళ్ళగానే, ప్రావిడెంటుఫండ్‌లోంచి మూడువేలు అప్పు తీసుకొని అక్కకి పంపించాను. కట్టుకొన్న ఆడదానితో- చేయబోయే ప్రతి పనినిగురించి ఆలోచించాలనీ, చేసిన ప్రతి పనిగురించి చెప్పాలనీ ఎక్కడాలేదు. ఇదీ యుగధర్మమే!

# కలుసుకున్న రైలుపట్టాలు

## సి. విశ్వేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

"ఏమి చేమిటని" ఉషా చతుర్వేదు లొక్కసారే ప్రశ్నించారు ఆదుర్దాగా.

"నేను ఆర్యసమాజ్‌ద్వారా హిందూ మతం పుచ్చుకొన్నాను – నాకు తెలుసు, ఈ వార్త మా దేశంలో గొప్ప సంచలనం కలిగిస్తుందని – అయినా నేనీ సాహసాని కొడిగట్టాను."

ఈ వార్త ఉషా చతుర్వేదులను చకితుల్ని చేసింది. పుట్టుకతో భారతీయుడైకూడా, ఈ దేశ నాగరికతను సంస్కృతిని ఏవగించుకొని పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో పడి పెడత్రోవలు తొక్కుతూన్న ఈనాటి భారత దేశ యువతరంతో పోల్చి చూచినపుడు, బ్రౌన్ వాళ్ళ కళ్ళకు ఒక మహత్తర ఆదర్శమూర్తిగా కనిపించాడు. అందుకోలేని హిమవన్నగ శిఖరంగా తోచాడు. బ్రౌన్ సాహస చర్యను వేనోళ్ళ అభివందించారు.

రోజులు గడుస్తూన్నకొద్దీ, ఉషా బ్రౌనులు సన్నిహితులయ్యారు. అనుబంధాలు పెంచుకొన్నారు. అనురాగలతతో రెండు హృదయాలను ఏకంచేసి బంధించుకొన్నారు. ఇద్దరూ కలిసి, సినిమాలకు షికార్లకు పిక్నిక్కులకు వెళ్ళేవాళ్ళు. ఎక్కడకు వెళ్ళినా జంటగా వెళ్ళేవాళ్ళు — ఒకరి మనసు ఒకరు పూర్తిగా అర్థంచేసుకొన్నారు. వాళ్ళిద్దరి మధ్య మొలకెత్తుతున్న ప్రేమానురాగాలు మొదట్నుంచీ గమనిస్తూన్నప్పటికి చతుర్వేది ఏమీఅనేవాడుకాడు. ఒక విధంగా వాళ్ళలా వుండటం చతుర్వేదికి సంతోషదాయకమయింది. అభిప్రాయాలలో అభిరుచులలో పరస్పరం వైరుధ్యంగల రెండుదేశాల యువతీయువకులు ఒకింటివారు కావటం, మూఢాచారాలు మూఢాభిప్రాయాలతో కరడుగట్టుకొన్న భారత దేశంలో జరగటం అసంభవమని చతుర్వేదికి తెలుసు. అయినా, విద్యావంతులూ, సభ్యతా సంస్కారమున్న వాళ్ళిద్దరూ ఒకటయిన రోజున, ఈ సంఘమూ, అనాదిగా మనలో పాతు

వాదాలు జరిగాయి. చివరకు బ్రౌను తలకొరివి పెట్టాలని పెద్దలు నిర్ణయించారు.

తనకు జన్మనిచ్చినవాడు, పవిత్ర భారతదేశ పౌరుడని తెలుసుకొన్న బ్రౌను కొన్నిక్షణాలు మౌనంగానిల్చొని చతుర్వేది శవంవేపు నిర్లిప్తంగా శూన్య దృక్కులతో చూస్తూ నిల్చున్నాడు. ఆకాశగంగ రెండుపాయలుగా చీలి, కనుదమ్ములనుండి వాగులై సెలయేరులై ప్రవహించింది.

"మిస్టర్ బ్రౌన్ బాధపడుతున్నావా" అంది ఉష ఓదార్పుగా.

అక్కడ చేరిన జనంలో తనను ఆదరించి ఆప్యాయంగా పలకరించే వాళ్ళిద్దరే. ఒకరు ఉష మరొకరు నాయర్.

"పుట్టిననాటినుంచీ కన్నతండ్రి ఎవరో తెలీకుండా మా మమ్మీ పెంపకంలో పెరిగాను. రెండేళ్ళక్రితం నన్నీ ప్రపంచంలో ఒంటరివాణ్ణిచేసి మా మమ్మీ నాకు దూరమయింది – నాకు జన్మనిచ్చినతండ్రి ఫలానావ్యక్తనితెలుసుకొనేలోపల, ఆయన అమృతహృదయం కూడా నాకు కరువయ్యింది. ఇంత ఒంటరి జీవితంలో నా మనసుకు కాస్త ఊరట కలిగించగలిగిన వ్యక్తివి నీ వొక్కతెవే ఉషా! నీ సాహచర్యంలో నా బాధను మరిచిపోగలనన్న నమ్మకం నాకుంది" అని ఉషచేతిని ఆప్యాయంగా తనచేతుల్లోకి తీసుకొని నిమిరాడు.

చతుర్వేది అంతిమయాత్ర బయల్దేరింది నిప్పుపట్టుకొని. ముందు బ్రౌన్ నడుస్తూండగా, పత్రికా విలేకర్లు, ఫోటోగ్రాఫర్లు, తండోప తండాలుగా జనం పాల్గొన్నారు ఆ నగరంలో అనేక అపూర్వదృశ్యం!

మంచిగంధపు చెక్కలతో చితిపేర్చబడింది. బ్రౌన్ నిప్పంటించి తలకొరివి పెట్టాడు. చిటపటలాడుతూ మంటలు జాజ్వల్యమానంగా. లేచాయి ఎగిసిన మంటలు ఎర్రటి నాలుకలు చాస్తూ సంజకెంజాయలో కలిసిపోయాయి. ప్రక్కనున్న జువ్విచెట్టుమీదనుంచి రెండుపాలపిట్టలు రివ్వున అనంతాకాశంలోకి ఎగిరిపోయాయి.

(సమాప్తం)



# పరిధి

పి.వి.రమణ



బలహీన సంఘటనలు గనకుంటా, అతి

సామాన్యమైన జీవితానుభూతుల గొడవ-

టఖానిస్తున్నను. అలంటి మనుష్యులంటనే ట

చలపతి కూడా చేర్చిన కొన్ని సత్యాలు

చలపతి కిది ఏరకాయిపోయి వస్తు

బంధుత్వం. చిన్ననాటినుండి పరుష్పించు

కల్పిమెప్పి తిలగినంతమేర్లి వా బంధు

కొంచెం పట్టుబడింది. మనుష్యులందరు

లాగే ఆయా అవయవాల సర్వాణం చల

పతికి క్రమం తప్పకుండా వున్నా, మనసుమాత్రం ఎంతో కొంత విడ్డూర మైనదనే విషయాన్ని వాడితో పరిచయ మున్న ప్రతి ఒక్కరూ అంగీకరించి తీరాలి. దీనికితోడు వాడి నరనరాల్లో రక్తంతోపాటు సరి సమానంగా లౌకిక జ్ఞానం గూడా ప్రవహిస్తూవుండేది, పాఠ శాల దశనుంచి అది పరిణతి పొంది, కళాశాల స్థాయిలో కాకలుదీరి. జీవి తంలో అడుగిడేనాటికి చిరంజీవిగా నిల్చి పోయింది.

చలపతి దృష్టిలో తల్లి బాధ్యత పాలిచ్చి పెంచేంత వరకే. రెక్క లొచ్చేంత వరకే తండ్రి. అంతకు మించిన అవసరాలు అనుబంధాలు కన్న వాళ్ళతో అనవసరమనేదే వాడిసిద్ధాంతం వాడి సిద్ధాంతాల రుచి చవి చూడక ముందే, లేదా ఆ దురదృష్టాన్ని అను భవించక ముందే వాడి తండ్రి కన్ను మూశాడు. పెద్దవాడై, గృహస్తుడు గూడా అయిన తర్వాత తల్లిని నీ దిక్కు నీవే చూసుకోమన్నాడు. కన్నీరు నింపు కొని, కడుపు చేత్తో పట్టుకొని దూరపు



బంధువు ఇంటి తరలి పోయిందా మహా తల్లి. ఉపయోగం లేకపోతే భార్యను గూడా చలపతి దూరం చేసేవాడే ; కాని ఆమె సంపాదనపరురాలు. ప్రేమ ఆప్యాయతలు వీటి సంగతేమో గాని, ఆర్జన కోసం ఆమెతో బంధాన్ని అధికం చేశాడు చలపతి. ఆమెకు రొప్పొచ్చినా, రోగమొచ్చినా నాలుగు రోజులు సెలవు పెడితే గిజగిజ లాడిపోయేవాడు. ఆ నాలుగు రోజుల జీతం రాళ్ళు తగ్గించి వస్తాయన్నదే వాడి దుఃఖం వాడి అదృష్టమో దురదృష్టమో పిల్లలు మాత్రం కలగలేదు వాడికి. కలగలేదనే బాధా వాడికిలేదు. బయటి పిల్లల్ని చూసి నప్పుడన్నా ఏ వెలితీ, వేడుకా వాడిలో కన్పించేవికావు. పిల్లలుగూడా పుట్టుక

తోనే సం...చుకొచ్చే ...మైతే కావాలని కావిర్లాకి పోయేవాడేమో మరి!

అటువంటి మనస్తత్వంగల చలప తింటికి అదహా దడహా పోయే అవసరం నాక్కల్లేది నేనే కల్పించుకొనే వాడి నంటే సమంజసంగా వుంటుంది. పదే పదే పట్నం పోయినప్పుడల్లా హోటళ్ళకు తగిలేయాలంటే నాలాటివాడికి అయ్యేపని కాదు. అందునా ఈ కరువు ...ల్లో, ఏ పంచశోనో పబ్బం గడుపు ... తప్పదుమరి. ఆదిలో నా రాకపోకలు ...తగా అవేదన కల్గించేవి గావు వాడికి. పోనుపోను వాడిలో మార్పు స్పష్టంగా కన్పించేది. వెళ్తే ఎప్పుడొచ్చావనైనా పలకరించేవాడు కాదు. ఒక వేళ పలుకరించినా అదేదో మొక్కుబడి కన్నట్లుగానే వుండేది.

ఓమారు ఆరుసగా నాల్గురోజులు పట్నంలో వుండాల్సిన అవసర మేర్పడింది. ఆ నాలుగు రోజులూ తిండీ తిప్పలన్నీ చలపతి ఇంట్లోనే సాగించాను. నేను ఎదురుగా వున్నా, మౌనంగానే వుండిపోయేవాడు చలపతి. వాడి మౌనంలో చిమ్ముకొచ్చిన ఎన్నో భావాల్ని వాడికళ్ళద్వారా చదవగలిగిగాన్నేను. "రోజులు తరపడి మామీద పడ్తుంటే నీ భారం మోయటం మావల్ల కాదు. అన్న విషయం అందులో ఒకటి. ఆ మరుసటిరోజే మావూరికి వచ్చేశాన్నేను. ఒక పదిహేనురోజులలా చల పతినీ, నా అతిథ్యం పెట్టి వాడు చూపిన అయిష్టతనూ మర్చిపోయాను. కారణం! అతకు మించిన విషాద పరిస్థితులు, పిక్కుతినే సంఘటనలు నా సంసారంలో నిత్యమూ ఎదుర్కోవల్సి రావటమే ఈ బరువు ముందు చలపతి అన్న మాటలు, వాటి అంతరార్థాలు వెలికి తెచ్చుకొని తర్కించుకొనే అవకాశం గాని, ఆ ప్రశాంతతగాని నాకు లేకుండాపోయినై.

ఉన్నట్లుండి మళ్ళీ పట్నం వెళ్ళే అవసరం వరద నీరులా తరుము కొచ్చింది. ఈ అవసరం నెరవేరి అనుకున్నవన్నీ సానుకూల పడితే, ఏ చీకూ చింతా లేకుండా ఓపదిరోజు పర్యంతం కుటుంబాన్ని నెట్టుకు రావచ్చు. ఇంకా అదృష్టం కల్సివస్తే మాసానికి సరిపడే గ్రాసం అందినా అందొచ్చు. మధ్యతరగతి బ్రతుకులకు కడుపునిండితే అదే పండుగ. అంతకు మించిన ఆశలు పెంచుకోవటం. ఎంత అపరాధమో, అపచారమో మధ్యతరగతి బరువు బాధ్యతల్ని నిరంతరం మోస్తుండే గృహిణులకు బాగా తెల్సు. పిల్లలకు ఒకపూటైనా కడుపునిండా తిండి పెట్టగలిగిన భర్త, ఇల్లాలి కళ్ళకు సర్వ సమర్థుడైన మగవాడి క్రిందే జమ – ఈ దేశంలో; ఆ మాటకొస్తే ఏ దేశంలోనైనా మధ్యతరగతి బ్రతుకుల్లో సర్దుబాట్లకోసం తహతహ తప్పదేమో మరి! ఎవరేమనుకున్నా, చీదరించినా, ఛీత్క-

రించినా అవసరం మనదైనప్పుడు తలొంచుకోక తప్పదు మరి. చలపతి విషయంలోనూ అధికంగా ఆలోచించటం అనవసర మనిపించింది. వాడి అసంతృప్తి వాడిది నా అవసరం నాది. పబ్బం గడుపుకోవాలనుకొంటే పరాభవాన్ని పట్టించుకోగూడదు.

మరునాటి సాయంత్రం తిరిగి పట్నం చేరుకొన్నాను. ఓ అరగంట అటూ ఇటూ తిరిగి చలపతింటికేసి నడిచాను. గడపలో కాలు పెట్టానో లేదో లోనుండి అరుపులు, పెడబొబ్బలూ విన్పిస్తున్నాయి. పరస్పర తిట్లూ, శాపనార్థాలే గాకుండా ఆ దంపతులిద్దరూ చేతులా చేతులూ గూడా కలుపుకొంటున్నారు. వీడి అరుపులు, ఆవిడ ఏడుపులూ; మొత్తానికి ఆ ఇల్లోక రణరంగమే అయింది. అట్లాగే ఓ అయిదు నిమిషాలు నిలబడ్డాను తలుపు వారగా: మరింత రెచ్చిపోతున్నారు వాళ్ళు. ఆగ్రహావేశాలు మిన్నుముట్టుతున్నాయి. మధ్య మధ్య నాపేరే ప్రస్తావన కొస్తున్నది. వాళ్ళు పడుతున్న ఘర్షణంతా నా గూర్చే అని తెల్సికోటానికి అట్టేసేపు పట్టలేదు. ఓ వారం రోజులవాకాశక్కడ గడపాలని వచ్చిన ఈ తరుణంలోనా వీళ్ళ కీచులాట? మనసంతా అదోలా అయిపోయింది నాకు. ఓ అరగంట తర్వాత మళ్ళీ వద్దామని మెల్లగా మెట్లు దిగాను. తీరా దిగివచ్చిన తర్వాత తెలొచ్చింది; చెప్పులు పైనే వదిలేసి వచ్చానన్న సంగతి. వాటికోసం మళ్ళీ మెట్లెక్కాను. లోపల అరుపుల్లేవు అసలు అలికిడే వున్నట్టులేదు. ఆశ్చర్యంతో తలుపు కొంచెం ప్రక్కకు నెట్టి లోనికి చూశాను. ఈ మారు నోరు వెళ్ళబెట్టటమే నా వంతైంది. ఎన్నాళ్ళనుండో కరువాచిపోయినట్లుగా ఆ దంపతులిద్దరూ కౌగిట్లో ఒకరి కొకరు అతుక్కుపోయున్నారు.

"హడలగొట్టాం వెధవని; మళ్ళీ ఈ గడప తొక్కడు."

చలపతి గొంతు అది.

"ఇప్పటికైనా ఈ పీడ వదిలితే అదే పదివేలు."

వాడి అర్ధాంగి వంత పలుకులు.

ఆ పలుకులు నాకు ములుకుల్లా గుచ్చుకోకపోయినా, నన్ను సాగనంపటానికే ఆ దంపతులిద్దరూ ఇంత నాటకాన్ని కూడబలుక్కొని కొనసాగించారని తెలిసొచ్చింతర్వాత, లోనికి అడుగు పెట్టటానికి నాకు మనస్కరించింది కాదు; ధైర్యమూ చాలింది కాదు. ఉస్సురోమంటూ వెనుదిరిగాను.





# పండగొస్తోంది జాగ్రత్త

సెల్లూరి సీతా రాజేశ్వరరావు

సింగినాదం వడ్డీలెక్కలు చూసుకుని ఆరిపోయిన బీడీ తిరిగి వెల్గించి పంచాంగం యదాలాపంగా చూస్తున్నాడు. పదో తారీఖున దీపావళిపండగ. శీతాకాలం చన్నీటిస్నానం చేసినట్లు సింగినాదం హృదయం ఝల్లుమంది దొంగాడికి పోలీసంటే భయమన్నట్లు పండగలొస్తుంటే సింగినాదానికి భయం. 'గోపాలంగాడు ఈపాటికి ప్రయాణసన్నాహంలో వుంటాడు...'' అనుకున్నాడు.

సింగినాదం వడ్డీలకి వడ్డీలు కట్టి, కక్కుర్తిపడి కడుపు మాడ్చుకుని నాలుగెకరాలు– అరలకారం సంపాదించాడు. వంశోద్ధారకుడు లేకపోయినా చాన్నాళ్ళకి ఆడపిల్ల పుట్టింది 'పెళ్ళిలో మాటవరసకి గోపాలంతో కొడుకైనా అల్లుడైనా నువ్వే' అన్నాడు సింగినాదం. గోపాలం మొదట్లో పండగలకి మావగారి ఆహ్వానాన్ని మన్నించి వచ్చేవాడు. రానురాను 'మీరు వేరే పిలవాలా?' అంటూ శివరాత్రి దగ్గర్నుంచీ సంక్రాంతిదాకా వస్తున్నాడు సింగినాదం పిలవకపోయినా. అయిదుగురు పిల్లల తండ్రయినా గోపాలం తన అలవాటు ఏమాత్రం మార్చుకోలేదు.

తనెంత నిర్వాకస్తుడో గోపాలం అంత దుబారా మనిషి. అయిదు రూపా





యిలు అయిదు పైసల్లా మార్చేస్తాడు ఈ గోపాలం తన వారసుడు కాదని సింగినాదం గ్రహించి దత్తతకోసం ప్రయత్నిస్తున్నాడు. మర్యాదలకిపోయి పండగ పండగకీ నాలుగువందలు వదుల్చుకోవడం సింగినాదానికి చిరాగ్గానే వుంది. అదే వడ్డీకిస్తే ఈపాటికి తనో అర ఎకరం కొనేవాడు.

సింగినాదం దీర్ఘంగా ఆలోచించాడు. భార్య భోజనానికి పిలుస్తున్నా కదల్లేదు. ఇంతలో దివ్యమైన ఆలోచన వచ్చింది.

తిరుపతి యాత్రకి వెళుతున్నట్లు వుత్తరం రాసి పడేశాడు. ఇలా రెండు మూడుసార్లు చేస్తే సిగ్గుపడి వాడురారు. సింగినాదం ఆనందం ఎన్నోరోజులు నిల్వలేదు. నాల్గురోజులు తిరిగేసరికి గోపాలం సంసారంతో దిగాడు.

సింగినాదం వెలవెలబోయాడు.

"నాకూ తిరపతియాత్ర వుందండి మావగారూ, మీరు వెళుతున్నారని బయలుదేరి వచ్చేశాను."

పండగ ఖర్చుకి మూడింతలవుతుందని సింగినాదం గ్రహించేశాడు. "టూరిస్ట్ వెళ్ళేదేటు మార్చారోయ్" అబద్ధం కల్పించాడు.

"తిరపతి వెళదామని మాటవరుసకయినా అనేలేదేమండీ?" సావిత్రమ్మ మొగుణ్ణి నిలదీసింది.

"తెలివితక్కువ సన్యాసిపీనుగా

నోరుమూసుకోవే," సింగినాదం మండి పడ్డాడు.

ఇంకా నాలుగురోజులుంది పండగ. ఇప్పట్నుంచీ తిట్లవేస్తావేమిటి ఖర్మ... సింగినాదం కుతకుత లాడిపోయాడు. పిచ్చికుక్కలా తిరిగేశాడు. వచ్చిన భాషలోను రాసిభాషల్లోను గోపాలాన్ని తిట్టేసుకున్నాడు. ప్రక్కపేటలోవున్న స్నేహితుడి దగ్గరకి సలహాకెళ్ళాడు, లౌకికత్వంలో అతడు సింగినాదానికి గురువు

"ఇవాళ కోర్టుకి ఏలూరు వెళుతు న్నాను. అక్కడ్నుంచి ఆఫీసువాళ్ళిచ్చి నట్లు టెలిగ్రాం యిచ్చేస్తాను."

సింగినాదం మతాబాలా వెలిగి పోయాడు. ఇంటికిపోయి టెలిగ్రాం ఎప్పుడు వస్తుందానని ఎదురుచూస్తూ కూర్చున్నాడు. రాత్రి ఆరున్నరకి టెలిగ్రాం వచ్చింది.

"అరె పండక్కి వుంటావను కున్నాను" సింగినాదం మొసలి కన్నీరు కార్చాడు.

గోపాలం టెలిగ్రాం చూసి పకపకా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతావు ?"

"ఇది ఎవరో నన్ను ఫూల్ చెయ్య డానికి యిచ్చారండీ. నాలుగు రోజుల క్రితమే బెజవాడ ట్రాన్స్ఫరయింది. మీతో చెప్పడం మరిచిపోయాను."

సింగినాదం తల తిరిగిపోయింది. 'వీడితెలివి కాలిపోనూ ? ఎత్తుకి పైఎత్తు వేస్తున్నాడే ?" రాత్రల్లా నిద్రమాని ఆలోచించాడు. ఇక నాలుగు రోజులుంది పండ.. గోపాలంగాడికి తిరుగులేని అస్త్రం వాడాలి అనుకున్నాడు.

తెల్లవారి లేవాక సింగినాదం గృహ ప్రవేశం శుభలేఖ తయారుచేశాడు." మధ్యాహ్నం బండికే వెళ్లాలి సావిత్రీ మనం ... వెళ్లకపోతే కామరాజు వూరుకోడు."

"అమ్మాయి వుండగా నేనెలా రానండీ..."

"మనం వచ్చేదాకా వుంటాడు..." అయిష్టాన్ని జొప్పిస్తూ అన్నాడు :

గోపాలం అక్కడే వున్నాడు. సింగి నాదం ఎత్తు గ్రహించేసి "మేం ఒక్కళ్ళం ఎందుకులెండి...విజయవాడకి టిక్కెట్టు తీస్కురండి ... మళ్ళీ వస్తాం." అన్నాడు.

కొంచెంలో తెమిలిందని సింగినాదం టిక్కెట్లు తీసుకొచ్చాడు. అప్పటికి గోపాలం తయారుగా వున్నాడు "కొం చెం పనివుంది...నాలుగింటికి బయలు దేరాం" అన్నాడు సింగినాదం. బండిలో ఎక్కాక గోపాలం "మీరల్లా వెళ్ళగానే కామరాజుగారు కోర్టుపనిమీద దిగారు... అత్తయ్యగారు ఆమెగొల్సు వాళ్ళమ్మాయికి యిచ్చారు. పండగ కట్నం ముట్టింది .," నవ్వాడు చెబుతూ :

రెండింతలు వూడింది. శ్రమా మిగి లింది సింగినాదానికి.

# మాధవయ్యగారి మనవడు



సినిశెట్టి శ్రీరామమూర్తి

**అ**ది పట్టణమూ కాదు. మరీ పల్లెటూరూ కాదు. మధ్యరకంగా ఉండే మాధవయ్య ఒకనాడు ఆ వూరికి మోతుబరిరైతు. అతను దయార్ద్ర హృదయుడూ దైవభక్తుడు. తన హయాంలో ఎన్నో దానధర్మాలుచేశాడు గుళ్లూ గోపురాలు కట్టించాడు. మరెన్నో పేదవాళ్ళ పెళ్ళిళ్ళుకూడా చేశాడు. అందుకే తన ఏకైక పుత్రుడికి ధర్మయ్య అని పేరుపెట్టాడు.

ధర్మయ్య వయోప్రాయుడయ్యే సరికి, తాతలనాటి ఆస్తి, తండ్రిదేసిన దానధర్మాలలో కరిగి తరిగిపోయి ఉన్న ఒక్క మండువాయిల్లు మాత్రమే మిగిలింది. సీతమ్మ అనే కన్యతో ధర్మయ్య పెళ్ళికూడా అయిపోయింది. సీతమ్మకు తాతగారంటే అమితభక్తి. కాని కొడుకు ధర్మయ్యకుమాత్రం, ఆస్తి తగలేసి దారిద్ర్యమంటే ముంచాడని అమితకోపం.

ఏమైతేనేం మాధవయ్యకు మరణ ఘడియలు ఆసన్నమైనాయి. కోడలు సీతమ్మ కన్నీరుతో నిలిచివుంది. అతని వెతికే నేత్రాలకు కొడుకు ధర్మయ్య జాడే కనిపించలేదు.

"సీతమ్మా" ఆయాసంగా మాధవయ్య పిలిచాడు.

"మామయ్యా" ఏం చెబుతాడోనని ఆత్రంగా ముందుకువంగింది.

"ఆస్తిఅంతా దానధర్మాల పేర పాడు చేశానని అబ్బాయికి నామీద కోపం కదూ !"

అబద్ధంకాదు కాని నిజమని ఆమె చెప్పలేదు

మాధవయ్య బరువుగా బాధగా నిట్టూర్చాడు.

"చూడమ్మా ! తల్లిదండ్రులు చేసిన పుణ్యమే బిడ్డలకు శ్రీరామరక్ష ! ఎన్నో పాపాలుచేసి ఆస్తి కూడబెట్టి బిడ్డకిస్తే, అది వాళ్ళపట్ల శాపమై పగతీర్చు కుంటుందమ్మా ! అసలు మానవుడికి స్వంతమనేది ఏమీలేదుతల్లీ ! మనమే స్వంతం కాదు ... మనమంటే ... ఏమిటో...ఎవరిమో ... ఎవరికీ అర్థం కాదు ... అపుడు ... ఇదంతా కల"

ఇలా అస్పష్టంగా మాట్లాడుతూనే మాధవయ్య ఎప్పుడు ప్రాణం విడిచాడో సీతమ్మ గమనించనేలేదు. చిరునవ్వుతో ప్రశాంతంగా అలా చూస్తూనే ప్రాణాలు విడిచాడు.

మాధవయ్య ఆస్తినివ్వకపోయినా ఆ కుటుంబమంటే ఆ గ్రామస్థులందరికీ ఒక గౌరవాన్ని సానుభూతినీ మిగిల్చి పోయాడు

మాధవయ్య మరణానంతరం, పెద్దలు కట్టిన ఆమండువా యిల్లు తప్ప ఆస్తి పాస్తులు ఏమీ మిగల్లేదు పెద్దలనాటి పాతనగలు అమ్మగా కొంత డబ్బు వచ్చింది. అంత్యక్రియలకు ఖర్చుకాగా మిగిలిన కొద్దిమొత్తంతో, విశాలమైన ఆ యింటి అరుగుమీదనే చిన్న కిరాణా కొట్టు ప్రారంభించాడు ధర్మయ్య.

మెల్ల మెల్లగా ఆ గ్రామం బస్తీలా రూపులు దిద్దుకుంది. యిరవై ఏళ్ళలో దినదినమూ అమ్మకం పెరగడంతో ధర్మయ్యకూడా ఆ వూరి లక్షాధికార్ల జాబితాలో చేరిపోయాడు. హైస్కూలు కాన్వెంట్లూ - సార్లులతో ఆ వూరు చిన్న పట్టణాన్ని స్ఫురింపజేసే స్థాయికి చేరుకుంది.

మామగారు బ్రతికున్నరోజుల్లో ఊరి బాగుకోసం పాటుపడ్డ కష్టం ఈనాటికి ఫలించిందనీ, తమ అభివృద్ధికి మామ గారుచేసిన పుణ్యమే కారణమని సీతమ్మ నమ్మకమైతే, తండ్రిచేసిన మంచికి ప్రతీకారంగా, తన జీవితంలో పిల్లికి కూడా బిచ్చంపెట్టని స్థితికి వచ్చాడు ధర్మయ్య

పెళ్ళయిన చాలాకాలానికి ఆ దంప తులకు ఒకే ఒక బిడ్డ కలిగాడు. తండ్రి

పేరు పెట్టడం ధర్మయ్యకు ఇష్టంలేక పోయినా, సీతమ్మమాత్రం దేవుడు లాంటి మామగారిపేరే పెట్టాలని పట్టు పట్టుక కూర్చుంది. ఇష్టమున్నా లేక పోయినా ధర్మయ్య తలవంచక తప్ప లేదు.

మాధవ్‌కి ఇప్పుడు ఎనిమిదో ఏడు. కాన్వెంటులో లోయర్ కె.జి. చదువు తున్నాడు.

తాతగారి పేరు ఆనోటా ఆనోటా వినడంతో మాధవ్‌కి ఆయనమీద ఎన లేని భక్తి శ్రద్ధలు ఏర్పడ్డాయి.

కాన్వెంటునుంచి రాగానే, కాస్త అవ కాశం చిక్కితే చాలు తల్లిదగ్గర కూర్చొని తాతగారు చేసిన పెళ్ళిళ్లూ పుణ్యకార్యాల గురించీ, చిన్న చిన్న కథలుగా సీతమ్మతో చెప్పించుకొనేవాడు. తల్లి తాతగారి గురించి చెప్పే ఆ మాటలు ఎంతో మధురంగా, శ్రావ్యమైన సంగీ తాన్ని . వింటున్నట్టుగా మురిసిపోయే వాడు పరవశత్వాన్ని పొంది ఆ కాస్సేపూ లోకాన్నే మరచేవాడు మాధవ్.

యాచకుడెవరన్నా గుమ్మంలోకివస్తే చాలు, కొట్టుమీద ఉన్న తండ్రికి కని పించకుండా, దొడ్డివైపుకు వెళ్ళి ప్రక్క గుమ్మంలో నిలబడి, తన బుల్లిచేతులతో వాళ్ళను పిలిచి, గుడ్డ ముక్కలో బియ్యమో; ఏమీ అందకపోతే తల్లి తన కిచ్చినపైసలో ధర్మంచేసి, తృప్తిగా నిట్టూర్చేవాడు.

భిక్షకులు "మాధవయ్యగారంత గొప్పవాడవవుతావు బాబూ" అని మనసా దీవిస్తే; అనిర్వచనీయమైన ఆనందానుభూతితో కళ్ళుమూసేవాడు.

అడుక్కునేవాళ్ళు వీధిగుమ్మం దరి దాపులకు రాకుండా దొడ్డిగుమ్మందగ్గర వేచివుండటం, ధర్మయ్య కళ్ళబడింది. వెంటనే చాటుగా నిలబడి, పరిశీలించడం ఆరంభించాడు.

ఒక కంచం నిండుగా బియ్యం తెచ్చిన మాధవ్, దోసిలిపట్టినన్ని బియ్యం వరసగా ఒక్కొక్కళ్ళకూ ధర్మం చేయడం ధర్మయ్య చూశాడు. ఇంతే ముంది? ఒక్క ఉరకను ముందు కెళదా మని కాస్త ఆలోచించి, ఇంటిలోపలికి వెళ్ళాడు.

నిశ్చింతగా శ్రద్ధాసక్తులతో తులసి కోటకు మౌనంగా నమస్కరిస్తున్న సీతమ్మను చూశాడు. ధర్మయ్య వళ్ళు మండింది. "సీతా!" అని బిగ్గరగా అర చాడు

కళ్ళు తెరిచి "ఏమండీ" అని ప్రశాం తంగా పలికింది, పూజలో పొందిన అను భూతి ఆమె అరమోడ్పు కళ్ళల్లో తళుకు లాడుతున్నాయి.

ఇలాంటి స్థితిలో సీతమ్మను చికాకు పర్చడం ధర్మయ్యకు అంతగా యిష్టం లేకపోయినా, ఇది ఘోరమైన విప త్తుగా భావించిన అతను, ఆలస్యం చేయకుండా ఆమె చేయిపట్టుకుని

"నా తోరా చూపిస్తా! నీ కొడుకు చేసే ఘనకార్యం" అంటూ దొడ్డి గుమ్మం వైపు లాక్కు వెళ్ళాడు.

అప్పటికే కుంచెడు బియ్యం అయిపోయినై యాచకులంతా తిరిగి వెళ్ళిపోయారు. కుంచంతీసుక ఉత్సాహంగా వెనక్కు తిరిగాడు మాధవ్.

తల్లితండ్రీ తనకు కాస్త దూరంలో నిలబడి ఉండటంచూసి గతుక్కుమన్నాడు.

"ఎప్పటినుంచిరా ఈ వ్యవహారం?" వచ్చే కోపాన్ని కళ్ళల్లో గుప్పిస్తూ అడిగాడు ధర్మయ్య.

"ఏది?" నిజంగా అర్థంగాక అడిగాడు మాధవ్.

"ఆ దరిద్రపు వెధవలకు ఇల్లు దోచిపెట్టడం"

"ఇది ధర్మంచేయడం నాన్నా."

"నీ మొహం మరోసారి ఇలాంటి ధర్మాలు చేశావా, కాళ్లూ చేతులూ విరచి మూలకూర్చోబెడతా జాగ్రత్త!"

ఈమాటలేం లెక్కచేయకట్టే కుంచం ఆడించుకుంటూ,ఇంట్లోకి వెళ్ళిపోయాడు మాధవ్.

"చూశావా వాడి పొగరు'' సీతకేసి కోపంగా చూస్తూ రిపోర్టుచేశాడు ధర్మయ్య.

"అంతా మావగారి పోలిక" ఆమె సంతృప్తిగా అంది.

"సీతా!" ఖంగ్‌మన్న ఆ కంఠ ధ్వనికి, అప్పుడే గుమ్మం ఎక్కాలనుకుంటున్న కుక్కపిల్ల 'కుయ్యో' అంటూ బెదిరి పారిపోయింది. సీతమ్మ ఫక్కున నవ్వింది.

ధర్మయ్య రెచ్చిపోయాడు, "ఇతంతా నీవల్లే జరుగుతుంది. నీ కారణంగానే వాడు భ్రష్టుడవుతున్నాడు. నువ్వూ వాడూ, నా సిరిసంపదలు నాశనం చేయడానికి పుట్టిన శనిగాళ్ళు" అంటూ కోపంతీరా తిట్టిన ధర్మయ్య ఆయాసపడుతూ వెళ్ళి కొట్టుమీద చతికిలపడ్డాడు.

సీతమ్మ తిరిగి తులసికోట దగ్గరకు వచ్చి జరిగిన అపచారానికి భర్తను క్షమించమని మనసారా వేడుకుంది,నమస్కరిస్తూ మెల్లగా "నా బిడ్డను మామగారంత మహామనిషిని చేయి తల్లీ" అని ఆనందబాష్పాలు జాలువారగా కళ్ళొత్తుకొని, ఆ దేవికి హారతిచ్చింది.

ఆ రోజునుంచి ధరయ్య ముష్టివాళ్ళు తన ఇంటి పరిసరాలకు రాకుండా, ఒక మనిషిని కావలా పెట్టాడు.

"పేరు ధర్మయ్య ఈయనలో ధర్మగుణమే లేదు. ఆ పసిబిడ్డే నయం" అని గొణుక్కుంటూ వట్టి చేతులతో తిరిగి వెళ్ళిపోయేవాళ్ళు, వచ్చిన యాచకులు.

ఆ రోజు కాన్వెంటు విడవగానే పుస్తకాలబేగ్‌తో చిన్న కారియర్‌తో పరుగు పరుగున మాధవ్ తన రిక్షా దగ్గరకు వచ్చాడు. రిక్షా రంగడు కనిపించలేదు.



నలువైపులా చూశాడు. దూరంలో చెట్టు దగ్గర ఒక ముసలాడితో రంగడు మాట్లాడుతూ వుండటం గమనించాడు.

"నన్ను ఏంచేయమంటావయ్యా! అయ్యగార్ని అడేగాను ఒక పైసాకూడా అప్పు పెట్టనని కసిరికొట్టారు" అంటూ రంగడు కన్నీరు తుడుచుకుంటున్నాడు.

"పనిచేసేకాడ అప్పు ఇవ్వకపోతే పరాయోడు ఎవడిత్తాడురా! పిల్ల బంగారం బొమ్మ. నీ పెళ్ళయి అది కోడలుగా ఇంట్లో కాలెడితే లక్ష్మి వచ్చి నట్టేరా! ఆ తర్వాత నే నేమైపోయినా నా బాధ వుండేది కాదు" అంటూ ముసలాడు కూడా కళ్ళు తుడుచుకున్నాడు.

"రంగడి పెళ్ళికి ఎంతకావాలేమిటి?"

ఆ మధురమైన కంఠధ్వనికి ఇద్దరూ అదిరిపడి ముందుకు చూశారు.

"మా చిన కామందుగోరు" రంగడు చెప్పాడు.

"మాధవయ్యగోరో" వణుకుతూ లేచి మాధవ్ దగ్గరగా వచ్చాడు ముసలాడు.

"మా తాతగారు నీకు తెలుసా ?" ముద్దుగా వచ్చిందా పలుకు.

"అయ్యో బాబో ! ఆయన మా దేవుడు కదూ ! ఎన్ని కష్టాల్లో ఆదుకున్నారు ! నా పెళ్ళి ఆయన ఖర్చుతోనేగా బాబూ చేసింది" అంటూ మాధవయ్య గొప్పతనం గురించి ఇంకా ఎన్నో సంగతులు చెప్పాడు రంగడి తండ్రి.

ఇంటికి ఒక గంట మాధవ్ ఆలస్యంగా రావడంతో "ఏమిరా ఇంత ఆలస్యం" అని రంగడ్ని గదమాయించాడు ధర్మయ్య.

"అది వాడి తప్పు కాదు. నేనే ఆలస్యం చేశాను" అంటూ సమాధానం చెప్పి, తీవిగా వెళ్ళి, ఎదురుచూస్తున్న తల్లి ఆలింగనంలో ఇరుక్కుపోయాడు,

"అంతా మీ నాన్నగారి పోలికే ధర్మయ్యా" సరుకులకు వచ్చిన ఒక పెద్ద చిరునవ్వుతో అన్నాడు.

"అందుకే బాధపడుతున్నా" అంటూ మెల్లగా గొణుక్కున్నాడు ధర్మయ్య.

ఆ రాత్రే తండ్రితో భోజనానికి కూర్చొన్న మాధవ్ మధ్యలో తిండి మాని ధర్మయ్యను చూస్తూ అలా వుండి పోయాడు.

నోట్లో ముద్ద పెట్టుకోబోతూ మాధవ్‌ని చూసి "అలా చూస్తున్నావేంరా ?" అని అడిగాడు ధర్మయ్య,

"చెప్పు బాబూ ఏం కావాలో-" వడ్డనచేస్తున్న సీతమ్మ కూడా అంది.

"నాకో వెయ్యి రూపాయిలు కావాలి"

నోట్లో పెట్టుకున్న ముద్ద తిరిగి ధర్మయ్య కంచంలో పడింది. ఆవలించిన నోటితో కాస్సేపు అలాగే వుండి పోయాడు.

వెయ్యి రూపాయలెందుకో సీతమ్మకు కూడా అంతుపట్టలేదు.

"వెయ్యి రూపాయలా" కటువుగా ప్రశ్నించాడు ధర్మయ్య.

"అవును" తల వంచుకుని అన్నం తింటూనే సమాధానమిచ్చాడు.

"అంత డబ్బెందుకు ?"

"నేనో పేదవాడి పెళ్ళి చేయాలి."

నదురూబెదురూ లేని మాధవ్ సమాధానానికి ధర్మయ్య నిలువెల్లా కంపించి పోయాడు.

"నీ వయస్సెంత నువ్వెంత" కంచంలోనే చేయి కడిగి చివ్వున లేచాడు. సీతమ్మ యిచ్చిన తుండు గుడ్డతో తొందరగా చేతులు తుడుచుకుంటూ "వేలంత లేదు, పెళ్ళి చేస్తాడట పెళ్ళి" ఇలాంటి పిచ్చి పిచ్చి వేషాలు వేస్తే; నీ పెళ్ళి తప్పకుండా చేస్తాను" అంటూ ఆ తువ్వాలు సీతమ్మ మీదకు విసిరి మరీ లేచాడు ధర్మయ్య.

తెలివైన ధర్మయ్య ఆ మరునాడే రిక్షా రంగన్నను తీసివేసి, మరో రిక్షా వాణ్ణి ఏర్పాటుచేశాడు.

పుస్తకాల బేగ్ భుజాన తగిలించు కొని, ఉత్సాహంగా వచ్చిన మాధవ్ కొత్త రిక్షావాణ్ణి చూసి ఆశ్చర్య పోయాడు.

"రంగడేడి?"

"ఇక రాడు" కొట్టుమీద కూర్చున్న ధర్మయ్య సమాధానం చెప్పాడు.

మాధవ్ ఆలోచనలో పడ్డాడు.

"బడికి తీసుకెళ్ళడానికి ఎవరైతేనేం బాబూ! రిక్షా ఎక్కు," టిఫిన్ కారియర్‌తో వచ్చిన తల్లి బుజ్జగించింది.

సీతమ్మ మాట కాదనలేకనో ఏమో మెదలకుండా రిక్షాలో కూర్చున్నాడు. తండ్రిని ఓసారి బిరువుగా చూశాడు. ఆ చూపుకి ధర్మయ్య కాస్త తొట్రుపడ్డాడు. చిన్ననాడు కష్టం కలిగినప్పుడు తన తండ్రి అలాగే చూసేవాడు. "వస్తానమ్మా!" తల్లితో మాత్రం చెప్పాడు మాధవ్ రిక్షా కదిలిపోయింది.

ఆ సాయంత్రం కాన్వెంటు నుంచి కాళీ రిక్షా వచ్చి ఇంటిముందు ఆగింది.

"మాధవ్ ఎక్కడరా?" ధర్మయ్య ఆత్రంగా అడిగాడు. సీతమ్మ అప్పుడే లోపలినుంచి వచ్చింది.

"బడి ఇడిసిపెట్టాక చాలా సేపు చూశానండి. అబ్బాయిగారు రాలేదు. బళ్ళోకి ఎల్లికూడా వెతికానండి. ఎక్కడా కనిపించలేదు.

కొట్టు మీద నుంచి ధర్మయ్య గబా లున లేచాడు. "బాబు ఏమైనట్టండి" సీతమ్మ భయాందోళనలతో అడిగింది.

"వాడు ఎక్కడుంటాడో నాకు తెలుసు" అంటూ రిక్షా ఎక్కిన ధర్మయ్య "పోనియ్యి" అన్నాడు.

సీతమ్మ వెళ్ళే రిక్షాని అయోమయంగా చూస్తూ అలా వుండిపోయింది.

సరాసరి రిక్షామీద వెళ్ళిన ధర్మయ్య రంగడి గుడిసెముందు ఆగాడు.

గుమ్మంలో దిగాలుగా కూర్చుని వున్న రంగడూ, అతని తండ్రి కంగారుగా లేచి ధర్మయ్య దగ్గరకు వచ్చారు.

"మాధవ్ ఏక్కడ?"

రంగడు తండ్రి ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు "మాకేం తెలీదు బాబూ" భయంగా సమాధానం చెప్పారు.

"నాకు తెలుసు. పసివాణ్ణి పురికొల్పి వెయ్యి రూపాయలు కాజేయాలని చూస్తారా! ఓరే రంగా! నా సంగతి నీకు తెలుసు! నిజం చెప్పకపోతే మీ రిద్దరూ రేపీపాటికి జెయిల్లో వుంటారు" బుసలు కక్కుతూ అంటున్న ఈ మాటలకు ఇంట్లో వున్న ముసలమ్మ కూడా బైటకొచ్చింది.

"సత్తెపమాణ పూర్తిగా నాకేం తెలీదయ్యగారు" రంగడు సమాధానమిచ్చాడు.

"పెళ్ళికేదో సాయం చేయమని అంటే; మావోణ్ణి పనిలోనుంచే తీసే-

కారు. పెళ్ళటుంచి ఇక ఐతకటమెల్లాగా అని బెంగలు పడి మేము సత్తుంటే, మా మీద లేని నేరం మోపుతారా బాబూ...ఇదే మీ నాన్నగారయితే...''

''ఊఁ చాల్లే''

రిక్షా గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది.

మరునాడు కూడా మాధవ్ జాడ తెలీలేదు. ధర్మయ్య మాత్రం రంగడికి తెలీకుండానే వాడింటి దరిదాపుల్లో, ఇద్దర్ని కాపలా వుంచాడు. ఆ వూళ్ళో ప్రతి మారుమూలా మాధవ్ కోసం వెదికించారు. కాని మాధవ్ కనిపించలేదు.

సీతమ్మ మాత్రం ఈ రెండురోజులు పచ్చిమంచ నీళ్ళు కూడా ముట్టలేదు. తన ఒక్కగాని ఒక్క బిడ్డ ఏమయ్యాడో ననే బెంగతో మంచంకూడా పట్టింది.

భార్య పరిస్థితి చూస్తే ధర్మయ్యలో మరీ ఆందోళన కూడా పెరిగింది. పోలీసు రిపోర్టులు యిచ్చాడు, రేడియోలో ఎనౌన్సు కూడా చేయించాడు. అయినా మాధవ్ గురించి ఆశాజనకమైన వార్త లేమీ అందలేదు.

మూడోనాడు ఉదయం దుఃఖితురాలైన సీతమ్మ మంచం దగ్గరకు ధర్మయ్య వచ్చాడు.

''ఈ సాయంకాలం లోపుగా మాధవ్ తప్పకుండా తిరిగివస్తాడు.

సీతమ్మ తడి ఆరని కళ్ళతో ధర్మయ్యకేసి ఆశగా చూసింది. ఒక దినపత్రిక చూపించాడు. దానిలో మాధవ్ ఫోటో కనిపించింది.

"ఈ పేపర్లో ప్రకటించాను. మాధవ్ ఇంటికి చేర్చిన వాళ్ళకు వెయ్యి నూటపదహార్లు బహుమతి యిస్తానని.. ఎవడో ఒకడు తప్పకుండా తీసుకొస్తారు" అన్నాడు మనస్సులో దిగులుగా వున్నా పైకి ధీమాగా. అంత మాత్రాన సీతమ్మకు గుండె నిబ్బరం కలగలేదు. పైగా పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ పిల్లలను దొంగిలించే వాళ్ళున్నారట కదండీ" అంది

"అంతా వట్టిది ... మన మాధవ్ మాత్రం ఎవరికీ చిక్కడు..ముమ్మూర్తులా వాడు మా నాన్నే ... '' కళ్ళు తుడుచుకుంటూ ధర్మయ్య ఇక అక్కడ వుండలేక హాల్లోకి వెళ్ళి తండ్రి ఫోటో చూసి వచ్చే దుఃఖాన్ని ఆవుకుంటూ బైటకు వెళ్ళిపోయాడు. ధర్మయ్య చెప్పినట్టుగా ఒక మోటుమనిషి మాధవ్‌ని చంకనెత్తుకుని ఆ సాయంత్రం గుమ్మంలో ప్రత్యక్షమయ్యాడు

ఒళ్ళంతా కళ్లుచేసుకుని చూస్తున్న సీతమ్మ "బాబూ' అంటూ బిడ్డని హృదయానికి హత్తుకొని గొల్లుమంది.

అరుగుమీద నిస్త్రాణంగా కూర్చున్న ధర్మయ్య "ఎక్కడ దొరికాడు?"మెత్తనగా అడిగాడు.

"అబ్బో! నేను పడ్డ అవస్త ఇంతా







అంతా కాదు, ఆ సంగతులన్నీ అబ్బాయి గారు చెబుతారుగాని ముందు దబ్బివ్వండి" చెయిచాచాడు.

ధర్మయ్య మాధవ్‌కేసి చూశాడు. మళ్ళీ అదేచూపు బరువుగా చూస్తున్నాడు ధర్మయ్య ఏమనుకున్నాడో ఏమో, తిరిగి ప్రశ్నించకుండా జేబులోసిద్ధంగా వుంచిన వెయ్యినూటపదహార్లు వాడి చేతిలో పోశాడు.

"చినబాబుగోరో ఎల్లొత్తా" అంటూ డబ్బుయిచ్చిన ధర్మయ్యకేసి కనీసం సూతకుండా, మాధవ్‌కి దణ్ణం పెట్టి వెళ్ళిపోయాడు, ఆ మోటుమనిషి.

ధర్మయ్య ఇకేం మాట్లాడకుండా, మూడురోజులనుంచీ మూసిన ఆ కొట్టు తెరవడానికి పూనుకున్నాడు.

ఇన్నిరోజులుగా తల్లి తన గురించి తిండిమానినందుకు ఆ పసిహృదయం ఎంతో వ్యధపడింది.

ఆ సంధ్యవెలుగుల్లో, తల్లీ బిడ్డ లిద్దరూ అన్నం తింటున్నారు.

"బాబూ! అసలు ఏంజరిగింది? ఇన్నిరోజులు ఎక్కడున్నావ్?" మెల్లగా అడిగింది సీతమ్మ.

మాధవ్ తండ్రి ఎక్కడనుంచన్నా పొంచివింటున్నాడేమోనని అటూ ఇటూ చూసి "రంగడు కాబోయే పెళ్ళాం యింట్లో ఉన్నానమ్మా! పాపం చాలా మంచిది! పెళ్ళాగిపోతే చచ్చిపోవాలను కుందట! నన్ను తీసుకవచ్చినవాడు వాళ్ళన్నే" అన్నాడు.

సీతమ్మకు విషయ మర్థమైంది.

ఇంత చిన్నవయస్సులోనే తనబిడ్డ ఒక పేదింటి పెళ్ళి జరగడానికి దారి చూపాడని, ఆమె గుండెలు ఆనందంతో నిండిపోయాయి.

# ప్రేమ పూజారి

(గత సంచిక తరువాయి)

సాయంత్రం శ్యామ గుడినుండి వచ్చాక కష్ణమూర్తి కూతురు రెండేళ్ళ వనజను ఎత్తుకుని పెరట్లో లేగదూడలను చూపుతూ కబుర్లు చెబుతూ అన్నంతినిపిస్తూంది.

శోభవచ్చి, నిన్నొకమాట అడగాలి. డాబా పైకి రా, అక్కా" అంది.

"ఇదో! ఈ రెండు ముద్దలు తిని పించి దీన్ని వదినకిచ్చి వస్తాను!"

పదినిముషాల తరువాత తడిచేతులు తుడుచుకొంటూ డాబామెట్లు ఎక్క సాగింది. శోభ తననడగబోయే దేమిటో శ్యామ ఊహించకపోలేదు.

చాపమీద పడుకొన్న శోభ అక్క రాగానే లేచి కూర్చొంది. నిష్ఠుర స్వరంతోనే మొదలుపెట్టింది. "నీ మరిది నీకు పెళ్ళిసంబంధం తెస్తే ఛీ! ఛీ! అన్న దానివి! పెళ్ళంటే అసహ్యమన్నదానివి! పిచ్చివాడిని ప్రేమించడం మాత్రం బాగుందా? పెళ్ళిచేసుకు వెళ్ళిపోతే పరువుకాదు. ఇలాంటి తిరుగుళ్ళు తిరిగి కడుపో, కాలో తెచ్చుకొంటే పరువూనా? ఇవాళ / ఉదయం కాలవంచున చెట్ల చాటులో నిన్ను పిచ్చివాడి కౌగిటిలో చూశానని ఆయన చెప్పినప్పటినుండి నా మనసు మండిపోతోంది. ఈ ఇంటి పరువును ఏం చేయాలనుకొన్నావు? అన్నయ్యకి తెలిస్తే నిన్ను చీల్చి కాకులకి గద్దలకి వేస్తాడని తెలియదా?"

పొద్దున భాస్కర్ చూచిన దృశ్యమే చర్చలోకి వస్తుందనుకొంది కాని అది ఇంత అసహ్యరూపంలో వస్తుందనుకోలేదు శ్యామ. బొగ్గులా నల్లబడిపోయింది ఆమె ముఖం. గొంతుకెండిపోయిన దానిలా వెంటనే ఏదీ మాట్లాడలేక పోయింది.

"చెప్పక్కా! ఎందుకిలా వివేకం కోల్పోయావ్?"

"నన్ను బాబు కౌగిలిలో చూశానని మీ ఆయన చెప్పాడా? నువ్వు నమ్ముతున్నావా?"

"అబద్ధం చెప్పడానికి ఆయనకు అవసరమేమిటి?" శోభ కనుబొమలు ముడిచింది.

"పైకి కనిపించేవన్నీ నిజాలు కావమ్మా, శోభా! పైకి కనిపించేదంతా మంచిది కూడా కాదు. అంతా పిచ్చివాడి కూడా నింతని ఆయన సాహచర్యం

పోల్కంపల్లి శాంతాదేవి

సీత గుండెలు అటువంటి పరిస్థితిలో వున్నాయి.

వీధిలో 'ఢయ్యి' మంది.

సీత ఉలికిపడి కనులు, బుగ్గలు తుడుచుకుంది.

వీధిలో వెడుతూవున్న టాక్సీవాడు రిక్షావాడ్ని ప్రక్కకి తప్పుకోమని హెచ్చరించటానికి, క్లమ్మా, యాక్సిల రేటరూ గట్టిగా తొక్కి ఆ చప్పుడు సృష్టించాడు.

సినిమా జనం కలకలం తగ్గింది.

వీధులు పల్చబడ్డాయి. చలిగాలి మొదలయింది.

మున్సిపాల్టీ వీధి దీపాలు గుడ్డిగా వెల్గుతున్నాయి.

"నాన్నా! కొట్టండి నాన్నా. మరేం ఫర్లేదు" నిద్రలో శశిధర్ కలవరించాడు.

గబగబ లోపలికి వెళ్ళింది సీత.

"బాబూ! శశీ!"

శశిధర్ మరల నిద్రలోకి జారుకున్నాడు.

"శశీ! శశీ!"

శశి మాట్లాడలేదు. దుప్పటి సరిగ్గా కప్పి శశిని ప్రక్కకి తిప్పి పడుకో పెట్టి మరల వీధి వరండాలోకి వచ్చింది సీత.

వొంట్లో నీరసంగా వుంది. నరాలు లాగుతున్నాయి.

స్తంభాన్నానుకుని అలాగే నిలబడింది సీత. సీత కన్నులు ఎదురు తెన్నులు చూస్తున్నాయి. చీకట్లోకే చూస్తూ కాసేపు వుండిపోయింది, సీత.

అప్పుడే బరబరమని చప్పుడు చేసుకుంటూ వచ్చి ఆగింది. ఒక స్కూటరు. ఆనందరావు ఇంటిదగ్గర ఆగిన స్కూటరు లైట్లు ఆరిపోయేయి

కళ్ళు చించుకుని చూసింది సీత!

సీత గుండెలు ఝల్లుమన్నాయి

సీత నరాలు గజగజ వణికేయి!

మనసు తల్లడిల్లింది!

(సశేషం)






'నీరజా ! ఓ నీరజా ! యింకా రెడీ కాలేదూ! అవతల సినీమాకి టైము కావస్తోందోయ్ !"

ఆఫీసులోనే ఆలస్యం అయి యేకంగా రిషాకూడా తెచ్చి వాకిట్లో వుంచి మదన్ నీరజకోసం కేకపెట్టాడు. నీరజ వంట గదిలోని సామానులన్నీ పెరట్లో పడేసి బొద్దెంకలమీద దండయాత్ర చేసి నట్లుంది. తర్వాత యేమయిందో కానీ యెక్కడి సామాను అక్కడే వదిలి పడక కుర్చీలో పడుకుని పమిటచెంగు ముఖాన కప్పుకుని యేడుస్తోంది. కళ్ళు యెర్రగా వున్నాయి. ముఖం జిడ్డు కారుతోంది.

"మళ్ళీ యేమయింది?'' విసుగ్గా అడి గాడు. అసలు యిలా నీరజని చూడటం పెళ్ళిఅయిన రెండు నెలల్లోనూ యిది అయిదోసారి

"పుత్తరం వచ్చింది" కళ్ళు తుడుచు కుంటూ అంది.

"యెక్కడనించి ?"

"యెక్కడనించో అయితే నే యేడవటం యెందుకూ ! మా చెల్లికి జ్వరంట. నా ఫ్రెండ్ రాసింది."

"యీ కాస్త విషయానికే యేడుపెందుకూ ! జ్వరంవస్తే అదే తగ్గుతుంది. అవతల సినిమాకి టికెట్లు రిజర్వేషన్ చేయించాననీ, త్వరగా వస్తాననీ చెప్పి వెళ్ళానుగా !"

"నా మనసు బాగాలేదు."

"నా ఖర్మ, నీ మనసెప్పుడూ బాగోదు" తలకొట్టుకుని కోపంగా ఆ రిక్షావాడిని పంపేసి వంటగదిలో గిన్నెలన్నీ మూతలుతీసి చూసి ఛీ ఛీ ఆకలి మండిపోతున్నా యేంలేదు అనుకుని కాస్త "టీ" కాచుకుని తాగేసి యివతలకి వచ్చేసి సిగరెట్ వెలిగించుకున్నాడు. అయినా కోపం తగ్గటంలేదు మదన్‌కి. నీరజ కళ్ళు తుడుచుకుంటూ భర్తవైపు ఓ కంటితో చూస్తూనే వుంది. అతను వచ్చి ఓదార్చకపోయేసరికి దుఃఖం మరీ యెక్కువైంది.

అసలు మదన్, నీరజా ఒకర్ని ఒకరు ప్రేమించుకుని పెళ్ళాడారు. యిద్దరి తల్లిదండ్రులూ యీ పెళ్ళికి అంగీకరించకున్నా "మా పెళ్ళి మా యిష్టం" అనీ ఒకర్ని ఒకరు వదిలి వుండలేమనీ పెదలకి తెలియకుండా గుళ్ళో పెళ్ళిచేసుకుని వుద్యోగానికి ట్రాన్స్ఫర్ చేయించుకుని దూరంగా వచ్చేశారు. మదన్ని స్నేహితులు చాలా అభినందించారు. "నువ్వే నోయ్ యీనాటి యువతరానికి ప్రతినిధివి, ఆశాకిరణానివి ఆదర్శమూర్తివి" అంటూ పొగిడేశారు ఆనాడు జరిగిన విషయాలు తల్చుకుంటే మదన్‌కి యిప్పటికి గర్వంగా, తృప్తిగా వుంటుంది. పెద్దన్నయ్యలా పదివేలకి అమ్ముడుపోకుండా చిన్నన్నయ్యలా "మేనరికం" అంటూ చింతపండు రంగులోవున్న పిల్లని పెళ్ళాడలా. తనని ప్రాణంకంటే యెక్కువ ప్రేమిస్తున్నా అని ప్రేమలేఖలు కురిపించిన ఒకప్పటి క్లాస్‌మేట్ నీరజని పెళ్ళాడేశాడు కొత్త కాపురం పెట్టాడు. నీరజకోసం తల్లిదండ్రులకి దూరంఅయినా దిగులుపడలేదు. పడకూడదు అని తనకి తను ధైర్యం చెప్పుకున్నాడు. కొత్తకాపురంలోకి కావల్సినవి ఒక్కొక్కటి అమర్చుకోవటం మొదలెట్టాడు.

అయితే ఒక్కనెల చాలా సంతోషంగా గడిచిపోయింది. యింక నీరజలో ప్రతివిషయానికీ విపరీతార్థాలూ, విసుగూ మొదలైంది.

యిద్దరిలోనూ మనస్పర్థలు ప్రారంభమైనాయి. అవి చిలికి చిలికి గాలివానలా అవుతూన్నాయి, చిన్న కారణాలకే. యిలా జరక్కూడదని చాలా ప్రయత్నిస్తూన్నాడు కానీ నీరజకి బొత్తిగా బుద్ధి లేదు.

యీ పెళ్ళితో తనవాళ్ళు దూరమై

నారు అనే బాధేకానీ నా వాళ్లూ దూరం అయారుగా అనే జ్ఞానం కాస్తన్నా లేదు. నాకుమాత్రం వాళ్ళ అందరినీ వదిలి వుండటం కష్టంగా లేదా!

యిలా ఆలోచించేసరికి నీరజమీద జాలి పోయి కోపం ముంచుకువస్తుంది.

నీరజ తండ్రికి గుమాస్తా వుద్యోగం అయినా అయిదుగురు ఆడపిల్లలు. తన లాంటి వరుడిని నీరజకి తేవాలంటే అధమపక్షం అయిదువేలన్నా "కట్నం" యివ్వకుంటే యీ పిల్లకి పెళ్ళి జరిగి వుండేదా! నీరజ అందంచూసి ప్రేమిం చాడు, పెళ్ళిచేసుకున్నాడు తను. యిందుకు మామగారికి కృతజ్ఞత లేక పోగా "మా అమ్మాయి భవిష్యత్తుని నాశనంచేశావు" అంటూ అడ్డమైన మాటలూ అంటూ అవమానపర్చాడు. అంతే, యింక నీవాళ్ళు అనే వాళ్ళెవరూ యీ నా గడప తొక్కగూడదు! అనే శాడు మదన్.

"అలా అనకండి" అంటూ రెండు రోజులు వుపవాసం చేసింది నీరజ. అయినా మదన్ రాజీకి రాలేదు.

అప్పుడప్పుడూ నీరజ అమ్మా, నాన్నా, చెల్లెళ్లూ, తమ్ముళ్ళూ గుర్తు కొచ్చారు అంటూ భోరుమంటుంది. యింక ఆ రోజంతా యిద్దరికీ తిండీ, తిప్పలూ వుండవు. వండిన అన్నం తెల్లవారి అప్పలమ్మ సత్తు కారియర్‌లోకి వెళ్ళిపోతుంది.

"నీరజా నేనసలే ఆకలికి ఆగలేను. నీవిలా చెయ్యకు. నిన్ను వదిలి నే నొక్కడినే కడుపునింపుకునే కసాయి వాడిని కాను" అని ఒకసారి కాదు వంద సార్లు చెప్పాడు నెమ్మదిగా. అప్పుడు మాత్రం "సరే" అని గొర్రెపొట్టేల్లా తల ఆడించేస్తుంది. కానీ సమయంవస్తే మామూలే.

నీరజ మదన్‌ని ప్రేమించింది. కానీ అతని అలవాట్లూ, మాటలూ కొన్ని నచ్చవు పైగా అసహ్యాన్ని కల్గిస్తాయి. మదన్ ఆఫీసులో పనిచేసే అమ్మాయిలని వెంటేసుకుని సినీమాలకీ, షికార్లకీ అంటూ తిరుగుతూ డబ్బు ఖర్చుపెట్టటం అస్సలు నచ్చదు ఒకప్పుడు యీ అల వాట్లకే ఆకర్షితురాలై పెళ్ళాడినా యిప్పుడు వాటిని భరించలేకపోతోంది. పైగా అసహ్యాన్ని పెంచుకుంటూ వుంది లోలోపల.

యిద్దరి మనస్సుల్లోనూ అప్పు డప్పుడూ యిలాంటి భావనలు కల్గినా ఆవేశపడిపోయినా తర్వాత యెవరో ఒకరు రాజీకి వస్తూ రెండు నెలలు గడిపేశారు.

"అసలీ పెళ్ళిచేసుకోవటంలో పొర పాటు చేశానా!" అని తనలో తను మధనపడిపోతూ వుంటాడు మదన్, తన వాళ్ళ యోగక్షేమాలు తెలియక ఆరాట పడేప్పుడు.

మదన్‌కి నీరజ ఒకప్పుడు ప్రేమ

స్వరూపిణిగా మరొకప్పుడు సత్య భామలా యింకొప్పుడు శూర్పణకలా రకరకాలుగా కన్పిస్తూవుంటుంది.

"యివన్నీ మీ వూహలే కానీ నేనెప్పుడూ ఒకేలా వున్నాను" అంటుంది మదన్ తన భావాలని బైట పెట్టినప్పుడు.

"కాదు. నీకు ముక్కుమీదే వుంటుంది కోపం. ఆడపిల్లకి అంత కోపం తగదు" అంటాడు శాంతంగా.

"అది నా స్వభావం. చస్తే పోదు'' అంటుంది

''మార్చుకుంటే అన్నీ పోతాయి. ప్రయత్నించు " అంటే చాలు కోపం వచ్చేస్తుంది నీరజకి. "నాకేం అవసరం లేదు, రాదు ! చస్తే మార్చుకోను...''

తనే నీరజని నమిలి మింగేయా లన్నంత కోపం వస్తూన్నా మింగేసి "ఖర్మ'' అని జుట్టు పీక్కుని ఆ రాత్రి భోజనానికైనా పిలవని భార్యని "రాక్షసి" అనుకుంటూ తెల్లవార్లూ జాగారంచేస్తాడు. కానీ నీరజ నిశ్చింతగా నిద్రపోతుంది, తను ఒక్కర్తీ హాయిగా అన్నం తిని.

యింక తెల్లవారి లేచి ఫిల్టర్ డికాషన్‌తో చిక్కటి కాఫీ తాగేసి యింకా నిద్రలేవని మదన్‌ని "యీవాళ ఆది వారం కాదు అయ్యగారూ ! ఆరుగంట లైంది లేవండి'' అని వంటయింట్లోనించే గావుకేకలు పెడుతుంది.

రాత్రి అంతా జాగారంచేసి తెల్లవారు ఝామునకి కాస్త కునుకుపడితే అప్పుడే లెమ్మని గోలచేసే నీరజని యేం చెయ్యాలో అర్థంకాదు. పోనీ బద్ధకంగా లేచి కాఫీ తాగి వాలుకుర్చీలో కూర్చుంటే,

"చింతపండు కావాలి ! చీపురుకట్ట

కావాలి! కూరలు కావాలి" అంది గోడతో మాట్లాడుతూన్నట్లుగా

"పెళ్ళిచేసుకున్నంత బుద్ధి తక్కువ లేదు" అనుకుంటూ బట్టలు వేసుకుని సైకిల్ తీసుకుని బజారు బయలుదేరాడు మదన్. కావల్సినవి తీసుకుని ఆఖరున చీపురుకట్టలు చూస్తూంటే ఆఫీసులో టైపిస్టు మేరీ కన్పించింది.

కబుర్లుచెప్తూనే "మదన్‌గారూ! మీకూ చీపుళ్ళూ, చింతపండూ కావాలా?" అంది ఆదోలా నవ్వుతూ.

"అంటే" యెదురుప్రశ్న వేశాడు.

"అహ యేంలేదు ప్రేమ వివాహం కదూ! ఆకలిదప్పులు వుండవేమో అనీ గాలి పీలుస్తూ, ప్రేమగీతాలు పాడుకుంటూ బ్రతుకుని గడిపేస్తారేమో అనీ..." సాగదీస్తూ అంది మేరీ.

యిలాంటి మాటలు వింటే యిదివరకైతే పొంగిపోయేవాడు. కానీ యీవాళ మాసినగడ్డాన్ని యెడంచేత్తో రాచుకుంటూ "చూడండి. ప్రేమవివాహం అయినా కాకున్నా ఆ తర్వాతి జీవితాలు అందరివీ ఒక్కలానే వుంటాయేమో!"

"అంతేనంటారా!" అని వాచీ చూసుకుని మేరీ టైము అయింది అని వెళ్ళిపోయింది.

మదన్ యింటికి వచ్చేన సంచీ భార్యకిచ్చి గడ్డం చేసుకునేందుకు అద్దం తీసుకుంటూ వుంటే "మార్కెట్లో కోతులాడుతూన్నాయా! యీ రెండూ తేవటానికింతసేపూ?" అంది నీరజ కోపంగా.

మదన్ కోపంవస్తూన్నా మింగతూ,

"టైము చాలా అయింది యింతా వేస్టు చెయ్యకు" అన్నాడు.

"తొమ్మిదింటికి కూరలు తెచ్చి నా ముఖానవేసి అర్ధగంటలో అన్నంపెట్టు అంటే నేనేం సతీ అనసూయనా! యీ ముదురు బెండకాయలన్నీ క్షణంలో వుడికించెయ్యటానికి" అంది కోపంగా చేతులు చాస్తూ.

"నువ్వు గృహిణివి కావూ, అర్ధగంటలో వంటచెయ్యలేవూ?"

"నేను ముందు ప్రియురాలిని. కనుకనే పదండి పోదాం హోటల్‌కి. సాయంత్రం తీరిగ్గా వేయిస్తాను బెండకాయ వేపుడు" వేపుడు అంటూ వత్తి పలికింది.

"యిలాంటి మాటలు ఆ మూడు ముళ్ళు పడకముందు అంటే నాలాంటి ప్రతి వెధవా కాబూలీవాలా దగ్గరైనా డబ్బుతెచ్చి "ఆటో"లో హోటల్‌కి తీసుకువెడతాడు. కానీ నువ్వు సాక్షాత్తూ గృహలక్ష్మివి. కనుక వెంటనే పప్పు పులుసు చెయ్యలేకుంటే నేవేసిన మూడు ముళ్ళకీ సార్ధకత వుండదు"

"మూడు ముళ్ళకీ మరో పదిముళ్ళు వెయ్యండి యీ తాడుతోనే. యింక "పురి" అక్కర్లేకుండా చచ్చి వూరుకుంటాను. పావుగంటలో పదిరకాలు

వండి వడ్డించటం నా తరంకాదు అయినా యింత తిండిపోతుతనం యేమిటి ! గతిలేనివాళ్ళలా."

"యేంకూశావే ! నే తిండిపోతునా?" చర్రున లేచాడు మదన్.

"........ ..''

'మీరు తిండి తినరూ ! పస్తులతో చస్తారా !' ఆవేశంగా అరిచి స్నానానికి వెళ్ళిపోయాడు

బట్టలు వేసుకుని ఆఫీసుకి బయలు దేరుతూంటే నీరజ మెల్లిగా అంది.

''వంట అయింది, వడ్డించాను'' అని.

మదన్ కోపం మంచులాగా కరిగి పోయింది. ఛీ నీరజని యేం అనకూడదు అనుకుంటూ భోజనంచేసి ఆఫీసుకి వెళ్ళి పోతూ చెప్పాడు

"త్వరగా వస్తాను, రెడీగా వుండు. సినిమాకి పోదాం! నీ ఆరాధ్య 'హీరో' పిక్చర్‌కి టికెట్లు రిజర్వేషన్ చేయించేసి మరీ వస్తాను !''

యీ మాటకి నీరజ ముఖం వికసిం చింది. అది చూసి వుత్సాహం తెచ్చుకుని ఆఫీసుకి వెళ్ళిపోయిన మదన్ ఆఫీసు లోనే ఆలస్యం అయిపోయిందంటూ రిక్షాలో వస్తే నీరజ తనవాళ్ళకి బాగా లేదని యేడుస్తూ కూర్చోవటంతో అశాంతీ, అసహనంతో వీగిపోయాడు మదన్. యిప్పుడేం చెప్పినా ప్రయో జనం వుండదు అని బాగా తెల్సు.

"ఖర్మ ఖర్మ" నెత్తికొట్టుకున్నాడు. కోపాన్ని తగ్గించుకోవాలని ప్రయత్ని స్తున్నాడు.

రాత్రి తొమ్మిదింటివరకూ చూసినా నీరజ లేచి వంట ప్రయత్నం చేసేలా కన్పించలేదు. బతిమిలాడాడు ''నే వండనా, తినకి" అంటే దుప్పటి ముసుగు బిగించి.

మదన్ ఆకలి భరించలేక అలా ఒని నీరజని వదిలి తను తినలేక కళ్ళు మూసుకుని పడుకున్నాడు

తెల్లవారింది

"వంట అయింది భోజనం చెయ్యండి" అని నీరజ పిలిస్తే బాగుండు అనుకుని చాలాసేపు చూశాడు. అవతల ఆఫీసుకి టైముఅయిపోతూ వుంది తనే "వంట అయిందా !" అని అడగాలి అని అనుకుని "అహం'' అడ్డువచ్చి ఆకలి తోనే వెళ్ళిపోయాడు.

ఆఫీసులోనూ శాంతిలేదు. తలనొప్పి పగిలిపోతోంది. కాఫీ తాగినా తగ్గలేదు నీరజ ఒక్కొక్కప్పుడు యిలా చేస్తూ వుంటుంది యెందుకూ ? అని ఆలో చిస్తూంటే యేవేవో గుర్తుకి వస్తూ న్నాయి. ఒకటి రెండుసార్లు సిగరెట్ పీకెలు కన్పించాయి. అవి తను వాడేవి కావు ! యెవరో కొత్త వ్యక్తి వచ్చి వుండాలి ! నీరజకి అంత సన్నిహితు లెవరు !

ఛీ యీలాంటి అనుమానం పెట్టుకో కూడదు. నూరేళ్ళు కల్సి బ్రతకవల్సిన

జీవితాలు. నేనిలావచ్చానని నీరజ బాధ పడిపోతూ అన్నం మానేస్తుందేమో. నన్ను తన ప్రాణంకంటే యెక్కువగా ప్రేమించిన నీరజకి యెంత అన్యాయం చేస్తూన్నాను ! యీ రోజునించీ యిలా చెయ్యను. అనుకుని కలవుపెట్టి యింటికి వచ్చేశాడు. వీధి తలుపు తోసుకుని రాబోతూంటే పడక గదిలోంచి మాటలు వినిపిస్తూంటే ఆశ్చర్యపోతూ అక్కడే ఆగిపోయాడు.

''నీరూ మదన్‌కి బాగా టోపీ వేసేశాం కదూ ! యీ కరువుకాలంలో ఆడపిల్ల పెళ్ళి అంటే మాటలా ! కనీసం కట్నం అయిదువేలూ, ఖర్చు అయిదు వేలూ అయినా కావాలి ! ప్రేమించానని పెళ్లాడి మమ్మల్ని రక్షించావు లేకుంటే అప్పులపాలు అయిపోయివుండేవాళ్ళం. నీకులానే మన "రమ''కి ఓ ఇంజనీరు ఫ్రెండ్‌ని చూపాను. అది వట్టి చవట ముఖం. అతనితో సినీమాలూ, షికార్లూ చేసి పెళ్ళి విషయం తేల్చుకోక "కడుపు" తెచ్చుకుని మా ప్రాణం మీదకి తెచ్చింది. దరిద్రగొట్టు ముఖంది."

నీరజ అన్న శ్రీహరి గొంతు అది.

''అయ్యో ! యిప్పుడెలా ! అతన్ని వదలకండి.''

"అతను మదన్‌లాంటి పిచ్చివాడు కాదు. 'ఛీఛీ పొండి' అని ఛీకరించి నన్ను మెడపెట్టి గెంటించేశాడు. అన్నట్లు నాక్కాస్త డబ్బు కావాలమ్మా. చాలా అవుసరం. నాకు పిల్లని యిస్తాం అని వచ్చారు. పదివేలకి కట్నం పైస తగ్గను అని చెప్పేశాను. "సరే" అన్నట్లే వాళ్ళు. అన్నట్లు నిన్న నే తెచ్చిన స్వీట్లు అతనికిగాని పెట్టలేదు కదా ! నీవంత తెలివితక్కువదానివి కాదులే !''

''అవన్నీ సరేగానీ నా దగ్గర పైస లేదు. ఆయన ఒట్టి పీనాసి. పైస యివ్వరు. నా కసలు విసుగ్గా వుందీ కాపురం."

"అయ్యో అలా అని కాపురం వదిలి రాకే తల్లీ!'' గాభరాగా అన్నాడు.

యింక వాళ్ళ మాటలు వినే సహనం లేక గభాలున తలుపు తోసుకుని గది లోకి వచ్చాడు మదన్. శ్రీహరి తృళ్ళి పడి లేచి నిల్చున్నాడు. నీరజ వణికి పోయింది. ''మీరు ... వచ్చేశారేం ?'' అంది యెలాగో గొంతు పెగుల్చుకుని.

యెందుకు వచ్చానా! మీ అంతు చూడ టానికి" అంటూ శ్రీహరి షర్టుపట్టుకుని ఒక్క గుంజు గుంజి యేంరా ! చెల్లె ళ్ళని యెరగాపెట్టి నాలాంటివాళ్ళని వలలో వేసుకుని మా యిల్లు గుల్లచేద్దాం అని వచ్చావా !

మీ బోడి తెలివి నా దగ్గర పని చేసింది కానీ ఆ ఇంజనీరు మీకు బాగా బుద్ధి చెప్పాడుగా. గుర్తువుంచుకుని మరెప్పుడూ బుద్ధితక్కువ పనులు చెయ్య



కండి. డబ్బులేకున్నా మంచి మనస్సు వుంచుకోవాలి అదీ లేదు మీకు, అని యిప్పుడు తెల్సింది. ఛీఛీ...నా జీవితం నాశనం చేసుకున్నాను నువ్వు చెల్లెలిని దొంగతనం కూడా చెయ్యమని ప్రార్థిస్తున్నావా !'' గద్దించి అడిగాడు.

"బావగారూ ! మీరు ... పొరబడుతున్నారు...మీ కాపురం యెలా వుందో చూసిపోదాం అనే వచ్చాను అంతే ... అంతే ... '' యింకా యేదేదో చెప్పబోతున్న శ్రీహరిని మెడపట్టుకుని వీధిలోకి నెట్టేసి తలుపు ఘడియ బిగించేశాడు.

"యిప్పుడు చెప్పు. నీ విషయం... నన్ను ...కట్టుకున్న భర్తని మోసగించాలని ప్రయత్నిస్తావా ! నువ్వు ఆడదానివేనా ! చెప్పు."

"........''

''నేనూ నా అలవాట్లూ నచ్చకుంటే నిర్భయంగా చెప్పి నీ దారిన వెళ్ళిపో. కానీ యిలా దొంగనాటకాలు ఆడకు... తెల్సిందా ! చెప్పు. యిక్కడ వుండటం యిష్టం వుందా ! లేదా ! చెప్పు, జవాబు చెప్పు."

"........''

"నీ పద్ధతులు యెన్నో నాకు నచ్చకున్నా భరించటంలేదూ !''

"........"

''పెళ్ళికాకముందు నీవు లేకుండా బ్రతకలేను అని చెప్పిన నీకు యిప్పుడేమయింది !

నీ కోసం నా వాళ్ళందరినీ వదులుకోలేదూ ! మాట్లాడవేం !'' మదన్‌కి కోపంతో వళ్ళు దహిస్తూన్నా నీరజ

సరిగా ఒక్కమాట మాట్లాడితే చాలు చల్లబడిపోయేవాడు. కానీ నీరజ మొద్దులా నిల్చుంది. అలా నిల్చోవటంలో భయంకాదు. తనంటే తేలిక భావం వుందని తెల్సి భరించలేక ఆవేశ పడిపోతూన్నాడు మదన్. అందుకే రెట్టించి అడిగాడు.

"నాకు నావాళ్ళుకూడా కావాలి'' అంది.

"అయితే వాళ్ళదగ్గరకే వెళ్ళు" మదన్ నీరజని రెక్కపట్టుకుని వీధిలోకి తోయబోతూంటే నీరజ గుంజుకుంది

"నా యిష్టంలేకుండా ఒక్కక్షణం యిక్కడ వుండటానికి వీల్లేదు" అంటూ ఆవేశంగా అవతలకి తోసేసి నీరజకి సంబంధించినవి పెట్టే, బట్టలూ వీధిలోకి విసిరేస్తూన్నాడు. నీరజ రాయిలా నిల్చుంది.

యింతలో యింటిముందు రిక్షా ఆగింది. అందులోనించి మదన్ తాత గారూ, నాయనమ్మా దిగారు. సత్తు గిన్నెలో నెయ్యీ, వేరుసెనక్కాయల మూటా, బెల్లం అరిసెలూ నువ్వు లుండలూ, అప్పడాలూ. వడియాలూ యిలా యెన్నెన్నో మూటలు కట్టుకుని మనవడి కొత్తకాపురం చూడాలని రైలు దిగి రిక్షాకట్టించుకుని యిక్కడికి వచ్చారు అసలు మదన్ తాతగారు సీతారామయ్యకీ, కొడుక్కీ మదన్ పెళ్ళి విషయం గురించి చాలా ఘర్షణ అయింది

"నా పరువు తీశాడు నీ ముద్దుల మనవడు" అని తండ్రి అంటే యింక తాతగారు "పోనివ్వు. కోరిన పిల్లని కట్టుకుని సుఖంగా కాపురం చేసు కుంటాడు. నూరేళ్ళ దాంపత్యం సుఖ సంతోషాలతో వెల్లివిరియాలి కానీ నీకు కట్నం డబ్బు పోయిందని దిగులు పడతావేం. పోతేపోయింది," అనేశాడు ముసలాయన. యింక మదన్ తండ్రి మండిపోతూ "నీ గారాబమే వాడిని పాడుచేసింది. నేనంటే విలువలేకుండా చేసింది. నలుగురిలో తలెత్తుకోకుండా చేశాడు అప్రాచ్యుడు. వెధవ శుంఠ'' అంటూ "వాడింక నా యింట్లో కాలు పెట్టటానికి వీల్లేదు'' రంకెలు వేశాడు.

ముసలాయన ఓ నెల చూశాడు రెండు నెల్లు చూశాడు. అంతే. భార్యతో బయలుదేరాడు. వాడు నీ గడపతొక్క వద్దు అన్నావుగా మేమే వాడిని చూస్తాం అని వచ్చేశాడు. వస్తూ మనవడికి యిష్టం అయినవన్నీ మూటలు కట్టుకుని వస్తే యిక్కడ యిలా వుంది. ముసలి వాళ్ళిద్దరూ మొదట తెల్లబోయి ఆపైన సర్దుకుని ఒకరి ముఖాల్లోకి ఒకరు చూసుకుని,

"ఒరే మదన్'' అని కేకపెట్టాడు తాతగారు। మదన్ కలగంటూన్నానా అని క్షణం నిర్ఘాంతపడి అంతలోనే




"తాతయ్యా, నానమ్మా" అంటూ అమాంతం వచ్చి యిద్దరినీ వాటేసుకున్నాడు. "నానమ్మా నేనంటే మీ కోపంతేదూ ?" అన్నాడు.

"నీ ముఖం కోపం యెందుకురా ?" అంటూ విగ్రహంలా నిలబడ్డ నీరజ చెయ్యిపట్టుకుని లోపలికి తీసుకు వస్తూంటే "వద్దు, దాన్ని లోపలికి తీసుకు రావద్దు నానమ్మా" అన్నాడు ఆవేశంగా.

'ఒరే ఒరే అటు చూడు, వీధిలో యెందరు చూస్తూన్నారో నీ వైపు. యేదైనా విషయం వుంటే భార్యాభర్తలు వీధిలోనుట్రా పరిష్కరించుకునేదీ ? అయినా పెళ్ళిఅయి పట్టుమని పదినెలలు కాలేదు. అప్పుడే యిదేమిటీ, సరే... యిప్పుడు నువ్వేం చెప్పకు. ముందు స్నానం, భోజనం కానిచ్చిగానీ తాపీగా వినం" అన్నారు యిద్దరూ యేక కంఠంతో.

నీరజ "అమ్మయ్య" అనుకుని లోపలికివెళ్ళి చకచకా చేసేస్తోంది వంట.

"పిల్ల లక్ష్మిలా వుంది" నానమ్మ ప్రశంశాపూర్వకంగా చూస్తూ అంది మనవడితో.

''వుంది కానీ గుణం లేదు."

"నీ ముఖం. అవన్నీ నే నేర్పిస్తారా పిచ్చి సన్యాసీ. చూడు. కొన్నాళ్ళు వుంటాంగా అంది" ముసిముసి నవ్వులు నవ్వుతూ.

ఆ తర్వాత తాపీగా మనవడూ, మనవరాలూ చెప్పినవన్నీ విన్నారు. మౌనంగా వూరుకుని మనవడు లేకుండా నీరజని పిల్చి మెత్తగా చివాట్లు పెట్టింది నానమ్మ. "పెళ్ళి అయిన యే ఆడదాని కైనా అందరికంటే ముఖ్యుడు మొగుడు తల్లీ! అతని జీవితంలో భాగం పంచుకుని యిల్లుని 'స్వర్గం' చేసుకుని అ తర్వాత మిగతా అందరి విషయమూ ఆలోచించాలే పిచ్చి పిల్లా! మా మదన్‌ది వెన్నలాంటి మనస్సు. యిలాంటివాడు దొరకటం నీ అదృష్టం. వాడూ అచ్చంగా వాళ్ళ తాతగారి పోలిక. అలవాట్లూ అవే. చూడమ్మా జీవితంలో చిన్న విషయాలకే అయినా పట్టుదలలూ, పంతాలూ భర్తతో కాదు ''

యింక తాతగారు మనవడిని దగ్గర కూర్చోపెట్టుకుని,

"నీ సెలక్షన్ అద్భుతంరా మదన్! కానీ ప్రేమించానూ, పెళ్ళాడానూ ... అనగానే జీవితంలో సంతోషం రాదురా! చూడూ మీకు ఒకర్ని ఒకరు అర్థం చేసుకునే అవకాశాలు యెక్కువ వున్నాయి. ఒకరి బలహీనతలని ఒకరు సర్దుకుంటూ వుండాలి. దాంపత్య జీవితం అంటే నూరేళ్ళ పంట. యీ జీవితాన్ని ఆదర్శవంతంగా, అందంగా మల్చుకోవటం మనచేతుల్లోనే వుంటుంది. అయితే దీనికి శాంతం కావాలి.

"యింకా యింకా చెప్తూన్నాడు తాతయ్య.

లోపల నీరజకి నానమ్మ మల్లె మొగ్గలు పెట్టి వంకీలజడ వేసింది. తమరు తెచ్చిన తెల్లజరీ చీరె కట్టించింది. అద్దంలో ఒక్కసారి చూసుకో అంటోంది. నీరజ అద్దంలో ముఖం చూసుకుంటూ వుంది. అయితే అక్కడ తన ప్రతిబింబం కాక మదన్ ముఖం కన్పిస్తోంటే ఆశ్చర్యంగా ఆ ముఖాన్ని తదేకంగా చూస్తూ వుంది. నీరజ ముఖం చిరునవ్వుతో విచ్చుకుంది.

స్త్రీ పురుషుల ఆకర్షణతో ప్రారంభమైన దాంపత్య జీవితం గృహభారాన్ని వహించి కష్టసుఖాలు పంచుకుంటూ తర్వాత వార్ధక్యంతో స్నేహితుల్లా మిగిలిపోతారు.

తాతయ్య వీళ్ళిద్దరినీ చూస్తూ తనలో తను అనుకుంటూ నవ్వుకుంటూ కళ్ళ జోడు పెట్టుకుని భగవద్గీత చదువుకోవటంలో మునిగిపోయాడు.




ప్రభాకరం పట్నంలో పన్లు చూసుకుని ఫస్ట్‌షో సినిమాకెళ్ళాడు. సినిమా చూసిన తర్వాత హాలు ఎదురుగా వున్న కాంటీన్‌లో టీ తాగి బయటకు వచ్చాడు. సిగరెట్ వెలిగించి తృప్తిగా పొగ పీల్చి స్కూటర్ స్టార్ట్‌చేసి బయలు దేరాడు తన పల్లెటూరికి. అతని వూరు ఆ పట్నానికి ఓ పాతిక మైళ్ళు వుంటుంది.

ప్రభాకరం స్కూటర్ని స్పీడుగా పోనిస్తున్నాడు. పట్నం దాటి చాలా దూరం వచ్చేశాడు. రోడ్డుమీద జన సంచారం అసలులేదు అప్పుడో లారీ అప్పుడో లారీ మాత్రం వెళ్తున్నాయి. చీకటి చిక్కగా వుంది రోడ్డు కిరు వైపులా చెట్లు చల్లని గాలి వీస్తూ తలలూపుతున్నాయి.

స్కూటర్ లైట్ కాంతిలో చాలా దూరంలో ఓ స్త్రీ చెయ్యి వూపుతూ కనిపించింది. ప్రభాకరానికి ఆ క్షణంలో పుట్టింటికి పురిటికి వెళ్ళిన పెళ్ళాం మనసులో మెదిలింది. దూరంగా చెయ్యి వూపుతూ నిలబడిన ఆ స్త్రీ అందంగా వుంటే బావుండుననుకున్నాడు. ఆ స్త్రీ









యింత కొన్ని గజాల దూరంలో వుంది.

ప్రభాకరం స్కూటర్ని స్లో చేశాడు. సుమారు ఐదు మైళ్ళు పోయేదాకా ఏ వూహా తగలదు. ఆమె లిఫ్టు కోసమే చెయ్యి వూపుతోందా... లేక తన కోసమే వూపుతోందా... ప్రభాకరం ఆలోచిస్తున్నాడు. ఆమె దేనికోసం చెయ్యి వూపినా ఆమె అందంగా వుంటే మాత్రం నెమ్మదిగా బుట్టలో వెయ్యాలి అనుకున్నాడు.

ప్రభాకరం ఆమె దగ్గరికి రాగానే సడన్ బ్రేక్ వేసి ఆగాడు. ఆమెని చూశాను అందంగా ఆకర్షణీయంగా వుంది. ప్రభాకరం నరాలు వేడెక్కిపోయాయి. తనకి లభిస్తున్న అదృష్టానికి మురిసిపోయాడు.

"ఎంతవరకూ వెళ్తున్నారు? రండి. వెనుక సీటుమీద కూర్చోండి," అన్నాడు ఆమెని తన వలలో ఎలా వేసుకుని, ఆమెని అనుభవిద్దామా అని ప్లాన్ వేసుకుంటూ మనసులో.

ఆమె చిన్నగా అందంగా నవ్వింది. అలాగే నిలుచుని వుండి నవ్వుతూ చూసింది ప్రభాకరాన్ని. ముందుకు రాలేదు.

మరుక్షణంలో ప్రభాకరం తృళ్ళిపడ్డాడు. శరీరం నిండా చెమటలు పట్టేశాయి. నోరు పిడచగట్టుకుపోయింది. నరాల్లోని వేడి ఒక్కసారిగా చల్లబడిపోయింది. ఆమె నవ్వినందుకు కాదు—

"నీ దగ్గరున్న డబ్బంతా బేగా యిత్తావా, మా సేతుల్లో సత్తావా" అంటూ చెట్లచాటునుంచి వచ్చి, కర్రలు పట్టుకుని యమభటుల్లా నిలబడ్డ ఆమె తరపు మనుషుల్ని చూసి.




మంత్రి కుమార్తె, "నేను చెప్పబోయే అద్భుతమైన కథ నాకు ఎలా తెలుసునో మీరు గ్రహించాలంటే, అది ఎలా ఆరంభమయింది మీకు చెప్పాలి", అంటూ ఆమె ఈ కథ చెప్పింది :

ప్రాచీనకాలంలో కిందమీర్ అనే రాజు పర్షియానూ, ఖురాసాన్‌నూ పరిపాలించేవాడు. హిందూ, సింధూ, చీనా దేశాలూ, అమూదరియా నదికి అవతలి నివసించే అటవికజాతులూ ఆయన ఏలుబడిలో ఉండేవి. ఆయన గొప్ప పరాక్రమవంతుడు, యుద్ధవిద్యలలో ఆరితేరినవాడు. అయితే ఆయనకు మేధావులను చేర్చి, వారితో చతురసంభాషణలు చెయ్యటమంటే ఎక్కువ ఇష్టం.

ఆయన విందులు చేసినప్పుడు తన చెంత కవులనూ, కథకులనూ కూర్చోబెట్టుకునేవాడు. ఎవరైనా ఆగంతకుడు రాజభవనానికి వచ్చి క్రొత్త కథలను గాని, వింత కథలనుగాని చెబితే, కిందమీర్ రాజు అతనికి అంతులేని బహుమతులిచ్చి, అతనికోరికలన్నీ తీర్చటమే గాక, అతనివెంట అశ్వికులనూ, బానిసలనూ పరివారంగా ఇచ్చి అతని

స్వదేశానికి పంపేవాడు. ఆయన ఆస్థానంలో కవులకూ, కథకులకూ వజీర్లతో సమమైన హోదా ఉండేది. ఆ రాజభవనం కావ్యపఠనాలకూ పురాణ గాథాశ్రవణానికీ కాణాచిగా ఉండేది.

సహజంగా కాలక్రమాన కిందమీర్ రాజు పర్షియా, అరేబియా, ఇండియా దేశాలకు చెందిన కథలన్నీ వినేశాడు; ఉత్కృష్ట ప్రాచీన కవితలన్నీ కంఠస్థం చేసేశాడు. ఇంక వినటానికి ఏమీలేదనీ, తనకు కాలక్షేపం జరిగే మార్గంలేదనీ తోచి ఆయన చాలా ఖేదపడ్డాడు.

ఆయన తన ముఖ్య కొజ్జావాణ్ణి పిలిచి, "అబూ అలీని పిలు", అన్నాడు.

అబూ అలీ అనేవాడు రాజుగారి ప్రధాన కథకుడు. కథనంలో ఎంతటి సమర్థుడంటే, ఒకే కథను వినేవారికి విసుగెత్తకుండానూ, మధ్యలో నాగాలు పెట్టకుండానూ, ఒక ఏడాదిపాటు చెప్ప గలిగేవాడు. అలాటివాడే వట్టిపోయి, చాలాకాలంగా చెప్పటానికి ఏ కథా లేని పరిస్థితిలో పడిపోయాడు.

కొజ్జావాడు అబూ అలీని రాజు సమక్షానికి తెచ్చాడు.

"కథకాగ్రేసరా, నువు వట్టిపోయావు నీకు తెలిసిన కథలన్నీ అయిపోయాయి. అయినా నిన్ను ఇప్పుడు ఎందుకు పిలిచానంటే, నువు నాకోసం ఒక అపూర్వమైన కథ సంపాదించాలి. నేను కథల కోసం తపించిపోతున్నాను నువు నాకు చక్కని కథచెప్పి సంతోషపెట్టినట్టయితే నీకు విస్తారమైన మాన్యాలూ, రాజభవనాలూ, కోటలూ ఇచ్చి పన్నులు మాఫీ చేసేస్తాను నిన్ను నా పెద్ద వజీరుగా నియమించి నా కుడి పక్కన కూర్చోబెడతాను నా సామంతులందరిపైనా నీ చిత్తంవచ్చిన ప్రకారం అధికారం చలాయించనిస్తాను. కాని నువు నాకు కథచెప్పి నన్ను ఆనందపరచలేకపోయావో, నువు మీ వాళ్ళకందరికీ అప్పగింతలు చెప్పెయ్యవచ్చు. నీకోసం కొర్రు సిద్ధంగా ఉంటుంది", అన్నాడు రాజు.

తనకు కాలం తీరిపోయిందనుకుని అబూ అలీ, "చిత్తం!" అని పాలిపోయిన ముఖంతో తలదించుకుని, క్షణం ఆగి, "మహారాజా, చచ్చిపోయే ముందు అనుగ్రహించి నాకు ఒక్క సంవత్సరం గడువు ఇయ్యండి. అప్పటికి నేను మీరు కోరిన కథ సంపాదించలేకపోయినా, అది మీకు అపూర్వంగానూ, అద్భుతంగానూ తోచకపోయినా, సంతోషంగా కొరతపడతాను", అన్నాడు

మనిషి అయినవాడు రేపు బతికి ఉంటాడన్న నమ్మకం లేనప్పుడు సంవత్సరం చాలా దీర్ఘకాలమే అనిపించింది రాజుకు. కాని ఆయన పైకి, "కథకోసం నేను ఎంత ఆత్రంగా ఉన్నానంటే,

నువ్వు ఇల్లు కదలకుండా ఉండేపక్షంలో నీకు సంవత్సరం గడువు ఇయ్య గలను", అన్నాడు.

అబూ అలీ రాజుకు వందనంచేసి ఇంటికి వెళ్ళిపోయాడు

ఆయన కొంతసేపు ఆలోచనలోపడి తన అయిదుగురు మమ్‌లూక్‌లను పిలి పించాడు, వాళ్ళు బాగా చదువుకున్న వాళ్ళు; ఆయన నౌకర్లందరిలోకీ అత్యంత విశ్వాసపాత్రులు.

ఆయన ఒక్కొక్కడికీ అయిదేసి వేల దీనారాలిచ్చి, "నేను మిమ్మల్ని పెంచి, పోషించి, పెద్దవాళ్లను చేసింది ఈ రోజు కోసమే. మీరు నన్ను ఇప్పుడు రాజునుంచి కాపాడాలి", అన్నాడు.

"ఆజ్ఞాపించండి, ప్రభూ ! మీకోసం ప్రాణాలైనా ఇస్తాం", అన్నారు మమ్‌లూక్‌లు.

"మీరు తలా ఒక దారినా బయలు దేరి దేశదేశాలు తిరిగి, అన్ని దేశాం లోనూగల జ్ఞానులనూ, కవులనూ, కథ కులనూ కలుసుకుని, బస్రాలో ఉండిన హసన్ అనేవాడి గాథలు సంపాదించాలి. అల్లా అనుగ్రహంవల్ల ఆ గాథలు ఎరి గినవాడు తటస్థపడితే, అతను కోరినంత ఇచ్చి ఆ గాథలు రాయించాలి. ఇది జరగనిపక్షంలో మీ యజమానికి కొరత తప్పదు", అన్నాడు అబూ అలీ.

తరవాత ఆయన అందరికీ శిఫా ర్సులు ఇచ్చి, ఒకణ్ణి హిందూ, సింధు దేశాలకూ, రెండోవాణ్ణి చీనా, పర్షియా పరిసరాలకూ, మూడోవాణ్ణి ఖ్వారిజ్ తూర్పునుంచి పడమరకూ, నాలుగో వాణ్ణి ఖురాసాన్ తదితర ప్రాంతాలకూ పొమ్మని, అయిదోవాడితో, "హుదు, ముబారక్, నువు ఈజిప్టు, సిరియా దేశాలు తిరుగు", అన్నాడు.

మంచిరోజు చూసి అయిదుగురు మమ్‌లూక్‌లూ తమ తమ మార్గాల ప్రయాణమయారు. పదకొండునెలల అనంతరం, వెళ్ళినవారిలో నలుగురు ఖిన్నవదనాలతో తిరిగి వచ్చి, తాము పర్యటించినచోట ఎంతమందిని చూసినా హసన్ వృత్తాంతం తెలిసినవాడు ఒక్కడూ కనిపించలేదని విన్నవించు కున్నారు.

అబూ అలీ గుండె చల్లబడింది, కళ్లు చీకట్లు కమ్మాయి. "అల్లా సర్వసమ ర్థుడు. నాకు కొరత రాసిపెట్టి ఉంది కాబోలు", అనుకున్నాడాయన.

ఈ లోపల అయిదోవాడు ముబారక్ ఈజిప్టుదేశమంతా తిరిగాడు. సిరియా కూడా చాలాభాగం తిరిగాడు. కాని అతనికి కావలిసిన సమాచారం దొరక లేదు. కైరోలో అత్యద్భుతమైన కథలు చెప్పేవాళ్ళున్నారు. వాళ్ల తండ్రులూ, తాతలూ కూడా ప్రసిద్ధ కథకులే కాని వాళ్ళు ఈ హసన్ కథ విన్న పాపాన పోలేదు. అందుచేత ముబారక్ దమా

స్కాన్ వెళ్ళాడు. అక్కడ తన పని నెరవేరుతుందన్న ఆశ అతనికి లేదు.

చేరినరోజు సాయంకాలం, బస కోసం వెతుకుతూ అతను వీధులవెంట నడుస్తూండగా, అతనికి ఎటుకేసో పోతున్న ఒక గుంపు అతనికంటపడింది. అందులో వీధి బేరగాళ్లూ, పాకీవాళ్లూ, గాడిదల కుర్రాళ్ళూ, ఉప్పరివాళ్లూ, వర్తకులూ, నీరు చేరవేసేవాళ్లూ, ఇంకా ఎవరెవరో ఉన్నారు. ఏమిటో తెలుసు కుందామన్న ఆసక్తితో ముబారక్‌కూడా ఆ గుంపుతోబాటు పరిగెత్తబోతూం డగా, ఒక యువకుడు అతనికి ఎదురు తగిలి, దుస్తులు కాళ్లకు అడ్డంపడి, కింద పడిపోయాడు.

ముబారక్ ఆ యువకుణ్ణి లేవనెత్తి, దుమ్ముదులుపుతూ, "ఈ అందరూ ఎక్కడికి అలా పరిగెత్తిపోతున్నారు?" అని అడిగాడు.

"నువు ఇక్కడి మనిషివి కాదన్న మాట. లేకపోతే మేమంతా కథలు విన బోతున్నామని నీకు తెలిసే ఉండేది. ఇషాక్ అద్భుతమైన కథలు చెబుతాడు. త్వరగా పోకపోతే హాలులో మంచి స్థలం దొరకదు. ఆయనగారు ప్రపంచంలో గల అద్భుత కథలు ఎన్నో చెబుతాడు. జనం తండోపతండాలుగా వస్తారు. ఆలస్యంగా వెళ్ళినవాళ్ల దూరంగా ఉండి పోవలసి వస్తుంది. అందుచేత నన్ను త్వరగా వెళ్ళనీ, నీకు పుణ్యం ఉంటుంది", అన్నాడు ఆ యువకుడు.

ముబారక్ అతని అంగీపట్టుకుని, "బాబ్బాబు! నన్నుకూడా అక్కడికి తీసుకెళ్ళు. నాకూ్కడా మంచి చోటు చూపించు. నేను షేక్ ఇసాక్ కథలు వినటానికే మా దేశంనుంచి ఇంతదూరం వచ్చాను", అన్నాడు.

"అయితే, త్వరగా పోదాం పద", అంటూ ఆ యువకుడు ముబారక్‌తో సహా హాలుకు పరుగుతీశాడు.

హాలులోపల చల్లగా ఉన్నది. హాలు చాలా పెద్దది. మధ్యలో ఒక వృద్ధుడు కూర్చుని ఉన్నాడు. ఆయన ముఖం కళగా ఉన్నది. నుదురు ప్రకాశిస్తున్నది. ఆయనచుట్టూ మూటలు మోసేవాళ్లూ, వర్తకులూ, గొప్ప ఇంటివాళ్లూ, సమస్తమైనటువంటివాళ్లూ కూర్చుని ఉన్నారు. ఆయన గంభీరమైన కంఠంతో, తాను అనేక రాత్రులుగా చెబుతూవస్తున్న కథను విడిచినచోట అందుకున్నాడు. అయితే కథ సాగినకొద్దీ ఉద్రేకంతో ఆయన కంఠం ఖంగున మోగసాగింది. ఆయన లేచి నిలబడి, శ్రోతలమధ్యగా అటూ ఇటూ తిరుగుతూ అభినయించ సాగాడు. ఆయన శ్రోతలకు తన్మయత్వం కలిగేలాగా, "అంతే, ద్రోహులు అలాగే చస్తారు! వాళ్ళకు నరకజ్వాలలేగతి! వాళ్లని అల్లా కాపాడ వలిసిందే. అతనికి అపాయం తప్పింది.



అమ్మయ్య! ... లేదు, లేదు! ఏవీ కత్తులు? ఏవీ గదలు? వెళ్ళి అతన్ని ఆదుకోవాలి! అదుగో అతని శత్రువులు పడిపోయారు. విజయం అతన్నే వరిం చింది. వీరాధి వీరుడికీ జై! అతను తన ప్రేయసి తనకోసం వేచిఉన్న గుడారం కేసి పోతున్నాడు. ఆమె అద్భుత సౌందర్యం చూడగానే తాను ఆ రోజు ఎదుర్కొన్న ఆపదలన్నీ మరుపు కొచ్చాయి. అల్లా స్త్రీని సృష్టించింది వీరుల హృదయాగ్నిని చల్లార్చి, కామాగ్నిని ఎగదోయటానికే గదా!"

ఇషాక్ ఆ రోజు కథ ఆ విధంగా నిలిపెయ్యగానే శ్రోతలు లేచి బయటికి పోసాగారు, ఆఖరున విన్న మాటలు మళ్ళీ మళ్ళీ అనుకుంటూ ఆయన కథ నాసికి అచ్చెరువు చెందుతూ ముబారక్ వృద్ధుణ్ణి సమీపించి, ఆయన చెయ్యి కళ్ల కద్దుకుని, "బాబూ, నేను పరదేశిని. తమరిని ఒకటి అడగాలి", అన్నాడు.

"అడుగు, నాయనా. మనకు పరదేశీ లంటూ ఎవరూ లేరు", అన్నాడు ఇషాక్.

"మా యజమాని అబూ అలీ అనే కథకుడు బహు దూరదేశంనుంచి తమకు వెయ్యి బంగారు దీనారాలు కాను

(గా పంపారు. ఈ యుగంలో తమ నాటి కథక చక్రవర్తి లేడని ఆయన విశ్వాసం. దాన్ని పురస్కరించుకుని తమకు ఈ బహుమానం పంపారు", అన్నాడు ముబారక్.

"ఖురాసాన్ నివాసి అయిన అబూ అలీ జగత్ప్రసిద్ధుడు. ఆయన పంపిన బహుమతిని నేను స్నేహపూర్వకంగా స్వీకరిస్తాను. కాని ప్రతిబహుమానంగా ఆయనకు నేనేదైనా పంపాలి. ఆయనకు ఏది ఇష్టమో, నేను ఏమిస్తే ఆయనకు ఎక్కువ సంతోషం కలుగుతుందో చెప్పు", అన్నాడు ఇషాక్.

ముబారక్ తన పని నెరవేరిందను కుని, ఇషాక్‌తో, "బాబుగారూ, మా యజమానికి ఐహిక సంపదల లోటు ఏమీలేదు. ఆయనకు తెలియనివి తెలుసు కోవాలని తప్ప మరే కోరికా లేదు. రాజుగారిని రంజింపజేయటానికి తమ నుంచి ఏదైనా ఒక కొత్త కథ అడగ మని వారు నన్ను పంపారు. తమకు బస్రా నివాసి అయిన హసన్ గాథ తెలిసి ఉన్నట్టయితే అది తమనుంచి తెలుసుకోవాలన్నది వారి ప్రగాఢ వాంఛ", అన్నాడు.

అవశ్య శిరోధార్యం ! నీ కోరిక తీరుతుంది. ఎందుకంటే, ప్రపంచంలో ఆ కథ తెలిసినవాణ్ణి నేను ఒక్కణ్ణే ! అంతకన్న విచిత్రమైన కథ ఉండదు గనక మీ యజమాని అబూ అలీ దాన్ని కోరటం కూడా సమంజసమే. దాన్ని ఒక సాధువు నాకు చెప్పాడు. ఆయన ఇప్పుడు లేడు. దాన్ని ఆయనకు చెప్పిన మరొక సాధువు కూడా లేడు. మీ యజమాని ఇచ్చిన బహుమతికి బదులుగా నేను ఆ కథ నీకు వివరంగా చెబుతాను, రాసుకో. అయితే నువు ముందుగా ఒక ప్రమాణం చెయ్యాల్సి ఉంటుంది", అన్నాడు ఇషాక్.

"మీరు కోరిన ప్రమాణం చెయ్యటమే కాదు. దాన్ని నిలుపుకోవటానికి నా ప్రాణాలైనా బలి పెడతాను", అన్నాడు ముబారక్.

"మంచిది. ఈ కథ ఎలాటిదంటే దాన్ని అందరికీ చెప్పరాదు. మంచి మేధావులకు మాత్రమే చెప్పాలి. అందు చేత, ఈ కథలో ఒక్క ముక్కకూడా అయిదు రకాల మనుషులకు చెప్పబోన దని నువు నీ పక్షానా, నీ యజమాని పక్షానా ప్రమాణం చెయ్యాలి. ఆ అయిదు రకాల మనుషులు ఎవరంటే, దాని స్వారస్యం గ్రహించలేని మూఢులూ, దాన్ని ద్వేషించే కుత్సితులూ, దాన్ని అవగాహన చేసుకోలేని మందబుద్ధులైన బడిపంతుళ్లూ, ఆ తరగతి కిందికే వచ్చే వెర్రిబాగులవాళ్ళూ, దానినుంచి నీతి గ్రహించలేని మత విద్వేషులూనూ", అన్నాడు ఇషాక్.

ముబారక్ అదేప్రకారం అల్లామీద ప్రమాణంచేశాడు. అతను వెయ్యి దీనా

రాల సంచీ ఇషాక్‌కు ఇచ్చాడు. ఇషాక్ అతనికి కలమూ, సిరా ఇచ్చి, "రాసుకో!" అన్నాడు.

ఇషాక్ నోటవచ్చిన ప్రతిమాటా ముబారక్ యధాతథంగా రాసుకున్నాడు. ఈ రచన నిర్విరామంగా ఏడు పగళ్లూ, ఏడు రాత్రులూ పట్టింది. అంతా అయినాక ముబారక్ వృద్ధుడికి తాను రాసినది చదివి వినిపించాడు. ఇషాక్ అందులో అక్కడక్కడా పొల్లులు దిద్దాడు. తరవాత ముబారక్ ఆయనవద్ద సెలవుపుచ్చుకుని, ఖురాసాన్‌కు తిరుగు ప్రయాణమయ్యాడు. అతను పనిపూర్తిచేసిన ఆనందంలో అతి త్వరగా ప్రయాణంచేసి, బసారులకు పట్టేకాలంలో సగంకాలంలోనే చేరుకున్నాడు.

గడువుకు ఇంకా పదిరోజులే మిగిలి ఉన్నాయి. ఆ పదిరోజులూ దాటితే అబూ అలీకోసం కోటగుమ్మంముందు కొర్రు సిద్ధంగా ఉంటుంది. పాపం, ఆ మనిషి పూర్తిగా ఆశలుడిగి, తాను తన శిక్షను మరింత ధైర్యంతో అనుభవించే ఉద్దేశంతో తన బంధుమిత్రాదులనందరినీ రప్పించాడు. అందరూ దుఃఖసముద్రంలో ఉండగా ముబారక్ వచ్చి చేరాడు. అతని చేతిలో కథకట్ట ఉన్నది. యజమాని దాన్ని అందుకుని చూడగా దానిపైన 'బస్రా నివాసి హసన్ గాథ' అని ఉన్నది.

అబూ అలీ లేచి తన మమ్లూక్‌ను కౌగలించుకుని, అతన్ని తన పక్కన కూచోమని, తన దుస్తులు విప్పి అతనికి తొడిగాడు; అతన్ని దాసవిముక్తుణ్ణి చేసి, అతనికి పది మగగుర్రాలూ, అయిదు ఆడగుర్రాలూ, పది ఒంటెలూ, పది కంచర గాడిదలూ, ముగ్గురు నీగ్రో బానిసలూ, ఇద్దరు కుర్రవాళ్లూ ఇచ్చి గౌరవించాడు.

తరవాత అతను ఆ ప్రాణప్రదమైన వ్రాతప్రతిని సువర్ణాక్షరాలతో మేలు కాగితంమీద నకలు తయారుచేశాడు. ఆ పని పూర్తికావటానికి అతనికి పూర్తిగా తొమ్మిదిరోజులు పట్టింది. పదో రోజున, అతన్ని కొరత వేయటానికి నిర్ణయించిన ఘడియకు అబూ అలీ తాను తయారుచేసిన ప్రతిని బంగారు పెట్టెలో పెట్టి, రాజువద్దకు తీసుకుపోయాడు.

ఇంతవరకు చెప్పి మంత్రి కుమార్తె, తెల్లవారుతూ ఉండటంచూసి మౌనం దాల్చింది.



# త్యాగం



## పాలకోడేటి సత్యనారాయణరావు

మాధవరావును చూసి ఆఫీసులో అందరూ ఆశ్చర్యపోయారు. ఆరోజు పొద్దున్న మాధవరావుకు తన్ను తానే అద్దంలో చూసుకునే సరికి, చెప్పలేనంత ఆశ్చర్యం కలిగింది–ఎదురుగా అద్దంలో కనిపిస్తూన్నవ్యక్తి తనేనా అని చాలాసేపు అలా చూస్తూ వుండిపోయాడు దేశంలో ఎన్ని రకాల మోసాలైనా జరుగుతూ ఉండివుండవచ్చు కానీ, ఇంకా కళ్ళూ, చెవులూ లాంటి ఇంద్రియాలు మాత్రం తమ యజమానిని మోసం చేయటం ప్రారంభించలేదు. అందుకే...ఈ సంగతి తెలిసినవాడు కాబట్టి, మాధవరావు అద్దంలో కనిపించేది తన బొమ్మే అనుకుని ఇంకా ఆ తర్వాత అద్దంకేసి చూడటం మానేశాడు.

తన్ను తానైతే చూడటం మానగలి గాడు కానీ, ఇందర్నీ తడకేసి చూడ కుండా ఎలా ఆపగలడు ?

—అయినా అతనె తో ఆలోచించి అందరూ పదిన్నరకు ఆఫీసుకొస్తే, ఆ రోజున మాత్రం కచ్చితంగా తొమ్మి దింటికే ఆపీసు చేరుకున్నాడు మాధవ రావు. ఆటోదిగి డబ్బులుఇచ్చి, తిన్నగా తన గదిలోకి వెళ్ళిపోయాడు. అమ్మయ్య 'బ్రతికాను!' అని అనుకొన్నాడు మాధవ రావు.

అరగంట గడిచింది.

ఆఫీసరు రావటానికి ముందు గది తుడిచేపని ప్యూన్ చెంగయ్యది. కానీ ఆ రోజు అతనొచ్చేసరికే, ఆఫీసర్ గారి గదిలో లైటుంది అంటే ఆయనొచ్చి పనిచేసుకొంటున్నారన్నమాట!- అయినా చూడ్డానికి వెళ్లాడు, చెంగయ్య ఆ గది లోకి.

గదిలోకి వచ్చిన చెంగయ్యకోసం తోలెడంత ఆశ్చర్యం ఆ గదిలో ఉంది. తెరతొలగించి లోపలకు రాగానే 'అయ్య గారి' సీటులో ఎవరో కొత్త వ్యక్తి -ఎవ రయ్యా నువ్వు ? అని అడగబోయి క్షణం తమాయించుకొని చూశాడు.- అవునూ, తన అయ్యగారే !-

అరె' ఏమిటిలా అయిపోయారు?- అనుకొన్నాడు చెంగయ్య.

గదిలోంచి బయటికి వచ్చేదేకానీ, చెంగయ్యకేమీ తోచలేదు. ఏ పని చేయాలో, ఏ పని చేయకూడదో అర్థం కాలేదు. అయ్యగారు ఇలా అయిపోయా రంటే దానికి కారణ ఏమై వుంటుందా ?" అని చాలా సేపు తనలో తనే ఆలోచించు కున్నాడు. కానీ అతనికేదీ సరైన కారణం తట్టలేదు.

ఇంక తన ఆలోచన పనికిరాదని అప్పుడేవచ్చిన రాఘవరావుతో చెప్పాడు. రాఘవరావు క్షణం ఆశ్చర్యపోతూ, ఆ తర్వాత తమాయించుకొని "నువ్వు చెప్పేది నిజమేనంటావా ?" అని అడి గాడు

"కావాల్సివస్తే మీరేవెళ్ళి చూడండి" అన్నాడు చెంగయ్య.

రాఘవరావుకు వెళ్లాకసారి చూస్తే బాగుండును అనిపించింది. కానీ, ఏ కార ణమూ లేకుండా వెడితే, ఆయన ఏమను కుంటాడో, ఏమంటాడో అనే సందేహం వచ్చి ఊరుకుండిపోయాడు.

ఆ తర్వాత మూర్తివచ్చాడు లక్ష్మణ రావు వచ్చాడు. పరాంకుశం, పార్వ తీశం అందరూ వచ్చారు.

అందరూ కలిసికట్టుగా ఆలోచించినా కూడా ఎవరికీ కారణం ఏమైవుంటుందో తట్టలేదు.

చివరకు బెనర్జీవస్తే, ఈ మిస్టరీ విడు తుందనుకొన్నారు రోజూ వేళకే వచ్చే బెనర్జీ ఆ రోజు ఓ గంట ఆలస్యంగా, పదకొండున్నరకు వచ్చాడు. అతను రానానే అందరూవెళ్ళి అతను చుట్టుముట్టి జరిగింది చెప్పారు.

బెనర్జీ ఆశ్చర్యపోయాడు - "నిజం గానా ?"

"నిజమే!" అన్నారు అందరూ ఏకకంఠంతో.

చివరకు నెమ్మదిగా అన్నాడు పార్వతీశం. "మీకు మాధవరావుగారు ఆఫీసరే కాక స్నేహితుడు కూడాగదా! ఈ మిస్టరీ ఎలాగైనా మీరే విడగొట్టాలి!"

అందరూపార్వతీశాన్ని బలపరిచారు.

అసలు బెనర్జీకే వెళ్ళి మాధవరావును చూడాలని వుంది ఎలా వుండి ఉంటాడు మాధవరావు?

—"ఊహించుకోవటంకన్నా చూసి వస్తేమేలు' అనుకొని ఏ కారణం లేకుండా ఎంత స్నేహితుడే అయినా ఆఫీసరు దగ్గరకు వెళ్ళటం బాగుండదని, ఓ ఫైల్ తీసి పట్టుకొని ఆఫీసరు రూంలోకి నడిచాడు బెనర్జీ.

మాధవరావు రూం ముందున్న తెరలు తొలిగించుకొని, లోపలకు అడుగుబెట్టిన బెనర్జీ ఉలిక్కిపడ్డాడు. 'అందరూ చెప్తే నమ్మలేదుగానీ, మాధవరావు ఇలా అయిపోయాడేం?" అనుకొన్నాడు.

బెనర్జీని చూశాడు మాధవరావు. చేతిలోవున్న పెన్సిలు కిందపెడుతూ అన్నాడు: "రా—"

మాధవరావు టేబిల్ మీద ఫైల్ పెట్టాడు, బెనర్జీ. అతని ముందు వున్న కుర్చీలో ఒకదాంట్లో కూర్చుంటూ అన్నాడు: "ఆఫీసంతా గొడవగా ఉంటే నమ్మలేకపోయాను!"

"ఏం సంగతి?"

"ఏం సంగతేమిటి? ప్రొద్దున్నలేచాక అద్దంలోకి ఒకసారి చూసుకొన్నావా, లేదా?—" నవ్వుతూ అడిగాడు బెనర్జీ.

మాధవరావు ఏమీ అనలేదు.

"నిన్నటి వరకూ ప్రాణంలా పెంచుకొన్నావుగదా ఆ జుట్టును, ఈ రోజు తీసేసి ఇలా వచ్చేశావేం? నిన్ను అసలు ఎవరూ గుర్తుపట్టేటట్లుగా లేవు. అయినా ఏం అలా తయారయ్యావు?"

మాధవరావు నవ్వాడు. "కారణం ఏమీలేదు."

బెనర్జీ నమ్మలేదు: "ఆ నీ ప్రాణం పోయినా ఒప్పుకొనేవాడివి కానీ, ఆజుట్టు తీసేవాడివి కావు. కానీ ఈ రోజు ఇంత ఇదిగా క్రాపు చేయించుకొని బుద్ధిమంతుడిలా వచ్చావంటే కారణం ఉండితీరాలి!"

నెమ్మదిగా అన్నాడు మాధవరావు "నువ్వన్నదీ రైటే! నాకు పెళ్ళి సెటిలయింది."

"సరళతోనేనా?" అనడిగాడు బెనర్జీ బెనర్జీకి మాధవరావు సరళను చేసుకుంటున్నాడన్న సంగతి తెలుసు.

"అవును! సరళనే!"

"అయితే దానికి ఈ కేశ త్యాగం ఎందుకోయ్?"

మాధవరావు నవ్వుతూ అన్నాడు "బాయ్‌ఫ్రెండ్‌గా ఎన్ని వేషాలు వేసినా ఒప్పుకొంది సరళ. కానీ భర్తగా అయితే బుద్ధిమంతుడిలాగే ఉండాలట! ఈ హిప్పీ వేషాలు, ఈ వెధవ్వేషాలు ఉంటే పెళ్ళి చేసుకోనందిరా! ఏంచెయ్యను., పెళ్లాం ముఖ్యమా? ఈ జుట్టు ముఖ్యమా?—అందుకే..."

బెనర్జీ ఆశ్చర్యంతో నోరుతెరిచాడు.

# కోళ్ళు



## కొంపెల్ల విశ్వం

ఉదయం సరిగ్గా ఆరుగంటలకు హైదరాబాదులో వుండవల్సిన బస్సు తొమ్మిదిన్నరకి కాని చేరుకోలేదు.

నేనుండేది హిమాయత్‌నగర్‌లో.

ఆ వేళ ఆదివారం. మర్నాడు నేను ఆఫీసుకెళ్ళాలి.

ఇక్కడ కొంత ఫ్లాష్ బ్యాక్ అవసరం ఈ కథకి ఎంతైనా వుంది— నేను హైదరాబాదు వెళ్ళిపోతున్నానని తెలిసి, మా ఊరిలో మా ఎదురింటి కమలమ్మగారు "శ్రమనుకోపోతే అక్కడ మా తమ్ముడున్నాడు. వాడికి నేనిచ్చే సామాన్లు అందజేయాలి బాబూ !" అన్నారు

అనటమే కాదు – నా సమ్మతికోసం చూడకుండా ఇంత – సైజు ప్యాకెట్టు (అదేదో ఎరువుల కంపెనీ నంచీని ఖాళీ చేసి, సగంచేసి అందులో సామాన్లన్నీ పెట్టి, మళ్ళీ దబ్బనంతో కుట్టి) నా కందజేశారు. నేను విసుక్కోబోయాను కాని, మా అమ్మ నాకా అవకాశం ఇవ్వ లేదు. నాకవన్నీ మోసుకుని రాకతప్పా లేదు.

ఫ్లాష్ బ్యాక్ అయిందా, ఇక ప్రస్తుతం–

ఆయనగారు సైదాబాదు కాలనీలో వుంటాట్ట. ఆ ప్యాకెట్టేదో పట్టికెళ్ళి ఇవేళే ఇచ్చేస్తే నయం. మళ్ళీ రేపటి




నుంచి ఆఫీసు, హడావిడి – అనుకుని టైము నాలుగవుతుంటే సైదాబాదు కాలనీ వెళ్ళాను.

ఇల్లు త్వరగానే దొరికింది. కాని—

ఎంతసేపు తలుపు బాదినా ఎవరూ తీయరు. "ఎవరండీ ఈ ఇంట్లో?" అని రెండు మూడు కేకలు కూడా వేశాను. పావుగంటసేపు తలుపుకొట్టి, ఇక వెనక్కి తిరిగి వెళ్ళిపోదామనుకుంటూ వుండగా—

తలుపులు తెరుచుకున్నాయి.

నాకు మాట పడిపోయింది. నా చేతిలో వున్న కాగితం (వాళ్ళ అక్క ఇచ్చింది) అతని చేతికిచ్చి అలాగే నిలబడిపోయాను.

కాగితం ఒకసారి చూసుకుని, కూచోండి — అన్నాడతను. కూచున్నాను.

సంజాయిషీ చెప్పుకుంటున్నట్టుగా అన్నాడతను "తనేమో, ఏదో పనుండి బైటకెళ్ళింది. పిల్లల స్తమానూ ఇంట్లోకి బైటికి తిరుగుతుంటే కోప్పడి, బైట ఆడుకోండని తలుపేశాను – తలుపు తీయగానే తెలుసుంటుంది మీకు, తలుపు తీయటం ఎందు కాలస్యమైందో?"

ఏమంటాను నేను? అతనికి రెండు కాళ్ళు లేవు.



# వ్యత్యాస



ఎం. బాలసరస్వతీదేవి

జగన్నాధానికి జీవితంమీద విరక్తి పుట్టింది!

మనిషికి జీవితంమీద విరక్తి కలగడానికి కారణం... జీవించడమే. గుమస్తాగా ఇరవై ఏళ్ళు జీవించి, ఎనిమిది జీవాలకి జన్మయిచ్చి, మూడుపూటలా వాళ్ళకి ఇన్ని గంజినీళ్ళయినా పోయలేకపోతున్న తన చేతకానితనానికి — దౌర్భాగ్యానికి - తనకే అసహ్యం పుట్టుకొచ్చి, ఆత్మహత్య చేసుకోవాలని గట్టిగా నిశ్చయం చేసుకున్నాడు జగన్నాధం.

ఆ వూరికి చివరగా ఓ చెరువు వుంది. అందరూ దాన్ని "దెయ్యాల చెరువు" అంటారు. ఆర్నెల్లకో శవం అయినా ఆ చెరువులో తేలుతుంటుంది.

"దెయ్యాల చెరువులో" పడి - తన జీవితాన్ని అంతంచేసుకోవాలన్న నిశ్చయానికి వచ్చేడు జగన్నాధం.

అర్ధరాత్రి.

రేయి కడుపున పెట్టుకుంటోన్న కాలాన్ని, దూరాన్ని కళ్ళతో కొలుచుకుంటూ... చీకటి గదిలో అటూ-ఇటూ పచార్లు చేస్తున్నాడు జగన్నాధం. ఎక్కడో గడియారం పదకొండు గంటలు కొట్టింది.

జగన్నాధం ఆగి, లాల్చీ ఎముకలం గూడుకు తగిలించుకుని ... ఇవతలికి వచ్చేడు. సావిట్లో, భార్యా...ఎనమండుగురు పిల్లలూ ... చీకటి మూటల్లా ముడుచుకుని, చింకి చాపలమీదపడి నిద్రపోతున్నారు. ఆర్నెల్లు నిండిన

ఆఖరివాడు...అమ్మ పొత్తిళ్ళలోనించి ఇవతలికి దొర్లి, కాళ్ళూ చేతులూ కెళ్ళించుకుంటూ... చిల్లిబుగ్గలతో లాంతరుకేసి చూసుకుంటూ నవ్వుతున్నాడు.

జగన్నాధం ఎవరికేసీ చూడటం లేదు. భార్యాబిడ్డల భవిష్యత్తు గురించీ... తను తన్నేయబోతున్న వాళ్ళ నోటి దగ్గిరి రేపటి చారు మెతుకుల గురించీ ఆలోచించటంలేదు. అలా ఆలోచించగల ఏ వ్యక్తీ, ఆత్మహత్య చేసుకోలేడు ...

చప్పుడుకాకుండా ఇవతలికి వచ్చి, వీధి తలుపులు దగ్గిరికి చేరేసి ... గబగబా రోడ్డుదాటి, వూరుదాటి, మట్టిబాట వెంట నడుస్తున్నాడు...

పొద్దుటివరకు కురిసిన వర్షపు నీటితో, చేలన్నీ నిండిపోయి పొట్టలు పోసుకుంటున్న వరిపిట్టలు ... తలలు వాల్చేసి, నీళ్ళలోనించి కన్నీళ్ళు కారుస్తున్నాయి. ఆకాశంలో మబ్బులు మదపు టేనుగుల గుంపులా పరుగెత్తుతున్నాయి. కాలుతీసి కాలువేస్తుంటే ఎర్రటి నీళ్ళు ముఖంమీదా, బట్టలమీదా చిందిపడుతున్నాయి. బాట పక్కన వున్న పొదల్లోనించి కప్పలూ, కీచురాళ్లూ అరుస్తున్నాయి.

జగన్నాధం చిప్పలవరకూ చిత్తడిలో కూరుకుపోతున్న పాదాలను అతి ప్రయాసతో పైకి లాక్కుంటూ ... ఆయాసపడుతూ...ముందుకు అడుగులు వేస్తున్నాడు. అంత చలిలో, చెమ్మలో అతని నుదుటిమీదినించి చెమట్లు ధారలుగా కారుతున్నాయి.

చెరువు గట్టుమీదికి వచ్చేడు.

చెరువంతా వర్షపునీటితో నిండిపోయి, నీరు గట్టుకి జానెడుదూరంలో కదులుతోంది. రాక్షసి మొసలిలా — నోరు తీసుకుని చూస్తోంది, చెరువు.

జగన్నాధం రక్తం చరచరా ఎరుపెక్కింది. కళ్ళు — పులిపంజాకి బెత్తెడు దూరంలోవున్న తోడేలు కళ్ళలా మండుతున్నాయి.

భుజంమీదవున్న కండువాతీసి — మొలచుట్టూ గట్టిగా చుట్టుకున్నాడు. ఎప్పుడో చూసిన అమ్మా...నాన్నలనీ, ఎప్పుడూ చూడని భగవంతుణ్ణీ ఆఖరిసారిగా తలచుకున్నాడు. వూపిరి బిగించి — శరీరంలోవున్న శక్తినంతా పాదాల్లోకి కేంద్రీకరించుకుని—

దూకేయబోతున్నాడు.

ఆకాశంలో తళుక్కుమని ఓ మెరుపు. క్షణంలో సగంసేపు, పాదాలకి కొంచెం దూరంలో ... నీళ్ళమీద తేలుతూ పైకి లేచివస్తోన్న రెండు పుల్లల్లాటి ఆకారాలమీద పడింది.

శవం.

బాగా వుబ్బి — అప్పుడే నీటిలోనించి తేలి, పైకి ... వస్తోంది. శవం కళ్ళు భయంకరంగా తెరచుకుని, ఆకాశంలోకి చూస్తున్నాయి. మృత్యువు కబంధ హస్తాల్లో చిక్కుకుని, ఆఖరిక్షణాల్లో...

సహాయంకోసం ఏ దేవతల్ని ప్రార్థిం చాయో ... ఏ దైవాన్ని రక్షించమని పిలుస్తున్నాయో...రెండు చేతులూ పైకి ఆకాశంలోకి చాచపడివున్నాయి.

ఆ నిశీధిలో...నిప్పుల్లాటి కళ్లతో జగన్నాధాన్ని కౌగిలిలోకి రమ్మని పిలుస్తున్నట్లు చేతులు చాచుకుంటూ, నీటిమీద తేలుకుంటూ ... జగన్నాధం వేపుకి వస్తోంది శవం...

గట్టు అంచుకు వచ్చిన శవంచెయ్యి- జగన్నాధం పంచెకొనకి తగులుకుంది

జగన్నాధం గావుకేక పెట్టేడు!

చెరువుగట్టుమీద వున్న రాళ్ళలో నించి క్రిందికి దొర్లిపోయి, లేచి- తుప్పల్లోనించి, బురదలోనించి, నెత్తురు కారుతోన్న శరీరాన్ని సాగదీసు కుంటూ...పరిగెత్తుతున్నాడు. బుర దలో పడుతున్నాడు. లేస్తున్నాడు. మృత్యువు తరుముకొస్తుంటే ప్రాణాలు కట్టెలగూడులో పెట్టుకుని...ఏగంతాల కేసి పరుగెత్తుతున్నాడు...

జేరవేసివున్న తలుపులు తోసుకుని, భళ్లున లోపలికి వచ్చేసేడు. భార్యా - బిడ్డలూ "కెవ్వు కెవ్వు" మంటూ లేచి కూచున్నారు. పరిగెత్తుకుంటూ వచ్చి - అతన్ని పట్టుకుని - మంచంలో పడుకో బెట్టేరు. ఒళ్ళంతా తడిమి, తడిమి "నాన్నా ... నాన్నా ... " అంటూ "ఏవండీ..." అంటూ బెక్కి బెక్కిన ఏడుస్తున్నారు.

ఆ ఏడుపు ... మృత్యువును పార ద్రోలుతోన్న సంజీవినీ సంగీతంలా, జీవన మాధుర్యాన్ని తనలో నింపు తోన్న అమృత వర్షిణిలా ... అతనిలో ప్రవహిస్తోంది.

కళ్లు విప్పి - అందర్నీ చేతులతో చుట్టి...దగ్గిరికి తీసుకున్నాడు. ముద్దులు పెట్టుకున్నాడు...!

అందర్నీ గుండెల్లోకి పొదువుకుని... కళ్ళుమూసుకుని...

వాళ్లందరి భవిష్యత్తుకోసం,

కాస్త మంచి భవిష్యత్తుకోసం... వెలుగుకోసం ఆలోచిస్తున్నాడు ... జగన్నాధం!



# కోతులు

గొల్లపూడి రాజ్యలక్ష్మి



"గోపి ! ఒక్కక్షణం ఆగరా !" అంటూ వాడిచేతిలో పుస్తకా లుంచి — గుడిలోపలికి వెళ్ళాను.

తిరిగి వచ్చేదాకా వాడక్కడే నిల బడి - నా వంక హేళనగా - విసుగ్గా చూస్తూ అన్నాడు.

"ఏమంటున్నాడు నీ దేవుడు, కులాసానా ?"

ఇలా రోజూ ఏదో కామెంట్ చేయటం గోపాలంకి - విని నవ్వి వూరు కోవటం నాకూ అలవాటే అయినా ఇవాళ వూరుకోలేకపోయాను.

"ఆయనకేం లోటని ? కులాసా లేకపోవటానికి..."

"అయితే ... పాపం ఇప్పుడు నీకే పెద్ద లోటొచ్చిపడిందన్నమాట !"

"వ్యంగ్యం చేయకు. నాకదో తృప్తి. ఈ మహా విశ్వానికి అధినేత దేవుడు. ఆయన సృష్టిలో మనం ఇసుకరేణువుకు కూడా సరిపోలం. అట్లాంటి తేజస్సం పన్నుడిని స్తుతించటంలో తప్పేం వుంది ?"

"కావాల్సినంత వుంది. పలకని - వులకని ఆ రాయికి బదులు-ఏ మనిషికి మ్రొక్కినా ఫలం వుంటుంది"

"కానీ - నేను ఫలం కోరుకోవటం లేదు."

"ఓహో ... ఏ ప్రతిఫలం కోరుకో

నప్పుడు ఈ దండాలూ - దణ్ణాలూ ఎందుకోయ్ ?"

''ఆయన సృష్టిపట్ల - మేధస్సుపట్ల మన వినయాన్ని చూపటం అనుకో రాదూ ?"

"మన నిత్యజీవితంలో ఏ ఆపదలకూ - అవసరాలకూ అక్కరకురాని దేవుడిపట్ల వినయం ఎందుకు చూపాలి ? అసలు దేవుడనేవాడున్నాడా ? వుంటే ఎవరైనా చూశారా ? మన సైన్సు గ్రంథాలు తిరగవేయ్ ఈ సృష్టి పరిణామం ఎలా మొదలైందీ తెలుస్తుంది. అందులో దేవుడిపాత్ర ఎక్కడైనా కనిపిస్తే చెప్పు. అప్పుడు ఒప్పుకుంటాను.''

"ఏ దేవుడూ - ఏ మహత్తరశక్తి లేనిదే ఈ గ్రహాలూ - గోళాలూ గతులు తప్పకుండా ఎట్లా పరిభ్రమిస్తున్నాయి ? వీటన్నిటి వెనుక ఏదో అజ్ఞాత శక్తి, దివ్యహస్తం వుండి తీరాలి. అది నా నమ్మకం !"

"నీ నమ్మకాలన్నీ - నీ మూఢ విశ్వాసాలమీద నిలిచినవి. అవి ఎప్పుడో అప్పుడు కూలిపోక తప్పదు."

"ఆ మాటే నేనూ అంటాను !"

"మంచిది. చూద్దాం వేచి. కాలం ఎవర్ని ఏ పరిధుల్లోకి తీసుకెళ్తుందో..."

నేను మౌనం వహించాను.

గోపాలం-నేను హైస్కూల్‌లో చదువుకునే రోజుల్నించి ప్రాణస్నేహితులం. మా ఇద్దరిమధ్యా అనేక విషయాల్లో ఏకత్వం వుండటంవల్ల మంచి స్నేహితులమయ్యాము. ఒక్క దేవుడి విషయంలోనే మేమిద్దరం ఉత్తర - దక్షిణ ధ్రువాలం. ఒకరి నమ్మకాల్ని మరొకరం మార్చలేక మధ్యమధ్య ఇలా వాగ్వివాదపడటం మా కలవాటే. మా కిద్దరికీ బాడ్‌మెంటన్ ఆడటం సరదా. రోజూ కాలేజీ అవగానే కాస్సేపు ఆడుకుని ఇంటిముఖం పట్టాం. చాలా చక్కగా ఆడతాడు గోపాలం. శలవు రోజుల్లో - తీరిక సమయాల్లో లైబ్రరీకి వెళ్ళి - పుస్తకాలు తిరగేసి - వాటిల్లోని విషయాల గురించి అనేకసార్లు గంటలతరబడి వాదించుకోవటం మా కిష్టం. నిజానికి గోపాలం మంచి తెలివైనవాడు. ఆటల్లోనేకాదు. మాటల్లోనూ మేటి. మాటల్లోనేకాదు - ఆచరణలోనూ చూపిస్తాడు. అతని మేధాశక్తి అపూర్వం అన్పించి అబ్బురపడ్తూంటాను. తను వాదించే విషయాన్ని నా చేతకూడా 'ఔను' అన్పించేంతటి నేర్పరి. నేను అతనిలోని ఆ శక్తికే మిక్కిలి ఆకర్షితుడనౌతాను.

టెన్త్‌లో మంచి మార్కులు తెచ్చుకున్న గోపాలం - ఇంటర్‌లో వాడి కిష్టమైన బై. పి. సి గ్రూప్ తీసుకున్నాడు

అత్తెసరు మార్కులొచ్చిన నేను ఎం. పి. సి. తీసుకున్నాను.

మా గ్రూప్స్ వేరైనా కాలేజీ ఒకటే అవటంనుంచి - మా స్నేహానికి ఏ విఘ్నమూ వాటిల్లలేదు. మేం పెరుగుతున్నకొద్దీ మా స్నేహం మరింత పటిష్టం కాజొచ్చింది. మా అభిప్రాయాలూ మరింతగా బలపడినయ్.

అయినా -

నేను గుడి కన్పించినప్పుడల్లా - లోపలికెళ్లి నమస్కరించటం - గోపీ వెక్కిరించటం మానలేదు. అదీ మా దిన చర్యలో ఒక భాగమైపోయింది.

కాలేజీ జీవితం ముగిసింది. నేను బి. ఏ. అన్పించుకున్నాను. గోపాలం బి. యస్సీ.లో యూనివర్సిటీ ఫస్టు వచ్చాడు.

గోపాలం తన కిష్టమైన డాక్టర్ కోర్సు కెళ్ళాడు.

నేను బి.ఇడి.లో చేరాను.

మా ఇద్దరిమధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూనే వున్నాయి.

నా చదువు పూర్తయి వున్న ఊళ్ళోనే హైస్కూల్లో టీచర్‌గా చేరాను.

గోపాలం ఎం.బి బి యస్ లో డిస్టింక్షన్ తెచ్చుకుని - ఫారెన్ స్కాలర్ షిప్‌మీద రీసెర్చికై జర్మనీ వెళ్లాడు.

నేను మామూలు బడిపంతులు ఉద్యోగంతో - పెద్దవాళ్ళు కుదిర్చిన పద్మను పెళ్లిచేసుకుని - సంసార తాపత్రయంలో పడ్డాను

జర్మనీ వెళ్లాక - మొదట్లో లెటర్స్ వ్రాసిన గోపాలం - క్రమంగా తగ్గించేశాడు. నేనూ సంసారపు గొడవల్లో తాత్కాలికంగా గోపాలం మాట విస్మరించాను.

రేసు గుర్రాల్లా రోజులు దూసుకు పోతున్నాయ్

ఓ ఆదివారం - ఉదయంపూట తీరిగ్గా లెక్కల పేపర్లను ముందేసుకుని దిద్దుతూ కూర్చున్నాను.

వాకిట్లో కారు ఆగిన శబ్దమైంది. మా ఇంటి కెవరు వస్తారన్న నిర్లక్ష్యంతో పట్టించుకోలేదు.

బూట్లశబ్దానికి తలెత్తిచూసిన నేను ఆశ్చర్యానందాలతో ఉక్కిరిబిక్కిరయ్యాను. వున్నపాటుగా లేచి గోపాలానికి ఎదురెళ్లాను.

ఆప్యాయంగా కౌగలించుకుంటూ - "ఇంకా నీకి గోపీ గుర్తున్నాడురా ?" అన్నాడు గోపాలం:

"అంత నిష్ఠూరం వేయకు గోపీ ! నిన్ను మర్చిపోవటమా ?" అన్నాను, ఏదో మాటలకందని అనుభూతి నా గొంతునిండా తొణికిసలాడగా!

గోపాలాన్ని కుర్చీలో కూర్చోమని - లోపలికి పరిగెత్తి - పద్మతో కాస్త కాఫీగట్రా చేయమని పురమాయించి వచ్చాను.

గోపాలం గది నలుమూలలా కలయ జూస్తూ "ఊఁ ... పక్కా సంసారి వయ్యావన్నమాట !" అన్నాడు నవ్వి




"నా సంగతికేంలే... నీ విషయాలు చెప్పు. ఎప్పుడొచ్చావ్ ఇండియా? రీసెర్చి పూర్తిచేశావా? పెళ్లి చేసుకున్నావా? పిల్లలెంతమంది??" అన్నాను గబగబా.

"ఫుల్ స్టాప్. నీలాగా నేను బుద్ధి లేని గాడిదననుకున్నావారా? నీకు ఆహ్వానం పంపకుండా చేసుకోవటానికి?"

"సారీరా గోపీ! అనుకోకుండా జరిగిపోయింది. కనీసం ఇన్విటేషన్ అన్నా పంపలేకపోయినందున రియల్లీ సారీ..."

"నెవర్ మైండ్... నేను ఇండియా వచ్చి వారం అయింది. ఇక్కడికి రాత్రే వచ్చాననుకో... రాగానే నేను మొదటి పని – నిన్ను వెదుక్కుంటూ రావటమే...రీసెర్చి పూర్తిచేసుకునే వచ్చాను– ఇక ప్రాక్టీస్ పెట్టటానికి ఏర్పాట్లు చూసుకోవాలి!"

గోపాలం బాగా తెల్లబడ్డాడు. కళ్లకు జోడు రావటంతో మనిషికి నిండుదనం వచ్చింది. మాటలో – చూపులో ఓ రకమైన హుందా. రత్నాన్ని సానబెట్టినట్లు ఇప్పుడు మరింత కళకళలాడి పోతున్నాడు.

పద్మ ఉప్మా ప్లేట్లతో వచ్చింది.

ఇద్దరికీ పరిచయం చేశాను.

"ఇప్పుడెందుకమ్మా ఇవన్నీ?" అన్నాడు మొహమాటంగా.

"నోరు మూసుకొని తినరా! నా పెళ్లి కెలాగూ రాలేదు. ఇవాళ మా యింట్లోనే నీ భోజనం. తిక్క వేషాలు వేయక!" అన్నాను.

మొదట్లో ఏవో అభ్యంతరాలు చెప్పినా – మా భార్యాభర్తల బలవంతంతో వుండిపోయాడు.

కాఫీల్లాగాక వక్కపొడి అందించ బోయాను. నిరాకరించాడు.

సిగరెట్ ఆఫర్ చేయబోయాను. సారీ చెప్పాడు.

"వాటెవండర్! స్టేట్స్ కెళ్లినా - నువ్వు తెలుగు మర్చిపోలేదు. ఏ బాడ్ హేబిట్స్ లేవంటే నమ్మలేకపోతు న్నాను" అన్నాను ఆశ్చర్యంగా.

"మన బలహీనతలు బైటపడవేసు కోవటానికి స్టేట్స్‌కే వెళ్లనక్కరలేదు. ఎక్కడున్నా అవి మనిషిని లోబరుచు కుంటూనే వుంటాయి. వాళ్లనుంచి మనం నేర్చుకోవాల్సింది ఇలాంటి హేబిట్స్ కాదు. నిజాయితీ-క్రమశిక్షణ. కానీ మనసులో చాలామంది అదేం దౌర్భాగ్యమో అవిమాత్రం వదిలేసి - మిగతావి వెంటబెట్టుకొస్తారు !"

గోపాలం అక్కడి ఆచార వ్యవ హారాలు - వాళ్ళు సాధించిన విజ యాలు - అక్కడ చూడతగిన ప్రదే శాలు అన్నీ వివరంగా చెప్తూ కూర్చు న్నాడు. అవన్నీ ఆసక్తిగా వింటూ చూస్తున్నంత అనుభూతి చెందాను.

"ఆ సాయంత్రందాకా మా ఇంట్లోనే వున్నాడు గోపాలం. వెళ్లబోయేముందు కారులోనుంచి ఓ పేకెట్ తీసుకొచ్చి నా చేతుల్లో పెట్టాడు.

"ఏంట్రా ఇది ?" అన్నాను ఆశ్చర్యంగా.

"తీసి చూడు. నీకోసం ప్రత్యేకంగా తెచ్చాను. ఇంతకంటే విలువైంది - నా కేదీ కన్పించలేదు."

విప్పాను.

మూడు కోతులు ! సజీవంగా వున్నట్లే భ్రమగొల్పుతున్న మూడు కోతులు.

చెడు చెప్పకు - వినకు - చూడకు. అన్న సందేశాల్తో వున్న మూడు కోతులు.

"థాంక్స్‌రా !" అన్నాను.

"రా ! ... అలా మన కాలేజీవైపు వెళ్దాం" అన్నాడు కార్లో కూర్చుని.

ఇద్దరం బైల్దేరాము.

మాతో చదువుకున్నవాళ్లు ఏ విధంగా సెటిలయ్యిందీ చెప్పుకున్నాం. కాలేజీ ఆవరణలోకి వెళ్ళాక - విచిత్రమైన అనుభూతి కల్గింది. ఒకప్పటి మా కాలేజీ ! ఇప్పుడు మాకేం కాదు. అయినా పుట్టిపెరిగిన వూరిమీదా - చదువుకున్న విద్యాలయాలమీదా ఏళ్ళ తరబడి వుంటున్న ఇంటిమీదా మనిషికి ఎంత మమకారమో !

తిరిగి వస్తూ - దారిలో గుడిదగ్గర ఆపాడు కారు గోపాలం నా అలవాటు ఎంత గుర్తో అన్పించింది. నేను గుడి లోపలికి నడిచాను. గోపాలం కారుదిగి - అక్కడే వుండిపోయాడు. అంటే గోపాలం అభిప్రాయాలేం మారలేదన్న మాట !

నేను తిరిగి వచ్చేసరికి గోపాలం కారును ఆనుకుని నిలబడి — గాలి గోపురంవైపు చూస్తున్నాడు.

దగ్గరగా వెళ్లినా - అతనట్లాగే వుండటంచూసి-



"ఏమిటంత పరిశీలన ? శిల్పకళ నేనా చూసేది ?" అన్నాను – నేనూ చూపులు అటే త్రిప్పి.

"కాదు ! భగవంతుడ్ని !" అన్నాడు నిదానంగా.

పక్కలో బాంబుపడ్డట్టు అదిరి పడ్డాను.

"ఒరే గోపీ ! ... నువ్వేనా మాట్లేది ?" అన్నాను ఆశ్చర్యంగా

"ఎందుకంత ఆశ్చర్యం ?"

"అయితే నువ్వు మారిపోయావన్న మాట !!" అన్నాడు సంతోషంగా.

"కానీ – నువ్వనుకుండే మార్పు కాదు."

"నాకర్థం కావటంలేదు."

"చెప్తాను...అదిగో ఆ గాలిగోపురం మీద ఏం వున్నాయి ?"

"శిల్పాలు !"

"ఇంకా ?"

"పావురాళ్ళు !"

"ఇంకా ?"

"కోతులు !"

"అవే ! నేనన్న భగవంతుడు!"

"కోతులా !"

"అవును ! కారెక్కు – అర్థం అయేలా చెప్తాను."

ఎక్కి కూర్చున్నాను – కదిలింది కారు

"అనాదినుంచీ మానవజాతికి అనేక ప్రాణులు – అనేక విధాలుగా ఉపయోగిస్తూ వచ్చాయి. అన్ని ప్రాణులలోకీ ఈ కోతులు తనకు ఎన్నివిధాలా ఉపకరిస్తున్నాయో తెలుసా ? వాటివల్ల మనకు కల్గుతున్న మేలు తెల్సుకుంటే వాటిని భగవంతుడని ఎందుకన్నానో తెలుస్తుంది."

నేను మౌనంగా వింటూ అర్థంచేసుకోవటానికి ప్రయత్నించసాగాను.

"మనిషికీ — కోతికీ దగ్గర పోలిక లున్నాయి. కోతినుంచే మానవుడు రూపాంతరం చెందాడు. ఈనాడు మనం ఎన్నో రోగాలనుంచి - నివారణ పొందుతున్నామంటే అదంతా కోతుల చలవే. ఈనాడు కోతులు శాస్త్రజ్ఞుల పరిశోధనలకు ఎంతో ఉపకరిస్తున్నాయి. ఎన్నో ప్రయోగాలు వాటిపై జరిపి - వాటి రియాక్షన్ గమనించి - దాన్ని బట్టి మందులు తయారుచేస్తున్నారు. ఏ మనిషికైనా తమ వృత్తికి ఎంతో ఉపకరించే వాటిని దైవంఅంటాను నేను. దైవం అన్నది మన మాటల కతీతమైనది అని అర్థం. ఒక మనిషి చావుబ్రతుకుల మధ్య చేయూతనిచ్చి - జీవితాన్ని చూపించే డాక్టరు ఎంతో ఉన్నతుడనీ - దేవుడనీ ఆకాశాని కెత్తేస్తారు. కానీ ఏ డాక్టరుకైనా మందులనే ఆయుధం చేతిలో లేనిది ఏమీ చేయలేడన్నది జగ ద్విదితం. ఈ మందులు ఎట్లావచ్చాయి? ఎలాంటి పరిశోధనవల్ల? అని ఆలో చిస్తే - పేరుపొందిన ప్రతి మందు వెనక — అనేక జీవాల ప్రాణ త్యాగా లున్నాయి. ఉదాహరణకి పోలియో వాక్సిన్ తీసుకో. ఈ వాక్సిన్ కోతులపై పరిశోధనలుచేసి వుండకపోతే- ఈనాడు మనకు అందుబాటులో వుండేదికాదు. మానవుని శరీర ధాతునిర్మాణంలో సారూప్య - సాహిత్య ధర్మాలుగల కోతు లపై పరిశోధనకే ఇతమిత్థమైనవి కావటంచేత - శాస్త్రజ్ఞులు వీటినే ఎక్కు వగా ఉపయోగిస్తున్నారు. కొందరు శాస్త్రజ్ఞులు శస్త్రచికిత్సలోనూ తమ విధానాలకై కోతులపై పరిశోధనలు జరుపుతున్నారు. కొందరు శాస్త్ర వేత్తలు - మెదడులో లైంగిక కార్య కలాపాల కేంద్రాన్ని గుర్తించటానికై విద్యుత్తు ప్రవహించే సూదుల్ని మెద డులో గుచ్చుతారు. ఇలా రకరకాలుగా చిత్రహింసల పాల్జేస్తూ - కోతుల్ని ఉపయోగించుకుంటోంది - మా వైద్య శాస్త్రం అందుకే నాకు కోతుల్ని చూస్తే హృదయం ద్రవిస్తుంది. వాటిపట్ల నా మనసు కృతజ్ఞతతో నిండిపోతుంది. చేతులెత్తి నమస్కరించాలనిపిస్తుంది. మన ప్రగతికోసం - అవి బలైపోతు న్నాయన్న నిజం నన్ను కదిలిస్తుంది - మనం వున్నాం ఎందుకూ? తోటి మనిషి బాగుపడినా — సుఖంగావున్నా సంతోషించలేని మానవులం మనం. మన తెలివితేటలు - మనం సద్వి నియోగపర్చుకోవటమే అరుదు."

గోపాలం ఇంటిముందు ఆగింది కారు.

డ్రాయింగ్ రూంలో కూర్చున్నాక కోతుల్ని గురించిన సమాచారాన్ని ప్రకటించిన పత్రిక చేతుల్లో పెట్టాడు.

అదంతా చదివాక - గోపాలం నాకు బహూకరించిన కోతుల బొమ్మల అంతర్యం అర్థమైంది నాకు!




కొట్టువాడు యిచ్చిన గాజుల పొట్లాన్ని జాగ్రత్తగా పేంటుజేబులో పెట్టుకుని, షాపునుండి బైటపడ్డాడు రామారావు.

సాయంకాలం కావడంవలన వచ్చే పోయే జనంతో బజారు రద్దీగావుంది. రోడ్డు పక్కన పేవ్‌మెంటుమీద నడవ సాగాడు రామారావు. అతని మనసు యిప్పుడు ఒకవైపు ఆనందంతోను, యింకొకవైపు ఏదో కోల్పోనట్లు దిగులుతోను నిండివుంది. అందుకుగల ప్రధాన కారణం పార్వతి. రాత్రి పడుకో బోయే ముందు "రేపు మన పెళ్ళి రోజండి రేపటితో మనకు పెళ్ళి అయి పాతిక సంవత్సరాలు నిండుతాయి." అంది. అప్పుడే పాతిక సంవత్సరాలు గడిచిపోయాయా అని ఆశ్చర్యం కలిగింది. పార్వతిలాంటి భార్య దొరకడం అదృష్టం. అందుకనే కాబోలు, పాతిక సంవత్సరాలు యిట్టే గడిచిపోయినా, తనకు తెలిసిరాలేదు.' గొణుక్కున్నాడు రామారావు. భార్యను ప్రేమగా గుండెకు హత్తుకున్నాడు పెళ్ళయి యిన్ని సంవత్సరాలయినా పార్వతి తనను ఏమీ కోరలేదు. తను కూడా "ఏం కావాలి?" అని అడగనూలేదు. వచ్చిన జీతం యింటి ఖర్చులకు సరిపోవడమే కష్టమవుతుంది అటువంటప్పుడు భార్యకు ఏంకావాలో ఎలా అడగగలడు? చేతకాని తనం తన నోరు నొక్కేసింది... ఎన్నోసార్లు.

కాని, నిన్నరాత్రి అనాలోచింతగా, తన చేతగానితనాన్ని మరచిపోయి "ఎంకావాలో కోరుకో" అన్నాడు. పార్వతి నవ్వింది.

"మీలాంటి భర్త లభించాక ఏ ఆడదన్నా ఏం కోరుకుంటుంది?" అంది. ఆ మాటలు వెక్కిరింపో, పొగడ్తో అర్థంకాలేదు.

పార్వతిని మరింతగా గుండెలకు హత్తుకుని, ముంగురుల్ని సవరిస్తూ—

"అదికాదు పారూ! మనకు వివాహం జరిగి యిన్ని సంవత్సరాలయ్యాయా?! నువ్వు ఎప్పుడన్నా నన్ను ఏదైనా కోరేవా? ప్లీజ్— ఏదైనా కోరుకో. లేకపోతే నాకు బాధగావుంటుంది.'' అన్నాడు. తన బలవంతంవలన పార్వతి కోరుకుంది.

ఎన్నాళ్ళనుంచి ఆ కోరికను తన గుండెలో భద్రంగా దాచుకుందో! తన వత్తిడివలన మెల్లగా ఆ కోరికను బైటపెట్టింది.

"నాకు... ఒక జత బంగారు గాజులు కావాలండీ" అంది. తను మరేం ఆలోచించకుండా సరే నన్నాడు.

ఉదయం నిద్రనుండి లేచాక, రాత్రి పార్వతి కోరిక, తన వాగ్దానం గుర్తుకు రాగానే గుండెనెవరో పిండినట్లయింది. రాత్రి తనెంత అవివేకంగా ప్రవర్తించాడో అర్థం అయింది. నిద్రపోతున్న పార్వతి మనసులోని కోరికను తనే బలవంతాన తట్టిలేపాడు. ఆ కోరికను తీర్చక తప్పదు. పాతిక సంవత్సరాలు తన కష్ట సుఖాల్ని పంచుకున్న భార్య కోరికను, ఈనాడు వివాహ రజతోత్సవ సమయంలో తీర్చడం తన విధి. కాని, ఎలా? వెయ్యి రూపాయలుంటేగాని బంగారు గాజులజత రాదు. నెలాఖరు రోజులు, పాతిక రూపాయలకన్నా తన దగ్గర ఎక్కువలేవు.

ఆఫీసులో పనిచేస్తున్నాడన్న మాటే గాని, మనసంతా గాజుల గురించే తీవ్రంగా ఆలోచిస్తుంది. సాయంకాలం ఆఫీసు విడిచిపెట్టే సమయానికి ఒక నిర్ణయానికి వచ్చాడు రామారావు.

ఆ నిర్ణయ ఫలితమే ఈ గాజులు! జేబులోని గాజుల్ని జాగ్రత్తగా అదిమి పట్టుకుని యింటివైపు నడుస్తున్నాడు రామారావు. అతని మనసు ఆలోచనలు ఈ గాజుల్ని కొనడానికి ఎంత బాధ పడ్డాడో, తలచుకుంటేనే భయం వేస్తుంది.

గుమ్మంలో తన రాకకు ఎదురు చూస్తూ నిలుచుంది పార్వతి. పార్వతిని అలా గుమ్మంలో చూసేసరికి పాత రోజులు గుర్తుకు వచ్చాయి రామారావుకి. పెళ్ళయిన కొత్తలో తన రాకకోసం ఎదురుచూస్తూ అలా నిలుచుండేది. ఆ తరువాత ఆ అలవాటు తప్పింది. మళ్ళీ, యిన్నాళ్ళిల్టికి.

పార్వతి భర్తను చూసి చిన్నగా



నవ్వి యింట్లోకి దారితీసింది. రామారావు కూడా నవ్వక తప్పలేదు.

ఇంట్లోకి వస్తూనే "పిల్లలంతా ఎక్కడ ?'' అడిగాడు.

"పెద్దవాడు యిప్పుడే లైబ్రరీకని చెప్పి వెళ్ళాడు. ఉమ యింకా కాలేజీ నుండి రాలేదు," చెప్పింది పార్వతి.

వంటయింట్లోకి వెళ్ళి స్టీలు ప్లేటులో రెండు స్వీట్లు, ఉప్మా సర్ది, రామారావుకి యిచ్చింది రామారావు ప్లేటును అందు కొని, పక్కనున్న బల్లమీద వుంచాడు.

"పారూ ! రాత్రి నువ్వడిగింది జ్ఞాపకం వుందా ?" భార్య కళ్ళలోకి చూస్తూ ప్రశ్నించాడు.

"బంగారుగాజులు కదూ ! పోనిస్తురూ. మనకి అంత డబ్బు ఎక్కడిది ? పూరిచ తే. మీరు బలవంతం చేస్తే అలా అడిగాను," అంది ఆ విషయాన్ని తేలిగ్గా కొట్టిపారేస్తూ.

"పారూ ! నీ కోరిక తీర్చలేని అస మర్థుడిని కదూ ?" కళ్ళల్లో రామారావుకు నీరు తిరిగింది.

"ఛ. అలా ఎవరన్నారు ?'' భర్త మాటలకు నొచ్చుకుంటూ అంది.

రామారావు భారంగా నిట్టూర్చాడు.

''ఇవిగో, నువ్వడిగిన గాజులు." జేబులోనుంచి పొట్లాన్ని తీసి భార్య కిచ్చాడు

పార్వతి ఆశ్చర్యంగా భర్తను చూసి గబగబా పొట్లాం విప్పింది పచ్చగా, మెరుస్తూ గాజులు ! తన కళ్ళను తనే నమ్మలేకపోయింది.

"ఏమండీ ! ఇంత డబ్బు ఎక్కడిది !" ఆశ్చర్యంనుండి తేరుకున్న తరువాత,

భర్తను అనుమానంగా చూస్తూ ప్రశ్నించింది.

జవాబు చెప్పలేదు రామారావు. దోషిలా తల వంచుకున్నాడు.

"లంచం పుచ్చుకున్నారా?" భయం భయంగా అడిగింది, భర్త స్వభావం బాగా తెలిసివున్నా.

"ఇంకా, అంతకు తెగించలేదు పారూ!" అన్నాడు బాధగా. తన మాటల వలన భర్త మనసు గాయ పడిందని గ్రహించింది పార్వతి. ప్రేమగా భర్త తల నిమురుతూ "మీ సంగతి నాకు తెలుసండి. ఈ గాజులు చూసేసరికి మతిపోయి, అలా అడిగాను" అంది పార్వతి.

"గాజులు బాగున్నాయా?" అడి గాడు రామారావు, ప్లేటును దగ్గరకు తీసుకుని,

"చాలా బాగున్నాయండి ఇంతకీ, ఈ గాజులకీ... డబ్బెక్కడిది?"

పార్వతి ప్రశ్న రామారావుకు గోరు చుట్టుమీద రోకలిపోటులా తగిలింది.

"అప్పు చేశాను పారూ!" మెల్లగా జవాబిచ్చాడు.

'ఇంత డబ్బు ఎందుకు అప్పు చేశారండి!" అంది పార్వతి గాజుల్ని ఆపేక్షగా చూస్తూ.

"ఇప్పుడా గొడవంతా ఎందుకు పారూ! ఈ రోజు మన వివాహ రజతో త్సవ దినం. సంతోషంగా వుండాలి. త్వరగా నువు తయారవు. సినిమాకి వెళ్దాం" అన్నాడు.

"అలాగేనండీ. ఇంతకీ, ఈ గాజుల్ని ఎంతకు కొన్నారు?" గాజులు పరీక్షగా చూస్తూ అడిగింది.

"పారూ! ప్లీజ్... ముందు నువ్వు ముస్తాబవు," విసుగా మొహంపెట్టాడు రామారావు.

* * *

రాత్రి పది గంటలయింది.

పిల్లలందరూ ముందు గదిలో నిద్ర పోయారు. వంటయిల్లు సర్ది, భర్త గదిలోకి వచ్చింది పార్వతి.

మంచంమీద పడుకుని వున్న రామా రావు తలతిప్పి పార్వతివైపు చూశాడు.

తడిచేతుల్ని చీర చెంగుతో తుడుచు కుంటూ వచ్చి రామారావు పడుకున్న మంచంమీద కూర్చుంది.

"పారూ! ఒక నిజం చెబుతాను. కోపం తెచ్చుకోవు కదూ?" సంశయంగా అడిగాడు.

"నిజం చెబితే కోపం ఎందుకండీ?" అంది.

రామారావుకు నిజం చెప్పడానికి ధైర్యం చాలడంలేదు. ఒకవైపు అర్ధాం గికి నిజం చెప్పకుండా మోసం చెయ్యడం తప్పు అని మనసు హెచ్చ రిస్తుంది.

జారిపోతున్న ధైర్యాన్ని జాగ్రత్తగా కూడదీసుకున్నాడు.

"పారూ! నిన్ను... మోసం చేశా ననుకో, అప్పుడు నన్ను అసహ్యించు కోవు కదూ?" గొంతు వణికింది.

"ఛ. అవేం మాటలండీ. మీరు నన్ను మోసంచెయ్యడమేమిటి?" అమాయకంగా భర్తను చూస్తూ అంది.

"అవును పారూ! నిన్ను మోసం చేశాను. నువు బంగారు గాజులు తెమ్మని అడిగితే, ఆ గాజుల్ని కొనే స్తోమత లేక గోల్డుకవరింగ్ గాజులు తీసుకువచ్చాను. ఆ గాజుల్ని బంగారు గాజులని చెప్పి నీకు యిచ్చాను. నన్ను క్షమిస్తావు గదూ?" దుఃఖం వలన రామారావుకు గొంతు బొంగురు పోయింది.

"అదేమిటండీ... ఈమాత్రం దానికే బాధపడాలా? నాకు మొదటే తెలుసు మీరు తెచ్చినవి గోల్డు కవరింగు గాజులని" అంది

రామారావుకు పార్వతి మాటలు ఆశ్చర్యాన్ని కలిగించాయి.

"ముందే తెలుసా? ఎలా??"

"మీరు తెచ్చిన గాజులు చాలా తేలిగ్గా వున్నాయండి. అంతేకాదు, మన ఎదురింటి పిన్నిగారికి చూపిస్తే యివేం బంగారు గాజులు! గోల్డు కవరింగువి," "అంది ఆవిడకు యిటువంటి విషయాలు బాగా తెలుసు" అంది.

బాధగా పార్వతిని చూశాడు.

"మరి, నన్ను వెంటనే అడగ లేదేం?" ప్రశ్నించాడు. తనవలన పక్కింటావిడ దగ్గర పార్వతికి తల వంపు జరిగించనే విషయం రామా రావుకు భరించశక్యం గాకుండా వుంది.

"అడగాలనే అనుకున్నాను. కాని, మీరు బాధపడతారని అడగలేదు."

పార్వతి మాటలకు రామారావుకు దుఃఖం ఆగిందెకాదు.

"నువ్వు భార్యగా దొరకటం నా అదృష్టం పారూ! నీకు...నీకు మోసం చేశాను. వట్టి యిడియట్‌ని చేత గాని వాడ్ని..." పిచ్చిగా జుత్తు పీక్కు న్నాడు- రామారావు! పార్వతి అతన్ని వారిస్తూ

"అలా మాట్లడకండి. అసలు నాదే పొరపాటు అంత పెద్ద కోరిక కోరకుండా వుండవల్సింది నన్ను క్షమించండి" అంది

"నీ మంచితనంతో నన్నింకా పిచ్చి వాడ్ని చెయ్యకు పారూ! ప్లీజ్" అస హనంగా అన్నాడు. పార్వతిని గుండెకు హత్తుకుని ముద్దులవర్షం కురిపించాడు.

...నేనదృష్టవంతుడ్ని... మరో సారి మనసులో అనుకున్నాడు రామారావు.



# చక్రపాణి

కావి ... షల

(గత సంచిక ... వాయి)

అతను అంచనా ప్రకారం ప్రక్క దగ్గరకు నడిచి మంచంమీద కూర్చున్నాడు.

"వక్కపొడి," అంది పద్మావతి.

అతను చెయ్యి ముందుకు చాపాడు.

అతని చేతిలో వక్కపొడి వేసింది పద్మావతి.

అతను వక్కపొడి నములుతూ వెనక్కి వాలాడు.

...ండండి. దిండు ..." అంటూ అతని తలకింద చెయ్యుంచి, దిండు సరిజేసింది పద్మావతి.

ఆమెను ఏమేమో అడగాలని మనస్సాత్రతపడుతూన్నా, ఇవ్వాళ కాదు అనుకుని వత్తిగిలిపడుకున్నాడు పాణి.

అతనేమన్నా మాట్లాడతాడని ఆశించిన పద్మావతి, బరువుగా నిట్టూర్చి టేబిలువైపు నడిచింది.



అతడి చావుకు కారణం అయ్యాననే బాధ... ఆకల్మషాత్మతో చేయవలసిన పోరాటం నాకు తప్పుతుంది!" అన్నది.

"అయితే ప్రయత్నించు," అన్నాడు అవజ్ఞవర్మ ఆశగా.

వకుళమాల లేచింది. ఆమె అవజ్ఞవర్మకేసి ఓమారు చూసి, తలవంచుకుని ద్వారంకేసి బయలుదేరింది. అవజ్ఞవర్మ కూడా లేచాడు. అతడి నేత్రాలు ఆనందంతో మిలమిలలాడినై. పెదాల మీద మందహాసం కదుల్లాడింది.

"వకుళా!" అన్నాడతడు ఆనంద పారవశ్యంతో.

వకుళమాల ద్వారందగ్గిర ఆగి, వెనుదిరిగి చూచింది.

"వకుళా! ఒకప్పుడు నేను,నీ ప్రేమ భిక్షకోసం వచ్చాను జ్ఞాపకంవున్నదా?" అని అడిగాడు అవజ్ఞవర్మ.

వకుళమాల నిశ్చేష్టురాలైంది.

"వకుళా! నా సహృదయం తెలిసిన నీవు, ఏనాటికైనా నా అర్థాంగివి కాగలవని, నేను నమ్ముతున్నాను," అన్నాడు అవజ్ఞవర్మ హీనస్వరంతో.

ఆ మాటలు వింటూనే, వకుళమాల గిరుక్కున తిరిగి గడపదాటి వీధిలోకి వెళ్ళిపోయింది.

అవజ్ఞవర్మకు ఆమె మనోగత భావమేమిటా అన్న ప్రశ్న ప్రత్యక్షమైంది. అతడు గబగబా గడపదగ్గిరకుపోయి, వేగంగా నడచిపోతున్న వకుళమాలకేసి చూస్తూ నిట్టూర్చి, "ఎవరక్కడ?" అంటూ సేవకుడికోసం కేకవేశాడు.

ఎవరూ జవాబు పలకలేదు. ఈ సారి అవజ్ఞవర్మ మరింతగట్టిగా, "ఎవరక్కడ?" అని అరిచాడు. దానికి జవాబు లేదు.

[సశేషం]




సావిత్రమ్మ ఇంటిపని చేసుకోలేక నానా బాధపడిపోతోంది. పనిమనిషి మానేసి పదిరోజులయింది. అది పోతూ పోతూ ఓ వాదు వేసి మరీ పోయింది.

"సావిత్రిరమ్మ ఇంటో పనెక్కువ. ఫలితం తక్కువ కనీసం ఇడిచిపారేసిన పాతకోకయినా పడెయ్యదు. ఓయమ్మో! మరో పదిరూపాయ లెక్కువిచ్చినా ఆ యింట్లో పనిసెయ్యడం శానా కష్టం," అంటూ ఓ వాదు లేవదీసి పోయింది.

అందులో నిజమెంతో అబద్ధమెంతో సావిత్రమ్మకి, ఆ వాదేసిన దానికి మాత్రమే తెలుసు

బంగారంగానూ! తిన్నన్నాళ్లు తిని చేసినన్నాళ్ళు చేసి మరో ఇంట్లో మరో నాలుగు డబ్బు లెక్కువిస్తా ననగానే మానేసిపోవటమే! నీతీ, నిజాయితీ అక్కర్లా! పైగా వాదేసి పోతావా! అపభ్రంశపు మాటలతో పూరూ వాడా యాగీచేసి పోతావా? అందుకనే కూడూ గుడ్డాలేక మీ జాతి అట్టా ఏడుస్తోంది! ఇంత కింత అనుభవించక పోవులే" అంటూ మనసులో పనిదాన్ని కసిదీరా శపించింది సావిత్రమ్మ. ప్రత్యక్షంగా దాన్ని తిట్టి పంపిద్దామని కబురు పెడితే అది రాను పొమ్మంది నిర్లక్ష్యంగా.

అసలు ఇలాంటి అలగాజనంతోనూ,

రౌడీజనంతోను మాట్లాడటం తనదే తప్పని సర్దుకుంది సావిత్రమ్మ.

రామసుబ్బమ్మగారి పనిదాన్ని అడిగితే పాతికిస్తావా అంది, దీని ఆశ పాడుగాను!

వెంకటలక్ష్మమ్మగారి పనిదానికి పాతికిచ్చి, రెండుపూటలా వేళప్రకారం కాఫీ, టిఫిన్లు పెట్టాల్ట! దీని మొహం మండ! ఇదేం పెళ్ళివారిల్లు అనుకుంది కాబోలు!

శేషమాంబగారి పనిదాన్ని కదిలిస్తే, హావ్వ! హావ్వ! ఆ పాతికేళ్ళ పడుచు గుంటని ఇరవైనాలుగ్గంటలూ ఇంట పెట్టుకు భరించాలట దాని తిండితిప్పలే గాక, సబ్బు, పౌడర్లలాటి అలంకార సామగ్రికూడా సప్లైచెయ్యాల్ట! అదో కండిషనూ! ఇంకా నయం అంతటితో పోనిచ్చింది. మరేం అడగకుండా దాని పుణ్యాన అంటూ!

ఇది మరీ విడ్డూరం కాదూ! ఆ షోకిల్లా డ్రైవిస్టు పారిజాతం పనిదంటుంది గదా, దానికి పై డబ్బక్కర్లేదట! ఇంట్లో పెట్టుకుంటే చాలట! వంటా, గింటా కూడా చేసిపెడుతుందిట! పైగా తను అవసరార్థం ఏ వూరన్నా పోతే అయ్యగారికి ఏ కష్టం కలక్కుండా వెయ్యి కళ్ళతో చూసుకుంటుందిట! హమ్మ! హమ్మ గుండెలు దీసిన బంటు గాదూ!

ఏతా, వాతా ఫలితం పదిరోజులయినా సావిత్రమ్మకి పనిమనిషి దొరకలేదు.

అంట్లగిన్నెలు తోమి, తోమి చేతులు ఎర్రగా కందిపోయాయి బట్టలకి సబ్బు రాచి రాచి చేతులు బొబ్బరెక్కిపోయాయి. ఛా, ఛా ఇలాటి అలగా పన్లన్నీ వాళ్ళు చెయ్యాల్సిందే! మనకేం అలవాటా పాడా అనుకుంటూ నడుం సవరదీసుకుంది సావిత్రమ్మ.

* * *

'అమ్మా' అంటూ వీధిలోంచినొక్కేసినట్టుగా వున్న ఓ కంఠం వినిపించింది. సావిత్రమ్మ చేతిలోని అంటగిన్నెని దభేలున కిందపడేసి వీధిలోకి పరుగుతీసింది. ఏదో ఆశ! బుద్ధి తిరిగొచ్చి పనిమనిషి తిరిగొచ్చిందేమోనన్న ఆశ ఓ మూల ఏడిపిస్తోంది సావిత్రమ్మ ఆదరాబాదరా తలుపుతీసి చూసింది. అది పాతమనిషి కానేకాదు. మరో కొత్త మనిషి.

సావిత్రమ్మ దాన్ని ఓసారి నఖశిఖ పర్యంతం పరీక్షించి మొహం చిట్లించుకుంటూ 'ఎవరూ?' అంది.

ఆ మనిషి చిరుగుల చీరతో, కప్పకో వల్సిన శరీరభాగాల్ని సగం సగం మాత్రమే కప్పుకుంది. అతుకులేసిన చోటకూడా చిరిగిపోయిన రవిక. కొబ్బరి పీచులాటి తలని గిరుకుని ముడేసుకుంది. పదిలంఖణాలు చేసినట్టుంది దాని మొహం.

'ఏం కావాలి?' అంది సావిత్రమ్మ చిరాగ్గా.

"పనిమనిషి కావాలా అమ్మా?" అందా మనిషి ఊపిరి లేనట్టుగా.

సావిత్రమ్మకి ఒక్కసారిగా ప్రాణం లేచొచ్చింది. ఆ చింపిరి బట్టల ఆకారం సర్వాభరణ భూషితురాలయిన సాక్షాత్ ఆ శ్రీమహాలక్ష్మి ఘల్లు, ఘల్లుమని గజ్జెలు చప్పుడు చేసుకుంటూ తనని అనుగ్రహించటానికి ఏతెంచినట్లు అని పించింది

సావిత్రమ్మ తన సంతోషాన్ని పైకి పొక్కనివ్వకుండా జాగ్రత్త పడింది

"ఇదివరకెక్కడ పని చేశావు? చేస్తే అక్కడెందుకు మానేశావు? ఇల్లె క్కడ? పిల్లలెంతమంది? నీ మొగుడేం చేస్తాడు?" అంటూ దాన్ని నిలబెట్టి సవాలక్ష ప్రశ్నలేసింది సావిత్రమ్మ.

అది దాని హిస్టరీ అంతా మూడు ముక్కల్లో చెప్పేసింది. మొగుడు చచ్చి పోయాడు, ముగ్గురు పిల్లలు. అడుక్కో టానికి గూడా పనికిరానంత చిన్న గుంటలు. అది ఇంతవరకు పనిచేస్తున్న ఇంటివాళ్ళు బదిలీ అయి మరో వూరు వెళ్ళిపోయారు. అందుకని మరో పని కోసరం వెదుకుతోంది. అదీ దాని మాటల సారాంశం.

సావిత్రమ్మ దాన్ని పనికి పెట్టుకో టానికి అంగీకరించింది. అది చెయ్య వల్సిన పనంతా చెప్పింది ఇప్పటి వరకు ఇస్తున్న జీతాన్ని ఓ రెండు తగ్గించి చెప్పింది.

అది నిశ్శబ్దంగా వింటూ నిలబడిం దల్లా, ఏ భావమూ లేనట్టున్న మొహాన్ని పైకెత్తి "పోయినదానికి మరో రెండు ఇచ్చేవారంట గదమ్మా?" అంది మెల్లగా.

సావిత్రమ్మ లోలోపల తత్తరబిత్తర లాడింది. అమ్మో ఆకారం పిచ్చివాల కంగా వున్నా అన్నీ తెలుసుకునే వచ్చిం దన్నమాట!

"ఏదీ, పనితీరు చూడనీ. నచ్చితే మరి రెండు హెచ్చిస్తాలే!" అంటూ సర్దుకుంది. ఏది ఏవయినా దీన్ని చేజారి పోనీయకూడదు అనుకుంటూ బొబ్బ లెక్కిన చేతుల్ని ఊదుకుంది

సావిత్రమ్మ దానికి పెరట్లోకి దోవ చూపించి చెయ్యవలసిన పనులన్నీ చూపించింది. దాని పేరు రావమ్మ.

* * *

రెండు రోజులు గడిచిపోయాయి. సావిత్రమ్మకి రావమ్మ పని సంతృప్తి గానే వుంది. కాకపోతే అది దీక్షావస్త్రం లాగా విడవకుండా కట్టుకొస్తున్న ఆ చింకి చీరని చూస్తే మాత్రం వొళ్ళు జలదరిస్తోంది.

ఆ మురికి పాతని విడిచి మరోటి కట్టుకోదేం ఖర్మ. పాపం రెండో చీర గూడా లేదేమో! వాళ్ళేం మనకి మల్లే పొద్దున్న, సాయంత్రం నీళ్ళోసుకుని



భ్రమ్ముగా తయారవటానికి వీలేవుంటే ఈ పాచి పని ఖర్మేం పట్టేది పాపం! ఏమిటో వెధవ జీవితాలు. ఇట్టాగే బ్రతుకుతూ, ఇట్టాగే రాలిపోతారు. ఏం లోకమో! ప్రతి మనిషికి పట్టెడు కూడు, జానెడు గుడ్డా ఇవ్వ లేకుండా వుంది. ఎప్పటికి వీళ్ళ బ్రతుకులు బాగుపడతాయో అంటూ బోలెడు జాలిపడింది. సావిత్రమ్మ లోకంమీద, పనివాళ్ళ మీదానూ.

సావిత్రమ్మ రెండు రోజుల్నుంచి అనుకుంటుంది రావమ్మకి తనదో పాత చీర ఇస్తే బాగుంటుందేమోనని. పాపం. పేదది. కట్టి విడవటానికి మరో గుడ్డ లేదల్లే వుంది. తనదో నడిపాత చీర పడేస్తే సంతోషిస్తూ కట్టుకుంటుంది. నమ్మకంగా పనిచేస్తుంది, అనుకుంది సావిత్రమ్మ.

రావమ్మ ఎఱ్ఱటి ఎండలో చెమటలు కగ్గారుకుంటూ గిన్నెలు తోమేటప్పుడు, బట్టలు వుతికేటప్పుడు సావిత్రమ్మకి దానికో పాత చీర పడెయ్యాలన్న అభిప్రాయం మరింత గట్టిపడేది జాలితో. ఒక్క చీరే ఏం ఖర్మ! పాపం ఓ రెవిక గూడా ఇస్తే బాగుంటుంది. పాపం దాని రెవికనిండా ఎన్ని అతుకులు, చిరుగులో! తనకేం బోలెడన్ని చీరెలు రెవికలు వున్నాయి. దానికి ఓ చీర, రెవిక పడేస్తే తన సంపదేం కరిగిపోదు గదా? మడి మాన్యాలేం కొట్టుకుపోవు గదా!

సావిత్రమ్మ ఆలోచన దారిలో వుండగానే మరో సంఘటన జరిగింది.

ఓ రోజు రావమ్మ వొంగుని ఇల్లు వూడుస్తోంది. సావిత్రమ్మ మొగుడు గడ్డంగీసుకుంటున్నవాడల్లా పెద్దగా

కేకలు వేసుకుంటూ వంటగదిలో కొచ్చాడు

"ఏమే సావిత్రీ, చూడు పాపం ఆ రావమ్మకి బొత్తుగా గుడ్డల్లేవల్లే వుంది. నీదో పాత చీర పడెయ్యక పోయావా?" అన్నాడు.

ఉన్నట్టుండి తన భర్తకి రావమ్మ విషయం ఎందుకు ఆరాకొచ్చిందో సావిత్రమ్మకి అర్థంకాలా. చటుక్కున గదిలోకి తొంగిచూసింది. రావమ్మ వొంగుని గది వూడుస్తోంది. ఆడదయిన సావిత్రమ్మకే చప్పున సిగ్గేసింది ఎంత చింకి గుడ్డలు కట్టుకున్నా రావమ్మ వయసులో వున్న ఆడదే కదా!

"ఓసేయ్ రావమ్మా! పవిట సరిగ్గా వేసుకు ఏడవ్వే. నీ చింకి చీరా నువ్వూ పాడుగానూ" అంటూ కసురుకుంది.

"అసలయినా పనివాళ్ళవైపు మిమ్మల్నెవరు చూడమన్నారు. వయసుతో పాటు సరసంగూడా పెరుగుతున్నట్టుందే" అంటూ రుంజుమంది మొగుడి మీద.

సావిత్రమ్మ మొగుడు ఒక్క కేక పెట్టాడు. "నోరుమూసుకో పిచ్చి వాగుడు వాక్కు. కళ్ళెదురుగా అది చిరుగుల గుడ్డలతో కనిపిస్తుంటే ప్రత్యేకంగా చూడాల్సిన పనేముందే! నీకు మాత్రం కనపట్టంలా? ఆ స్టీలుగిన్నెల వాడికి బట్టలన్నీ దోచిపెట్టకపోతే, కళ్ళెదుట తిరిగేది దానికో పాత చీర తగలెయ్యకూడదూ" అంటూ రంకెలేసి, సలహా చెప్పి, స్నానానికి పోయాడు సావిత్రమ్మ మొగుడు.

ఆ సంఘటనతో రావమ్మకి ఓ పాత చీర ఇవ్వాలన్న అభిప్రాయం మరింత బలపడింది. సావిత్రమ్మ మనసులో జాలితో కాకపోయినా మరోవిధంగా.

ఆ సాయంత్రమే మరో సంఘటన కూడా సావిత్రమ్మ కళ్ళబడింది తనని పిసినారిదని అపవాదు వేసిపోయిన తమ పాత పనిమనిషి, రావమ్మ రోడ్డు మీద మాట్లాడుతూ కంటబడ్డారు.

ఓ క్షణం సావిత్రమ్మ గుండెలు దడదడ లాడాయి. ఈ పిచ్చిముండ రావమ్మకి అదేవన్నా పురెక్కించి, వున్నవీ లేనివీ నాలుగు చెప్పి దీన్ని గూడా పని చెయ్యకుండా మానిపించదుగదా! అని అదటు పట్టుకొంది సావిత్రమ్మకి. పైగా తనమీద వున్న అపవాదు తొలగించుకోవటానికయినా తను దానికొక చీరన్నా దానం చెయ్యాల్సిన అవసరం అగత్యంగా కనిపించింది సావిత్రమ్మకి.

సావిత్రమ్మకి తనమీద పనివాళ్ళు జాతి వేసిన అభాండాన్ని తొలగించుకోవటానికి ఇదో మహదవకాశంలాగా తోచింది. పాపం చిన్నపిల్లలున్నారంటోంది. తన పిల్లలకి పొట్టయినవి, పాతబడినవి నాలుగు నిక్కర్లు, చొక్కాలు ఇస్తే సంతోషిస్తుంది చీరతో

ణాటుగా. తన దాతృత్వం నలుగురికి వెల్ల డయ్యే మహదవకాశం.

"నీ పిల్లల కెన్నేళ్ళే రావమ్మా?" అంటూ అడక్కనుక్కుంది. ఏడేళ్ళలోపు వాళ్ళని చెప్పింది రావమ్మ.

ఇంకేం! బాబిగాడి లాగులూ, చొక్కాలు నిక్షేపంలా సరిపోతాయి దీని పిల్లలకి అనుకుంది సావిత్రమ్మ.

మరునాడు పెట్టెలన్నీ తీరుబడిగా వెతికి తనదో నడిపాత చీర, రెవిక, బాబిగాడివి పొట్టయిన రెండు నిక్కర్లు, చొక్కాలు తీసి విడిగా పెట్టింది.

"నువు వెళ్ళేప్పుడు చెప్పిపోవే రావమ్మా" అంది.

రావమ్మ పని పూర్తిచేసి పోబోతూ, "పనయిందమ్మా" అంటూ కేక

"వుండు వస్తున్నా పోబోకు" అంటూ గదిలోకి వెళ్ళింది సావిత్రమ్మ. విడిగా పెట్టిన బట్టలు తీసి చేత్తో పుచ్చుకున్న సావిత్రమ్మ తల్లో తటాలున ఓ ఆలోచన తలెత్తింది. "అవునూ, ఇది వారం రోజులయి పని చేస్తుండె. నోరు తెరిచి ఒక్కనాడయినా "ఓ పాత చీర ఇప్పించమ్మా అనన్నా అడగలేదేం? తనీసం దాని పిల్ల వెధవలకి ఓ పాత చొక్కాఅన్నా ఇవ్వమని అడగలేదేం! చూడబోతే బెట్టు సరిరకంగానే వుందే! పనిచేసేవాళ్ళకి ఇంత టెక్కా ఏం! సరే కానీ దానికే అంత అభిమానమయితే నాకుమాత్రం ఏం పట్టింది గరజు చూద్దాం దీని బెట్టు ఎంతవరకో" అనుకుంటూ చేతిలోని బట్టలన్నీ మళ్ళీ పెట్టెలో పడేసి బయటకొచ్చింది సావిత్రమ్మ.

"సరే, ఏంలేదులే. పో యింటికి" అంది లేచి నిలబడ్డ రావమ్మతో.

రావమ్మ వెళ్ళిపోయింది. సావిత్రమ్మ తల్లో మరో ఆలోచన కూడా మెరుపులాగా మెరిసి మాయమయింది. అసలు వీళ్ళు కనిపిస్తున్నంత పేదరికంతో బాధపడటం లేదేమో! ఇదంతా పైపై నటనేనేమో!

* * *

మరునాడు రావమ్మ పనిచేస్తూంటే సావిత్రమ్మ అడిగింది. "ఏమే రావమ్మా! వారంరోజులయి చూస్తున్నాను. ఆ మురికి చీర మార్చవు, వుతకవు. మరోటి కట్టవు. అట్టా మురిగ్గా పనికొస్తే ఎట్లాగే! అంది.

"మరో కోక లేదమ్మా" అంది రావమ్మ నెమ్మదిగా. ఈసారికూడా సావిత్రమ్మకి కావల్సిన సమాధానం రాక వొళ్ళు మండింది.

"ఏమో అనుకున్నాను. పొగరు మోతే!" అనుకుంది కోపంగా.

"ఇట్టా పనికొస్తే వూరుకునేది లేదు. ఆ చీర వుతుక్కుని, శుభ్రంగా పనికి రావాలి తెలిసిందా? ఇట్టా మురిగ్గా, అస

హ్యాంగా పనికొస్తే వూరుకోను. తెల్సిందా?" అంది కోపంగా, గట్టిగా.

ఆ సాయంత్రం రావమ్మ ఆ చిరుగుల మురికి చీరని సాధ్యమయినంతవరకు మురికి వదిలించి, ఉతికి ఆరేసి కట్టు కొచ్చింది. సావిత్రమ్మ పెదిమలు కొరుక్కుంది గట్టిగా

రావమ్మ మల్లెపందిరికి నీళ్ళు పోస్తుండగా, దాని చీర పందిరి వాసానికి చిక్కుకుని మరింతగా చిరిగింది. ఆ దృశ్యం చూసిన సావిత్రమ్మ మనసు జాలితో తలమునకలయింది. పాపం వెర్రిముండ అడిగినా అడక్కపోయినా చీర పడెయ్యాల్సిందే పాపం" ప్రసూతి వైరాగ్యం లాంటిది పొంగుకొచ్చింది ఆ క్షణంలో సావిత్రమ్మకి.

ఆ సాయంత్రం రావమ్మ వినేట్టుగా రెండుసార్లు అనుకుంది. "ఈ ఎఱ్ఱచీర కాస్తా పాతబడిపోయింది. వెలిసిపోయి కట్టుకుంటే వెలాతెలాపోతోంది. ఇహ పెట్టె అడుగున పడెయ్యాలి" అంటూ.

అయినా రావమ్మ మౌనంగా దాని పని అది చేసుకు వెళ్ళిపోయింది- సావిత్రమ్మకి వొళ్ళు మండుకొచ్చింది. "ఉహ! చాలావరకే వుందే! కానీ, అనుభవించే అదృష్టం దానికిమాత్రం వుంటద్దూ!" అనుకుంది నీరసంగా.

మరో వారం గడిచి పోయింది. రావమ్మకి పాతచీర ఇచ్చే వుద్దేశాన్ని సావిత్రమ్మ మర్చిపోలేకుండా వుంది.

ఆ సాయంత్రం పనిముగించి ఇంటికి పోబోతున్న రావమ్మ "అమ్మా" అంటూ నసుగుతూ నిలబడింది.

"ఏమిటి?" అంది సావిత్రమ్మ.

"ఏంలేదమ్మా" మీదో పాతచీరుంటే పడెయ్యండమ్మా. రెండో చీర ముక్కలేక మహా బాధగా వుందమ్మా" అంది రావమ్మ ప్రాధేయపూర్వకంగా.

సావిత్రమ్మకి బిగబట్టిన నరాలన్నీ సళ్ళిచ్చినట్లనిపించింది. ఆశ్చర్యంగా, ఆనందంగా. ఓరగా రావమ్మ వైపు చూసింది.

"ఊ, ఇప్పటికి దిగొచ్చావన్నమాట" అనుకుంది తనలో తను తలూపుకుంటూ.

"చూస్తాలే. చూసి వుంటే ఇస్తాను. ఇప్పటికిప్పుడు కావాలంటే ఎక్కడి నుంచి వస్తాయి" అంది బింకంగా సావిత్రమ్మ.

రావమ్మ జవాబు చెప్పకుండా తలొంచుకుని వెళ్ళిపోయింది. "పిచ్చి ముండ" ఇవాళ లేని పాతచీర రేపు మాత్రం ఎక్కడినించి వస్తుందని అడగ లేదు, ఇంకా నయం, అనుకుని నవ్వుకుంది సావిత్రమ్మ.

పులిలాగా ఇంటికొచ్చిన సావిత్రమ్మ భర్తకి ఆ రోజు భార్య చాలా ప్రసన్నంగా, సరదాగా వున్నట్లు తోచింది. కళ్ళజోడు తీసి ఓసారి భార్యని పరీక్షగా చూసి తిరిగి కళ్ళజోడు పెట్టు



కుంటూ "ఏమిటి సంగతి?" అంటూ కళ్ళతోనే ప్రశ్నించాడు.

సావిత్రమ్మ సరదాగా నవ్వి "ఆ ఏం లేదు. ఓ పాతచీర కావాలని ఆ రావమ్మ నా ప్రాణం తీస్తోంది! ఓ చీర చూసి పడెయ్యాలి దానికి" అంటూ లోపలికి పోయింది సావిత్రమ్మ.

సావిత్రమ్మ భర్త లోపలికి పోతున్న భార్యవంక పరీక్షగా చూసి, అయోమయంగా ఇంటికప్పుకేసి చూస్తూ, దీని భావమేమి తిరుమలేశ" అనుకుంటూ సిగరెట్టు కాల్చుకోసాగాడు.

* * *

మరో రోజు గడిచింది. ఇంకోరోజు వెళ్ళిపోయింది ఆ తరువాత రోజుకూడా గడిచిపోయింది. సావిత్రమ్మ చీరమాట ఎత్తలేదు. ఇవ్వనూలేదు. రావమ్మ మళ్ళీ ఆ విషయం కదవనూ లేదు. క్షణక్షణా నికి హెచ్చిపోతుండే బెజవాడ ఎండ లాగా సావిత్రమ్మ కోపం పెరగసాగింది, రావమ్మని చూసినప్పుడల్లా

నాలుగోనాడు పక్కింటి సుందరమ్మ పిన్నిగారొచ్చింది పెత్తనానికి. ఆవిడ పింతల్లి ఆడపడచు కోడలి వొదినగారు ఏవిధంగా మొగుడితో దెబ్బలాడి పుట్టింటికి లేచిపోయిందో వైన వైనాలుగా వర్ణించి, లేవబోతూ పెరట్లో బట్టలుతుకుతున్న రావమ్మని, దాని చిరుగుల చీరని చూసింది సుందరమ్మగారు.

"చూశావా సావిత్రీ, మీ పనిదాని

పెంకెతనం ! వారంరోజులుగా నా ప్రాణం తీసి, నా ఎర్రంచు పచ్చచీర లేదూ ?! నడిపాతది, అది కాస్తా పట్టుకు పోయింది. ఇచ్చేవరకు నా గొంతుమీద కూర్చుందనుకో" అంది సుందరమ్మ పిన్నిగారు తనకే ఓ మహా సామ్రాజ్యం ఉండి వున్నట్టయితే దాన్ని అలాగ్గా దారినపోయేవాడికి దానం చేసినంత ఘనంగా.

సావిత్రమ్మకి రావమ్మని చూస్తే వొళ్ళు మండుకొచ్చింది. కోపం తారా స్థాయిని అందుకోసాగింది. అది చీర కోసం తన గొంతుమీద కూర్చోనూ లేదు ! పైగా రెండోసారయినా తనని అడగన్నా లేదు ! పొగరుమోతూ !

"వీళ్ళింతే పిన్నిగారూ. మా ఇది వరకు పనిదానికి ఎన్ని పాత బట్ట లిచ్చానో ఆ పరమాత్ముడికే తెలుసు, చీరలేనా ! నిక్కర్లేనా ! చొక్కాలేనా ! ఇచ్చేవరకూ నన్ను తిండిగూడా తిన్ని చ్చేది గాదనుకోండి ! పుండు సలిపి నట్టుగా సలిపేది. అయితే ఏం ? విశ్వా సమా ఏమన్నానా వీళ్ళకి ! ఎప్పటి కప్పుడే పరగడుపు" అంది సావిత్రమ్మ కోపంగా రావమ్మ ఉన్నవైపు చూస్తూ.

రావమ్మ పిన్నిగారి మాటలూ వింది. సావిత్రమ్మ మాటలూ వింది. కానీ అది మరొక్క మాటకూడా మాట్లాడకుండా పని ముగించి వెళ్ళిపోయింది. సావి త్రమ్మకి పుండుమీదకారం రాచుకున్నట్ట యింది. అసలు దాని తల్లో ఏముందో కూడా ఆవిడకి అర్థంగాకుండా పోయింది.

* * *

ఆ సాయంత్రం రావమ్మ అవతారం చూసి సావిత్రమ్మ కళవళపడి పోయింది అది రోజూ కట్టుకొచ్చే చీర లోని సగం ముక్కని మాత్రమే ఒంటి పొరని చుట్టబెట్టు కొచ్చింది.

"ఏవిటే ? ఈ అవతారం ?" అంటూ గద్దించి అడిగింది సావిత్రమ్మ.

రావమ్మ జాలిగా తన కథ చెప్పింది. అది పొయిదగ్గరగా పడుకుని నిద్దరో తుంటే అగ్గంటుకుని సగం చీర పైగా కాలిపోయిందట ! మరో గుడ్డ లేక, ఆ మిగిలిన సగం ముక్కనే చుట్ట బెట్టు కుని పని మానితే సావిత్రమ్మ వూరుకో దేమోనన్న భయంతో పనిలోకి వచ్చిం దట !

సావిత్రమ్మ దాని తీరు, మాటలు చూసి కరిగి నీరయింది జాలితో. ఛా ఛా పాపం దానితో తనకి పట్టుదలేవిటి ! పాపం సరిఅయిన బట్టలు కూడా లేక ఎంత అవస్థపడుతోందో ! ఏమో ఎవరు చెప్పొచ్చారు. ఎవరికాలం ఎప్పుడు ఎట్లా మారుతుందో పాపం ఒకప్పుడు బాగా బ్రతికిన మనిషేమో ! అందుకే ఒకటికి పదిసార్లు అడగటానికి అభిమాన పడుతోందేమో అనుకుంటూ ఓ క్షణం

జాలితో కొట్టుకుపోయింది సావిత్రమ్మ. పైగా అది స్వప్నసుందరిలాగా ఒంటి పొరన చీరకట్టుకుని ఇంట్లో తిరుగుతుంటే ఇంకేమన్నా వుందా!

"అయ్యో పాపం. ఓసి పిచ్చిరకమా, మళ్ళీ చీర సంగతి గుర్తన్నా చెయ్యలేదేమే ఇంటికి పోయేప్పుడు గుర్తు చెయ్యి. ఓ పాతచీర పడేస్తాను" అంది దయగా రావమ్మతో

ఆ సాయంత్రం రావమ్మ ఇంటి కెడుతూ చీర సంగతి గుర్తుచేసింది సావిత్రమ్మకి

"ఉండు వస్తున్నా" అంటూ సావిత్రమ్మ లోపలకొచ్చి పెట్టె తెరిచింది. రావమ్మకిద్దామని పదరోజులనాడు విడిగా తీసిపెట్టిన చీర, రవిక, నిక్కర్లు చొక్కాలు బయటకి తీసింది. చేత్తో పుచ్చుకుని గుమ్మంవరకు వచ్చిన సావిత్రమ్మ ఏదో ఆలోచన తోచి, చేతిలోని దొంతిలోంచి నిక్కర్లు, చొక్కాలు తీసి పెట్టెలో పడేసింది "అసలు ఇన్ని బట్టలు పాతవయినా సరే ఒక్కసారిగా ఇచ్చామంటే అలుసయి పోతాం. అసలది మరోసారి అడిగినప్పుడు పిల్లల బట్టలు ఇవ్వవచ్చులే" అనుకుంటూ సావిత్రమ్మ వెలిసిన పాతచీర, రవిక పుచ్చుకుని గుమ్మంవరకు వచ్చింది కాస్తా మళ్ళీ ఆగిపోయింది. చీరని ఇటూ ఇటూ తిప్పి పరీక్షగా చూసింది.

"చీరమాత్రం దుమ్ములాగా వుందే! ఒక్క చిరుగన్నా పట్టలేదే. కాస్తంత రంగు పోతే మాత్రమేం! రాత్రిపూట కట్టుకోవచ్చు లేకపోతే ఏ జరీచీరతో చాటుగానో స్టీలుగిన్నెల వాడికిస్తే ఏ దుమ్ములాంటి గిన్నో, గ్లాసో ఇచ్చి పోతాడు! అసలయినా ఈ పని వాళ్ళకి అడగంగానే ఇవ్వకూడదు, విశ్వాసమా ఏమన్నానా?" ఇదీ చీర కాస్తా పుచ్చుకుని లేపటినుంచి మానేసినా మానేస్తుంది. చీర సంగతి ఇంకోమారు చూడచ్చులె'' అనుకుంటూ చీర తీసి పెట్టెలో పడేసి, రవికమాత్రం చేత్తో పుచ్చుకుని బయటికి వచ్చింది సావిత్రమ్మ.

''రావమ్మా'' ఇప్పటికిప్పుడు పాత చీరలేం లేవుగానీ, ఈ రవిక తీసుకో. గట్టిదే రవిక. చిరుగన్నా పట్టలా కాస్తంత రంగు వెలిసింది అంతే, అంటూ రవికన భద్రంగా రావమ్మకి దానం చేసింది సావిత్రమ్మ.

రావమ్మ ఒక్కసారయినా కళ్ళెత్తయినా చూడకుండా రవిక చేత్తో పుచ్చుకుని వెళ్ళిపోయింది.

అలా వెళ్ళిపోతున్నదాన్ని చూస్తుంటే సావిత్రమ్మని మరో మారు జాలి చుట్టుముట్టింది "ప్చ్ ప్చ్ పాపం ఆ చీర కూడా ఇవ్వాల్సింది. ఎంత అవస్థ పడుతోందో ఏమో పాపం కట్టుకోవడానికి గూడా లేకుండా? ప్చ్. ఈ సారి అడిగితే తప్పకుండా ఇవ్వాలి' అనుకుంది సావిత్రమ్మ స్వగతంతో రావమ్మ మళ్ళీ చీరనిగురించి అడగటం కోసం ఆతృతగా ఎదురు చూస్తోంది సావిత్రమ్మ."




(గత సంచిక తరువాయి)

మర్నాడు రాత్రి మంత్రి కుమార్తె తిరిగి ఇలా ప్రారంభించింది.

ఆ రాత్రి రాజు ముగ్గురు జోస్యుల అద్భుత శక్తులను గురించి ఆలోచిస్తూ నిద్ర పోనేలేదు. మర్నాడు ఉదయం ఆయన తనలో, "ముగ్గురిలోకీ మూడో వాడు గట్టివాడుగా కనబడతాడు. నిజమైన రాజవంశంలో నిజమైన రాజులకు పుట్టిన నా జన్మగురించి అతను ఏం చెబుతాడో!" అనుకున్నాడు.

ఆయన మూడో జోస్యుణ్ణి మరోసారి పిలిపించి, "నీవు వాస్తవం కనిపెట్టగలవని రుజువయింది గనక, నా జన్మ గురించి ఏదైనా చెప్పు," అన్నాడు.

"చిత్తం, అలాగే, మహారాజా కాని ముందు అభయప్రదానం కావాలి. ఉన్నమాట చెప్పి నేను ఎంత చిన్న శిక్ష కూడా సహించలేను. నాది అసలే సుకుమారి ప్రాణం," అన్నాడు మూడో



"నీకు వచ్చిన భయంలేదు. నేను అభయం ఇస్తున్నాను," అంటూ రాజు అతనికి అభయవస్త్రం ఇచ్చాడు.

"అలా అయితే మనం ఏకాంతంగా మాట్లాడుకొందాం, మహారాజా!"

సుల్తాను తాము ఉన్న హాలునుంచి వజీరుతో సహా అందరినీ అవతలికి పంపేశాడు.

అప్పుడు జోస్యుడు రాజు చెవిలో రహస్యంగా, "మహారాజా, మీరు జారుడికి పుట్టటమేగాక. చాలా హీనుడైన జారుడికి పుట్టారు" అన్నాడు

ఈ భయంకరమైన మాట చెవిన పడగానే రాజుకు మైకం వచ్చినట్టయింది. ఆయన ముఖం పాలిపోయి, నోట నురుగు వచ్చింది. ఆయన కంఠంనుంచి భయంకరమైన గురక వచ్చింది. విరుచుకుని చాపచుట్టలాగా పడిపోయాడు. ఆయనలో ప్రాణం ఉన్నదీ, లేనిదీ కూడా జోస్యుడు తెలుసుకోలేకపోయాడు.

చాలా నింపాదిగా రాజుకు స్పృహ తెలియసాగింది. ఆయన మోచేతమీద లేచి, "నువు చెప్పిన మాటకు రుజువు లభించే పక్షంలో నా స్థానంలో నిన్ను రాజుగా ఉంచి, నేను రాజ్యత్యాగం చేసేస్తాను. కాని నువ్వు చెప్పినది అబద్ధం అయేపక్షంలో నీ తల నా చేత్తోనే నరుకుతాను," అని శాంతంగా అన్నాడు.

"చిత్తం, అలాగే చెయ్యవచ్చు," అన్నాడు జోస్యుడు.

రాజులేచి, దూసిన కత్తి చేతబట్టుకుని తన తల్లి మందిరానికి పరిగెత్తుకుంటూ వెళ్ళి, ఆమెతో, "నువ్వు నిజం చెప్పక పోయావో నిన్ను కండలు చీలుస్తాను," అంటూ ఆమె ముఖాన కత్తి ఆడించాడు.

"అల్లా నిన్ను కాపాడుగాక, నాయనా. నీకు ఏంకావాలో స్పష్టంగా చెబితే, దాచ

పండా నిజం చెప్పేస్తాను," అన్నా దామె

"నేను రాజైన నా తండ్రికే పుట్టానా? నీళ్ళు నమలకుండా చెప్పు."

"నీళ్ళు నమలను నువు ఒక వంట వాడికి పుట్టావు. అది ఇలా జరిగింది," అంటూ జరిగిన సంగతి చెప్పింది.

"పాత సుల్తానుగారు నన్ను పెళ్లాడి నాతో మామూలుగానే సంసారం చేశాడు. కాని అల్లా అనుగ్రహించని కారణంచేత, నా గర్భాన సింహాసనానికి వారసుడు కలగలేదు. ఆ కారణంచేత రాజు విచార పడి, నిద్రాహారాలు విసర్జించాడు. ఆయన తల్లి ప్రోద్బలంమీద ఆయన మరొక పెళ్ళి చేసుకున్నాడు. కాని ఆ భార్యకూ పిల్లలు కలగలేదు. మూడో పెళ్ళాన్ని కట్టుకోమని ఆయనను తల్లి ఒత్తిడి చెయ్యసాగింది. ఇక దివాణంలో నాకు ఎలాటి స్థానమూ ఉండదని గ్రహించి, అవకాశం దొరికితే నా పదువు నిలవటానికీ, సింహాసనానికీ ఒక వార సుడు ఏర్పడటానికి కృషిచేయ నిశ్చ యించాను.

"ఒకరోజున సుల్తానుగారికి కోడిమీద మనసుపోయి, వంటవాడితో, రాజభవనం దిగువన ఉండే కొట్టంలో ఉన్న కోళ్ళలో ఒకటి వండమని చెప్పాడు. వాడు ఆ పనిలో నిమగ్నుడై ఉండగా నేను పైనుంచి చూశాను వాడి బలమూ, యౌవనమూ నాకు అక్కరకు వస్తా యని తోచి, వాణ్ణి పైకి రమ్మని సైగ చేశాను. వాడు రహస్యద్వారం గుండా నా గదికి వచ్చాడు. అక్కడ తృటి కాలంలో జరగవలసిందేదో జరిగిపో యింది. నా పని తీరిపోగానే బాకుతో వాడి గుండెల్లో పొడిచాను. వాడు చచ్చి పోయాడు నా దాసీలు రహస్యంగా వాణ్ణి తోటలో పాతేశారు. రాజుకు కోడి దక్కకపోగా వంటవాడు పోయాడు. తొమ్మిది నెలల అనంతరం నిన్ను కన్నాను. రాజుకు తిరిగి స్వస్తత చేకూ రింది. ఆయన కనిపించిన వారందరిమీదా కానుకలవర్షం కురిపించాడు. నలభై రోజులపాటు అహోరాత్రాలు విడవకుండా ఉత్సవాలు జరిగాయి. ఇదే నీ జన్మ రహస్యం. నిజం చెప్పానని ప్రవక్త మీద ప్రమాణం చేస్తున్నాను."

రాజు ఏమీ బదులు చెప్పక, కన్నీరు కార్చుతూ తిరిగివచ్చి, జోస్యుడికి ఎదు రుగా నేలమీద కూర్చుని చాలాసేపు అశ్రుధారలు కార్చాడు. చివరకు ఆయన తలఎత్తి, "సత్యవాక్కూ, ఈ సంగతి నువు ఎలా కనిపెట్టావు?" అని జోస్యుణ్ణి అడిగాడు.

"మహారాజా, మేము ముగ్గురమూ అద్భుతమైన మా విద్యలతో నీకు అపార మైన అహ్లాదం కలిగించినప్పుడు, నువు మాకు రొట్టే, మాంసమూ రెట్టింపు చేయించావు. దాన్నిబట్టి నీ తండ్రీ, పూర్వులూ వంటలవాళ్లయి ఉంటారని



గ్రహించాను. రాజుల రక్తం గలవాళ్ళు అలా చెయ్యరు, కాలువలు తవ్వుతారు. అంతులేని బంగారం ఇస్తారు. నువ్వు పేరుకు రాజువే అయినప్పటికీ, నీలో ప్రవహించే రక్తం వంటవాళ్ళది. నువ్వు జారజుడివి,'' అన్నాడు జోస్యుడు.

జోస్యుడు ఇలా అన్నమీదట రాజు లేచి నిలబడి, జోస్యుడి దుస్తులు విప్పించి, అతనిచేత తన రాజదుస్తులు ధరింపజేసి, దర్బారును ఏర్పరచి, అందరిచేతా అతనికి విశ్వాసప్రమాణం చేయించాడు.

ఈ విధంగా అతను రాజ్యత్యాగం చేసి, సాధువుదుస్తులు ధరించి, ఎవరికీ వీడ్కోలు చెప్పకుండానే ఈజిప్టుదేశానికి బయలుదేరాడు. అక్కడ తన మిగిలిన జీవితమంతా అజ్ఞాతంగా గడపాలని ఆయన ఉద్దేశం.

ఆయన ప్రయాసపడి ప్రయాణంచేసి, అల్లా అనుగ్రహంవల్ల క్షేమంగా కైరో నగరం చేరుకున్నాడు కైరో నగరం ఆయనకు చాలా కొత్తగా కనిపించింది. అలాటి నగరాలు ఆయనదేశంలో లేవు. కైరో నగరం చుట్టూ నడిచిరావడానికి మూడున్నరరోజులు పట్టుతుంది. అది ప్రపంచపు వింతలలో నాలుగోదని జారజుడు తెలుసుకున్నాడు కైరో గురించి కవులుచేసిన వర్ణనలలో నిజంలేకపోలేదు.

ఆయన వింతలన్నీ చూసి తిరుగుతూ, రాజబాధ్యతల నుంచి విముక్తుడై, పేదవాడికి ఉండే స్వేచ్ఛను అనుభవించసాగాడు. "అధికారాన్నీ, బాధ్యతనూ అక్కచెల్లెళ్ళుగా సృష్టించి, నిర్విచారాన్ని పేదతనానికి భార్యగా ఇచ్చిన అల్లా ధన్యుడు!" అనుకున్నాడతను. అలా తిరుగుతూ, తిరుగుతూ అతను సుల్తాన్ మహమ్మద్ రాజభవనంవద్దకు వచ్చాడు

అతను రాజభవన గవాక్షాలక్రింద, కర్రమీద ఊతంవేసి నిలబడి, భవనం

లోపల ఉండేవాడి జ్ఞాపకాలను గురించీ, సమస్యలను గురించీ ఆలోచించుకుని, తనకు అవమానంతోబాటు అశాంతివాటి నుండి విముక్తి లభించి, స్వేచ్ఛావాయువులు దొరికేందుకు తనను తాను అభినందించుకున్నాడు. ఆయన మనస్సు ప్రశాంతంగానూ, నిశ్చలంగానూ అయిపోయింది.

ఆ స్థితిలో ఆయన, సుల్తాను వేట నుంచి తిరిగి రావటమూ, మేడెక్కి భవనంలోకి వెళ్ళిపోవటమూ గమనించ లేదు. కాని సుల్తాన్ మహమ్మద్ ఆయన లోని నిర్లిప్తత గమనించి, "చెయ్యి చాచని సాధువును ఇతన్ని ఒక్కణ్ణే చూశాను. ఇతని కథ చాలా చిత్రమైనదై ఉండాలి!'' అనుకున్నాడు.

కొద్దిసేపు విశ్రాంతి తీసుకున్నాక ఆయన తన ఉద్యోగిని ఒక్కణ్ణిపంపి, ఆ సాధువును తన వద్దకు తీసుకు రమ్మన్నాడు.

సాధువు తన ఎదుటికి రాగానే సుల్తాను, "దయచెయ్యండి, సాధువు గారూ. మీ లక్షణాలు చూస్తే మీరొక ఆరబ్బీ ఉన్నతుడికి పుట్టినట్టు కని పిస్తారు," అన్నాడు.

"మహారాజా, అల్లా ఒక్కడే ఉన్న తుడు. నేను పేదవాణ్ణి, బిచ్చగాణ్ణి," అన్నాడు సాధువు

"మహాత్మా, నాకు నీ కథ ఇప్పుడే వినాలని ఉన్నది," అన్నాడు సుల్తాన్.

సాధువు కంటివెంట ఒక చుక్క రాలింది గుండె ఉన్న బండెను పట్టేసి నట్టయింది. చిట్టచివరకు ఆయన, "మహా రాజా, నా జీవితంలో తీపీ చేదూ కూడా ఉన్నాయి ఏదీ దాచాలన్న ఉద్దేశం లేదు కాని, నా కథ పదముంది ముందరా చెప్పను." అన్నాడు.

సుల్తాన్ మహమ్మద్ సింహాసనం మీది నుంచి లేచి, సాధువును చెయ్యిపట్టుకుని, తన అభ్యంతర మందిరంలోకి తీసుకు పోయాడు. అక్కడ సాధువు సుల్తాన్‌కు తన కథ అంతా చెప్పాడు. అది మనకు తెలిసినదే!

సుల్తాన్ మహమ్మద్ సాధువు కథ ఆసాంతం శ్రద్ధగావిని, పరమానందంతో అతని కౌగలించుకుని, "అల్లా మహిమ! ఆయన తన సంతానాన్ని తన నిర్ణయం ప్రకారం పైకి ఎత్తుతాడు, కిందికి దించు తాడు! అన్నా, నీ కథ చాలా గొప్పది. అందులో గొప్పనీతి ఉన్నది. శోకతప్తుడు పవిత్రుడు. నువు ఇప్పుడు జ్ఞానివి. అవ మానం ద్వారా ఏ రాజులూ సాధించలేని ఉన్నతి సాధించావు నాకన్నా ఉన్నతు డివి, నిన్ను ఒక్క కోరిక కోరుదునా?" అన్నాడు.

"తమ ఆజ్ఞ!" అన్నాడు సాధువు.

"నాకు నీ స్నేహం కావాలి," అన్నాడు సుల్తాన్.

అతను సాధువును మరొకసారి కౌగ లించుకుని, "అన్నా, ఇక మన జీవిత్పం



ఎంత ఆనందమయంగా ఉండబోతున్నది! మనం కలిసిపోదాం, కలిసి తిరిగిపద్దాం. రాత్రివేళ మారువేషాలు ధరించి, నగరమంతా సంచారంచేసి, జీవితంనుంచి పాఠాలు నేర్చుకుందాం. నా రాజ్యభవనంలో ఉన్నదానిలో సగం నీది. అందుచేత నా కోరిక నిరాకరించకు," అన్నాడు.

సాధువు తన హృదయంలో ఆనంద బాష్పాలు రాలుస్తూ, సుల్తాను కోరికకు సమ్మతించాడు.

అప్పుడు సుల్తాను మళ్ళీ ఇలా అన్నాడు

"మన మిద్దరమూ ఇప్పుడు సోదరులమూ, మిత్రులమూ కనక నా జీవితంలో కూడా ఒక విచిత్రమైన రహస్యం ఉన్నదని నువు తెలుసుకోవాలి. నా కథ—నేనిప్పుడెవరినో, పూర్వం ఎవరినో—నీకు ముందు చెబుతాను ఆ తరవాత మనం ఆనందంగా జీవింతాం.

"నా కథ నీ కథకు విరుద్ధంగా నడిచిందని తెలుసుకో. నువు సుల్తానువుగా ఉండి సాధువైతే, నేను చిన్నతనంలో సాధువుగా ఉండి తరవాత ఈజిప్టుకు సుల్తాను నయాను."

"నా తండ్రి చాలా పేదవాడు, నీళ్ళు మోసి జీవించేవాడు రోజూ బరువైన మేకతోలు తిత్తి వీపుమీద మోసుకుపోయి వీధుల్లో దుకాణాలముందు నీళ్ళుచల్లి, చాలీ చాలని డబ్బులు సంపాదించేవాడు. నాకు తగిన వయసురాగానే నేను కూడా చిన్నతిత్తి తీసుకుని, మా తండ్రికి సాయపడుతూ వచ్చాను. ఆయిన పోయాక ఆ పెద్దతోలుతిత్తి మాత్రమే నాకు ఆయన నుండి సంక్రమించింది నేనుకూడా ఆయన వృత్తే కొనసాగించాను

"అయితే తండ్రి బలం కొడుక్కు ఎన్నడూ ఉండదు. ఆ పెద్దతిత్తి నాకు చాలా భారమనిపించింది. గాని శాశ్వ

తంగా వచ్చేస్తుందని ఆ వృత్తి మానేసి, నేను సాధువృత్తి అవలంబించి, పెద్ద వీధుల్లో అడుక్కుంటూ, మసీదు ద్వారం వద్ద పడుకుంటూ వచ్చాను. రాత్రిపూట, దొరికిన కాస్త రొట్టె తిని. పడుకునికళ్ళు మూసుకుని, 'అల్లా దయవల్ల రేపు ఇంత కన్న బాగుండాలి!' అనుకునేవాణ్ణి. అయినా అదృష్ట ఘడియ ఎప్పుడో ఒక ప్పుడు ప్రతివాడికీ వస్తుందనీ, నేను కోరినా కోరకపోయినా ఘడియ రాక తప్పదనీ నాకు తెలుసు అందుచేత, నిద్రలో అది ఎక్కడ నన్ను దాటి పోతుందోనని, మేలుకుని ఉండి ఆఘడియ కోసం కుక్కకాపలా కాసేవాణ్ణి."

"కాని అప్పటి నా దరిద్రం అంతా ంతా కాదు నేను ఏసుఖమూ ఎరగను. అంతలో ఒకరోజు నేను ముష్టెత్తేసరికి ఒక పెద్దమనిషి నా చేతిలో అయిదు వరహాముల వెండి నాణెం పెట్టాడు. ఆ నాడు ఆయన పుట్టినరోజుట. అది పెట్టి నాకు ఇష్టమైన తినుబండారాలు కొను క్కొని తిందామన్న ఆశతో ఆ నాణెం గుప్పెట్లో గట్టిగా పట్టుకుని, పెద్దబజా రుకు పరిగెత్తాను "

"నేను పరిగెత్తిపోతూండగా ఒక చోట జనం నవ్వటం వినిపించింది. ఒక మనిషి ఒక కోతిని గొలుసుకట్టి తీసుకు పోతూండటమూ, ఆ కోతివెంట కొందరు అలగా జనం పోతూండటమూ చూశాను. కోతి బాగా పుష్టిగా ఉన్నది. అది కళ్ళు తిప్పుతూ, పళ్లు ఇకిలిస్తూ మధ్య మధ్య పప్పులకోసం చెయ్యి చాస్తున్నది.

"నాలో నేను, 'ఒరే మహమ్మద్, ఈ కోతే నీకు అదృష్టం తీసుకురా వచ్చురా. ఈ అయిదు వరహాములూ ఒక్కసారి తిండికి ఖర్చుచేసి ఏమీ మిగలకుండా చేసుకునేకన్న, దానితో ఈ కోతిని కొనుక్కుంటే మంచిది కదరా?' అనుకున్నాను.

"వెంట ఉన్న జనం కాస్త పలచ బడ్డాక నేను కోతిగలవాణ్ణి సమీపించి, 'ఈ మూడు వరహాములిస్తాను, ఆ కోతి నిస్తావా?' అని అడిగాను 'నేను పదిపెట్టి కొన్నాను కావాలంటే ఎనమిదికిస్తాను.' అన్నాడు వాడు. నాలుగు, అన్నాను నేను. వాడు ఏడు అన్నాడు. నాలుగు న్నర అన్నాను. వాడు అయిదుకు తగ్గేది లేదన్నాడు. నేను నా గుప్పిట్లో ఉన్న నాణెం ఇచ్చేసి, కోతిని తీసుకుని, గొలుసుపట్టుకుని తీసుకుపోయాను

"ఆ కోతితో నేను మసీదు ప్రాంతా నికి పోతే మాట దక్కదు. అందుచేత, నాకు తెలిసిన ఒక పాడుబడ్డ ఇంటికి వెళ్ళాను. ఆకలిమంట దహించేస్తున్నది. ఆ డబ్బుతో ఏమేమి తినుబండారాలు కొనుక్కొని ఉండేవాణ్ణో మననం చేసు కున్నాను. నా తిండిమాట అలా ఉంచి, నా కోతికి ఏం తిండి పెట్టగలనో నాకు అంతుబట్టలేదు.

"కాని నా ఆరాటం అంతా వృథా! ఆ కోతి ఒళ్ళంతా రుూడించి, ఒక్క



క్షణంలో ఒక చక్కని యువకుడుగా మారింది

"ఆ యువకుడు నా ముందు వినయంగా నిలబడి తియ్యగా మాట్లాడుతూ, 'ఓ మహమ్మద్, నీ కున్నదంతా నా కోసం ఖర్చుపెట్టి, మన ఇద్దరికీ తిండి ఎలాగా అని మధనపడుతున్నావు?' అన్నాడు.

" 'అక్షరాలా నిజం! కాని అలా ఎందుకు చేశానో? ఇంతకూ నువు ఎవరు? ఎక్కడినుంచి వచ్చావు? నీకేం కావాలి?' అన్నాను.

అతను నవ్వి, "అన్ని ప్రశ్నలు వెయ్యకు. ఈ బంగారు దీనారం తీసుకుపోయి, మనిద్దరికీ ఆహారం కొనుక్కురా. ఆకలి మనిద్దరినీ దహించేస్తున్నది. జ్ఞాపకం ఉంచుకో, నీ అదృష్టం నా పైన ఆధారపడి ఉన్నది. నేను నీకు సంపదా, సౌఖ్యమూ చేకూర్చుతాను. ముందు త్వరగా వెళ్ళిరా! అన్నాడు."

మంత్రి కుమార్తె ఇంతవరకు చెప్పి, తెల్లవారుతూ ఉండటంచూసి మౌనం వహించింది. (సశేషం)



# సువర్ణ రేఖలు

బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

వైశాఖమాసం మామిడితోట విరగబడి కాసింది. అమావాస్య చీకటిలో గుడిశ ముందు నులక మంచం మీద కూర్చుని వున్న తోటమాలి చిన్నయ్యకు తను కాలుస్తున్న చుట్ట నిప్పూ, దూరాన తాటి తోపులో మిణుగురు పురుగులూ నిగనిగ మెరుస్తూ కనిపిస్తున్నాయి. తను కాపాడవలసిన తోటగాని, మామిళ్ళుగాని కంటికి కానడం లేదు దూరాన అరుస్తున్న నక్కలు తోట నిశ్శబ్దానికి భంగం కలిగిస్తున్నాయి. మేలు జాతి మామిళ్ల సువర్ణరేఖలు కారు చీకట్లో కనుపించకపోయినా కమ్మగా వాసన వేస్తున్నాయి.

చిన్నయ్య నులకమంచంమీద నడుం వాల్చేడు. కిర్రుమంటూ మంచం చప్పుడయింది. విరిగిపోయింది కద! అది కూడా తనలాగే వార్ధక్యంలో వుందిమరి

వార్ధక్యమంటే జ్ఞాపక మొచ్చింది. తనకిప్పుడెనేళ్ళు? ఏమో. ఎన్నేళ్ళయితేనేం? శరీరదారుధ్యం సడలిపోయింది. చూపు సమంగా ఆనదు. దంతాలు రాలిపోయాయి. తనవంటిమీద ఎన్ని మడత

లున్నాయో అన్ని కష్టాలు పడ్డాడు. ఎన్నో బాధలు, ఎన్నో దుఃఖాలు: ఎన్నేళ్లు బ్రతికితేనేం ప్రతిఫలం ఏమిటి లాభం? బ్రతికినన్నాళ్ళూ తానేమి అనుభవించాడు గనుక? ఏమి సాధించాడు గనుక? పిల్లల్ని పెంచి పెద్దవాళ్ళను చేశాడు. తను చేయడమేముంది? వాళ్ళంతట వాళ్లు పెరిగారు. చిన్నప్పటినుంచీ కూలి చేసు కున్నారు. అయితే తను పెద్ద కూతురికీ, కొడుక్కీ పెళ్ళిచేశాడు. చిన్న దానికింకా పెళ్ళేనా కాలేదు. కాని దేవుడి దయవల్ల దానికి మంచి సంబంధమే కుదిరింది.

కాబోయే అల్లుడు చక్కనివాడు, బుద్ధిమంతుడు; పట్నంలో ఏదో నౌకరీ చేస్తున్నాడు. జీతం బాగానే వస్తుందట. తులం బంగారం పెట్టి కోరి పిల్లను చేసు కుంటున్నాడు. ఆమాటకొస్తే తనకూతురు మాత్రం తీసిపోయిందా? చక్కనిచుక్క, అమాయకురాలు. అందుకే భగ వంతుడు దాని పక్షాన వున్నాడు. అది సుఖపడుతుంది. అంతకంటే తనకు కావలసిందేమిటి? కూతురూ, అల్లుడూ పట్నంలో కాపురం చేస్తుంటే తనూ ముసలిదీ వెళ్ళి ముచ్చటతీరా నాలుగు రోజులుండి చూసి రావాలి.

అయితే పెళ్ళి ఖర్చులకి డబ్బేదీ? బోలెడు డబ్బు ఖర్చవుతుంది. ఎక్క డుంది అంత డబ్బు? తనకేమైనా పొల ముందా, పాడివుందా, పశువులున్నాయా? అమ్ముకోడానికేముంది? తన కొడుకున్నా బాగుణ్ణు. ఎక్కడనుంచైనా తెచ్చి ఇచ్చే వాడు. చెట్టంత కొడుకు చచ్చిపోయాడు. వాడి పెళ్ళాన్నీ కొడుకుని తనమీద వదిలి వెళ్ళి పోయాడు. దేవుడు తనకెం దుకు దుఃఖం కలిగించాడు? కొడుకుని తలచుకున్నప్పుడల్లా కడుపు తరుక్కు పోతుంది. అనుకోకుండా ఏడుపొస్తుంది ...ఛీ...తను వెళ్ళిపోయి, వాడుండిపో కూడదూ...వాడుంటే తన చెల్లెలికి వాడే పెళ్ళి చేసేవాడు ఇంత ముసలితనంలో తనేం చేయగలడు?

పెళ్ళి వచ్చేవారంలోనే. ఎంత దగ్గర పడిందీ ముసలిది పెళ్ళికప్పుడే అన్నీ సిద్ధం చేస్తూంది. ప్రతిదానికీ డబ్బులు కావాలంటుంది ఎక్కడివీ డబ్బులు? పదే ళ్ళయి తోటకాస్తున్నాడు ఓపాతిక రూపా యలు అప్పు యివ్వమంటే లేవన్నాడు యజమాని. తోటమీద ఏడాదికి మూడు వందల రూపాయలొస్తాయి.భూములమీద బోలెడొస్తుంది. ఎప్పుడడిగినాలేదు, మహా ఇబ్బంది పడుతున్నానంటాడు. అలాంటి పిసినారికి రైతు లే తగినవారు. వారు శిస్తులు సమంగా కట్టకుండావుంటే నోరు మూసుకొని వూరుకున్నాడు. వాళ్ళా భూమి వదలరు, ఏమి చేస్తాడు? కోర్టు కెక్కినా లాభంలేదు. ఇప్పుడు రూల్సు మారిపోయినాయట. మంచిపనే అయింది. మంచిగా అడిగితే ఇస్తాడేమిటి? తన కిస్తు న్నాడేమిటి? అయితే తను మంచిగా అడ క్కపోతే చెయ్యగలిగినదేమిటి? మామిడి

కాయలు కోసి అమ్మేస్తే? అమ్మో... చంపేయడూ?

మామిడికాయ - పలకబారివున్నాయి. ఎంత కమ్మగా వాసన వేస్తున్నాయి ఇంకా ఎలాగా పది రోజుల్లో దించేస్తారు. సువర్ణరేఖలు ధర ఇంకా బాగా పెరిగింది పెరుగుతుందేమోనని యజమాని తన తోటలో అదే వుంటుందో రెండు వేల కాయ. ఓ నాలుగైదు వందలు తీసి అమ్మేస్తే ఎవడు చూడొచ్చాడు?

అవును. ఎంత మంచి వూహతట్టింది! సుళువుగా పిల్లకి పెళ్ళిచేయవచ్చును. దాని బరువు తీరి పోతుంది. ఇక ఎప్పుడు పై నుంచి పిలుపు వస్తే అప్పుడు నిశ్చింతగా కళ్లు మూసేయ వచ్చును.

పెళ్ళికి పోగా డబ్బు మిగల వచ్చును కూడాను. అవిపెట్టి ముసలిదానికీ, కోడలికీ రెండు చీరెలు కొనాలి. తను పంచ, తలపాగా గుడ్డకొనుక్కోవాలి. మనవడికి లాగూ, చొక్కా కుట్టించాలి. ఇంత బాగా బట్టలేసుకొని, దర్జాగా పిల్లకి పెళ్ళి చేస్తే ఊరువాళ్లు చూసి ఏడవరూ? ఏడిస్తే ఏడవనీ...

ఇంతకీ కాయలు దొంగతనంగా కోసి అమ్మడమెలాగ? ఏముంది, ఈ చీకటిలో యీతోటలో తను కాయలు కోస్తే చూసే వాడెవడు, అడిగే వాడెవడు? యజమాని దూరంలో పట్నంలో వున్నాడు తెల్లవారక మునుపే కాయలు కోసి, పొరుగూరి సాయబుకి అమ్మేయ వచ్చును. దొంగ దినుసు కొనడం సాయబుకి అలవాటే.

ఈ సంగతి యజమానికి తెలిస్తే? అసలెలా తెలుస్తుంది? అంతగా అయితే నామీద అనుమాన పడతాడు, అంతేనా? రుజువేమిటి? అసలు నా మీద అనుమానమే రాకుండా ఓ పని చేస్తే! ఆ... మంచి ఊహతట్టింది. మనమే రేపు యజమాని దగ్గరకెళ్ళి కాయలు దొంగలుపట్టుకుపోయారని మొరపెడితే...

తెల్లవారే సరికి కాయలు అమ్మేసి, డబ్బు తెచ్చి ముసలిదానికిచ్చి, మనవడిని వెంట బెట్టుకుని పట్నం బయలుదేరి వెళ్ళాలి. తిన్నగా యజమాని ఇంటికి వెళ్ళేసరికి ఆయన ఎత్తుగా అరుగు మీద కూర్చుని చుట్ట కాలుస్తూ వుంటాడు. వెళ్లి వెళ్ళడంతోనే "బాబూ" బుగతగోరు, ఘోరం జరిగి పోయింది. బాబూ...! ఏనాడూ యిలా నేదు బాబూ...ముసిలాడినై పోయి యిదంతా యీకల్లతో సూడ్డానికే బతికున్నాను బాబయ్యా...అన్నేయమైపోయింది. బాబూ...అని లబో లబోమని నెత్తినోరు కొట్టుకోవాలి యజమాని ఇదంతా బోధపడక "ఏమిట్రా చిన్నయ్యా, ఏం జరిగిందిరా? పిల్లాజెల్లా అంతా బాగున్నారా? నీ ముసలిది బాగుందా?" అని ఆదుర్దా పడుతున్నట్లు అడుగుతాడు

"అంతా బాగానే వున్నారుగాని నా రాతే బావు నేదు బాబయ్యా... ఇంత అన్నేయం జరుగుతాదని..."

"ఏం జరిగింది చెప్పరా, నీ తల్లి కడుపు బంగారంగానూ."

"నిన్న రాత్రి సీకట్లో తోట కాస్తుండగా ఓ పదిమంది దొంగలు తోటలోపడి నన్ను సెట్టుకిరిసి కట్టేసి, కాయలు కొట్టుకుపోయారు బాబయ్యా... నేనేం సేసేది సెప్పండి..."

"ఏమిటీ, కాయలుపోయాయా?ఛీ... దొంగ వెధవా, అంతా వొట్టి అబద్ధాలు, నా కంట్లో దుమ్ము కొడదామనుకున్నావ్రటా?" యజమానికి కోపం వస్తుంది

"నేదు బాబూ... నే నబద్ధమాడితే పెద్దరోగంతో చావనా బాబయ్యా...మా అమ్మతోడు, నాకే పాపం తెలీదు పెబూ"

"నీ కల్లబొల్లి మాటలు నాదగ్గరట్రా వెధవా ... పోలీసుల కప్ప జెబుతానుండు... నిజం అప్పుడే తేలుతుంది."

"ఏటి బాబు అలాగంటారు, నా జలమతో యిలాంటి మాటెప్పుడూ పడనేదు నేను" నాకు పౌరుషమొస్తుందన్నమాట.

"మీరునమ్మకపోతే ఇదిగో నామనవడి తలొట్టుకుని పెమాణం సేస్తాను బాబూ..."అని మనవడితలమీద చెయ్యివేసి ఒట్టుపెట్టుకుంటాను. ఒట్లు నిజమౌతాయా ఏమిటి పిచ్చిగాని – అయితే ముసిల్దానికి చెప్పకూడదు. చెబితే ఏమవుతుందీ?

"ఏటీ పిల్లోడి మీద సెయ్యేసి పెమాణం సేస్తావా ? నువ్వు మనిసివా, పశువ్వా...ఫోఫో, ఆడిని నే నొగ్గను ఇంత బతుకూబతికి దొంగ తనం చేస్తాడట. పిల్లోడి మీద పెమాణం సేస్తాడట. ఛీ, సిగ్గులేని జలమ, బతికితేనేం, చస్తేనేం." అంటూ తోకతొక్కిన తాచుపాములాగా చర్రున లేస్తుంది

"ఉస్...ఊరుకోయే, ఏంటా గావుకేకలు, ఎవరేనా ఇనగల్రు ఏదోకటి సెయ్యకపోతే రేపు పిల్లకి పెళ్ళి ఏలాగవుతాదే, ఎర్రిదానా?" అని నాలుగు ఓవాట్లు పెడతాడతను.

"డబ్బు నేకపోతే తల తాకెట్టు ఎట్టుకుంటాం. సేకపోతే బిచ్చ మెత్తుకుంటాం అంతేగాని దొంగపని చేయడమా? కాయలుగాని పోసినావంటే నువ్వే దొంగలాడేవని బుగతకెళ్ళి సెప్పేస్తాను. నాకేం ?" అంటుంది ముసిలిది. అనడమేమిటి అంత పని చేసేస్తుందికూడాను. అందుచేతే దానికి తెలియనివ్వకూడదు

అయితే అప్పుడు యజమాని ఏమంటాడూ ? నాలుగుతిడతాడు, బెదిరిస్తాడు. ఈ గోలకి నలుగురు జనం మూగుతారు. నా ఏడుపు విని అందరికీ జాలేస్తుంది. "పోనివ్వండి వెధవని, పిల్లవాడిని పట్టుకు ప్రమాణంచేస్తున్నాడుగదా, వాడుమాత్రం ఏం చేస్తాడు పాపం" అంటారు వాళ్ళు. యజమానికివిసుగేసిపొమ్మంటాడు,అంతే.

అంతేనా, లేకపోతే తోటలోకి వచ్చి, చూసి, తరవాత ఊళ్ళో పెద్దమనుషుల్ని పిలిచి రభస చేస్తాడా? అలాగయితే ఈ సంగతి ముసిల్దానికి తెలిసి, నిజం చెప్పేయదుకద ! అది నిప్పులాంటి మనిషి. అన్నంతపని చేస్తుంది. తను నలుగురిలో ఎంత నవ్వులపాలవుతాడు ! ఛీ !

కాని యీ రోజుల్లో ఏదో మోసం

చెయ్యనిదే దినాలు గడవడంలేదు. యజమాని కొడుకే ఏదో కంపెనీలో సొమ్ము తినేశాడని ఖైదులో కెళ్ళేడుగదా? పెద్ద చదువులు చదువుతారు, బ్రహ్మాండమైన నౌఖరీలు చేస్తారు, బోలెడు ఆర్జిస్తారు, వాళ్ళే దొంగ పనులు చేస్తారు కదా, తనే మాత్రం? మహా అయితే తన్ను ఖైదులో పడేస్తారు అంతే గదా. ఖైదులో మహా కష్టాలు పెడతారట. తన ప్రాణాలుపోవూ?

ఛీ! ఇంత బతుకు బతికి యింటివెనకాతల చచ్చినట్టు ఖైదులోనా చావడం? చచ్చేముందు దొంగ ననిపించుకొని చావడమా? ముసిల్ది చెప్పినమాట నిజమే. మా వంశంలో ఎవడూ యిలాంటి మాట పడలేదు. దొంగ పని చేయడం కంటె బిచ్చమెత్తుకోవడం మేలు.

అయితే ఇంతకీ కాయలు కొయ్యడమా, మానడమా? కొయ్యకపోతే పిల్లకి పెళ్ళి ఎలా అవుతుందీ? డబ్బెక్కడి నుంచి వస్తుందీ? ఇప్పుడేం చెయ్యాలి?... కీళ్ళు సడలిన నులకమంచం కిర్రుమంటూ చప్పుడయింది. అవును మరి, ఏనాటి మంచం! తన లాగే ముసిలిదయింది. తాళ్ళు తెగి వేలాడుతూ చిక్కులు చిక్కులుగా గజిబిజిగా తయారయింది. ఇక ఎంతకాలం వుంటుంది గనుక. ఎప్పుడో ఓనాడు విరిగి కట్టెలక్రింద కాలుతుంది. అయితే అంతవరకూ తన పని తను చేస్తుంది. అది ఎంత మందికి ఉపయోగపడింది! ఎంత మంది దాన్ని వాడుకున్నారు! అందుకు దానికి ముట్టిన ప్రతిఫలం యేమిటి?

అబ్బ! ఎంత ఇరుకు వెధవమంచం! అటునుంచిటు కదిలితే నొప్పి!

దూరాన కాడు చీకట్లో మిణుగురులు కనిపిస్తూనే వున్నాయి. మరు క్షణంలో అంతా అయోమయంగా వుంది. యీ నిశ్శబ్దంలో, మగత నిద్రలో ఏవేవో ఆలోచనలు, వూహలు ఆశలు – అన్నీ గజిబిజిగా నులక మంచపు తాళ్ళ చిక్కుల్లా చుట్టుకుంటున్నాయి. అబ్బ! వెధవమంచం ఎంత ఇరుకు!

"ఏటా మొద్దు నిద్దర ... నెగు నెగు మామా... కొంప మునిగింది. కాయలు దొంగలు కొట్టుకుపోనారు...నెగు నెగు" అంటూ కాళ్ళమీద తట్టింది ముసిలిది.

"బాబూ నే నెరగను బాబయ్యో, దొంగలు పట్టుకుపోయారు బాబూ, నాకే పాపం తెలీదు సెబూ..."

"ఏటా పలవరింతలు, దొంగలొట్టుకుపోయారు, కొంపమునిగింది, నెగరాదా."

"ఏటీ, కాయలు పోనాయా? దొంగలా?''అన్నాడు చిన్నయ్య కళ్ళు నులుపుకుంటూ ఆశ్చర్యంగా.

"ఒళ్ళెరక్కుండా మొద్దులానిద్దరోతే మరేటవుతాది''

"నేదే, నిద్దరే పట్టనేదు సుమా."

"నలుగురు దొంగలు, అందులో ఒకడు దొరికి పోయినాడు. మునసబు నాయుడి పాలేరు వెంట దరిమి పట్టుకున్నాడు''...

చిన్నయ్య నిట్టూర్పు విడిచి, 'పోసీతే బతికేను" అన్నాడు తృప్తిగా చిరునవ్వు నవ్వుతూ.



# ప్రకాశరావు
# పిరికివాడు

ఢిల్లీ వెళ్ళి ఇంటర్వ్యూ తంతు ముగిసిన తరవాత దగ్గర్లోనే హరిద్వార్, ఋషికేశ్ కూడా వెళ్ళివద్దామంటే మా రామం ససేమిరా రానన్నాడు. మావాడు హరిద్వార్‌లో ఇంతకుముందు కొన్నాళ్ళ వుద్యోగం వెలగబెట్టి వున్నట్టుండి రిజైన్ చేసి ఇంటిమొహం పట్టాడు. మళ్ళీ చాలారోజుల తరవాత ఇటుగా వచ్చిన వాడు దగ్గర్లోనే వున్న హరిద్వార్‌కు వెళ్లాలంటే మొండికేయడం కాస్తవింతగా అనిపించింది నాకు. వాడి మొండితనానికి విసుగెత్తినా కొత్తచోట తెలిసినవాడు కూడా వుంటే ప్రయాణం సులువని వాడిని బతిమాలి బయల్దేరదీసేసరికి నిజంగానే హరిహరాదులు దిగివచ్చారు.

హరికి పావురి (హర్ కి పావురీ)లో స్నానంచేసి పవిత్రత సంతరించుకున్న తరవాత బస్సెక్కి ఋషికేశ్ వెళ్ళి ఆంధ్ర ఆశ్రమంలో గదితీసుకుని దిగాం. ఆశ్రమం బ్రహ్మాండంగా వుంది—ప్రత్యేకించి కొత్తగా కట్టిన రెండు దేవాలయాలు ఆ పరిసరాల్లో కొట్టవచ్చినట్టుగా కనిపిస్తాయి మర్నాడు టాంగా తీసుకుని లక్ష్మణ్ ఝూలా వెళ్లాం.

ఇటు కొండ మీదా అటు కొండ మీదా ఉక్కు టవర్ల మీదుగా ఇనుపతాళ్ళు

బిగించి వాటికి ఇనుప తీగలు వేళ్లాడదీసి ఉయ్యాల మాదిరిగా వంతెన తయారు చేశారు. గాలికి పూరికే ఊగిపోకుండా ఇటూ అటూ బిగించి మరీ కట్టారు. అయినా దాని మీదుగా నడుస్తూంటే కొంత భయంగానే వుంటుంది. మెలికలు తిరుగుతూ గంగానది నిండుగా, వేగంగా, రంయిమని రెండువేపులా కొంగలను ఒరుసుకుంటూ పారుతూంటే ఎంత ఆహ్లాదంగా వున్నా ఆ వంతెననుండి కిందికి చూస్తే కళ్లు తిరిగినట్టుగా అనిపించింది నాకు కాస్సేపు.

నెమ్మదిగా వంతెన మీదుగా ఆ మనోజ్ఞ పరిసరాలను చూస్తూ నడుస్తూంటే నాకు ప్రక్కనే రామం వున్న విషయం కూడా గుర్తుకు లేదు. పక్కకు తిరిగి చూస్తే ఎప్పుడూ సరదాగా వుండేవాడు గంభీరంగా ఎటో చూస్తూ పరధ్యానంగా నడుస్తున్నాడు. వాడి ధోరణి గమ్మత్తుగా వుంది నాకు భుజంమీద చరిచిందాకా నా వేపు కూడా చూడలేదు వాడు.

"ఫోటో దిగుతారా?" అంటూ వచ్చిన ఫోటోగ్రాఫర్లను తప్పుకుని వాడిని నిలదీశాను.

"ఓ కథ చెబుతాను వింటావా రఘూ." హఠాత్తుగా అన్నాడు రామం ఇనుప తాళ్లమీదుగా వంగి నదిని పరికించి చూస్తూ. "కొన్ని సంఘటనలు వింతగా అనిపిస్తాయి. నమ్మశక్యంగా కూడా వుండవు. క్షణికోద్రేకాలే కారణం అని సరిపెట్టుకోవడానికి మనసొప్పదు. నేను చెప్పేది ఒక చిన్న సంఘటన. వీలైనంత టూకీగా చెబుతాను వర్ణనలూ...బలమైన ఉపోద్ఘాతమూ, ఉత్కంఠ రేకెత్తించే శైలీ నాకు చేతకావు... క్రింద ప్రవహించే గంగానది చూడు— ఎంత స్వచ్ఛంగా, పవిత్రంగా కనిపిస్తూందో! ఆ గలగలల్లో ఎన్ని కథలు దాగి వున్నాయో ఎవరికి తెలుసు!"

"...రోజూ వందలకొద్దీ యాత్రికులు దాటుతుంటారు ఈ వంతెనను. పుణ్యాభిలాషతో కొందరు వస్తే సరదాగా పిక్నిక్కని మరికొందరు విలాసంగా వస్తారు.

—ఆరోజు అచ్చెరలాటి ఓ చిన్నదీ, మరో ప్రౌఢా— బహుశ తల్లి అయివుంటుంది, వంతెన మీదుగా నడుస్తున్నారు. ఎంతటి ఋష్యశృంగుడికైనా కన్ను చెదిరే లావణ్యమయి ఆ ముగ్ధరాలు. సన్నగా, పొడుగ్గా, మత్తెక్కించే వంపుల సోయగాలతో మెత్తగా నడుస్తుంటే ఎదురుగా వస్తున్న ఓ యువకుల గుంపు నోరు తెరుచుకుని చూస్తూ వుండిపోయింది. సంపెంగలాటి చక్కనిముక్కుకు ఇటూ అటూ రెపరెపలాడే విశాల నేత్రాలూ, గుండ్రటి చుబుకానికి చక్కగా అమరిన లేత గులాబీ పెదాలూ; మెరుగెక్కిన పాలరాతి లాటి నున్నటి చెక్కిళ్లూ, బంగారు వన్నెను వెక్కిరించే దేహచ్ఛాయకు మెరుగుపెట్టే నల్లటి



## పో లి క లు

కురులూ— ఒక్క ముక్కలో చెప్పా లంటే దివినుండి దిగిన దేవకన్యలావుంది కాని మానవ కాంత అనిపించదు!

"ఏమాత్రం తొట్రుపాటూ, తొందరా లేకుండా కదిలిపోతున్న ఆ కోమలాంగిని చూస్తూ అలాగే నుంచునిపోయారా యువకులంతా. అలా వాళ్లను దాటుకుని పోతూన్న అప్సరవేపు చూస్తూ ఆ గుంపులో ఒకడన్నాడు, 'ఇలాటి సుందరి ఆజ్ఞాపిస్తే ఏదేనా చేయవచ్చు... ఈ వంతెన మీదుగా దూకమన్నా సరే!'

"ఈ మాటలు వినగానే తక్కున వెనక్కు తిరిగింది ఆ తరుణి, 'ఎవరు ఈ మాటలంది?' వీణా తంత్రుల మృదుత్వంతోబాటు సవాలుచేస్తున్న హేళన కూడా వుంది ఆ కంఠస్వరంలో. ఈ హఠాత్సంఘటనకు త్రాన్పడిపోయారు వాళ్లంతా. ఎవరూ నోరువిప్పి మాట్లాడ లేదు. అందరినీ తేరిపార చూసి నిరసనగా నవ్వింది ఆ సుందరి. ఆవిడ మళ్ళీ నవ్వి వెనుదిరిగేంతలో ఆ గుంపులో ఒకడన్నాడు, 'నే నన్నాను.

సూటిగా అతడివేపు చూస్తూ అడిగింది ఆరూపసి 'నీవేనా నదిలో దూకమంటే దూకుతానన్నావు?'

'అవును' దృఢంగా పలికింది అతని కంఠం.

'మరైతే దూకు' వెటకారంగా అంది ఆ లతాంగి.

"మరు క్షణంలోనే ఎవరూ అనుకోని ఘోరం?— ఆమె వెనుతిరిగే లోగా ఆ యువకుడు అమాంతంగా కిందికి దూకడమేమిటి, రంయిమని పారే గంగామాతకు పారాణి రాస్తూ కొట్టుకు పోవడమేమిటి—

క్షణంలో జరిగిపోయాయి. అంతా వెర్రి వాళ్లలా చూస్తూ వుండిపోయారు. ఇలా అవుతూందని ఎవరూ వూహించి కూడా వుండరు." కాస్సేపు వూపిరి తీసుకోవ టానికి ఆగాడు రామం.

"ఇదంతా కథలా వుంది కదూ నీకు?" రామం మళ్ళీ మొదలెట్టాడు "కాని అది ఇంతటితో ఆగిపోలేదు. అలా అంతా పిచ్చివాళ్లలా కిందికి చూస్తూన్నంతలో మరో ఘోరం— ఆమె కూడా సరిగా అదే చోటికి దూకేసింది? ఇద్దరినీ ఒళ్లోకి తీసుకుని పరవళ్ళు తొక్కుతూ ఏమీ ఎరగనట్టుగా పారుతూంది గంగానది మరో క్షణంలోనే..."

నరాల్లోంచి విద్యుత్తు ప్రవహించి నట్టుగా వణికాన్నేను అప్రయత్నంగా. ముఖపరిచయం కూడా లేని ఇద్దరు వ్యర్థంగా ప్రాణత్యాగం చేయటంలో ఏమీ అర్థం కనిపించలేదు నాకు. రామం అన్నట్టుగా క్షణికోద్రేకాలే ఈ విపరీతా నికి దారితీశాయా? ఏదో మొదట మాట జారితే ఆ యువతి సవాలుచేయగానే శిరసావహించాలని ఎక్కడ వుంది? ఇది కూడా ప్రేమ కథ కిందే వస్తూందా? మరి ఆ యువతి కూడా ఎందుకు దూకింది— అతని చర్యకు చలించిపోయా లేక తనే అతని చావుకు కారకురాలు అనే భావన వల్లా? ఈ సందిగ్ధావస్థలోనుండి నేను తేరుకోకముందే మావాడు అన్నాడు.

"కాస్సేపు మాకేం బోధపడలేదు. వెర్రిగా అలాగే క్రింది నదిని చూస్తూ వుండిపోయాం..."

"అంతే?" వులిక్కి పడ్డాన్నేను.

"అవును?" నా మాటల కడ్డుపడ్డాడు రామం. "ఆ గుంపులో నేను కూడా వున్నాను"

పక్కకు తిరిగి ఎటో చూస్తూ గద్గద కంఠంతో అన్నాడు రామం, "అసలు ఆ అమ్మాయి వెళ్తూంటే 'వంతెన మీదుగా దూకమన్నా దూకు'తా అని అన్నది కూడా అతడు కాదు."

"మరి?" ఉత్కంఠను అణచుకోలేక అప్రయత్నంగా వెంటనే ప్రశ్నించా న్నేను.

మొహం పక్కకు తిప్పుకుని నెమ్మ దిగా అన్నాడు రామం "...నేను?"



# సరస్వతీ పటం



కంఠంనేని రాధాకృష్ణమూర్తి

"ఈ పటం ఒక హత్యకు మరో ఆత్మ హత్యకూ కారణభూతమయిం దంటే నువ్వు నమ్ముతావా?" రామా రావు అన్నాడు.

ఆ పటాన్ని చేతిలోకి తీసుకుని చూసాను. పెద్ద ప్రత్యేకత ఏమీ లేదం దులో. మామూలు సరస్వతీ పటం! అద్దం పగిలిపోయి చుట్టూ 'ఫ్రేము మాత్రం ఉంది. వెనక ఎప్పుడో చూసాను అట్లాంటి బొమ్మల్ని, కొందరి పూజామందిరాలలోనూ, ముందుగదుల్ని అలంకరించి. అవి రవివర్మ లక్ష్మి, సర స్వతులు. పటంక్రింద రంగులమధ్య ఆర్టిస్టు పేరుకోసం చూసాను గాని రవి వర్మ కాదు అయితే రవివర్మ బొమ్మకు ఇది పూర్తి నకలు. వెనక కొండలు, దూరాన వాటిమీంచి దూకుతూ వస్తున్న తెల్లటి సెలయేరు అదంతా రవివర్మ లక్ష్మి చిత్రానికి ఉంచిన బాక్గ్రౌండు. ఏదో పెద్ద కాలెండరును చించి పటం కట్టించినట్లుంది.

"ఇది నీకెక్కడ దొరికింది?" అడిగాను.

"ఈ ఇంట్లోనే", రామారావు అన్నాడు. "మొదట నేనీ ఇంటిని కొంటానన్నప్పుడు చాలామంది నన్ను

నిరుత్సాహపరిచారు, ఈ ఇంట్లో రెండు బలవన్మరణాలు సంభవించాయనీ, వాళ్ళ ఆత్మలు దెయ్యాలరూపంలో ఈ ఇంటి చుట్టూ తిరుగుతున్నాయనీ అంటూ పెళ్ళాం, పిల్లలతో సుఖంగా బ్రతకాలని లేదా అని బెదిరించారు. నాకిట్లాంటి వాటిమీద నమ్మకంలేదు. పైగా ధరలన్నీ ఆకాశాన్నంటుతున్న ఇవాళ్టిరోజుల్లో అంత కారుచౌకలో మరో ఇల్లు దొరకాలన్నా కష్టమే. అర్థంలేని సెంటిమెంట్లకు బానిసలమయి వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోవటం అవివేకమనిపించింది. అందుకే మా ఆవిణ్ణి ఎలాగో ఒప్పించి ఈ ఇల్లు కొనేసాను. ఈ ఒక్క పటం తప్ప మిగతా సామానంతా ఈ ఇంటి యజమాని దాయాదులు తీసుకుపోయారు. ఈ పటం మాత్రం ఈ గదిలోనే అదుగో! అక్కడ ఆ పైన గోడకు తగిలించి ఉంది. నేను తీసి అవతల పారేద్దామనుకున్నానుగాని మా ఆవిడ బలవంతంవల్ల అలాగే ఉంచేసాను. అయితే బూజుదులిపే రోజున దాన్ని కదపాల్సివచ్చింది. చానాళ్ళనుంచి గోడలను వ్రేలాడుతుండే సామాన్యంగా పటాల వెనక తేళ్ళు, జెర్రులు లాంటివి చోటుచేసుకోవటం జరుగుతుంటుంది. ఆ భయంతో జాగ్రత్తగా పటాన్ని తిప్పి చూడబోయేసరికి దాని వెనక నుంచి మూడు నోటు పుస్తకాలు జారి క్రిందపడ్డాయి. ఆశ్చర్యంతో వాటిని ఒకోదాన్నీ తిరగేసి చూసాను అవి డైరీలు. ఇంటి యజమాని నరేంద్ర డైరీలు ఈ ఇంట్లో జరిగిన హత్యకీ ఆత్మహత్యకీ కారణాల్ని తెల్పగలిగే డైరీలు! ఇన్నాళ్ళూ లోకానికి మిస్టరీగ ఉండిపోయిన ఆ దారుణాలకి మూలం నాకొక్కడికిమాత్రమే తెలిసింది ఆ డైరీలద్వారా నేనింతెవరికీ చెప్పలేదు ఇంతవరకూ, ప్రస్తుతం ఒక్క నీకు తప్ప ..

చెప్పటం ఆపి రామారావు కొద్దిసేపు కళ్ళుమూసుకున్నాడు. తనకు తెలిసిందాన్ని క్రోడీకరించటానికి ప్రయత్నిస్తున్నాడనిపించింది. ఆఖరుకు అతను కళ్ళు తెరిచాడు

అవివేకంతో కూడుకున్న విద్య మనిషికి మేలు చేయకపోగా కొన్ని సమయాల్లో చెరుపు చేస్తుందనటానకి నరేంద్రని ఉదాహరణంగా తీసుకోవచ్చు. ఈ దేశంలోని తుఘ్లక్ ప్రభువుల చేత ఏర్పరచబడి, పండిత పుత్రులచేత అంగీకరించబడ్డ చదువుల్లో ఒక పెద్ద దానిలోనే ఉత్తీర్ణుడయ్యాడు నరేంద్ర. ఆ చదువు అతనికి ఉద్యోగం సంపాదించిపెట్టలేదుగాని, అతని మొహంమీద అసమర్థుడన్న ముద్రను మాత్రం వేయించి పెట్టింది. ఇది ఇలా చెరుపు చేయగా చిన్నప్పణ్ణించీ అతను చదివిన కొన్ని "నోట్ పుస్తకాలు", సుకుమాత




కావ్యాలు మొదలైనవి మనుషుల విషయంలోనూ, జీవితం విషయంలోనూ అతడిలో కొన్ని ఫాల్స్ ఇల్యూజన్స్‌ని సృష్టించి అతణ్ణి ప్రతిదానికీ బాధపడే సెన్సిటివ్ జీవిగా తయారుచేసాయి. ఫలితంగా అతని తండ్రి చనిపోయి అకస్మాత్తుగా అతను జీవితంలోకి ప్రవేశించాల్సి వచ్చేసరికి వాస్తవానుభవాలు అతడి అంచనాల్ని తారుమారుచేసి ఈ కృత్రిమ ప్రపంచము, ఇందులో కదుళ్ళాడే స్వార్థపూరిత సంకుచిత మనస్తత్వాలు, ఇదంతా అతడి మనస్సుకు మ్రింగుడుపడక అతణ్ణి ఉక్కిరిబిక్కిరి చేసాయి.

తండ్రి చనిపోయేనాటికి నరేంద్ర తన చదువు పూర్తిచేసి నాలుగేళ్ళు, పెళ్ళిచేసుకుని యేడాదీ అయింది. అతని తల్లి అతని చిన్నప్పుడే చనిపోయింది. అప్పట్నించీ తండ్రే అంతా తానయి పెంచాడు అతణ్ణి. ఆ తండ్రి కూడా చనిపోయి ఈ వ్యాపార ప్రపంచంలో అతనొక్కడే స్ట్రగుల్ చేయాల్సి రావటంతో అతను బొత్తిగా నిస్సహాయుడై తట్టుకోలేకపోయాడు. కనీసం అతడి భార్యన్నా అతడి ఎమోషనల్ జీవితానికి చేయూత నివ్వలేకపోవటం అతడి పరిస్థితిని మరింత దిగజార్చింది. అతని నిరుద్యోగ జీవితానికి తోటి మనుషులు సానుభూతి చూపకపోగా దాన్ని అతడి అసమర్థత క్రింద తీసుకుని వీలైనప్పుడెల్లా అతణ్ణి కించపరచటానికి ప్రయత్నించేవాళ్ళు. అతడు ఊహించిన జీవితానికి అతడు ఎదుర్కొంటున్న పరిస్థితులకీ ఎక్కడా పొంతన కుదరలేదు. పెద్ద మనుషులంటూ ప్రత్యేకంగా అతనికి ఎక్కడా కనిపించలేదు. కాని

మంచివాళ్ళుగానే ఉంటూ, బాగా దగ్గరై పఠన్‌గా గుండెల్లో గ్రుద్దినవాళ్ళు ఎదు రయ్యారు. డబ్బుకోసం అడ్డమైన తక్కుడ్తులా పడే మనుషుల్ని చూసి చీదరించుకున్నాడతను. మనుషుల్లో ఎక్కడా అతనికి నీతి, నిజాయితీ, ధర్మము, విశ్వాసము, ఇట్లాంటివి కని పించలేదు. లోకంలోని మనుష్యుల నిండా అతనికి తోడేళ్ళు, గుంట నక్కలు, లద్దె పురుగులు, గొంగళి పురుగులూ కనిపించాయి వాళ్ళ వాళ్ళ మనస్తత్వాల్నిబట్టి. స్నేహితులుగా కనిపించినవాళ్ళు ఎక్కువమంది ఆఖరున నయవంచకులుగా, జేబులో తేళ్ళుగా తేలేవాళ్ళు అనుభవంమీద. మానవుడు తమ శరీరాల్ని, వాటి లోపాల్ని కప్పి పుచ్చుకోవటానికి అందమైన దుస్తుల్ని ధరించినట్లే తమ మనస్సుల్లోని మకిలినీ, నీచత్వాన్ని కప్పిపుచ్చటానికి తీయటి మాటల ముసుగును కప్పుకోవడం గమ నించాడు......ఎంతయినా మానవుడు సంఘజీవి. చుట్టూఉన్న మనుషుల్ని అసహ్యించుకుంటూ వాళ్ళమధ్యే బ్రత కటం అంత సామాన్యమైన విషయం కాదు. అందులోనూ నరేంద్రలాంటి సెన్సిటివ్ జీవులకు మరీ. తన మనుగడ కోసం తోటివాళ్ళలో తను అసహ్యించు కునే నటనల్ని తిరిగి తనే ప్రదర్శిం చాల్సి రావటం అతనికి బాధాకరంగా అనిపించేది.

అట్లాంటి పరిస్థితిలో నరేంద్ర బయటిప్రపంచంతో సంబంధ బాంధ వ్యాల్ని ఒకటొకటిగా త్రెంచుకోవటం మొదలుపెట్టాడు. అంతవరకూ తను చేసిన ఉద్యోగప్రయత్నాలతో విసిగి వేసారిపోవటంతో ఆఖరున అతను ఆ ప్రయత్నాలు కూడా మానేసాడు. మరీ అవసరమైతేతప్ప ఇంట్లోంచి బయటికి కదలటం మానుకున్నాడు. ఒంటరిగా గదిలో కూర్చుని తను చదివిన "ఎండిమియాన్"నో, "ఎంకి పాట"ల్నో లేక "మాన్"నో జ్ఞప్తికి తెచ్చుకుంటూ, వింత వింత లోకాల్లో విహరిస్తూ ఊహా జీవుల్తో కాలక్షేపం చేస్తుండేవాడు. అలా మరో మూడేళ్ళు గడిచాయి.

ఆ రకపు జీవితం నరేంద్ర మట్టుకు నరేంద్రకు సుఖకరంగానే ఉన్నా అతని చుట్టూ ఉన్న మనుష్యులమీద అది నిదానంగా తన ప్రభావాన్ని చూపిం చటం మొదలుపెట్టింది. ముఖ్యంగా అతని భార్యమీద. అప్పటికి అతనికి ఉన్న కొద్దిపాటి ఆస్తి మరో సంపాద నంటూ లేకపోవటంతో ఇంటి ఖర్చుల క్రింద పూర్తిగా హరించిపోయింది. ఇక మిగిలింది అతని భార్య తీసుకువచ్చిన కట్నం. దాన్నికూడా కదిలించక తప్ప లేదు అతని భార్యకు. నిదానంగా అందులో కూడా తొర్ర పెద్దది కావటం మొదలెట్టింది. అది గమనిస్తున్నకొద్దీ

ఆమెకు గంగవెర్రులెత్తటం ప్రారంభించింది. అది కూడా అయిపోతే ఇక తమ గతేమిటి ? నరేంద్ర ఏదో బాగా చదువుకున్నాడనీ, మంచివాడనీ, పెద్ద ఉద్యోగాన్ని వెలగబెడతాడనీ తన కూతుర్నెంతో ఉద్ధరిస్తాడనీ ఆమె తండ్రి ఆమెను కట్టబెట్టాడు. అయితే ఆఖరికి అతనుత్త వ్యర్థుడుగాను, నిరర్థకుడుగాను తేలాడు. దీన్ని భరించలేక పోయిందామె. పైగా నరేంద్ర తానేదో ఉత్తమపురుష దన్నట్లూ, మిగతా మనుషులంతా చీమలూ, దోమలూకంటే హీనాతిహీనమైన వాళ్ళన్నట్లూ ప్రవర్తించటం ఆమెకు మరింత చికాకును కలిగించింది. తరచుగా ఆమె భర్తను సాధించటం మొదలుపెట్టింది, తోటి వాళ్ళతో అతణ్ణి పోలుస్తూ, అతని అసమర్థతను వేలెత్తి చూపెడుతూ, దెప్పుతూ ఇలా. అట్లాంటి సమయాల్లో నరేంద్ర ముందు కొద్దిసేపు ఆమెతో వాదించటానికి ప్రయత్నించేవాడు. కాని అకస్మాత్తుగా అతనికి తన పరిస్థితి గుర్తుకువచ్చి చప్పున బయటికి వెళ్ళిపోయేవాడు. అట్లా వెళ్ళిపోయిన మనిషి మళ్ళీ ఎప్పటికో తిరిగి తిరిగి, భార్యకు కోపం తగ్గిపోయిందనిపించినప్పుడు ఇంటికి చేరుకునేవాడు. గదిలోకి పోయి మళ్ళీ తన మామూలు మూడ్‌లోకి జారిపోయేవాడు.

ఇట్లా ఉండగా ఒకరోజు అతనిభార్య ఈ సరస్వతీ పటాన్ని తీసుకువచ్చి ఇంట్లో తగిలించింది. ఆ పటం ఆమెకు బజారులో షాపింగ్ చేస్తుండగా చవకగా లభించింది. ఎందుకనో ఆ పటం ఆమెను బాగా ఆకర్షించింది. ఆ పటమే తన జీవితంలో అంత పెద్ద చిచ్చుపెడుతుందని తెలిసి ఉన్నట్లయితే ఆమె దాన్ని ఖరీదుచేసి ఉండేది కాదేమో. ఇంట్లో ఉన్నది బాత్‌రూమ్‌కాక రెండే గదులు కావటంతో ఆమె దాన్ని వంటగదిలో తగిలించలేక ఇవతలి గదిలో తగిలించింది ఈ గదిలోనే నరేంద్ర ఎప్పుడూ కూర్చుని ఉండేది. ఆవిడ ఎక్కువగా వంటగదిలోనో లేక పక్క ఇళ్ళల్లో అమ్మలక్కలతో కబుర్లు చెబుతూనో కాలక్షేపం చేస్తుంటుంది.

మొదట్లో ఆ పటం నరేంద్ర దృష్టిని అంతగా ఆకర్షించలేదు కాని ఎందుకో ఒకరోజు అతనావేపుకు చూచినప్పుడు హఠాత్తుగా ప్రాణం లేచి వచ్చినట్లయింది. అందులో ఉపయోగించిన రంగుల కాంబినేషన్‌కీ, అక్కడ కనిపిస్తున్న వాతావరణానికీ. అప్పట్నించీ నరేంద్ర రాత్రులు నిద్రకీ, పగలు తిండికీ కాలకృత్యాలకీ పోను మిగతా కాలాన్నంతా ఆ పటంలోకే చూస్తూ రోజులకు రోజులు గడపటం సాగించాడు. అందులో సరస్సు ఒడ్డున రాయి మీద కూర్చుని వీణను శృతిచేస్తున్న సరస్వతి మొహం ఎంతో అందంగా,

కళ్ళల్లోంచి గొప్ప దయను కురిపిస్తూ చిత్రించబడింది. ఆ మోహంలోకి చూస్తుంటే హృదయంలో ఏదో హాయి కలుగుతుండేది, ఆ పక్కనే ఉన్న దృశ్యం – ఉదయాన్ని స్ఫురింపజేసే రంగులతో సరస్సు, అందులో ఎదురు బొదురుగా ఈదుతున్న రెండు తెల్లటి హంసలు నీళ్ళలో జిగ్–జాగ్‌గా ఏర్ప డిన వాటి ప్రతిబింబాలు, ఇవతల సరస్వతి పాదాలకు దగ్గరలో విచ్చుకుని చూస్తున్న కలువపూలు ఎర్రటివీ, తెల్లటివీ, అవతలగా సరస్సు ప్రారంభ మవుతున్న చోట కలిసిన రెండు కొండలు. వాటిమీద దూరాన ఎక్క ణ్ణించో పరిగెత్తుకుంటూ వస్తున్న తెల్లటి సెలయేరు, అది సరస్సులోకి దూకుతూ సరస్సును ప్రారంభించిన చోట ఏర్ప డిన నురగ చిక్కదనము, అదంతా నరేంద్ర మనస్సును జోకొట్టి, ఈ వాస్తవ వికృత లోకానికి దూరంగా అతణ్ణి ఏవేవో వింత లోకాల్లో విహరింప జేసేది. ఆ సెలయేటి ఒడ్డున కొండల పచ్చదనంలోనూ, సరస్వతి వెనక చెట్ల గుబురులలోనూ వన దేవతలు సంచ రిస్తున్నారనిపించేది అతనికి. ఆ సరస్సు మధ్య జలకన్యలు స్నానాలు చేస్తూ ఒకరిమీద ఒకళ్ళు నీళ్ళు చిమ్ముకుంటూ కేరింతలు కొడుతూ ఉంటారు ఎక్క ణ్ణించో ఎగురుకుంటూ వచ్చిన రాయం చలు సరస్సులో వాలి పడవల్లా తేల్తూ, కదుల్తూ విన్యాసాలు చేస్తుంటాయి. సరస్వతి పాదాలవద్ద ఉన్న నెమిలి తటాలున పురి విప్పి నాట్యం ప్రారం భిస్తుంది. గాలిలో పల్టీలు కొడ్తూ చెట్టు నుంచి చెట్టుకు ఎగుర్తున్న పిట్టలు ఆనం దంతో కిలకిలారావాలు చేస్తుంటాయి. అక్కడ అతను అతిథి. అతని గౌరవం కోసం, అతని ఆనందంకోసం సరస్వతి చిరునవ్వుతో వీణను మీటుతూంటే ప్రకృతి పరవశంతో పులకరించి పోతుంటుంది.

' భోజనానికి వస్తారా ?"

ఊహలు చెదిరిపోగా నరేంద్ర తల పక్కకు తిప్పి చూసాడు. గుమ్మంలో భార్య నిలబడి ఉంది.

"నా కాకలిగా లేదు, నువ్వు చేసేయి", అన్నాడు.

"అవును, ఎట్లా ఆకలవుతుంది, కదలకుండా ఇంట్లో తిని కూర్చునే వాళ్ళకు !!" కోపంగా అందామె.

నరేంద్ర పెద్దగా బాధపడలేదు. లౌకికమైన బాధలకు అతను చాన్నాళ్ళ క్రితమే అతీతుడుగ మారిపోయాడు. అతనికి తెలుసు, ఆమె గుండెల్లో మంటలు మండుతున్నాయన్న సంగతి. ఆ పూటకు ఇంట్లో తిండిగింజలు ఉన్నాయో లేవో. ఎక్కడో అప్పుతెచ్చి వండి ఉండాలామె.

భర్త మవునం ఆమెను మరీ రెచ్చ గొట్టింది.



"మనుషులకు సిగ్గన్నా ఉండాలి, లేక రోషమన్నా ఉండాలి. ఏమీ లేని వాళ్ళముందు ఎంత వాగితేనేమి? ఒక్కసారి బయటకుపోయి చూడండి, లోకం మన గురించి ఏమనుకుంటోందో, మీ అసమర్థత గురించీ, మీ వ్యర్థత్వాన్ని గురించీ..." అన్నదామె.

"విమలా సొంత వ్యక్తిత్వమంటూ లేని ఈ మందలోని మనుషుల గురించి ఎందుకు చెబుతావు నాకు? వాళ్ళకంటే బురదలో పొర్లే పందులు, స్టుపిడిటీకి మారుపేరయిన గాడిదలూ నయం!!" అన్నాడు నరేంద్ర.

"అక్కడికి నువ్వొక్కడివే వ్యక్తిత్వంగల మనిషివన్నమాట? ఛీ, ఛీ. నీ పాలిట పడ్డందుకు నా ఖర్మ కను కోవాలి", అందామె ఛీత్కారంతో. ఈ మధ్య కొన్ని సమయాల్లో ఆమె భర్త కివ్వాల్సిన కనీస గౌరవాన్ని కూడా మర్చిపోతోంది. ఆ అవసరం కూడా కనిపించటం లేదామెకు. సంపాదన లేనివాణ్ణి కోళ్ళు కూడా తరుముతాయి.

నరేంద్ర ఏమీ మాట్లాడలేదు. కొద్ది సేపు చూసి ఆమె ఒక్క విసురున అతనివద్దకు చేరుకుంది. మోకాళ్ళమీద కూర్చుని కుర్చీలో ఉన్న అతని

భుజాలు రెండూ పట్టుకుని బలంగా కుదిపింది.

"చెప్పు, చెప్పు, కనీసం ఇదన్నా చెప్పు ! నువ్వసలు మనిషివేనా ? నీ గుండెల్లో దయ, ప్రేమ, సానుభూతి ఇల్లాంటివి లేశమాత్రమేనా ఉన్నాయా? నేను – నేను – నీ పెళ్ళాన్ని – నన్ను నవ్వించాలనీ, సుఖపెట్టాలనీ, ప్రేమించాలనీ ఇవేమీ అనిపించటం లేదా నీకు ?? "

"నన్ను క్షమించు విమలా !"

ఆమె కళ్ళల్లోకి నీళ్ళుబికాయి. ఏడ్చేయటానికి సిద్ధంగా ఉందామె. భర్త నిరర్ధకత్వం తోటివాళ్ళలో ఆమెను అపహాస్యం పాలుచేస్తోంది. అంతేకాక ముందుకాలం ఆమెకు మరీ అంధకారంగా, అయోమయంగా కనిపిస్తోంది. ఇట్లా ఎంతకాలమని ??

నరేంద్ర దృష్టి మళ్ళీ గోడమీద పటంలోకి మళ్ళటం గమనించిందామె. వెంటనే ఒక్క ఉదుటున లేచి గోడ వద్దకు వెళ్ళింది.

"దీన్ని – దీన్ని – ముందు దీన్ని నాశనం చేస్తాను", అన్నది రొప్పుతూ, కసిగా.

"విమ్లా", నరేంద్ర లేచి నిలబడ్డాడు. ఆమెను చేయిపట్టుకుని ఇవతలకు గుంజాడు. "దానిమీద చేయి వేసావంటే ... నేనేమి చేస్తానో నాకే తెలియదు", అన్నాడు.. అతనిలో మానవ సహజమైన ఉద్వేగం ఏకోశానా లేదు.

కొద్ది క్షణాలపాటు అతని మొహంలోకి చూస్తూ ఉండిపోయింది విమల. ఆమె కేదో అర్ధమయినట్లయింది. చాచి లెంపకాయ కొట్టిం దతణ్ణి. వెంటనే ఏడుస్తూ వంటింట్లోకి పారిపోయింది.

నిర్లిప్తంగా నరేంద్ర కుర్చీలోకి వాలిపోయాడు...

ఇదే రోజుల్లో అతనోసారి పేపరులో ఒక వింతవార్త చదవటం తటస్థించింది. విదేశాల్లో ఎక్కడో సముద్రం ఒడ్డున ఒక మత్స్యకన్యను పట్టుకున్నారట. జంటగా కనిపించిన మత్స్య పురుషుడుమాత్రం దొరక్క సముద్రంలోకి జారిపోయాడట. కాళ్ళనుంచి నడుం వరకు మానవదేహము, నడుంనుంచి తలవరకు మత్స్యశరీరమూనట ఆ వింత జీవికి. ఆ ఫోటో కూడా ఏదో ఉర్దూ పేపర్లో ప్రచురించబడ్డట్లు విన్నాడు. ఆ వార్త నరేంద్రకు ఎంతో కుతూహలాన్నీ, వింతనూ కలిగించింది. పుక్కిటి పురాణాల్లో మత్స్యకన్యలు కాళ్ళనుంచి నడుంవరకు మత్స్యదేహంతోనూ, నడుంనుంచి తలవరకు మానవ శరీరంతోనూ ఉన్నట్లు విని ఉన్నాడతను అంతవరకూ. అంటే అట్లాంటి వింతలు నిజంగా ఉన్నాయన్నమాట ! అయితే మానవుడికి తెలియరాని ఇంకెన్ని వింతలు ఉన్నాయో ఈ

లోకంలో !? యక్షులు, దేవతలు, కిన్నెరలు, వాళ్ళంతా నిజంగానే ఉన్నారేమో...ఈ భావం నరేంద్ర జీవితంలో ఒక వినూత్న మలుపుకు కారణమయింది. దానికి మూలం ఆ సరస్వతీ పటము! అప్పటివరకు అతని ఆలోచనల్ని ఆ పటంలోని బాగ్రౌండు దృశ్యం మాత్రమే ఆక్రమించగా ఇప్పుడు అందులోని సరస్వతీ చిత్రం అతని ఊహలకు కేంద్రస్థానమయింది.

సరస్వతి! ఆమె ధరించిన పాల నురగలాంటి పట్టుచీర, దాని అంచులకు మెరుస్తున్న బంగారు జరీ, వడిలో వీణ, వీణమీద కదుల్తున్న అందాల చేతులు, చక్కటి మెడనుంచి జారుతున్న ముత్యాల దండలు, మొహంలో వెల్లివిరుస్తున్న కళ, కళ్ళల్లోంచి కురుస్తున్న దయ, కిరీటం క్రిందనుంచి వీపుమీదకు జారుతున్న కేశసంపద, ఆ మోము, ఆ విగ్రహం, నిండుగా, నిర్మలంగా, ప్రశాంతంగా, సృష్టికార్యంలో పూర్తి సంతుష్టి నొందిన స్త్రీలా ఉందామె... ఈ వాస్తవ జీవితపు ఒడిదుడుకుల్ని మర్చిపోవటానికి, స్వసంతోషం కోసమూ నరేంద్ర తన ఊహాసంపదకు పదును పెట్టుకున్నాడు. అతనక్కడ ప్రకృతి వడిలోని భక్తుడు. సరస్వతి అతని దేవి. ఇద్దరూ ఎనెన్నో కబుర్లు చెప్పుకుంటుంటారు. వాళ్ళు నడుస్తుంటే వాళ్ళకాళ్ళక్రింద పచ్చిక మెత్తగా తల వంచుకుంటుంది. పైనుంచి చెట్లు పూలను రాలుస్తుంటాయి. చుట్టూ వెన్నెల పగలబడి నవ్వుతుంటుంది. తరచుగా అతని మాటలకు సరస్వతి సన్నగా నవ్వుతుంటుంటే అతని హృదయం ఉద్వేగంతో వణుకుతుంటుంది. ఒకరోజు వాళ్లు వర్షంలో నిలబడి లోకాన్ని మూస్తున్న మబ్బుల్నీ, తడుస్తున్న కొండల్నీ, చెట్ల ఆకుల్నించి బరువుగా రాల్తున్న చినుకుల్నీ. ఇంద్రుడు ఝళిపించే వజ్రాయుధపు మెరుపుల్నీ గమనిస్తూ, ప్రకృతి పాడే సంగీతాన్ని వింటూ కాలం గడుపుతారు. ఇలాగే ఒకరోజు, ఒకరోజు...

ఆ రోజు నరేంద్ర ఈ లోకం తన కివ్వలేకపోయిన ఆనందాల్ని వెతుక్కుంటూ, సంప్రదాయపు సెంటిమెంట్లను ఛేదించుకుంటూ, ఏ హైందవుడూ కలలోనైనా ఊహించ సాహసించని దూరతీరాలకు ప్రయాణంచేసాడు. ఆ రోజు అతను సరస్వతీదేవికి ఏమేమిటో చెప్పాడు. ఆమె వడిలో తలపెట్టుకుని ఏడ్చాడు. మర్త్యలోకం తనకేమీ నచ్చలేదన్నాడు. అక్కడి మనుషులంతా ఉత్త అవివేకులూ, దుర్మార్గులూ, మందమతులూ నన్నాడు. మనిషి వ్యక్తిత్వానికీ, గుణగణాలకీ కాక అతని సంపాదనకీ, సంపదకీ విలువ ఇచ్చే మూర్ఖులని చీదరించుకున్నాడు. వాళ్ళ మాయలోపడి తన

భార్య తనని వేధించుకు తింటోందని ఆరోపించాడు. అతను చెప్పినదంతా సరస్వతి సాదరంగా విన్నది. ఆఖరుకి అతనివేపు చూసి దయగా నవ్వింది. అదే సమయంలో నరేంద్ర తనలో కలిగిన ఒక వింత కోర్కెను ఆమెకు వెల్లడించాడు. కోపగించుకోలేదు సరస్వతీదేవి. చిన్నగా నవ్వింది. అతని హృదయం పురివిప్పి నాట్యం చేసింది. పదే పదే అతనామె పెదాల్ని చుంబించాడు తర్వాత ఆమెను నగ్నపరచటం మొదలెట్టాడు. ఆ అభరణాల్నలాగే ఉంచి, వీణను అవతలకు నెట్టి, పట్టు చీరను మెడమీంచి, గుండెలమీంచి, నడుం చుట్టూ తిప్పుతూ, వణుకుతున్న వ్రేళ్ళతో, ఉద్వేగ పూరిత హృదయంతో, వంపుల దేహాన్ని, వంకలెరుగని దేహాన్ని, అమర సహజపు మెరుపుని, ఎక్కడా గరుకులేని మృదుత్వాన్ని...

చటుక్కున ఆ ఉద్విగ్న దృశ్యం కదిలి, వణికి, నిశ్చలాన్ని సంతరించుకుని, అతనందులోంచి జారిపోయి, అది ఉత్త బొమ్మగా, పటంగా మారిపోయింది. ఈ లోకంలోకి ఊడిపడ్డాడు నరేంద్ర. అతని కెదురుగా భార్య నిలబడి ఉంది. ఆమె చేతిలో ఆ పటం ఉంది.

"విమలా!" అరిచాడు నరేంద్ర.

ఆమె ఇంకెన్నాళ్ళో భరించలేక పోయింది, అతని ధ్యాసంతా ఆ పటం మీదే ఉండటము, కాలమంతా అతను దానిముందే గడిపేయటము. సంపాదన లేకపోతేమానెగాని తిండి తిప్పల్ని కూడా మర్చిపోయి అతనలా కృశించిపోవటము, అదంతా.

"ఈ ముదనష్టపు పటాన్ని నా కొంప కూల్చుకోవటానికి తెచ్చుకున్నట్లున్నాను," అందామె ద్వేషంగా తన చేతిలోని పటంకేసి చూస్తూ. వెంటనే దాన్నామె విసిరి నేలకేసి కొట్టింది.

ఆ దృశ్యం చూస్తూనే నరేంద్ర కట్టెలా బిగుసుకుపోయాడు. క్రింద పడగానే ఆ పటం అద్దం పెద్ద చప్పుడుతో పగిలిపోయింది. పగిలిన గాజు పెంకులు చెల్లా చెదురుగా సరస్వతి మొహంమీద, శరీరమంతా చిమ్ముకున్నాయి. ఆ పగుళ్ళ మధ్య సరస్వతి, తన దేవేరి, తన హృదయరాణి, వికారంగా, మొహం పగిలి, శరీరం నలిగి, కాళ్ళు విరిగి, ముక్కలై ... అంతకుముందే తనకంత గొప్ప సుఖాన్ని అందీయబోయిన హృదయ రాజ్ఞి హత్య చేయబడింది! తన హృదయం బీటలు వారగా ఆ బీటల మధ్యనుంచి ఎవరో రంపంతో పరపరా కోస్తున్నట్లు అనుభూతి చెందాడు నరేంద్ర. ఒక్క-క్షణం భార్యవేపు అసహ్యంతో కసిగా చూసాడు. వెంటనే




అతనకి తెలియకుండానే అతని శరీరం చురుగ్గా, వేగంగా కదిలింది. అతని భార్య ఏమి జరగబోతోందీ ఊహించే లోపునే అతని చేతులు రెండూ ఆమె గొంతుమీద ఉన్నాయి. ఆమె గొంతు మీద ఉన్నాయి. ఆమె గొంతుమీద ఆనిన బొటన వ్రేళ్ళు రెండూ ఆమె మెడ వెనక బిగుసుకున్న మిగతా వ్రేళ్ళ వేపు కసిగా, పిచ్చిబలంతో నొక్కు కున్నాయి...

"అదే రోజు అతను ఆత్మహత్య కూడా చేసుకున్నాడు'', ముగించుతూ అన్నాడు రామారావు.

అంతవరకు నేనా విచిత్రగాధను ఊపిరి బిగబట్టుకుని విన్నాను. కాసేపు ఏమి మాట్లాడాలో తెలియలేదు నాకు.

"పాపం హంతకుడైనందుకు పశ్చాత్తాపంతోనూ, భార్యమీద ప్రేమ కారణంగానూ అతను ఆత్మహత్య చేసుకుని ఉండాలి'', అన్నాను ఆఖరుకి.

"లేదు. అదేమీ కాదు", రామారావు అన్నాడు. 'విచిత్రమేమిటంటే అప్పటికీ తాను హత్యచేసినట్లుగాని, దాని వల్ల ఏ పశ్చాత్తాపమూగాని నరేంద్రలో కలగలేదు. భార్య శరీరం చేతుల్లోంచి జారిపోగానే అతను అవతలికి నడిచి పటాన్ని చేతిలోకి తీసుకున్నాడు. ఉత్త అద్దమే పగిలిందిగాని సరస్వతీ చిత్రానికి ఎక్కడా ఏ డామేజీ జరగలేదు. పటాన్ని తీసుకువెళ్ళి అతను యదాస్థానంలో గోడకి తగిలించి వచ్చి తిరిగి తన కుర్చీలో కూర్చున్నాడు. అతని కాళ్ళవద్ద భార్య మృతదేహం పడిఉంది.

కాని అతనికా స్పృహే లేదు. అంతకు ముందు ఆఖరి క్షణంలో తను నగ్నపరిచిన సరస్వతీ దేహాన్ని కళ్ళముందు నిల్పుకోవటానికి తెగ ప్రయత్నించాడు. ఆ దృశ్యం పూర్తిగా అనుభవిస్తే చాలు అతనింక జీవితంలో కోరుకోదగ్గది ఏమీ లేదు. కాని లాభంలేకపోయింది. అలా చాలాసేపు జరిగింది ఆ ప్రయత్నాల్లో అతను ఊపిరి బిగబట్టాడు. శ్వాసను నిదానం చేసాడు. మనస్సుకు స్టైక్నిన్ ఇచ్చాడు. కాని అతని తెగిన ఊహలుమాత్రం ఒక్కచోటికి చేరుకోలేకపోయాయి. ఆఖరుకి అతను విసిగిపోయాడు. నిరాశ చెందాడు. వాస్తవ జీవితంలో పూర్తి ఓటమిని గ్రహించిన వాడన్నా అతనంతటి నిస్పృహ చెందలేదు. కసితో లేచి ఒక్క తన్ను తన్నాడు భార్య శరీరాన్ని.

"తర్వాత అతను తన డైరీని తీసుకుని ఆ సమయాన తనలో కలుగుతున్న భావసంచలనాన్ని అందులో రాసుకున్నాడు. భార్యను చంపినందుకు ఏ పశ్చాత్తాపమూ కలగలేదుగాని అతనికి, సరస్వతీదేవితో కలగబోయిన "ఆ" అనుభవాన్ని మిస్ అయినందుకు మట్టుకు ఎంతో చింతించాడు. తర్వాత అతను తీరికగా ఆ అద్దపు పెంకుల్ని ఏరి అవతల పారబోసి వచ్చాడు. ఏ చప్పుడూ కాలేదు కాబట్టి బయటివాళ్ళకెవరికీ ఈ ఇంట్లో జరిగిన దారుణం గురించి తెలియరాలేదు అప్పటికి. పటాన్ని గోడమీద జాగ్రత్తగా సర్ది అతను తనకు మిగిలిన కొద్దిపాటి డైరీలనూ పటం వెనక అమర్చాడు. తర్వాత గదిమధ్య ఉరివేసుకుని చనిపోయాడు."

"విచిత్రం! అంతేకాక నమ్మశక్యం కాకుండా కూడ ఉంది."

"అదే నాకు నచ్చదు", భుజాలెగరేసి అన్నాడు రామారావు." మన అనుభవంలోకి రానంతమాత్రాన, మన ఊహలకి అందనంత మాత్రాన నమ్మలేకపోవటం మన మూర్ఖత్వాన్ని తెలియజేస్తుంది. అందుకే గావచ్చు, శతాబ్దాల క్రితమే "హేమ్లెట్" చేత అనిపిస్తాడు మహాకవి :

"దేర్ ఆర్ మోర్ థింగ్స్ ఇన్ హెవెన్ అండ్ ఎర్త్, దాన్ ఆర్ డ్రీమ్స్ ఆఫ్ ఇన్ యువర్ ఫిలాసఫీ!"





# ఓ మహిళా! దారి ఇదిగో...

కొడవంటి కాశీపతిరావు

మేస్టారి కోపం చూడ్డానికి పౌర్ణమినాటి వెన్నెల్లా తెల్లగా చల్లగా ఉన్నా అనుభవానికి వచ్చేసరికి నట్టనడి వేసవిలో మిట్టమధ్యాహ్నపు ఎండలా తీవ్రంగా ఉంటుంది. పైగా "అమ్మాయ్ హోంవర్కు చెయ్యలేదేం? ఓ గంటసేపు ఎండలో నిలబడు...ఊఁ" అంటే ఆ ఎండే వెన్నెల్లా వుంటుంది. అదే... "హోంవర్కు చెయ్యలేదూ... ఊఁ... సరే" అని పెదాలు బిగించి రెప్పెయ్యకుండా ఓసారి చూసి తలపంకించెరంటే ఆపై మరి భరించలేను నేను. నేనే కాదు బహుశా ఎవరూను.

అంతకుముందు క్లాసులో ఇంగ్లీషు ఏమేస్టారెలా చెప్పేవారో కూడా తెలియనంత మరపుకొచ్చిందిగాని, మేస్టారు మాత్రం పాఠంలోకి తిన్నగా వెళ్ళిపోయేవారు కాదు ఒక్కో స్ట్రిక్చరూ తీసుకుని

తీగమీద డ్రిల్లు చేయించినట్టు చేయించి, ఒక్కో కంటెంటు వర్ధూ తీసుకుని ఒక్కో పిప్పరమెంటుబిళ్ళ నోట్లోవేసి చప్పరించినట్టు చేయించేవారు ఆపైన ఒక్కసారో రెండుసార్లో మరి పాఠం చదివించి అరటిపండు వలిచి చేతిలో పెట్టేసేవారు అంతవరకూ ఇంగ్లీషంటే భూతవో దయ్యమో అని జడుసుకునే నాలాంటి అమ్మాయిలంతా మేస్టారు సోషల్ స్టడీస్ చెప్పబోతే "ఇంగ్లీషు చెప్పండి మేస్టారూ..." అంటూ మారాం చేసేవాళ్ళం. "మరీ అంత వేలం వెర్రి కూడదర్రా" అంటూ మందలించేవారు.

"బేడ్మింటను నేర్చుకుంటారర్రా... నేర్పిస్తాను..." అని ఓసారి అన్నారు మేస్టారు. "ఛీ... బేడ్మింటా?" అని ఒకరూ..." "అయ్యోరామా... మా కెందుకండీ..." అంటూ ఆ మరొకరూ సాగదియ్యబోతే... "ఏవమ్మా మంగ తాయారూ... తల్లీ సుబ్బలక్ష్మీ మీ కొద్దర్రా ఒద్దు... బేడ్మింటనూ వద్దు... పాడూ వద్దు... తల్లీ... మాత్రం సినిమాహీరోయిన్లా ఒళ్లు పెంచండమ్మా.. చూడూ... ఓ ఇద్దరు కుర్రాళ్ళెదురొచ్చి ఏయ్ అంటే బేర్ మందురు కానీ... అమ్మా ఒద్దు తల్లీ ఒద్దు..." అంటూ హాస్యంగా వ్యంగ్యంగా అని ఆ మంగ తాయారునీ, అదే సుబ్బిలక్ష్మినీ ఛాంపి యన్స్‌గా నిలబెట్టిన మా మేస్టార్నెలా మరచిపోతాం?

పెన్త్‌క్లాస్ పరీక్షలకు వెళ్ళేముందు ఎన్ని రకాలుగానో శిక్షణనిచ్చేరు. పరీక్షల్లోకూడా మా మేస్టారే మా రూముకి ఇన్విజలేషన్‌కు వస్తే 'మా మేస్టారే కదా' అని సంతోషించాం. ఆ 'మా మేస్టారేకదా' అన్నభావమే... అది నిర్లక్ష్యమో... మరి నిర్లిప్తమో...ఇంకా నిర్భీతో రఘుమాత్రం చక్కా మేజోడు మడతల్లోంచి కాగితమ్ముక్కలు లాగి కాస్త సాహసం చెయ్యబోయేడు.

"ఏమిటోయ్.. తెచ్చుకున్నావ్..ఏదీ గురుదక్షిణగా ఇచ్చెయ్ నాయనా." అన్నారు తమాషాగా, అది మా అమ్మాయిలకు తమాషాగా అనిపించడంవల్ల కాబోలు రఘు అహం దెబ్బతింది.అంతే కాదు ఆ అమ్మాయిలదగ్గరే ఆ మేస్టార్నే అవమానిస్తే అతనిమీద హీరో వర్‌షిప్ పెరిగిపోతుందనుకున్నాడు.

స్టైల్‌గా బెల్‌బాటమ్ ఫేంటు వేసుకున్నకాలును బెంచీమీద పెట్టి, ఓ చెయ్యి నడుంమీద పెట్టి వెనకనున్న గేంగ్‌కేసి చూస్తూ. "ఒరేయ్ మేస్టారికి గురుదక్షిణ కావాల్ట్రా గురుదక్షిణ.." అన్నాడు. వెంటనే ఒకడు.. "తగ్గు గురూ తగ్గు.. ఇక్కడకాదు.." అంటూ కాస్త తొందర తొందరగానూ, నచ్చజెప్తున్నట్లుగానూ అన్నాడు. ఆ వెంటనే నడుంమీద పెట్టిన చెయ్యి దించకుండా రెండోచేత్తో ఆ స్లిప్స్ విసిరేసి.. ఆ విసిరేసిన చేత్తోనే జులపాల జుత్తుని సుతారంగా దువ్వుకున్నాడు.

ఓ కుర్రాడిలా అవమానంచేసేడని కాదు గానీ.. ఇంత అక్రమంగా ప్రవ

అప్పుడే పారేసుకున్నావుట్రా ??



త్రించేడంటే తన శిక్షణలోనే ఏదో లోపం ఉందని బాధపడ్డారు మేష్టారు. అది మేం ఇంటర్మీడియేటులో చేరాక మంగతాయారూ, సుబ్బలక్ష్మి, నేనూ మేష్టారి గౌరవార్థం ఇచ్చిన టీ పార్టీలో ఆయనే చూచాయగా వ్యక్తంచేసేరు.. "చాలా సంతోషవర్రా.. నా తయారీలో కొన్ని బొమ్మలు వికృతంగా తయారైనా ఎక్కువశాతం అందంగా తయారయ్యే యంటే మరి నా కానందవే.." అంటూంటే ఆయన సంస్కారం ఎంతని చెప్పను?

మేష్టారు వేసిన పునాదిబలంతో ఇంటర్మీడియేటులో చేరింది నేనూ, మంగతాయారూ, సుబ్బలక్ష్మియే కాదు.. చెప్పకేపీ. రఘూ, అతని గేంగ్‌లో మరో ఇద్దరూ కూడా ఉన్నారు.

కాలేజీలో జరిగే ఇండిపెండెన్స్‌డే, రిపబ్లిడే, కాలేజీడేలకు జరిగే ఇంగ్లీషు డిబేట్లలో నేను పాల్గొనే ధైర్యమూ, బహుమతి పొందగలిగే యోగ్యతా వచ్చే యంటే అది మేష్టారి చలవకాక మరేమౌతుంది? పైగా ఆ మేష్టార్ని నా ఉపన్యాసాల్లోనూ, వ్యాసాల్లోనూ తల్చుకోకపోతే అది కృతఘ్నత కాక మరేమౌతుంది!

కాని ఓరోజు——

"ఒరేయ్ గురూ...మేష్టార్ని తల్చుకుంటోదేవిట్రా. కొంపతీసి మేష్టారి, ఇదీ కథల్లాగించలేదు గదా.." "లాగించే ఉంటారు గురూ.. లేపోతే హైస్కూలు మేష్టర్లనీ.. ఎలిమెంటరీస్కూలు మేష్టర్లనీ ఇంకా తల్చుకోవటమేవిట్రా.." అంటూ ఇంకా ఏవేవో పొగరుగా మాట్లాడబోయేడు రఘు. నాకు విపరీతమైన ఆవేశం వచ్చేసింది. మేష్టారనేవారు...

ఓ ఇద్దరు కుర్రాళ్ళెదురొచ్చి ఏయ్ అంటే జేవ్ మందురు గానీ.. అందరు ఆడవాళ్లూ అలా మూసల్లో పోసినట్టుగా కాకపోతే.. కాస్త చదువుకున్నందుకు మీరైనా మారకూడదుటర్రా..' అని. అదికూడా జ్ఞాపకంవచ్చి కాలిచెప్పు తీయబోయేను. మనకు స్థానబలిమి లేదని మంగతాయారు వారించకపోతే ఏవయ్యేదో మరి!

మరోరోజూ అంతే...

ఆవేళ డిబేటులో 'మరపురాని మనుషులు' శీర్షికకింద మాట్లాడుతూ.. 'మేస్టారు.. నాకు దైవమని' ముగించాను. అంతే, మర్నాడు 'మేస్టారూ.. మీరే కావాలి..', 'మేస్టారూ మీరే దైవం', 'మేస్టారూ మీరే నాకు పతియు, గతియు..' అంటూ రఘూవాళ్ళ బేచ్ వెక్కిరింతలూ, వెటకారాలు.

మేస్టారంటే పంచెకట్టూ, కళ్లీలాల్చీ, చంకలో గొడుగూ.. రూపమయితే ఇంత రాద్ధాంతం జరిగి ఉండేది కాదేమో! కాని మా మేస్టారంటే మాత్రం చక్కని మీస కట్టూ, ముప్పయ్యేళ్ళవయసూ, సొగసున్న బ్రహ్మచారీ కావడంవల్లనేమో పాపం నావల్ల రఘూవాళ్ళ నోళ్ళలో నానుతున్నారు. కాని ఏంచేసేది? వీళ్ళకెలా బుద్ధి చెప్పేది? చెప్పుతీసి ఎడా పెడా నాలుగంటించేదా అనిపించేది కాని తర్వాత దుష్ఫలితాల మాటేవిటి? పోనీ మేస్టారితో చెప్పి బుద్ధి చెప్పించుదామంటే.. మేస్టారిమాట అప్పుడే వినలేదు ఇప్పుడు వింటాడా... పైగా మేస్టారితో తాను ఏమని చెప్పుకుంటుంది?

రోజూ నా ఆలోచనిలా ఈగల్లాగా, దోమల్లాగా ముసురుకుంటూ పొగల్లాగా సెగల్లాగా సుళ్ళు తిరుగుతూనే ఉన్నాయి.

కాని ఆరోజు...

నేనూ, మంగతాయారూ, సుబ్బలక్ష్మీ ఎన్నాళ్ళనుండో అనుకుంటున్న మల్లీశ్వరికి ఫస్టుషో ప్రోగ్రాం వేసుకున్నాం. ఏ సెంటర్ హాల్లోనో అయితే ఫర్వాలేక పోనుగానీ, ఇలాంటి పాతసినిమాలు మాలనున్న థియేటర్లవాళ్ళే తెప్పిస్తారో ఏమో! వెళ్ళేటప్పుడు ఉత్సాహంలో ఏ సంకోచాలూ రాలేదుగానీ.. సినిమా విడిచిపెట్టేక.. వచ్చిన కొద్దిమంది ప్రేక్షకులూ కొంతదూరానికి చెల్లు అయిపోయాక, మిగతాదూరం నడిచి ఇంటికి చేరాలనుకునేసరికి ముగ్గురికీ చెప్పొద్దూ భయంవేసింది. రోడ్డంతా నిర్మానుష్యంగా ఉంది.

"పదండివే.. పిరికిమొద్దుల్లారా.. ఇది అంతర్జాతీయ మహిళాసంవత్సరవే... మనల్ని ఎవడేంచేస్తాడే.. పదండి పదండి.." అంటూ ధీంకంగా నడుస్తున్న సుబ్బలక్ష్మి.. "ఇదో తాయారూ..వెనక ఎవరో వస్తున్నట్టుగున్నారూ.. నువ్వు కాస్త ఇట్రావే.." అంటూ తాయారుని పక్కకి లాక్కుంది.




సుబ్బలక్ష్మి మాటలకీ, చేతలకీ నవ్వు కుంటున్న మేము మా వెనక దగ్గరగా ఆ ముగ్గురూ చీకటినీడల్లా నిల్చునేసరికి మా నవ్వులూ నిశ్శబ్దాలై నిలబడిపోయేయి.

పొగలు కక్కుతూన్న నిప్పుకణికల వెల్తుర్లో మమ్మల్ని అవి పరకాయించి చూసినట్టున్నాయ్.. "ఓసోస్ మనోళ్ళే గురూ.." అని ఒకటీ.. "ఎవర్రా గురూ.." అంటూ మరో కంఠం.. "మేస్టారి భక్తురాలూ.. వారి ఇష్టసఖులూనూ.." అని జవాబూ.. "మరి చెప్పవేం.. లక్కీఛాన్సు.. ముగ్గురికీ మూడు.." అంటూ పంపకాలు— అన్నీ వింటూ నడుస్తున్న మాకు నిప్పుకణికలు సిగరెట్లనీ, వాటిని పట్టుకు గాలిలో నడిపించినవి మూడుజతల పెదాలనీ.. ఆ పెదాల తాలూకు శాల్తీలు రఘూ, వాళ్ళ ద్దరి ఫ్రెండ్సూ అని కొంతదూరం నడిచాక ఒంటరిగా నిల్చున్న లైటు స్తంభం దగ్గరగానీ తెలిసిందికాదు. తెలిసాక మనసులో గజగజ వణుకుతోపాటు గడ గడ భయం కూడా ప్రారంభమైంది.

"మేస్టారి చిలకమ్మ... నాకు స్పెషల్.." అంటూ నా చెయ్యి పట్టుకో బోయేడు రఘు. ఏమైతే అయ్యిందని నేనుకూడా గమ్మున వంగుని చెప్పు తీయబోయేను.

"గురూ ... ఎవరో వస్తున్నారు.. తగ్గు." అంటూ రఘూని ఆపటంతో కాస్త ఆగేరు. ముందు మళ్ళీ లైటు లేక పోవడంవల్ల, ఆ వచ్చేఆయన్ని పిల్లైతే హెల్ప్ అడగొచ్చు కదాని మేముకూడా నిలబడిపోయాం ఆ లైటు స్తంభం దగ్గరే.

ఆ వచ్చింది మా మేస్టారే!

మమ్మల్ని, మాతోపాటు రఘూ వాళ్ళ గేంగుని చూసి ఆశ్చర్యపోయారు. "ఏవిట్రా.. ఇక్కడున్నారు" అంటూ మా దగ్గరగా వచ్చేరు. మాకు ప్రాణాలు లేచి వచ్చేయి.

"మేస్టారూ...చూడండి...వీళ్లు..." అంటూ చిన్నప్పట్లానే ఏవీ చెప్పలేక వెక్కుతూ ఆయన వెనక్కి చేరేం.

"ఏవిటి రఘూ ఇది.." అంటూ చాలా నెమ్మదిగానే ప్రారంభించేరు మేస్టారు. కాని అడిగేది అడగనివ్వకుండా, చెప్పేది చెప్పనివ్వకుండా.."ఒరే గురూ మేస్టారికి మనం గురుదక్షిణ బాకీ ఉండి పోయేం గురూ.." అని రఘు అనడం ఏమిటి ముగ్గురూ...? మేస్టారిమీద పడ్డా రొక్కసారి. మేం బిక్క చచ్చిపోయేం మా మాట అలావుంచి పాత పగతో మేస్టార్ని ఏంచేస్తారోనని బెంగటిల్లి పోయాం.

కాని.. క్రిందపడ్డ మేస్టారు మేస్టారులా కాక దెబ్బతిన్న పులిలా, దెబ్బ తీసే వస్తాదులా లేచేరు. మెరుపుల్లాగా, పిడుగుల్లాగా గుభీ గుభీమని ముగ్గురికి ఏకకాలంలో వడ్డిస్తున్నారు. అరటుగుల దున్నపోతులాంటి వాళ్ళూ ఆయనమీదికి వెళ్ళడం.. వెళ్ళినట్టే వెళ్ళి అంతదూరాన దభీమని పడటం.. ఏదో మంత్రంగానీ గురువుగారికి వచ్చునా అన్పిస్తోంది వాళ్ళు చెయ్యెత్తేలోగానే వాళ్ళ మెడల మీద కత్తివేటులాంటి అరిచేతి పోటుతో దెబ్బతీస్తున్నారు. అందులో ఏదో ఇష్టం వచ్చిన దెబ్బ కొట్టడంలా కాక ఏదో నేర్పు కనిపిస్తున్నది. కొద్దిసేపట్లో వాళ్ళు ముగ్గురూ నేలకరిచేశారనీ, అది బహుశా ఆయన కుస్తీ పట్లూ, జూడో నేర్చుకుని వుంటారని మాకు తట్టిందికాదు.

"పదండర్రా . మీ ఇళ్ళదగ్గర దిగ బెట్టిపోతాను." అంటూ చేతులు దులుపు కుంటూ మా దగ్గరకొచ్చాక కూడా ఆయన నిగ్రహంకేసి కళ్ళప్పగించి చూస్తూండిపోయేం.

"ఏవిట్రా.. అలా ఉండిపోయేరు? పదండి పదండి ఇళ్ళదగ్గర మీవాళ్లెంత గాభరా పడుతుంటారో.." అంటూన్న ఆయన మాటలకడ్డుపడుతూ అదికాదు మేస్టారూ . మీరు ఫైటింగ్.." అంటూ నసిగేను.

"అదా... నేర్చుకున్నానులే... లేక పోతే ఇన్విజిలేషన్సులోనూ, స్టూడెంట్ల గొడవల్లోనూ నెగ్గుకు రాగలనా.." అంటూ తేల్చి నవ్వేసి, "సరేగాని.. మంగతాయారూ.. నువ్వూ జూడో నేర్చు కుంటావేమిటి ?" అన్నారు మేస్టారు నడుస్తూ.

ఠీవిగా మా ముందు నడుస్తూన్న మా మేస్టార్ని చూస్తూంటే.. ఆయన అన్నమాటలు వింటూంటే.. రఘులాంటి వాళ్ళకెలా బుద్ధి చెప్పాలా అని ఆలో చిస్తూ ఉండే నాకు ఏదో మార్గం చూపిస్తున్నట్టు అన్పించింది.




సింహాసనం మీదికి ఎక్కిన పెద్ద పక్షి తన పక్షి ఉడుపు విసర్జించి ఒక సుందరిగా తయారయింది. వెంటనే మిగిలిన పక్షులు కూడా అలాగే చేసి, పదిమంది నగ్నసుందరులు ప్రత్యక్షమయారు. వాళ్ళందరూ నీటిలోకి దూకి కేరింతలు కొడుతూ ఓలలాడసాగారు. అందరిలోకి అందగత్తె అయిన సుందరి మిగిలిన వాళ్ళ వెంటబడి, చిలిపి చేష్టలతో అందరినీ నవ్వించింది.

అందరూ స్నానాలు ముగించారు. అందరిలోకి అందగత్తె అయినది సింహాసనంమీద నగ్నంగానే కూర్చున్నది. ఆమె అందచందాలను వివరంగా చూస్తూన్న హసన్‌కు మతిపోయింది. "ఇందుకే గులాబ్ నన్నా తలుపు తెరవవద్దన్నది. ఇక నా జీవితానికి మనశ్శాంతి ఉండబోదు," అనుకున్నాడతను.

నిజానికి ఆమె సౌందర్యం ఊహకు అందేది కాదు. అందులోనూ నగ్నంగా

ఉన్నది. ఆమె అవయవాలు వర్ణించటానికి ఉపమానాలు దొరకవు.

ఆమె సింహాసనంమీద కొద్దిసేపు విశ్రమించింది. మిగిలినవాళ్ళు తిన్నెమీద చేరగిలబడ్డారు. కొంతసేపు గడచినాక ఆమె మిగిలినవారిని తనకూ దుస్తులు తెమ్మన్నది. వాళ్ళు ఆమె బాహువులమీద ఒక జరీ వలిపం తొడిగి, తలమీద ఆకుపచ్చవల కప్పారు. ఆమె నూతన వధువులాగున్నది. అంతా చెట్లచాటు నుంచి చూస్తున్న హసన్ ప్రేమఘాతంతో నిశ్చేతనుడయాడు.

"రాజకుమార్తెలారా, తెల్లవార వస్తున్నది. విశ్రాంతి చాలు. మనం చాలా దూరం వెళ్ళాలి" అన్నదామె మిగిలిన అమ్మాయిలతో.

వాళ్ళ ఆమెకు పక్షి తొడుగు తొడిగి, తమ తొడుగులను తాము ధరించారు. తరవాత అందరూ ఆకాశంలోకి ఎగిరిపోయారు. హసన్ మూర్ఛపోయిన వాడిలాగా, వాళ్ళు కనిపించకుండా పోయిన తరవాత కూడా అలా ఆకాశంకేసి చూస్తూ ఉండిపోయాడు. ఏ మానవకన్య కూడా అతని హృదయాన్ని అంతగా కలచిఉండలేదు. "అయ్యో, హసన్! ఆడది చలింపజెయ్యలేదనుకున్న నీ హృదయాన్ని ఒక భూతకన్య దోచేసిందే!" అనుకున్నాడతను, మోహావేశంతో కన్నీరు కార్చుతూ.

సూర్యోదయ మయినదాకా అతను నిట్టూర్పులు పుచ్చి, తరవాత ఆ ప్రదేశమంతా కలయతిరిగాడు. ఆ రోజల్లా ఒక యుగంగా గడిపి, తిరిగి రాత్రి కాగానే మిద్దెమీదికి ఎక్కివచ్చాడు. కాని ఆ రాత్రిగాని, మరే రాత్రిగాని ఆ స్త్రీలు మళ్ళీ రాలేదు. హసన్‌కు తిండిమీదా, నిద్రమీద పూర్తిగా ధ్యాసపోయింది. అతను చిక్కి, నీరసించి, గడ్డిమీద పడుకుని, "నాకు చావెందుకు రాదు!" అనుకున్నాడు.

అతను ఈ దశలో ఉండగా భూత రాజ కుమార్తెలు ఏడుగురూ తమ తండ్రి ఇంటినుంచి తిరిగి వచ్చారు. గులాబ్ తన ప్రయాణపు దుస్తులైనా మార్చుకోకుండా హసన్ కోసం వెతికింది. అతను పూర్తిగామారి, పాలిపోయి అరమోడ్పుకళ్లతో అశ్రుధారలతో తడిసిన చెక్కిళ్లతో పక్కమీద పడుకుని కనిపించాడు.

అతన్ని ఆ స్థితిలో చూడగానే ఆమె గట్టిగా ఆక్రోశించి, అతన్ని కౌగలించుకుని నుదురుమీదా, కళ్లమీదా ముద్దు పెట్టుకుని, "అన్నా, నిన్ను ఇలా చూసి నా గుండె అవిసిపోతున్నది. నీకు వచ్చిన కష్టం ఏమిటో చెప్పు, అది తీరే ఉపాయం చూస్తాను," అన్నది, అతనితో పాటు శోకిస్తూ.

"చెల్లీ, నా అపరాధమే నన్ను శిక్షిస్తున్నది. నువ్వేం చెయ్యగలవు? నన్ను కుమిలి చావనీ!" అన్నాడు హసన్.

"ఏమిటి నువ్వనేది? నీకు సహాయం చెయ్యలేకపోతే నేను కూడా చచ్చిపోతాను," అన్నది గులాబ్.

"గులాబ్, నేను తిండితిని పదిరోజులయింది. ఏం జరిగిందంటే—" అంటూ హసన్ జరిగినదంతా ఆమెకు చెప్పాడు.

వద్దన్నపని చేసినందుకు హసన్ మీద కోప్పడటానికి బదులుగా ఆమె అతన్ని చూసి జాలిపడి, "నువు ఆవేదన పడకు, హసన్. నా ప్రాణం ఒడ్డి అయినా సరే, ఆ పిల్ల ఎవరో నీకు దక్కేటట్టు చెయ్యటానికి శక్తికొద్దీ పాటుపడతాను, కాని ఈ సంగతి నా అక్కలకు ఏ మాత్రమూ తెలియనియ్యకు. లేకపోతే మన ఇద్దరికీ ప్రమాదమే. వాళ్ళు తెరవకూడని తలుపుమాట తెస్తే, అదేదో నీకు తెలియదని చెప్పు. ఎందుకిలా చిక్కావంటే, 'మీ వియోగంవల్లనే,' అను," అని చెప్పింది.

హసన్ అలాగే చేస్తానన్నాడు. అతని హృదయభారం చాలా తగ్గింది. వద్దన్నపని చేసినందుకు ఆమెకు తనపై ఆగ్రహం కలగలేదు. అతను గులాబ్‌ను భోజనంకూడా అడిగాడు. ఆమె తెస్తానని చెప్పి, అక్కల దగ్గరికివెళ్ళి, "పాపం, హసన్ చాలా జబ్బుపడ్డాడు. మనం వెళ్ళిపోయామన్న విచారంతో అతను పదిరోజులుగా తిండి తినలేదు. మనం అతన్ని బొత్తిగా ఒంటరిచేసి వెళ్ళామేమో, అతను తన తల్లినీ, తన దేశాన్నీ జ్ఞాపకం తెచ్చుకుని బాగా బెంగపడిపోయాడు," అన్నది.

మెత్తని మనసు గల ఆ రాజకుమార్తెలు ఆహారం తీసుకుని హసన్ వద్దకు శీఘ్రంగావెళ్ళి, అతన్ని రక్షించటానికి సర్వవిధాలా యత్నించారు. తమ తండ్రిచేసిన విందు బాపతు కబుర్లన్నీ చెప్పారు. ఒక నెలపాటు వాళ్ళు అతనికి ఎన్నో ఉపచారాలు చేసారు, కాని అతను పూర్తిగా కోలుకోలేదు.

నెల తరవాత అక్కచెల్లెళ్ళు వేటకు పోయే ఆలోచన చేశారు. గులాబ్ తాను మాత్రం హసన్‌ను కనిపెట్టుకుని ఉంటానన్నది. అందుకు సంతోషించి మిగిలిన ఆరుగురూ వెళ్ళిపోయారు.

గులాబ్ హసన్ తీసుకుని కోనేరు వద్దకు వెళ్ళి, "నీకు కనిపించిన స్త్రీలు కోనేటి ఒడ్డున ఏ పక్క కనిపించారు?" అని అడిగింది.

"అవతలి పక్క, ఆ కనిపించే సింహాసనం దగ్గిర," అన్నాడు హసన్.

గులాబ్ వెలవెలపోతూ, "అయ్యో, గ్రహచారమా! నువు చూసినపిల్ల భూతాల చక్రవర్తి కూతురు. మా తండ్రి ఆయనకు సామంతు. ఆయన ఉండే దేశం చేరటం అసాధ్యం. దాని చుట్టూ ఉండే సముద్రాన్ని భూతాలుగాని, మానవులుగాని దాటే మార్గంలేదు. ఆయనకింద యోధకన్యల సేన ఉన్నది. ఒక్కొక్కతె కిందా అయిదేసివేలమంది వీర

స్త్రీలుంటారు. నువు చూసిన కన్య ఏడుగురు అప్పచెల్లెళ్లలో చివరిది, చాలా ధైర్యవంతురాలు. ఆమె తన చెలికత్తెలతో ప్రతి అమావాస్యనాడూ ఇక్కడికి విహారానికి వస్తుంది. వాళ్లందరూ ధరించే పక్షితొడుగులు భూతాల దుస్తులు. మేం ఏం సాధించదలిచినా వాటిని ధరిస్తాం. నీకు ఆమె వశం కావాలంటే, నువ్వు ఇక్కడే దాగిలేచి ఉండి, ఆమె నీటిలో జలకాలాడేటప్పుడు ఆమె పక్షితొడుగు సంపాదించాలి. అప్పుడామె నీకు వశమవుతుంది. కాని ఆమె బతిమాలిందిగదా అని తొడుగు ఇచ్చేశావో, నీకూ, మాకూ, మా తండ్రికీ సర్వనాశనం తప్పదు. అంతకన్నా ఆమెను జుట్టుపట్టి ఈడ్చుకు రావటం అందరికి క్షేమం. ఆ విధంగా ఆమె నీకు లొంగుతుంది తరవాత జరగవలసినది జరుగుతుంది," అన్నది.

ఇది విని హసన్ పరమానందం చెందాడు. అతనికి బలమూ, చైతన్యమూ తిరిగి వచ్చాయి. అతను చప్పున లేచి నిలబడి, గులాబ్‌తల తన చేతుల్లోకి తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు. తరవాత ఇద్దరూ తమ భవనంలోకి దిగివెళ్ళి, వేట నుంచి మిగిలినవాళ్ళు తిరిగివచ్చేదాకా అదీ ఇదీ మాట్లాడుకున్నారు.

మర్నాడే అమావాస్య. హసన్ పైకి ఎక్కివెళ్ళి, కొలను ఒడ్డున ఉన్న అరుగు వెనక దాక్కున్నాడు. కొద్దిసేపటికల్లా నల్లని ఆకాశంనుంచి పక్షులు, రెక్కలు టపటపలాడిస్తూ వచ్చి వాలి, పక్షి ఉడుపులూ, తొడుక్కులూ విప్పేసి, కన్యలుగా మారాయి. వాళ్ళు నీటిలోకి దిగారు. తాను ప్రేమించిన సుందరి సౌందర్యానికి తల తిరిగిపోతున్నా, హసన్ చల్లగా వెళ్ళి, ఆమె పక్షి ఉడుపు సంగ్రహించి, తాను దాగిన చోటికి తిరిగి వచ్చాడు

భూత చక్రవర్తి ఆఖరు కుమార్తె పేరు రోష్నీ. ఆమె నీటినుంచి పైకి వచ్చి, దుస్తులు చూస్తూనే, వాటిని ఎవరో కెలికినట్టు తెలుసుకున్నది. మరుక్షణమే తన ఉడుపు ఎవరో కాజేసినట్టు గ్రహించి, ఆమె కెవ్వున అరిచి, రొమ్ము బాదుకున్నది.

ఆమె కేకలు విని చెలికత్తెలు పరిగెత్తుకుంటూవచ్చి, జరిగిన సంగతి తెలుసుకున్నారు. వెంటనే వాళ్ళు ఆమెకు ఎలాంటి సేవగాని చేసే ఆలోచన లేకుండా, ఎవరి పక్షి ఉడుపులు వాళ్ళు తొడుక్కుని, ఆకాశంలోకి ఆదరాబాదరా ఎగిరిపోయారు. పాపం, రోష్నీ కొలను ఒడ్డున ఒంటరిగా మిగిలిపోయింది.

హసన్ ఉద్రేకంతో నిలువునా కంపిస్తూ ఆమె వద్దకు దూకుతూ వచ్చాడు ఆమె పారిపోయింది. అతను వెంబడించాడు. ఇద్దరూ కొలనుచుట్టూ పరిగెత్తారు. అతను ఆమెను ముద్దుపేర్లతో సంబోధిస్తూ తానేమీ ద్రోహం చెయ్యనని మాట ఇచ్చాడు. కాని ఆమె



వినిపించుకోకుండా, రొప్పుతూ, పొదల మీదిగా దూకుతూ పరిగెత్తింది.

చిట్టచివరకు హసన్ ఆమె జుట్టు అందుకుని, తన చేతితో మెలిపెట్టి పట్టుకుని, ఆమెను బలాత్కారంగా తన గదికి లాక్కుపోయి, ఆమెను అంపలో పెట్టి తాళంపెట్టి శుభవార్త గులాబ్‌కు చెప్పటానికి వెళ్లాడు

గులాబ్ అతని గదికి వచ్చేసరికి రోష్నీ పెద్ద దుఃఖంలో ఉన్నది. ఆమె రోష్నీ కాళ్లమీదపడి ప్రణామంచేసి, "తమర్ని 'అల్లా' చల్లగా చూడాలి, మహారాణీ! మీవల్ల మా గృహం పావనమయింది," అన్నది.

"నువేనా, గులాబ్! మానవమాత్రులు నీ రాజుకూతుళ్ళను ఇలాగేనా చేసేది! మా నాన్న ఎవరో, ఎలాంటివాడో నీకు తెలుసు. ఎందుకిలా జరగనిచ్చావు! నువు సామాన్య మానవుణ్ణి చేరనియ్యటమే గాక, వాణ్ణి ఇలాంటి అత్యాచారం చెయ్యనిచ్చావు! నీ సహాయంలేకుండా వాడికి నా కొలను ఎలా తెలుస్తుంది! అని రోష్నీ అడిగింది"

"మహారాణీ! త్రిలోకసుందరీ! నిన్ను ఇలా చేసినవాడైనా సామాన్య మానవుడు కాదు అతని సంసారం అద్భుతమైనది అతనిలో నీచోద్దేశం ఏమీలేదు. కాకపోతే విధివిపర్యయం అమలు జరిగి

తీరాలి. నీ అందంతో ఈ యువకుడు సమ్మోహితుడు కావటం కేవలమూ విధి నిర్దేశం. ప్రేమికులు క్షమార్హులు. అతనికి నీపైగల ప్రేమ నీకు ఆదరణీయమే అవుతుంది. అల్లా స్త్రీలను సృష్టించినది పురుషులకోసమే గదా; ప్రపంచంలో ఇంత కన్న ఆకర్షణీయుడైన యువకుడుంటాడా? అమ్మా! నిన్ను చూసిన అనంతరం ఇతను ఎలా కృశించాడో నువు చూసి తీరవలసింది. నీ మీది ప్రేమతో చచ్చినంతపని అయింది. తల్లీ, మరిచిపోకు, ఇతను పదిమంది నగ్నసుందరులలో నిన్ను ఎన్నుకొన్నాడు," అన్నది గులాబ్.

ఈ ప్రసంగం విన్నమీదట తనకు విమోచనం కలగదని గ్రహించి, నిరాశతో నిట్టూర్చింది.

గులాబ్ ఆమెకు దివ్యమైన ఉడుపులు కట్టిపెట్టి, ఆమెకు భోజనం పెడుతూ, ఆమె విచారాన్ని పోగొట్టటానికి ఎంతో కృషిచేసింది. కొన్ని చివరకు కొంత ఊరడిల్లి, "నేను నా తండ్రికీ, దేశానికీ దూరం కావటంకూడా విధి నిర్దేశంలాగే ఉంది. విధికి తల వంచక తప్పదు," అన్నది.

గులాబ్ ఆమెను ఇదే స్థితిలో ఉండనిచ్చి, హసన్ వద్దకు వెళ్ళి, "నీవు నీ ప్రియురాలిని చేరటానికి ఇదే మంచి సమయం. నువు ఆమెను చూడగానే ముందు ఆమె పాదాలూ, తరవాత ఆమె చేతులూ, తలా ముద్దుపెట్టుకో. అంత దాకా ఏమీ మాట్లాడకు. తరవాత ఆమెతో ఇంపుగానూ, మధురంగానూ మాట్లాడు," అన్నది.

ప్రేమతో చలించిపోతూ హసన్ రాజకుమార్తె ముందు నిలబడ్డాడు. ఆమె అతన్ని సునిశితంగా పరీక్షించి, అతని అందం చూసి మెత్తబడింది. అయినా ఆమె రెప్పలు వాల్చింది. హసన్ ఆమెను పాదాలమీదా, చేతులమీదా, కళ్ళమధ్యా ముద్దుపెట్టుకున్నాడు. తరవాత అతను ఇలా అన్నాడు. "సౌందర్యమూర్తీ, ప్రాణానికి ప్రాణమా! రాజకుమారీ, నా మీద నీకు ఏపాటి కనికరం ఉన్నా, హృదయాందోళన వినర్జించి, నన్ను చల్లగా చూడు. నీకు సుఖప్రాప్తి ఉంటుంది. నా చెల్లెలిలాగే నేను కూడా నీ సేవకుణ్ణి. నీ దాసుడుగా ఉండటం కన్న నాకు వేరే కోరిక ఏదీలేదు. నిన్ను బలాత్కారించాలని నేను ఎన్నడూ అనుకోలేదు. నిన్ను విధి నియమితంగా పెళ్ళాడగోరాను. నిన్ను నా జన్మస్థలమైన బాగ్దాదుకు తీసుకుపోతాను. నీ ఘనతకు తగినట్టుగా నీకు బానిసలను ఏర్పాటుచేస్తాను. బాగ్దాదు పరిసరాలు ఎంత మనోహరంగా ఉంటాయి! అక్కడి ప్రజలు ఎంత నాగరికులు! వారి మాటతీరు ఎంత సంస్కారంతో కూడి ఉంటుంది! నా తల్లి కన్న ఉత్తమురాలు ప్రపంచంలో ఉండదు. ఆమె నిన్ను కన్న కూతురిలాగా చూసుకుంటుంది. ఆమె నీకు దివ్యమైన వంటకాలు




చేసిపెతుతుంది. ఎందుకంటే పాకకళలో ఆమెను మించినవారు ఇరాన్ దేశంలో లేరు."

భూతచక్రవర్తి కుమార్తె రోష్నితో హసన్ ఈ ధోరణిలో మాట్లాడితే అందుకు సమాధానంగా ఒక్క మాటగాని, ఒక్క శ్వాసగాని ఇయ్యలేదు.

ఇంతలో ముఖద్వారం తలుపు ఎవరో తట్టారు హసన్ రోష్ని అనుమతి తీసుకుని వెళ్ళి ద్వారం తెరిచాడు. వేటనుంచి ఆరుగురు అక్కచెల్లెళ్ళూ తిరిగివచ్చారు. హసన్ చెక్కిళ్ళు మళ్ళీ ఎర్రబడిఉండటమూ, అతనికి పూర్వారోగ్యం తిరిగి ఉండటమూ చూసి వాళ్ళు చాలా సంతోషించారు. కాని హసన్ వారితో రోష్ని సంగతి చెప్పక, వాళ్ళు వేటాడి తెచ్చిన జంతువులను లోపలికి చేరవేశాడు

అతను వాళ్లతో చాలా ఆప్యాయంగా మాట్లాడుతూ, అందరినీ వరసగా నుదురు మీద ముద్దులుపెట్టుకుని చాలా ఉల్లాసంగా ఉన్నాడు. ఇది చూసి వాళ్ళు కొంత ఆశ్చర్యపడ్డారు. ఎందుకంటే అతను సాధారణంగా గులాబ్‌తోనే అంత చనువుగా ఉంటాడు.

ఈ మార్పు పెద్దావిడ పసిగట్టి, హసన్‌కేసి కొంటెగా చూస్తూ, "ఏం, హసన్? ఇంతదాకా మేం నిన్ను ముద్దు పెట్టుకోవటమేగాని, నువ్వు మమ్మల్ని ముద్దుపెట్టుకున్న పాపాన పోలేదు, దీనికేదో కారణం ఉండాలి. మేము వేట దుస్తుల్లో నీకు మరింత అందంగా కనిపించామా, లేక నీకు ఆకస్మికంగా మా మీద అనురాగం పుట్టుకొచ్చిందా, లేక రెండూ జరిగాయా?" అన్నది.

హసన్ నేలచూపులు చూస్తూ, హృదయవిదారకంగా నిట్టూర్చాడు.

అది చూసి అతని అక్కలు, "ఎందుకంత బరువుగా తమ్ముడూ? మీ అమ్మమీదా గాని, మీ దేశంమీదా గాలి మళ్ళిందా? అక్కలకు నిజం చెప్పెయ్యి, హసన్!" అన్నారు.

హసన్, అప్పుడే అక్కడికి వచ్చిన గులాబ్ కేసి చూసి, ఆమెను చెప్పమన్నాడు.

గులాబ్ వాళ్ళతో, "మరేమీలేదు, అక్కలూ! హసన్ ఒక అందమైన పక్షిని పట్టాడు దాన్ని మచ్చిక చెయ్యటానికి మీ సహాయం కావాలి," అన్నది.

"ఇంతేనా భాగ్యం? ఈ మాత్రానికి అలా సిగ్గుపడిపోతాడేం?" అన్నారు అక్కలు.

"ఎందుకంటే హసన్ ఆ పక్షిని ప్రేమిస్తున్నాడు. అలాంటి, ఇలాంటి ప్రేమకాదు," అన్నది గులాబ్.

"అదేమిటి హసన్? పక్షినా ప్రేమిస్తావు?" అన్నారు వాళ్ళు.

హసన్ ఇంకా నేలచూపులు చూస్తూ, తెగసిగ్గుపడిపోతూంటే, గులాబ్ ప్రేమించటమేగాదు. ప్రేమ పర్యవసానంతో సహా!" అన్నది.

"చాలా పెద్దపక్షి కాబోలు!"

"దావాపు మనంతది! అంతా వినండి. మనిషి తెలివి పరిమితమైనది. ఆ కాకతాళంగా, మనం ఒంటరిగా తనని వదిలి వెళ్ళినప్పుడు, హసన్ బెంగతో భవనమంతా తిరుగుతూ, ప్రమాదవశాన తెరవకూడని తలుపు తెరిచి, మిద్దెమీదికి వెళ్లాడు," అని ప్రారంభించి గులాబ్ తన అక్కలకు జరిగినదంతా చెప్పింది హసన్ తప్పు ఏమీ లేదన్న అభిప్రాయం కలిగేటట్టుగా హసన్ ప్రణయకథ ముగించి ఆమె, "ఏమైనా మన సోదరుణ్ణి తప్పుపట్టే పనిలేదు. ఆ పిల్ల చాలా చక్కనిది. ఎంత చక్కనిదో మీరు ఊహించలేరు!" అన్నది.

"అంత చక్కనిదైతే హసన్ ఆమెను ప్రేమించాలిసిందే. ఏదీ మమ్మల్ని కూడా చూడనీ!" అన్నారు అక్కలు.

ఇంతలో తెల్లవారుతూండటం గమనించి మంత్రికుమార్తె మౌనం వహించింది.





"ఇటీజ్ డామ్ ఇన్సల్ట్!" — అన్నాను కోపంగా ఫోర్క్ నైఫ్ గాజు పళ్లెంలో శబ్దమయ్యేలా పడేస్తూ.

క్షణంసేపు చుట్టుప్రక్కల టేబిల్స్ వాళ్ళు సంభాషణ ఆపేసి నావైపు చిత్రంగా చూశారు. శివపాదం బిత్తర పోయి, కళ్ళు చికిలిస్తూ చూశాడు నా వైపు గుటకలు మింగుతూ.

"సారీ!"—అన్నాను మళ్ళీ నేనే, క్షణంసేపు నా మేనర్స్ మర్చిపోయి ఎక్సయిట్ అయినందుకు.

"ఇట్సాల్‌రైట్ మిస్టర్ శర్మా!"— అన్నాడు శివరాం నొచ్చుకుంటున్నట్లు.

టేబిల్‌మీద పళ్ళాలు తీసేసి, సర్వరు కాఫీ పెట్టేవరకూ దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్నాను. శివపాదం రెప్ప వెయ్యక

కుండా నన్నే చూస్తూ నిటారుగా కూర్చు న్నాడు సోఫాలో...ఫస్నీగా వుంది అతన్నా పొజిషన్‌లో చూస్తోంటే.

శివపాదం ఈ వూళ్ళో మా కంపెనీ తరఫున చిన్న శాఖలు రిప్రెజెంటేటివ్. ప్రఖ్యాత సినిమా తారల సౌందర్యం ద్విగుణీకృతం చేస్తాయని మేము ప్రకటించి తయారుచేసే సబ్బులు, లోకల్ డిమాండుకు తగినట్లుగా సంపిణీ అయ్యేట్లు చూడడం. వీలయినంతవరకూ ప్రతి సంవత్సరం సేల్స్ టర్న్ ఓవర్ ఈ ప్రాంతంలో పెంచడం అతని కర్తవ్యం...అతను చేసే పనికి కంపెనీ అతనికి నెలనెలా వెయ్యిరూపాయల జీతం ప్లస్ ఇతర బెనిఫిట్సు ఇస్తోంది. దాదాపు పదేళ్ళనుండి కంపెనీ తరవున పనిచేస్తున్నాడతను.

ఈ పదేళ్ళలోనూ అతను ఈ ప్రాంతంలో మా సబ్బు సేల్సు దాదాపు మూడురెట్లు పెంచాడు. అవును; పదేళ్ళలో ఈ ప్రాంతంలో స్టిఫ్ కాంపిటీషన్లో ఖరీదైన సబ్బు అమ్మకాలు మూడురెట్లు పెంచడమంటే అంత తేలికైన పని కాదు. ఏరియా రిప్రజెంటేటివ్ ఎంతో సామర్థ్యంతో మెళకువగా పనిచేస్తేగాని అలాంటి ఫలితాలు రావు...కాని గత ఆర్నెల్లనుండీ మా సేల్సు దాదాపు సగానికి పడిపోయాయి.

దానికి కారణం శివపాదం అసమర్థత కాదని తెలుసు. ఈ ప్రాంతంలో క్రొత్తగా స్థాపించబడిన సబ్బుల కంపెనీ ఒకటి అతి చవగ్గా క్వాలిటీ సబ్బుల్ని అమ్ముతోంది...దాదాపు సమానమైన క్వాలిటీతో తక్కువ ధరలోవున్న సబ్బు మార్కెట్‌లోకి వచ్చేసరికి అధిక ధరల్లో ఇల్లాడుతున్న ప్రజలు దాన్ని ఆదరించడంలో ఆశ్చర్యం లేదు.

అంచేతే పరిస్థితిని పరిశీలించి, ఈ లోకల్ కంపెనీ సేల్సు దెబ్బకొట్టి మా సేల్సు ఎలా పెంచాలో స్ట్రాటజీ రూపొందించడానికి, ఆన్ ది స్పాట్ రిపోర్ట్ కోసం బొంబాయినుండి నన్ను పంపింది కంపెనీ. హార్వర్డ్ బిజినెస్ స్కూల్లో నేను నేర్చుకొన్న పాఠాలు ఎలా అమలులో పెట్టించాలో కంపెనీకి తెలుసు మరి.

"ఒకే క్వాలిటీ సబ్బును ... అంత చవగ్గా అమ్ముతూంటే నష్టం రాకుండా ఎలా వుంటుంది వాళ్ళకి? ఏదో ఒకరోజు ధరను పెంచాలి. అప్పుడు ప్రజలు మళ్ళీ మన సబ్బునే కొనడం ప్రారంభిస్తారు"—అన్నాడు శివపాదం.

"బిజినెస్ ఎకనామిక్స్"—అన్నాను సమాధానంగా నవ్వుతూ. శివపాదం ఆశ్చర్యంగా చూశాడు.

"అవును; మామూలుగా అయితే వాళ్ళకు నష్టంరావాలి. కాని ఓ విషయం మరిచిపోతున్నారు మీరు. వాళ్ళది చిన్న ప్రొడక్షన్ యూనిట్; లిమిటెడ్ క్వాంటిటీలో లోకల్‌గా తయారుచేస్తున్నారు.

ఉత్పత్తి ఖర్చు దాదాపు వాళ్ళకీ మనకీ సమానంగానే వున్నా, మనకన్నా వాళ్లకు ఓవర్ హెడ్స్ —అంటే...ఉత్పత్తేతర ఖర్చులు తగ్గుతాయి. వాళ్ళు ఆపరేట్ చేసే ప్రాంతం చిన్నది కాబట్టి పెద్దగా అడ్వర్టయిజ్‌మెంట్స్ ఖర్చులు, ట్రాన్స్‌పోర్ట్ ఖర్చులు వుండవు పైగా స్మాల్ స్కేల్ యూనిట్ కాబట్టి...బాంక్‌లోన్ చీప్‌గా వస్తుంది—" చటుక్కున చెప్పడం ఆపేశాను.

నా కళ్ళు అప్పుడే రెస్టారెంట్‌లోకి అడుగుపెట్టిన జంటమీద నిలిచిపోయి నయ్ - జెన్నీ - యస్ జెన్నీ - సందేహంలేదు. కాపర్ కలర్ జుట్టు భుజం దాకా వ్రేలాడుతూ - తెల్లని శరీర చ్ఛాయ - దాదాపు అయిదున్నరడుగుల పొడవు - చక్కనట్లుండే 'స్లావ్' ముఖ లక్షణాలు - పెద్ద కాఫీరంగు కళ్ళు - వెడల్పయిన నిండయిన పెదిమలు — మైగాడ్ - షి యీజ్ జెన్నీ ఫర్!

నిముషంపాటు రెప్పవెయ్యకుండా జెన్నీ వైపే చూస్తూ వుండిపోయాను. ప్రక్కన ఎవరో? శర్మే మో! అతను భారతీయుడులానేవున్నాడు. ఈ ప్రాంతం వాడిలా లేడు. ఉత్తర భారతీయుడిలా వున్నాడు ఇండియన్స్ అంటే పురుగుల్లా భావించే జెన్ని పెళ్ళిచేసుకొందా? జెన్ని అతని ముఖంమీద తల ఆన్చి నడుస్తూ, నవ్వుతో ఏదో చెబుతుంది. అతను గంభీరంగా తల వూపుతూ, ఆమె నడుం చుట్టూ చెయ్యివేసి మూల టేబుల్ దగ్గరకు నడిపించుకెళుతున్నాడు.

ఎందుకో గుండెల్లో ఎవరో కెలికినట్లనిపించింది. బాధో, ఆయాసమో తెలియదు. జెన్నిఫర్‌మీద ప్రేమ తప్ప, మరే భావాన్నీ పోల్చుకోలేను — చిత్రమైన ఉద్వేగం మొదలయింది. శివపాదం నేను సంభాషణ ఆపి అటే చూడ్డంచూసి, జెన్నీని, నన్ను మార్చి మార్చి చూసి గుటకలు మింగుతూ కూర్చున్నాడు — నేను తల దించుకొని సుగర్ బౌల్ ముందుకు లాక్కొన్నాను. ఒక్క క్షణం —చేతిలో స్పూన్ వణికి సుగర్ టేబిల్ అంతా పడింది.

"సారీ" — అన్నాను అపోలజిటిక్‌గా.

శివపాదం మాట్లాడలేదు ఇబ్బందిగా సోఫాలో అటూ ఇటూ కదిలాడు. ఇక ఆ రోజుకు ఏమీ బిజినెస్ మాట్లాడలేనని పించింది. గుండెలు జెన్నీ, జెన్నీ అంటూ స్పందిస్తున్నాయి. రేపు ఉదయం మాట్లాడతానని, ప్రస్తుతానికి వెళ్ళిపోమని చెప్పి పంపేశాను శివపాదాన్ని.

"ఆర్ యు ఆల్‌రైట్ మిస్టర్ శర్మా? ఈజ్ దేర్ ఎనీ థింగ్ ఐ కెన్ డూ ఫర్ యు"—అంటున్నాడు శివపాదం- నా పరిస్థితి అర్థంకాక.

"నో - నో - నథింగ్ -థాంక్యూ" —అన్నాను.

హడావిడిగా, ఎవరో తరుముతున్నట్టు

బయటికి వెళ్ళిపోయాడు శివప్రసాదం. జేబులు తడుముకొని సిగరెట్ తీసి వెలిగించాను. రెండు మూడుసార్లు మంట అడ్జెస్ట్ చేస్తేగాని సిగరెట్ అంటుకోలేదు. గుండెల్నిండా పొగపీల్చి సన్నగా వదుల్తూ వాళ్ళకేసి చూశాను.

ఇద్దరూ నవ్వుతూ కబుర్లు చెప్పుకొంటూ ఫ్రూట్‌సలాడ్ తింటున్నారు. జెన్నీ వెనక భాగం నన్ను వెక్కిరించి నట్లు కనిపిస్తోంది – లక్కీ గై! అనుకొన్నాను మనసులో నేఅతని అదృష్టానికి ఈర్ష్యపడుతూ

ఈ అయిదేళ్ళలో జెన్నీ ఏమీ మారలేదు శారీరకంగా – ప్రసిడెన్సీలో – అప్పట్లో ఆమె అందంచూసి పిచ్చెక్కని స్టూడెంట్ లేడు – ఆఫ్‌కోర్స్! వాళ్ళలో నేనూ ఒకణ్ణనుకోండి ప్రెసిడెన్సీ కాలేజి మేట్ స్టూడెంట్స్ అందర్నీ ప్రిన్సెస్ ఆఫ్ ప్రెసిడెన్సీ అనీ మద్రాసు విద్యార్థిలోకం అంటే, మేమంతా ప్రిన్సెస్ ఆఫ్ ప్రెసిడెన్సీ అని జెన్నీని అనేవాళ్ళం— నిజమే–ఆమె ఆంగ్లో ఇండియన్ బ్యూటీ ముందు, భారతీయ యువతులంతా సూర్యుడిముందు దీవిటీల్లా అనిపించే వాళ్లు.

జెన్నీ ఇండియన్ బాయ్స్ ఎవరితోటీ మాట్లాడేదికాదు అసలు వాళ్ళనో మనుమల్లా గుర్తించినట్లు అవుపించేదికాదు ఎప్పుడూ మాతో చదివే ముగ్గురు ఆస్ట్రేలియన్స్‌లోనూ, ఆంగ్లోఇండియన్ బాయ్స్‌లో మాత్రమే చనువుగా తిరిగేది. —అందుచేతే జెన్నీతో నా పరిచయం, ఆమెతో స్నేహం నేనెప్పుడూ ఓ అదృష్టంలా, జీవితంతో మరపురాని ఘట్టంలా భావిస్తాను,

అదీ నాకు 'గిటార్' వాయించడంలో వున్న నేర్పువల్ల మాత్రమే – అప్పట్లో సిటీలో నేను గిటార్ మాస్టర్ని – జిమ్ రవిన్, క్లిఫ్ రిచర్డ్ పాటలు గిటారు వాయిస్తూ, గొంతెత్తి పాడే శక్తి నాకే వుండేది – నా పాట రికార్డ్‌చేసి వింటే క్లిఫ్‌రిచర్డ్‌కు, నాకూ ఆట్టే తేడా లేదనే వాళ్లు ఫ్రెండ్సంతాను. మరి జెన్నీ, క్లిఫ్ రిచర్డ్ అభిమాని – అలా నాతో పరిచయం – మెల్లి మెల్లి స్నేహం–నాలో ప్రేమ – పాత సంఘటనలు అవన్నీను.

ఆ రోజు నేనిప్పటికీ మరిచిపోలేను. . హార్వర్డ్ బిజినెస్ స్కూల్లో బాచ్‌లర్ క్లాసుకు సీటు వచ్చింది. మరో నెల రోజుల్లో అమెరికాకి ఎగిరిపోవాలి ... నాలో దాచుకొంటున్న ప్రేమకు ఆనకట్టలు కట్టివుంచడంలో అర్థంలేదనిపించింది.

"ఐ లవ్ యు జెన్నీ"—అన్నాను. బీచ్ ఒడ్డున బుహారీలో నాకు సీటు వచ్చిన సంగతి తెలియచేసి.

జెన్నీ కాఫీరంగు కళ్లు చిత్రంగా మెరిసాయి...ఒక్క క్షణం నాలో ఆశా పుష్పాలు విచ్చుకోవడం మొదలెట్టాయి.

"సిల్లీ క్లిఫ్! ఐ నెవర్ సస్పెక్టెడ్!"–



అన్నది జెన్నీ...అన్నట్లు చెప్పడం మరిచాను...జెన్నీ నన్నెప్పుడూ నా పేరుతో పిలిచేది కాదు...'క్లిఫ్' అనేది.

మాట్లాడలేదు నేను...ఆమె ముఖం వంకే చూస్తూ వుండిపోయాను నా దీన వదనంచూసి జాలిపడివుంటుంది.

"సారీ క్లిఫ్! ఐయామ్ రియల్లీ సారీ!"—అన్నది చెయ్యి ముందుకు సాచి లాలనగా నా చేతివేళ్ళు తడుతూ.

"నో ఛాన్స్?" – అడిగాను గొంతు పెగిల్చి

జెన్నీ మాట్లాడలేదు. తల అడ్డంగా వూపింది...నెల రోజుల తర్వాత అమెరికా వెళ్ళిపోయాను నేను. తర్వాత నా నా అడ్రసు ఎలా సంపాయించిందో, ఓ ఉత్తరం వ్రాసింది. అందులో నన్ను నిరాశపరచినందుకు క్షమాపణలు చెప్పుకొంటూ, అలా చేయవలసివచ్చినందుకు కారణాలు వ్రాసుకొచ్చింది. ఉత్తరమంతా చదివింతర్వాత, ఆమె మనసులో లేశమంతైనా నామీద ప్రేమ వుండి వుంటుంది. అందుకే శ్రమతీసుకొని నాకు వ్రాసిందనిపించింది

తనకూ. నాకూ సాంఘికంగా, మత రీత్యా వున్న అడ్డంకులు ఎత్తిచూపడమే కాకుండా, తనకు భారతీయులు, అందునా హిందువుల ఆచారాలపట్ల, ఆలవాట్లపట్ల ఎంత విముఖత వున్నది తెలియచేసింది. అందుచేత తను ఏ భారతీయుణ్ణీ పెళ్లిచేసుకోననీ, విదేశస్థుడి నెవర్నయినా పెళ్ళిచేసుకొని, అతని దేశంలో స్థిరపడిపోదామని వుందని వ్రాసింది... 'సిల్లీ లిటిల్ ఫూల్' అనుకున్నాను ఆమె కారణాలు చదివి

ఆమె కోరిక నెరవేరడానికి పెద్ద సమస్యలేమీ వుండవనిపించింది. ఆ

తర్వాత నేను జెన్నీని మరచిపోలేక పోయినా, మళ్లీ కలుసుకోవడం మాత్రం ఇంతవరకూ పడలేదు.

మెల్లిగా లేచినిలబడి జెన్నీ కూర్చున్న టేబిల్ వైపు నడిచాను ... అప్పటికే అతను తినడం పూర్తిచేసి సాసర్లో పది రూపాయలనోటు పడేసి, జెన్నీ బుగ్గ మీద చిన్న ముద్దుపెట్టుకొని, బయటికి వెళ్లిపోతున్నాడు...జెన్నీ మాత్రం ఇంకా వయ్యారంగా సలాడ్ తింటూ కూర్చొని వుంది.

"హలో జెన్నీ!" అన్నాను ప్రక్కకు వెళ్లి.

తటాలున తలెత్తి చూసింది జెన్నీ... క్షణంపాటు ఆశ్చర్యం...ఏదో తెలియని చిత్రమైన భావం కనిపించాయి. ఆ ముఖంలో...ఆ భావంయొక్క స్పష్ట మైన అర్థం నాకు తట్టలేదు.

"హలో క్లిఫ్" – అన్నది జెన్నీ చిన్నగా...నవ్వుతూ...నా గుండెల్లో గంటలు మ్రోగడం ప్రారంభించాయి.

ఆ తర్వాత గంటలు క్షణాల్లా గడిచి పోయాయి...పాత జ్ఞాపకాలు, క్లిఫ్ రిచర్డ్ క్రొత్త రికార్డులు, నా ప్రస్తుత ఉద్యోగం, ప్రెసిడెన్సీలో స్పిరిట్ ఎలా తగ్గిపోయిందీ...కానీ, ఏదో తెలియని క్రొత్తదనం...గిల్టీనెస్ ..తప్పుచేస్తున్నా మనే భావన...మా మధ్య వున్నట్టు అని పించసాగింది నాకు. దానికి కారణం ఇదని వేలుపెట్టి చూపించలేను...కాని ఆ ఫీలింగ్ మనసులో ఏ మూలో తడు తోంది.

సంభాషణ చటుక్కున ఆపి నావైపు చిత్రంగా చూసింది. "ఆర్ యు...?" ఆమె ప్రశ్న మధ్యలోనే ఆపింది.

చిన్నగా నవ్వాను నేను – ఆ ప్రశ్నే మిటో నాకు తెలుసు – తలూపాను ఔ నన్నట్లు. – "ఒక బ్బాయి – పోయిన నెల్లోనే రెండో ఏడు వచ్చింది" – అన్నాను.

ఎందుకో జెన్నీ ముఖంమీద సన్నని నీడ కదలినట్లనిపించింది. "ఆర్ యు ...?" అన్నాను నేను ప్రశ్నార్థకంగా.

జెన్నీ ముఖంలో క్షణంపాటు తట పటాయింపు కనిపించింది...ఔనన్నట్లు తల వూపింది." నువ్వొచ్చేముందే వెళ్ళి పోయారు.. ఢిల్లీకి వెళ్ళే ప్లేన్ మిస్ అయిపోతుందేమోనని హడావిడిగా వెళ్ళి పోయారు. హి యీజ్ ది ప్రొడక్షన్ మేనేజర్ ఆఫ్ లూకాస్ అండ్ మార్టిన్" – అన్నది.

ఆ కంపెనీ పేరు ఎక్కడా విన్నట్లు గుర్తులేదు. – అదే అన్నాను – నవ్వింది ... "అవును ... క్రొత్తగా పెట్టారు కంపెనీ"...ఆయన డాడీయే దానిమానే జింగ్ డైరెక్టర్...మిస్టర్ హేమ్‌చంద్... అదే నా హస్‌బెండ్ కూడా స్టేట్స్ రిటర్న్డ్ కెమికల్ టెక్నాలజీ చేశారు, యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియాలో–"



ఆశ్చర్యంగా చూశాను — హేమ్ చంద్...అంటే అతను భారతీయుడు అయివుండాలి. నా ఆలోచనను కనిపెట్టి నట్లు చిన్నగా నవ్వింది జెస్సీ.

"ఐ నో...ఈ అయిదేళ్ళలో నేనూ చాలా మారాను ... అభిప్రాయాలు మారాయి...పరిస్థితులు మారాయి —ఒక ప్పటి నా ఆలోచనలు తలచుకొంటే సిగ్గు అనిపిస్తోంటుంది" — అన్నది. ఎందుకో ఆమె గొంతులో దిగులు కనిపించిందని పించింది.

నాకూ దిగులనిపించింది... ప్చ్ ..

* * *

ఆర్నెల్ల తర్వాత ఢిల్లీ వెళ్లాను బిజి నెస్ ట్రిప్ మీద...సాయంత్రం పూట కాసేపు ఖుషీ చేద్దామని ఐసెంత్ బార్లోకి నడిచాను...ఓపెనెయిర్ బార్ అది. గార్డెన్‌లో ఓ మూల కూర్చొని స్కాచ్ విస్కీ పీలుస్తూ కనిపించాడు హేమ్ చంద్...అదే...జెస్సీ భర్త.

నవ్వుతూ అతని ముందుకెళ్ళి నిల బడ్డాను. "హలో మిస్టర్ హేమ్‌చంద్" —అన్నాను అతను నా వైపు సాలోచ నగా చూశాడు. స్కాచ్ తను కాస్త ఎక్కువయినట్లు అతని ముఖం చూస్తేనే తెలుస్తోంది.

"సారీ ఫ్రెండ్! నా పేరు హేమ్ చంద్ కాదు''—అన్నాడతను నవ్వుతూ.

ఆశ్చర్యంగా చూశాను...విస్కీ-మత్తు బాగా తలకెక్కివుండాలి అతనికి. "ఐ యామ్ శర్మా...నేనూ జెన్నీ ప్రెసిడెన్సీలో కలిసి చదువుకొన్నాం" ...అన్నాను.

"సో!" అన్నాడతను.

అతని తలబిరుసుకు క్షణం కోపం వచ్చింది. నిగ్రహించుకొన్నాను. "ఈజ్ షి?''—అన్నాను.

"స్టిల్ సారీ ఫ్రెండ్! ఎవరిని గురించి నువ్వు మాట్లాడుతున్నావో అర్థం కావడంలేదు" - అన్నాడతను తల అడ్డంగా ఊపుతూ.

నిమిషంపాటు అతన్ని తేరిపార చూశాను...అతన్ని హేమ్‌చంద్ అని పొరబొడ్డానేమోనని... అతను హేమచందే ...సందేహం లేదు...కారు బాగా గుర్తు.

"నాలుగు నెల్లక్రితం నేను పాండిచ్చేరి వచ్చాను" - అన్నాను పెద్దగా... అప్పటికయినా అతనీ ప్రపంచంలో పడతాడేమోనని.

అతని ముఖంలో ఏదో ఆలోచన కదిలింది...కనుబొమలు ముడిపడ్డాయి.

"సో ఐ వసీ—" అన్నాడు. అంటూనే పెద్దగా నవ్వడం మొదలెట్టాడు.

"ఓ మై! హౌ ఫన్నీ - " అంటున్నాడు మధ్య మధ్యలో నవ్వాపుకొంటూ విరగబడి నవ్వుతూ......

రక్తం నా ముఖంలోనికి తన్నుకొచ్చింది. పిడికిళ్ళు బిగుసుకొన్నాయి.

"వాటీజ్ సో ఫన్నీ?" - అరిచాను కోపంగా

అతను చటుక్కున నవ్వు ఆపాడు. "సారీ ఫ్రెండ్! యు ఆర్ రైట్ - నాలుగునెల్ల క్రితం నేనూ పాండిచ్చేరి వచ్చాను ...అప్పుడు అక్కడున్న నా రోజులు నాకు కంపెనీ ఇచ్చిన అమ్మాయి పేరు జెన్నీయే...కాదనను...కాని షి యీజ్ నాట్ మై వైఫ్...షి యీజ్ ఎ లోకల్ కాల్ గర్ల్...అ నాల్రోజులకి నాలుగొందలు దోచేసింది. నా ప్రక్కనుండడం చూసి నా వైఫ్ అనుకొని వుంటావు" ...అంటున్నాడతను

నా తల గిర్రున తిరగడం ప్రారంభించింది. నమ్మలేనట్లు అతని ముఖంలోకి చూస్తూవుండిపోయాను. అతను ఆశ్చర్యంగా నా వైపు చూశాడు

"హే యు ఆర్ షాక్, ఆర్ సమ్‌థింగ్ —" అంటున్నాడు.

"ఫర్‌గెటిట్" - అన్నాను చకచక బయటికి నడుస్తూ.



# లాగ్వేపు

చెళ్ళూరి సీతారామేశ్వరరావు

ఎద్దులజత కొందామని పుల్లయ్యా, వెంకయ్యా పాలకొల్లు సంతకి వెళ్లారు. మూడుగంటలు బేరం సాగించినా నచ్చ లేదు. రెండు వేలకి మంచి జత లేంరావ డంలేదు, లోపులో వున్నవి వారికి నచ్చ లేదు. మరోసారి వద్దామని సంతలో కూరలు కొనుక్కుని బయలుదేరారు. బస్సు దొరకడం ఆలస్యమైంది. రేవులోకి వచ్చేసరికి చీకటిపడింది.

పడవవాళ్లు సమయం చూసి రెట్టింపు అడుగుతున్నారు. తాము చెప్పిన బేరానికి దిగడంలేదు. చీకటిలో రేవులో బాధ పడటమెందుకని చాలమంది ఎక్కువయి నా పడవలు చేసుకుని వెళ్లిపోతున్నారు.

అయిదురూపాయలు పొయ్యడం వెంకయ్యకిష్టంలేదు. "పెద్ద రేవుకి పోదాం."

పుల్లయ్య ఒప్పుకోలేదు. "చీకట్లోనా ... గోదారిఒడ్డున పురుగు, పుట్ర వుంటాయి... దారి కనిపించక నీళ్ళలో పడితే..."

ఇద్దరూ గట్టుమీద కూర్చున్నారు. రేవులో రెండే పడవలున్నాయి. చీకటి దట్టంగా వ్యాపిస్తోంది. చలిగాలి రేగుతోంది. దూరంగా లంకల్లో దీపాలు మిణుక్కుమంటున్నాయి. గోదావరి కెరటాలు శబ్దం చేస్తున్నాయి.

వెంకయ్య లోభత్వం పుల్లయ్య ఎరుగున్నదయినా విపరీతంగా కోపం వచ్చింది. వీడికోసం తన పని తగలేసుకుని రావడమే తప్పు.

"రెండ్రూపాయిలివ్వించండి...... నాకూ ఆ రేవులో పనున్నాది... ఎలిపోదాం..." ఓ పడవవాడు నీళ్ళలో నుంచి కేకేశాడు.

అంతకంటె తక్కువలో వెళ్ళడం అసంభవమని వెంకయ్య గుర్తించి పడవ ఎక్కాడు. పుల్లయ్య బ్రతుకుజీవుడా అనుకున్నాడు.

పడవ సాగిపోతోంది...

## 2

వెంకయ్య దాపలో కూర్చున్నాడు.

పుల్లయ్య బల్లమీద కూర్చున్నాడు. వెంకయ్య సంచీలోనుంచి పకోడీపొట్లాలు తీసి "రా. . " అన్నాడు. పుల్లయ్య కూడ చాపలోకి వచ్చాడు. సంతగురించి కబుర్లు చెప్పుకుంటూ పకోడీలు కాని చ్చారు.

వెంకయ్య నీళ్ళు పడుతున్నాయని ప్రక్కకి జరిగాడు. ఏదో మెత్తగా తగి లింది. గుండె ఝలుమంది.

"అగ్గిపుల్ల వెయ్యి పుల్లయ్యా ... పామేమో!"

పుల్లయ్య గీశాడు. చిన్న వెలుగులో నల్లటి ప్లాస్టిక్ సంచి. పడవవాడిదేమో ననుకొని, చేత్తో రాశాడు వెంకయ్య. గరకుగావుంది. తీసిచూశాడు.

"డబ్బురా" పుల్లయ్య అన్నాడు.

"ష్...పడవవాడు వింటాడు."

"ఎవరో మరచిపోయారు. మన అదృష్టం బాగుంది."

పుల్లయ్యని పిలవడంవల్ల తప్పుజరి గిందని బాధపడ్డాడు. తను కేకవెయ్య కుండా వుంటే డబ్బంతా తనదే అయ్యేది.

పుల్లయ్యకి వాటా యివ్వకుండా వుండానికి పథకం వేశాడు.

రేవులోదిగాక సంచిని కూరల్లో దాచేసి కబుర్లు చెప్పుకుంటూ రోడ్డుమీదకి వచ్చారు. "సైకిల్ తెస్తాను ఆగు ..." వెంకయ్య చీకట్లోకి వెళ్ళాడు.

3

మస్తాన్‌ని లేపాడు చెప్పవల్సినదంతా చెప్పి "నీకు వంద యిస్తాను." అని ఆశ పెట్టాడు వెంకయ్య. మస్తాన్ అంగీక రించాడు.

పుల్లయ్య, వెంకయ్య సైకిల్ ఎక్కు తుండగా మస్తాన్ వచ్చి "ముసలయ్యా పడవలో మీరేటగావస్త... సంచీ మరచి పోయాను చూశారా? అందులో ఎర్రకవరు కూడా వుంది!" అన్నాడు ఆందోళనగా.

వెంకయ్య రహస్యంగా నవ్వు కున్నాడు "ఇచ్చెయ్ పుల్లయ్యా ... యేదీమయినా రేపు విచారించి యిచ్చేద్దా మనుకున్నాంకదా!"

పుల్లయ్య అయిష్టంగా సంచీ తీసుకుని చూశాడు. లోపల ఎర్రకవరు వుంది. అది మస్తాన్‌దేనని యిచ్చేశాడు. మస్తాన్ వెళ్ళిపోయాడు.

"అదృష్టం జారిపోయింది వెంక య్యా! అమ్మాయి పెళ్ళి అయిపోను."

"పొలం అప్పు తీరిపోతుందను కోలేదూ నేను."

ఇంటికి రాగానే వెంకయ్య సైకిల్ తీసుకుని మస్తాన్ దగ్గరకి వెళ్లాడు. మస్తాన్ వందతీసి యిచ్చాడు.

వెంకయ్య మండి పడ్డాడు.

"తగ్గవయ్యా . . ఇది నీ కష్టార్జి తమా ? పుల్లయ్యకి నువ్వు టోపీవేశావు. నేను నీకు వేశాను. గొడవచేస్తే నీకే నష్టం. పడవలో వచ్చింది నువ్వు. అను మానమొస్తే నీ మీద వస్తుంది. కాని నాకేంబాధు."

వెంకయ్య బిక్కముఖం వేశాడు. ఎతు చిత యింది.

# ఓ అమ్మాయి తెలుసుకో!

అరిగె రామారావు




శైలజ సాయంత్రం కాలేజీనుండి యింటికి వచ్చేసరికి ఆమె తల్లి హాలులో కూర్చుని ఎవరో అమ్మలక్కలతో బాతాఖానీ కొట్టుతోంది. ఒకామె విప్పుళ్ళజెస్త్రాలాగా వుంది; మరొకామె గడకర్రకు పట్టుచీర కట్టబెట్టినట్లుగా వుంది. వీళ్ళను తనంతకు ముందెప్పుడూ చూడలేదు.

పుస్తకాలు పట్టుకుని లోపలికి వస్తోన్న తనను చూచి, "ఈ అమ్మాయి ఎవరండీ అనసూయమ్మగారూ ?" అని విప్పుళ్ళజెస్త్రా అడిగింది.

"మా అమ్మాయేనండీ ! కాలేజీలో బియ్యే చదువుతూంది." అంది. "శైలూ !" అని తనని పిలిచింది, తనని వాళ్ళకు పరిచయంజేయటానికి.

తనప్పటికే గదిలోపలి కెళ్ళిపోయింది– తల్లి పిలుపు వినిపించనట్లే !

పుస్తకాలు టేబిల్‌మీద పడేసి తలుపు

వారగా నిలబడింది, దానికి వాళ్ళే మంటారో విందామని.

వాళ్ళు ఏమంటారో తనకు తెలుసు— "మీకింత పెద్దమ్మాయి వుందండీ?" అని.

ఇదే మాటను విని విని విసిగిపోయి వుంది తను.

తను అనుకున్నట్టే పిప్పళ్ళబస్తా మూతిమీద చెయ్యివేసుకుని మరీ అడిగింది ఆశ్చర్యంగా.

"అయ్యో రామా, అలా ఆశ్చర్యపోతారేమిటండీ? అమ్మాయికంటే పెద్దవాడున్నాడు. కాకినాడలో బి. ఇ. ఫైనలియర్ చదువుతున్నాడు." —ఈ మాట తల్లి మామూలుగా చెప్పినా, ఏదో గర్వంగా చెప్పినట్లనిపించింది తనకు.

"ఏఁవిటీ, మీకు ఇంజనీరింగు చదువుతున్న అబ్బాయి కూడా వున్నాడా?" — ఈసారి గడకర్ర ఆశ్చర్యపోయింది.

"క్షమించండి అనసూయమ్మగారూ! వీళ్ళు మీ సొంత పిల్లలేనా? అంటే మీది రెండో సమ్మంధం పెళ్ళా...నాకు తెలియక అడుగుతున్నా, మరేం అనుకోకండి!" అంది పిప్పళ్ళబస్తా.

దానికి అనసూయమ్మ పకపకా నవ్వింది.

ఆ నవ్వులో కూడ తనకు తల్లి గర్వమే ప్రతిధ్వనించింది; వళ్ళు మండిపోయింది.

"తెలియనివాళ్ళు అందరూ అలాగే అనుకుంటారండీ! నా పిల్లలే..." అంది అలా నవ్వుతూనే.

"మిమ్మల్ని చూస్తే ఎవరూ అలా అనుకోరు సుమండీ!"

"ఏమనుకుంటారేఁవిటీ?" ఈసారి నిజంగా కాస్త గర్వంతోనే అడిగింది.

"క్రొత్తగా పెళ్ళయి కాపురాని కొచ్చిన క్రొత్త కోడలేమో అనుకుంటారు. ఇంత పెద్ద పిల్లలున్నారంటే ఎవ్వరూ నమ్మరు!" పాపం పిప్పళ్ళబస్తా సిన్సియర్‌గానే అంది.

నిజానికి కూడ అనసూయమ్మ అలాగే కనిపిస్తుంది. నాల్గుపదులు దాటబోతున్నా ఇంకా పల్చగా, లేతగా, రెబ్బపాయిలాగా నాజూగ్గా కనిపిస్తుంది.

"మీ అమ్మాయికి మీ పోలిక వచ్చినట్టు లేదు. మీ అమ్మాయి అంటే ఎవ్వరూ నమ్మరు. పుస్తకాలు తీసికొని లోపలికి వస్తోంటే మీ బంధువులమ్మాయేమో అనుకున్నానండీ!"

"మా అమ్మాయికి వాళ్ళ నాన్నగారి పోలిక వచ్చింది. అబ్బాయిది నా పోలిక—"

ఇక తనక్కడ నిలబడలేకపోయింది. టవల్ భుజానేసుకుని విసురుగా బాత్‌రూంకేసి వెళ్ళిపోయింది.

ఖాళీ ప్లాస్టిక్ బకెట్‌లోకి పంపులోంచి నీళ్ళు పడుతుంటే వచ్చే వింత శబ్దాన్ని వింటూ బొమ్మలాగా నిలబడి




పోయింది శైలజ. బొమ్మ మనస్సులో ఏవో దృశ్యాలు బొమ్మలు కట్టు తోన్నాయి; నీళ్ళ శబ్దంలోంచి అప్పు డప్పుడు విన్న ఏవేవో మాటలు "రింగ్" అవుతున్నాయి.

"ఆడవాళ్ళంతా మన అనసూయ మ్మను చూచి నేర్చుకోవాలి : చీర మాయనీయదు; జుట్టు చెరగనీయదు. అవునే పిల్లా, వున్నంతలో శుభ్రంగా, పొందికగా వుండాలి :"—ఒక పేరం టంలో ఒక నిండుముత్తయిదు యిచ్చిన కాంప్లిమెంట్ : అంతే అనసూయమ్మ ఎబ్బెట్టుగా అలంకరించుకుంటుందని కాదు. "చక్కనమ్మ" మామూలుగా వున్నా అలంకరించుకున్నట్లే కనిపిస్తుంది.

"అనసూయమ్మా : ఏమిటే ఎప్పుడు చూచినా నీవు శోభనపు పెళ్ళికూతురు లాగా వుంటావు; నీ కూతురు చూడ బోతే ముసలిదానిలాగా వుంటుంది—" —ఒక దగ్గరి చుట్టం ఒకప్పుడన్న మాట : (అవును, వుంటాను — ముస లమ్మలాగే వుంటాను : మధ్యలో వీళ్ళ కేంటి బాధ : నా బదులూ తన బదులూ తనే తగుదునమ్మా అని పెళ్ళికూతురు లాగా ముస్తాబయి కూర్చుంటుందిగా : ఇంక తనెలా వుంటేనేం :)

"మీ పిల్లలెవరూ కనిపించరేమండీ : ఆడుకుంటాని కెళ్ళారా : ఈ అమ్మాయి ఎవరు : మీ ఆడబిడ్డా :" —ఈ వీధి లోకి క్రొత్తగా అద్దెకొచ్చిన తాసీల్దారు గారి భార్యామణి పేరంటానికి పిలవ టాని కొచ్చి బొట్టుపెట్టుతూ అన్నమాట ఇది : (అవును, నేను ఈ అందాల

బొమ్మగారి ఆడబిడ్డను ! ఆసలు మాట్లాడితే ఈవిడగారి అత్తగార్ని ! మీకేంటి ! ... అందుకేగా ఈ బిడతో కలిసి ఈ పేరంటాళ్లకూ పెళ్ళిళ్ళకూ వెళ్ళటం మానుకున్నది !)

...బకెట్ నిండిపోయి నీళ్ళు పొర్లి పోతున్నాయి. బొమ్మలోకి జీవం వచ్చింది; ఈ లోకంలోకి వచ్చింది. గాఢంగా నిట్టూర్చి స్నానానికి వుపక్రమించింది.

స్నానం పూర్తిచేసుకుని లోపలకి వచ్చేసరికి పిప్పళ్ళబస్తా, గడకర్రా వెళ్ళిపోయాయి.

తను ఏదో ఆలోచిస్తూ, అనాసక్తిగా, మనస్సెక్కడో పెట్టుకుని జడల్లుకుంటుండగా తల్లి వచ్చింది.

"ఏఁవిటా జడల్లుకోవటం శైలూ ! చక్కగా నేనేస్తా ఇలా రా ! కాలేజీలో బి.ఏ. చదువుకుంటున్న పిల్ల వుండే తీరు ఇదేనా ? యింటికి వాళ్లూ వీళ్లూ వస్తుంటారు కదా, కాస్త నీట్‌గా వుండక పోతే ఎట్లాగే తల్లీ ? ఎంతసేపూ నీ చదువు ధ్యాసేనా ?" అంది.

"ఏం, నీ కూతురునని చెప్పుకోవటానికి నీకు తలవంపులుగా వుందా ?" ఉక్రోషంగా, దురుసుగా అని విసురుగా తన స్టడీ రూంలోకి వెళ్ళిపోయింది.

పావం, అనసూయమ్మ విస్తుపోయి చూస్తూండి పోయింది. ఈ పిల్లేంటో, ఈ పద్ధతి ఏంటో అర్థంకాకుండా వుందని దీర్ఘంగా నిట్టూర్చింది

—క్లాసు పుస్తకం తీసిందన్నమాటేగాని మనస్సు దానిమీదకు పోవటం లేదు. అమ్మమీద కసి. తనమీద తనకు కసి. అందరిమీదా కసి ... ఇదేంటి, తన కళ్ళు వూరికే చెమ్మగిల్లుతూన్నాయి; ఎందుకో గుండెలు బరువెక్కుతోన్నాయి. కరువుదీరా ఏడిస్తేగాని ఈ బరువు తగ్గేటట్లు లేదు !

మనస్సు ఇలా బరువెక్కినప్పుడు ఆ వీధిలో వున్న ఆంజనేయస్వామి కోవిల కెళ్ళి కాసేపు కూర్చుంటే తేలికవుతుంది.

పుస్తకం ప్రక్కన పడేసి లేచింది.

తల్లికి చెప్పుదామని వంటింటి గుమ్మందాకా వెళ్ళింది. మళ్ళీ మనస్కరించలేదు. వెనక్కి వచ్చేసింది.

గుళ్లో వున్న ఆ కాసేపు ఏదో శాంతి; గుండెలు సేదతీరినట్లుగా వుంటుంది.

ఇవ్వాళ తను ఈ కాసేపు శాంతికి కూడ నోచుకున్నట్లు లేదు. గుళ్లో గుమ్మడికాయంత బంగారంతో చేయించుకున్న నగలు దిగేసుకున్న ఒక కోమటామె కనిపించింది. ఆమె అప్పుడప్పుడు గుళ్లో తననీ, తల్లినీ చూస్తుంటుంది.

ఏదో పని వున్నదానిలాగా పలక

రించి, "మీ అక్కయ్య రాలేదే?" అని అడిగింది.

"ఆమె మా అక్కయ్య కాదు, మా చెల్లెలు!" అని పెడసరంగా అంది తను. ఆమె నోరెళ్లపెట్టుకుని చూస్తూండి పోయింది.

మరోక్షణం కూడ అక్కడ కూర్చో లేకపోయింది. లేచింది

దారిలో అరుణా వాళ్ళింటి ముందు కొచ్చేసరికి అప్రయత్నంగా తన కాళ్ళు ఆగిపోయాయి. అరుణ వారం పది రోజుల్నుంచి కాలేజీకి రావటం లేదు. 'జ్వరమండి' అని వాళ్ళ చెల్లెలు కరుణ చెప్పింది; ఒకసారి వచ్చి చూచి వెళ్ళ మని కబురు పంపింది. అరుణ తనకు ఆప్తమిత్రురాలు. స్కూలు నుంచి కలసి చదువుకున్నారు. అలాంటి అరుణతో రెండు నెలలుగా తాను మాట్లాడటం లేదు. ఆ రోజు అరుణ మామూలుగా ఏదో నోట్స్‌కోసం వచ్చింది. అప్పుడు అనసూయమ్మ ఏదో పెళ్ళికెళ్ళటానికి ముస్తాబవుతూంది.

"మీ అమ్మ ఇంత స్లిమ్‌గా వుంటుంది. యోగాసనాలుగానీ వేస్తుందా ఏమిటే శైలూ!" అని అడిగింది.

తనకు వళ్ళు మండుకొచ్చింది. "ఏం, నీకూ్కడా నేర్పుతుంది. నేర్చు కుంటావా?" అని వ్యంగ్యంగా అంది. అరుణ నవ్వి, "కాదే, మన చిన్నప్ప ట్నుంచీ చూస్తోన్నానుగా, మీ అమ్మ గారు అప్పటికీ ఇప్పటికీ చెక్కు చెదర కుండా ఇలాగే స్లిమ్‌గా వున్నారు. మా చిన్నక్కయ్యకు నిరుడేగా పెళ్ళయింది. ఒక్క ఇప్పుడికే డొక్కయిపోయింది. చూస్తావికి నాకే రోతగా వుంది—" ఆ కాంప్లిమెంట్‌కు తనేదో మురిసిపోతా ననుకుంది. కాని, తన మనోవైచిత్రి దానికేం తెల్సు? అంతే, మర్నాట్నుంచి అరుణతో మాట్లాడటం మానేస్తేగాని తన మనస్సు వూరడిల్లలేదు.

లోపలి కెళ్ళి జ్వరంతో మంచ మెక్కిన స్నేహితురాలిని పలకరించ టానికి మనస్సు మొరాయించింది. గిరుక్కున వెనక్కి తిరిగి వచ్చింది.

ఆ రాత్రి భోజనాల దగ్గర తనూ అమ్మా ముభావంగా వుండటం గమ నించి నాన్నగారు నవ్వుతూ, "అమ్మా కూతుళ్ళు పోట్లాడుకున్నారా?" అని అన్నారు.

"అమ్మా కూతుళ్ళు" కాదు సార్, "వదినా ఆడబిడ్డలూ" లేక "కోడలూ అత్తా" అనండి! మీ ముద్దులభార్య సంబరపడిపోతుంది అని అందామను కుంది. కాని, అన్నం కంచంలో గీతలు గీస్తూ కూర్చుండిపోయింది...

మర్నాడు నిద్రపక్క మీదనుంచి లేవటమే నేరుగా వంటింట్లోకెళ్ళి తల్లితో మెల్లగా మాటలు కలిపింది.

కాని, తన కర్మానికి ఒక్క గంట లోనే అనుకోకుండా సుబ్బులు పిన్ని

వాళ్లు తిరపతి నుండి తిరిగి వెళ్ళతూ ఇక్కడ దిగేరు. పిన్ని అంటే – తన తల్లికి రెండోదీ – కడగొట్టుదీ అయిన సొంత చెల్లెలు. అవటానికి అమ్మకంటే పదేళ్ళు చిన్నదయినా, ఇద్దరు పిల్లలకే లావెక్కిపోయి, రాను రాను చూట్టానికి అసహ్యంగా వుంది. తనకు అమ్మమ్మ అవుతుందంటే ఎవరన్నా యిట్టే నమ్మే స్తారు ... పైగా ఆమెకు బోలెడు బడాయి. హైదరాబాదులో వుంటున్నా విడకదా, ఆ అవతారానికి తోడు బోలెడు ఫ్యాషన్స్ !

వున్న నాలుగురోజులూ సుబ్బులు పిన్నికి తన తల్లిని వుబ్బేయటంతోనే సరిపోయింది. "అక్కయ్యా, నీలాగా వుండాలంటే ఏం చెయ్యాలో చెప్పవే !" అని. "ఏఁవే అమ్మడూ, అమ్మ ఏం చేస్తుందే ఇలా నాజూగ్గా వుండటానికి ?" మళ్ళీ తనని అడుగుతుంది. తనకేమో వంటికి ఆవకాయకారం రాసుకున్న ట్లుంటుంది. వళ్ళు చిత్రిక పట్టించు కోమని అందామని నోటిదాక వచ్చేది. "అందరూ ఆమెను మెచ్చుకునే వాళ్లే!" అనుకుని విసురుగా అక్కణ్ణుంచి గది లోకి వెళ్ళిపోయేది.

ఈ బాబాయి ఒకడూ — వెధవ గుండూ, మెల్లకన్నూ ! అటు వచ్చీ ఇటు వచ్చీ గుటకలు మ్రింగుతూ అమ్మ వంక దొంగచూపులు చూస్తాడు. తనకు వీళ్లున్న ఆ నాలుగురోజులూ యింటో వుండాలంటేనే ప్రాణంమీదకు వచ్చేది; ఎప్పుడు వెళ్ళిపోతారా అని అనిపించేది.

వున్న నాలుగురోజులూ తన తల్లిని వుబ్బేసి వుబ్బేసి, మూడొందలు పట్టు చీర పెట్టించుకుని పోయింది. రిక్షాలు కదలగానే "అమ్మయ్య !" అనుకుంది తాను.

కాని, పిన్నిరాక తన గుండెల్లో కనిపించని గాయాలను మరీ ఎక్కువ చేశాయని ఆ తర్వాతగానీ తెలుసుకోలేక పోయింది.

సుబ్బులు పిన్ని వెళ్లుతూ వెళ్లుతూ తనకు పట్టని క్రొత్త పట్టు జాకెట్స్ తన తల్లి కిచ్చిపోయింది. అవి హైదరా బాదులో కుట్టిన ఫ్యాషన్‌బుల్ జాకెట్స్ — పైకిపోయిన చేతులూ, క్రిందకు దిగిన మెడా, షేపులూనూ !

చెల్లెలు వెళ్ళిన తర్వాత వచ్చిన ఒక శుక్రవారం సాయంత్రం అనసూయమ్మ స్నానమదీ చేసి తీరిగ్గా కూర్చుని ఆ జాకెట్స్‌లో నీలపు రంగుది ఎలా వుంటుందో చూద్దామని వేసుకుంది. సవరంపెట్టి బన్మాముడేసుకుంది. దొడ్లో కాసిన గులాబీ పువ్వును ప్రక్కగా పెట్టుకుని అద్దంలో చూచుకుంది. జాకెట్ చేతులు మరీ కురచగా వున్నట్లని పించాయి. జబ్బలమీద క్రింద నల్లి అరా, పైన పచ్చటి అరా – గమ్మత్తుగా వుంది. మెడ ఎలా వుందోనని








ముందుకూ వెనక్కీ తిరుగుతూ నిలువుటద్దంలో చూచుకుంటోంది.

తన గదిలో టేబిల్ ముందు కూర్చుని చదువుకుంటూ ఇదంతా ఓరకంట గమనిస్తోంది శైలజ. మనస్సులోనే తల్లి అందాన్ని ఒక్కక్షణమో, అరక్షణమో మెచ్చుకుందో లేదో. మళ్ళీ అంతలోనే, "ఛీ, సిగ్గులేకపోతే సరి! ఆవిడగారు యిచ్చింది ఇంతేచాలని ఆ బొమ్మ రెవిక వేసుకుని కులుకుతోంది!" అనుకుంది. అలా అనుకుంటేగాని మనస్సుకు సుఖంగా లేదు మరి!

సరిగ్గా అప్పుడే, "మరీ ఎబ్బెట్టుగా వుందేమో!" విప్పేద్దామనుకుంటోంది అనసూయమ్మ.

సరిగ్గా అప్పుడే ఆమె భర్త శ్రీహరిరావు ఆఫీసునుండి వచ్చాడు. గుమ్మంలో నిలబడిపోయి, అద్దంముందు నిలబడి, క్రొత్తగా, మళ్ళీ మెరుగుపెట్టిన బంగారు బొమ్మలాగా వున్న భార్యను చూచి మురిసిపోయాడు.

"ఏంటోయ్, ఇవ్వాళ భలే గమ్మత్తుగా వున్నావు!", "అబ్బ, భలే తమాషాగా వున్నావోయ్!" అంటూ ముందుకు వచ్చాడు. సందెట్లోకి విసురుగా లాక్కొని, చేతులు బిగించి, వెనక్కి మళ్ళించుకుని పచ్చటి మెడకేసి తన మొగాన్ని రుద్దుకుంటూ, "అబ్బ! కొబ్బరిముక్కలాగా వుందోయ్! కోవా బిళ్లలాగా వుందోయ్! కొరుక్కొని తినేయాలనిపిస్తోందోయ్!" అని అంటున్నాడు.

"ఛీ, ఏంటది! వదలండీ — అమ్మాయి యింట్లోనే వుంది!" అని అంటూ వదిలించుకోవటానికి అనసూయమ్మ గింజుకుంటోంది.

ఇదంతా గదిలోంచి శైలజ వింటూనే వుంది; వోరకంట చూస్తోనే వుంది.

అనసూయమ్మ జాకెట్ విప్పేయ

టానికి మరో గదిలోకి వెళ్లబోతుంటే శ్రీహరిరావు వారించాడు.

"అమ్మాయికి చూపిద్దాం రా, ఏమంటుందో!" అని చెయ్యిపట్టుకుని తన గదిలోకి లాక్కొచ్చాడు.

"చూడమ్మాయి, ఈ జాకెట్ మీ అమ్మకు బాగా లేదూ!" అని అడిగేడు.

తనేం అంటుంది? ఏడుపులాంటి నవ్వు ఒకటి నవ్వింది.

"మీ యిద్దరూ వెళ్లి ఆ కృష్ణలో దూకండి!" అని మనస్సులోనే కసిగా అనుకుంది.

మర్నాడు మరో విశేషం తన కంట పడింది!

తల్లి రోజా రంగు వుల్‌వాయిల్ జాకెట్ తొడిగింది. అది విశేషం కాదు. ఎప్పుడూ వేసేదే. కాని, విశేషమేమిటంటే — దాని క్రిందనుంచి పచ్చటి వీపును గట్టిగా, బిగుతుగా చుట్టుకుని వున్న బ్రాసరీ కనిపించటం. అయితే ఈవిడగారు బ్రాసరీలు కూడ వేస్తోందన్నమాట! ఇవి కూడ విన్నే యిచ్చిపోయిందో, లేక తమ అందాల భార్య కోసం నాన్నగారే మోజుపడి తీసి కొచ్చారో?

ఆ రోజే శైలజ ఆ వీధిలో వుంటున్న మిషన్ కుట్టే జానికమ్మ దగ్గర కెళ్ళి — "కాలేజీలో బియ్యే చదువుకుంటున్న దానివి, ఈ పాతకాలపు బాడీలు నీ కెందుకమ్మా?" అని ఆమె అంటున్నా వినకుండా ఆ "పాతకాలపు" బాడీలే కుట్టించుకుంది. తల్లి రౌండ్ నెక్ జాకెట్ తొడిగితే బాగుందని మెచ్చుకుని తండ్రి తెగ మురిసిపోయాడు కాబట్టి, తను కావాలని పూర్వకాలపు ముసలమ్మల "కంతెమెడ" రెవికలు కుట్టించుకుంది. అంతకుముందు తనకున్న బ్రాసరీలూ, రౌండ్ నెక్ జాకెట్లూ పాత గుడ్డల మూటలో కట్టి అవతల పడేసింది. ఈ పాతకాలపు "బాడీలూ", "కంతెమెడ" రెవికలూ చూచి, "కాలేజీలో చదువుకుంటున్నదానికి ఈ ముసలమ్మ వేషాలేంటే శైలూ! వున్నకొద్దీ మతిపోతున్నట్లుందే!" అని తల్లి విసుక్కునేది

"అవును, నేను ముసలమ్మనే! నీవున్నావుగా వడుచమ్మవు. నా యిష్టము వచ్చినట్లు వుంటా! మధ్యలో నీకేంటి బాధ?" పెడసరంగా అని విసురుగా తన గదిలోకి వెళ్ళిపోయి చాటుగా కన్నీళ్ళు తుడుచుకునేది.

అప్పట్నుంచి పెద్ద పమిట తీసుకుని భుజాల చుట్టూ కప్పుకుని, గూడలు బిగపట్టుకుని నడవటం అలవాటు చేసుకుంది. స్నోలూ, పౌడర్లూ, కాటుకా వాడటం మానేసింది. పూలకు అమడ దూరంలో వుంటుంది. అంతకుముందు చేతులకు వున్న బంగారుగాజులు తీసేసింది; మెళ్ళో గొలుసు తీసేసింది.



"ఇంకేషాపులో దొరుకుతుందో చెప్పగలరా? ఎల్లుండే మా ఆవిడ పుట్టినరోజు...మా పెళ్ళయిన తర్వాత వచ్చిన మొదటి పుట్టినరోజు అందులో."

"ఎక్కడా దొరకవనుకుంటాను. మార్కెట్‌లో లేవు. అయినా ప్రక్క షాప్‌లో అడిగిచూడండి. అక్కడ లేక పోతే మళ్ళీ రండి."

పరమహంసలో కొత్త ఆశ పుట్టింది.

"అలాగేసార్" అని బయటకివెళ్ళి, అయిదునిముషాలు కాకుండానే తిరిగి వచ్చాడు.

"దొరకలేదా?" అడిగాడు సేఠ్.

తల అడ్డంగా వూపాడు పరమహంస.

"ఓ వందరూపాయల సరకు కొనండి ఏదైనా. ఆ చీరకూడా తీసుకుందురు గాని."

"వందరూపాయల సరకే? నా దగ్గిర అంత డబ్బు లేదు" వెంటనే జవాబు చెప్పాడు పరమహంస.

ఆలోచనగా చూసి చెప్పాడు సేఠ్ కానేపాగి.

"అలా కాకపోతే, ఆ చీర ఖరీదుమీద పదిరూపాయలు ఎక్కువ ఇవ్వాల్సి వస్తుంది మీరు."

పదిరూపాయలు! పదిరూపాయలు ఎక్కువే కాని పెళ్ళయిన తర్వాత వచ్చే భార్య మొదటి పుట్టినరోజు జీవితంలో ఒక్కసారే వచ్చేది.

"అలాగే" అన్నాడు పరమహంస నిట్టూర్చి.

సేఠ్ కాలింగ్‌బెల్ నొక్కి ప్యూన్‌ని పిలిచి, ఏదో చెప్పి పంపాడు సింధీలో.

"క్యాషియర్‌కి డబ్బు చెల్లించి తీసు కోండి." చెప్పాడు సేఠ్ పరమహంసతో.

థాంక్స్ చెప్పి బయటకి వెళ్ళాడు పరమహంస. వెళ్తున్న పరమహంస వంక చూసి చిన్నగా నవ్వుకున్నాడు సేఠ్. తన భార్య మొదటి పుట్టినరోజుకి తన భార్యకి ఏం బహుమతి ఇచ్చాడు తను? గుర్తురాలేదు ఆయనకి. అంత గుర్తించుకోదగ్గ రోజుగా జరగలేదు ఆ రోజు. మళ్ళీ బిల్స్‌ని కేష్‌బుక్‌లో వ్రాసేపనిలో మునిగిపోయాడాయన

అయిదునిముషాలలో ఆ చీరని పేక్ చేసి, పాకెట్‌ని పరమహంసకి అందిం చారు షాపువాళ్ళు. దాంతో గర్వంగా బయటకి నడిచాడు పరమహంస. బయట డిస్‌ప్లేవిండో ముందు నిలబడి చూశాడు ఆ బొమ్మవంక. ఇంకేదో చీర కట్టివుంది ఆ బొమ్మకి. చీర పూర్తిగా విప్పేస్తే ఎలా వుంటుందా బొమ్మ నగ్నంగా? తన ఆలోచనకి తనకే నవ్వువచ్చింది పరమహంసకి.

దారిలో ఒరకిలో సోంపట్టి, పూలు, పళ్ళు కొని నడకవేగం పెంచాడు.

ఇంటిసందు మొదట్లోనే కనబడ్డాడు ప్రక్కింటాయన. పరమహంస చేతిలో చీరల పాకెట్‌ని చూసి అడిగాడు.

"బట్టలు కొన్నట్టున్నారే?"

"అవును. నా భార్య పుట్టినరోజు ఎల్లుండి."

గర్వంగా నడిచాడు ఇంటివైపు. గుమ్మంముందు ఆగి తలుపు తట్టాడు చిన్నగా. తలుపు తెరుస్తున్న అలికిడి వినబడగానే, చేతులు వెనక్కి దాచే సాడు, పేకెట్ కనబడకుండా.

"నీకేం తెచ్చానో చెప్పుకో" అడి గాడు భార్య కనబడగానే.

"ఏం తెచ్చారు?"

"అదే చెప్పుకో."

"సోంపట్టి."

"ప్రతీ నెలా తెచ్చేదేగా జీతంరోజు. ఇంకా?"

"మల్లెలు."

"ఇంకా?"

"ముందర లోపలికిరండి."

ఈజీ చెయిర్‌లో కూర్చుని, భార్య వంటగదిలోకి వెళ్ళగానే, మల్లెపూల పొట్లం, సోంపట్టి పొట్లం విప్పి టేబిల్




మీద పెట్టాను. చీరపాకెట్ విప్పకుండా ప్రక్కనే పెట్టి, పైన చేతిరుమాల కప్పాడు కనబడకుండా.

"కాఫీకాదు ఇవాళ, పాయసం."

తలెత్తిచూసాడు. పాయసం కప్పు అందిస్తున్న భార్యవంక. కప్పు అందుకుంటూన్న పరమహంస చేతులు వణికాయి

"ఎలావుందండి? బావులేదా నాకు? మధ్యాహ్నం కొన్నాను మిమ్మల్ని సర్‌ప్రయిజ్ చేద్దామని. మా చిన్నాన్న వెళుతూ మొన్న నాకు ఇచ్చిన రెండు వందల సంగతి మీకు చెప్పలేదు అందుకనే. వద్దంటున్నా వినకుండా ఇచ్చాడా డబ్బు పుట్టినరోజుకి చీర కొనుక్కో-మని...లాస్ట్ బట్ వన్ పీస్‌ట. అదృష్టం కదూ?"

బిత్తరపోతూ చూసాడు పరమహంస— కొద్దిగా బాధ గోచరించింది ఆమెకి భర్త కళ్ళలో.

"కౌంటర్‌లోవున్న చీర కొంగుదగ్గర బాగా చిరిగితే, ఆ బొమ్మకు కట్టిన చీర విప్పించి తీసుకున్నాను ఆ చిరిగినచీర బొమ్మకి కట్టారు"

పరమహంస ఎందుకంతగా కొయ్యబారిపోయాడో అర్థంకాలేదు అతని

ఇప్పుడు ఒంటిమీద తెల్లరంగు చీర బదులు, గులాబిరంగు షిఫాన్ చీర వుంది పరమహంస భార్య వంటిమీద!!!

# ఆశ

బి. సరోజినీదేవి.
"పవన్"



ఆశ మంచిదే. మనిషిని జీవింప చేస్తుంది. ప్రతీ మనిషికి కొద్దో గొప్పో వుండవలసిందే. కానీ మితిమీరితే దానంత చెడ్డది మరొకటి లేదు. మనిషిని ఎంతగానో దిగజార్చి, పతనం చేసేస్తుంది. ఇప్పుడు బంగారమ్మ పరిస్థితి అలాగే అయింది. కడుపులో చల్ల కదలకుండా వుండే బంగారమ్మ కాళ్ళకు బలపాలు కట్టుకుని, కోర్టుల చుట్టూ తిరగవలసి వస్తోంది.

బంగారమ్మది ఏ కులమో, తల్లి తండ్రులు ఎవరో ఆ ఊళ్ళో ఎవరికీ తెలియదు. బ్రాకెట్లు ఆడే బంగార్రాజు, బస్తీనుండి తీసుకువచ్చి, ఒక మంచి రోజున బంగారి మెళ్ళో పసుపుకొమ్ము కట్టి, భర్త ననిపించుకుని, బడ్డీకొట్టు పెట్టించేడు. బంగారు పిచ్చుకలాంటి బంగారి బడ్డీకొట్లో కూర్చుని, చిరునవ్వులు చిందిస్తూవుంటే, నూకాలు కొట్లో కెళ్ళే జనం బంగారి బడ్డీకొట్లోకి ఎగబడటం మొదలుపెట్టేరు. నూకాలు మెటికలు విరిచింది. కొద్దిరోజులకి కిళ్ళీ, చుట్ట, బీడీ సిగరెట్‌లతోపాటు, చిన్న పిల్లలకు పనికొచ్చే కొబ్బరి వుండలు,

తీక్కులాంటివి అందంగా సీసాల్లోపోసి పెట్టింది. దాంతో బడిపిల్లలు కూడా పళ్ళాల్లో పోసి, ఈగలు వాల్తూవుండే నూకాలు కొట్లో కొనుక్కోవటం మానేసి, బంగారి కొట్టుచుట్టూ బిలబిల్లా డుతూ మూగటం మొదలుపెట్టేరు. నూకాలు ఆ కాంపిటీషన్‌కు తట్టుకోలేక తన కొట్టుని మరొక సెంటర్‌కు మార్చేసుకుంది. దాంతో ఆ చుట్టు ప్రక్కలంతటికి ఏకఛత్రాధిపత్యము వహించింది, బంగారి. బంగారి బడ్డీకొట్టు చూస్తూ వుండగానే, కిళ్ళీకొట్టు కాస్తా కిరాణా కొట్టుగా మార్చేసి, బంగారి కాస్తా బంగారమ్మ అయి కూర్చుంది.

బంగారమ్మ కొట్లో అన్ని సరుకులూ దొరికేవి. అరువులు కూడా ఇచ్చేది. రోజుకి రూపాయకి పదిపైసలు వడ్డీకట్టి పుచ్చుకునేది. పదిపైసలు పోతే పోయేయి. ఆ రోజు పబ్బం గడిచిందే చాలని అవసరానికి చాలామంది అరు వులు పట్టికెళ్తూ వుండేవారు. మల్లు పంచ, నేత చొక్కా తొడుక్కుని, బ్రాకెట్లాడే బంగార్రాజు బ్రాకెట్లు మానేసి, సిల్కు లాల్చీ, గ్లాస్కో పంచ కట్టుకుని, పూలరంగడులా తిరుగుతూ వుండే ఇదంతా బంగారమ్మ భాగ్యమే అనుకునే వారందరు. కొట్లో తిప్పలన్నీ బంగారమ్మే పడేది. బంగార్రాజు మాత్రం వారంకోసారి పట్నం వెళ్ళి, చీట్లాటాడి, - వచ్చేటప్పుడు కొట్లో కావలసిన సరుకులు కొనుక్కొస్తూ వుండేవాడు. చీట్లాటాడి, నాలుగు డబ్బులు తెచ్చిన్నాడు ఏమనేదికాదు. కానీ, పోతేమాత్రం బంగారమ్మ బంగార్రాజుమీద సింహాలెత్తిపోయేది.

"కష్టపడి సంపాదిస్తా వుంటే, కూసుని, చీట్లాట యదాన్న కొట్టటానికి సేతులెలా వచ్చెయ్? ఇదిగో సెప్తన్నా! సచ్చినా సీట్లాట లాట్టాకీల్లేదు. అనా పైసల్తో నెక్క సెప్పవలసిందే !" అంది.

"ఏటే ఆగ్నేపిత్తున్నావ్? మొగోడిని! ఒకాట ఆడాలనిపిత్తే ఆడాను. నా ఇష్టం !"

"నీ బాబు సొమ్మేమైనా వుంటే ఓటికాదు పదాట్లాడుకో !"

"బాబు సొమ్ము కావాల్టే ! అనాడు తీసుకొచ్చి, నీ మెళ్ళో తాళికట్టకపోతే నీ బతుకు కుక్కలు సింపిన ఇత్తరి కదే ! డబ్బులట్టుకొస్తే మట్టుకు చిర్నవ్వు నవ్వుకుంటూ తీస్కొని, బొడ్లో దోపేను కోవటం తెల్సు పత్తిత్తుకి ! పోతే మటుకు యిరుచుకుపడ్తోంది. నోర్మూసు క్కూర్చోయెనే !" అనేవాడు. బంగా రమ్మ నోటికి తాళం పడేది.

* * *

బంగారమ్మకి కొట్లో ఊపిరి సలప కుండా వుండేవి బేరాలు. సరుకులు అందివ్వటానికి చిన్నకుర్రాడిని కూడా పెట్టుకుంది.

వాళ్ళకి, వీళ్ళకి అప్పులు, అమ్మ

కాలు చేసిపెట్టి, పొట్టపోసుకునే బ్రోకరు నాగిరెడ్డి ఒకరోజు,

"బంగారత్తా! పీరేసుకి అయిదొందలు అర్జంటుగా అవసర మొచ్చినయ్! నూటికి మూడ్రూపాయలు వడ్డీ ఇప్పిత్తాను! కాస్త సర్దుదూ!" అన్నాడు.

డబ్బు పెట్లో యెట్టుకుంటే పిల్లలెడుతుందా ఏమన్నానా? అనుకుని, "సర్లే!" అంది. అప్పటినుండీ వడ్డీ డబ్బులు రుచి మరిగి, అడిగిన వాళ్ళకి లేదనకుండా అప్పులిస్తూ వుండేది.

ఈలోగా బంగారమ్మ బిడ్డ తల్లి కూడా అయి, బిడ్డతోపాటు భాగ్యం కూడా పెరిగింది. అందుచేత పుట్టిన పిల్లకి "వరలక్ష్మి" అని పేరు పెట్టుకుంది.

* * *

బంగారమ్మకి నానాటికి బంగార్రాజు మీదకంటే వడ్డీ డబ్బులమీదే మోజు బాగా పెరిగిపోతుంది. ఒక్క రూపాయి పెట్లోవున్నా తోచేది కాదు. నగా నట్రా, చెంబూ తప్పేలా, భూమీ పుట్రా, ఇల్లూ వాకిలీ ఏవి వుంటే అవి తాకట్టు పెట్టించుకుని, ప్రోనోట్లు వ్రాయించుకుని, వడ్డీ వ్యాపారం సాగించేది. వడ్డీ డబ్బులు మాత్రం ఖచ్చితంగా వసూలు చేసేది. డబ్బు లేకపోతే వాళ్ళ దగ్గర ఏముంటే అవి గొడ్లో, ధాన్యమో ఆఖరికి కోళ్ళో తెచ్చేసుకునేది. బంగారమ్మ దగ్గర అప్పు తీసుకున్నవాడు మొలగట మేతప్ప తేలటం వుండేదికాదు. తాకట్లు వాకట్లయి ఒక ఇల్లు, రెండెకరాల భూమేకాక నాలుగు గేదెలు పాతిక కోళ్ళు గాదినిండా ధాన్యం చేరేయి. ఊరివాళ్ళ సొమ్ములన్నీ సొంతమై బంగారమ్మ వంటిమీద మిలమిల్లాడేయి. అయినా బంగారమ్మ ఊళ్ళోవాళ్ళకి కల్పతరువే. పది అడిగినా లేదనదు. ఎవరికేం కావలిస్తే అవిస్తుంది. పాలు, పెరుగు, పిడకలు అవి, ఇవి అని లేదు. అడగడమే తరువాయి అరువు ఇస్తుంది. అసలు అరువు బేరం అంటేనే ఇష్టం బంగారమ్మకి.

వరలక్ష్మిని ముద్దుగా "వరాలు" అని పిల్చుకునేవారు. వరాలు నిజంగా 'వరహా" లాంటి పిల్లే. వరాల్ని గేదెల దగ్గర కాపలా వుంచి, తను కొట్లో పని చేసుకోవటానికి వెళ్ళింది. కొట్టు కట్టేసి, ఇంటి కొచ్చిన బంగారమ్మ తిన్నగా గొడ్లపాకలోకి వెళ్ళేసరికి పేకలేదు– గతుక్కుమని, "వరాలూ! గొడ్లకాడ పేడేదే?" అంది.

"ఇందాక సుబ్బమ్మత్త వచ్చి, పండక్కి ఇల్లలుక్కోవటానికి కావాలని పట్టుకెళ్ళిందే అమ్మా!" అంది.

"ఆ అబ్బ తెలివే నీకూనూ! ఇందుకటే నిన్ను కాపలా ఎట్టింది! వంద



పిడకలు, రూపాయ్ — రూపాయ్ రూపాయనాగా వుంటదా? పిల్లల్నెట్టదూ? ఇసుమంటి సన్నాసి పన్లెప్పుడూ సెయ్యకు!" అంటూ గుడ్లెర్ర చేసింది.

పదేళ్ళ వరాలికి రూపాయేమిటో, పిల్లల్నెట్టటమేమిటో అగమ్యగోచరమై తల్లికేసి వెర్రిచూపులు చూస్తూ వుండిపోయింది. బంగారమ్మ దృష్టిలో పనికి రానిది ఏదీ లేదు. పేడా, చెత్తా, చెదారం అన్నీ రూపాయి కాసులకిందే మెరుస్తాయి. ఒక్క రూపాయి పోయినా ప్రాణం గిజగిజ లాడ్తుంది. తవుడూ, చిట్టూ కొట్లో పెట్టి, డబ్బులు చేసుకుని, ఇరుగు పొరుగుతో, "గంజీ, కడుగూ నేలమీద పారబోస్తే ఏటొస్తది పిన్నమ్మా? కడవలో పోసుంచితే మా దూడముండలు తాగుతాయ్!" అనేది.

ఊరు బయట మేసి, ఇరుగు పొరుగు గంజీ కడుగు త్రాగి డబ్బులిచ్చేవి బంగారమ్మ గేదెలు. చెత్తచెదారంలోని గింజలు, పురుగులు తిని గుడ్లుపెట్టి డబ్బుల్చేసేవి కోళ్లు. అందుకే బంగారమ్మకి బంగార్రాజుకంటె అవి అంటేనే ఇష్టం!

* * *

బంగార్రాజు నానాటికి పేకాట రాజుగా మారిపోయి, పట్నంలో నాలుగేసి రోజులు వుండిపోయేవాడు. కొట్టుకట్టేసొచ్చిన బంగారమ్మ జేబులో డబ్బులు కుక్కుకుని, పట్నం బయలుదేరిన బంగార్రాజును చూసి,

"ఎంతసేపూ ఆ ముదనష్ట పాట

తప్పితే పిల్లకి పెళ్ళిచేసేది నేనేటి ?" అంది, జేబులోంచి బీడీ తీసి వెలిగించు కుంటూ."

"ఏటి మునిగిపోనాదీ ?" అన్నాడు.

"మునిగిపోనేదు. అన్ని యవ్వారాలు సూసుకోనేక సత్తున్నాను. నీ యాసరా ఎల్లాగూ నేదు. కాస్త సురుకైనోణ్ణి చూసి, ఇంట్లో ఎట్టుకుంటే కాస్త సేదోడు వాదోడుగా వుంటాడని నా ఏడుపు. ఒక్క పిల్లని బయటి కంపెయ్యాలని కాదు" అంది. నోట్లో బీడీ తీసి, తుపుక్కున ఉమ్మి, "అటు మంటి సన్నాసోడ్ని కూడా సెప్పు !" అంటూ మళ్ళీ నోట్లో బీడీ పెట్టుకున్నాడు."

"నాగిరెడ్డి ఎంత సాయంగా వుంటున్నాడో నీకేటి తెల్సు ? వాడి తెలివి, వాడి సురుకు ! కాస్త వయసెక్కువైతే ఏం పోనాదీ ? ముడెట్టేంది, అడ్ని ఇంట్లో ఎట్టేసుకుంటాను."

"గొప్పపని సేత్తావ్ ! ఆ త్రిలోకరెదవకి సత్తే ఇవ్వను ! నకిలీ బంగారం కాదే, నా వరాలు. వరహా ! సదువుకున్న దొరబాబు కిచ్చి సేత్తాను !"

"దొరబాబులు తేరగా వత్తారేటి ?" అంటూ చేతులు తిప్పింది.

"తెల్సే ! పదికాకపోతే పాతికేలు పడేత్తాను. ఇదంతా కట్టుకుపోతామేటి ? నువ్వు ఏ గడ్డి కరిచి కూడబెట్టినా దాని కోసమేగా !" అంటూ గబగబ వెళ్ళిపోయాడు.

కూతురి విషయంలో బంగార్రాజు పట్టుదల తెలియందికాదు బంగారమ్మకి. ప్రక్కగదిలోంచి ఈ సంభాషణ అంతా విన్న వరలక్ష్మి మనసులోనే తండ్రికి నమస్కరించుకుంది.

* * *

వరలక్ష్మి ఐదవ తరగతివరకు ఆ వూరి ఎలిమెంటరీ స్కూల్లో చదువుకుంది. తరువాత ప్రక్క పట్నంలోని హైస్కూల్లో చేర్పించటానికి ఒప్పుకోలేదు బంగారమ్మ.

"ఇంటికాడే పంతుల్నెట్టి సదివిత్తాను !" అన్నాడు బంగార్రాజు.

"పంతులూరికే సెప్పుతాడేటి ? అనుమంటి దండగమారి పన్లు సెయ్యకు మాకు ! నేనేటి సదువుకున్నాను ? ఇన్ని యవ్వారాలు సూసుకోవటంలా ? ఆ సదువు సాల్లే !" అంది.

బంగారమ్మ అడింది ఆటే అయినా కొన్ని విషయాల్లో మగతనం ప్రదర్శిస్తాడు, బంగార్రాజు. అప్పుడు మాత్రం బంగారమ్మ అశక్తురాలే.

మర్నాడే వరాలుకి చదువు చెప్పటానికి పంతుల్ని ఏర్పాటుచేసాడు. ఇంటి దగ్గరే చదువుకుని, ఇంటర్మీడియట్ సర్టిఫికెట్ తెచ్చుకుంది వరలక్ష్మి.

* * *

పదిరోజుల్లోనే పట్నంలో ప్లీడరీ పరీక్ష పానయిన దాకులాంటి కుర్రాణ్ణి చూసి, నిశ్చయించేరు వరాలుకి

"కట్నం ఏపాటి ?" అంది బంగారమ్మ ముభావంగా.

''పదేలు" అన్నాడు.

"సొమ్మంతా ఊరిమీదనే వుంది గందా ! ఎట్టాగిత్తావ్ ?"

"ఆ సంగతంతా నేన్జూసుకుంటాలే ! అని బంగారమ్మ అప్పులిచ్చిన వాళ్ళందరి దగ్గరికి వెళ్ళి, "పిల్లదాని పెళ్ళి చేసెయ్యాలి. అసల్లోనే తలో వెయ్యి సెల్లు వెయ్యండి" అని చెప్పుకుని, నెల రోజుల్లో వరాలు పెళ్ళి ఘనంగా చేసీసాడు.

* * *

భర్త నరహరితోపాటు పండుగకొచ్చిన వరాలుతో, "మీ అయన కట్నం సొమ్ము ఏం చేసేడే ? ఇక్కడ వడ్డీకి తిప్పితే పదింతలు అవుతుందని సెప్పు !" అని, మర్నాడు

''మీ అయనేమన్నాడే ?" అంది.

"ఆయన కటువంటి వడ్డీ వ్యాపారాలిష్టం వుండవమ్మా. బాంకులో డిపాజిట్ చేస్తే మనకు న్యాయంగా రావలసిన ఇంట్రస్టు వాళ్ళే ఇస్తారన్నారు" అంది.

"ఊ ! ఈ సదువుకున్నోళ్ళ తెలివిలిలాగే అఘోరిస్తాయ్ !" అని వూరుకుంది. కూతురి పెళ్ళికి ఖర్చైన సొమ్ము పూడ్చటంకోసం వడ్డీరేటు పెంచి, వ్యాపారం సాగిస్తోంది బంగారమ్మ.

* * *

ఒకరోజు వున్నట్లుండి, హఠాత్తుగా బంగార్రాజు చచ్చిపోయేడు. బంగారమ్మ తీసుకు వచ్చిన డాక్టరు అక్కడ పోగైన జనానికి ''గుండె జబ్బు" అని చెప్పాడు.

"మొన్న మా ఊరొచ్చినప్పుడు నిక్షేపంగా వున్నాడు. ఇంతలోనే ఏం ముంచుకొచ్చిందే అమ్మా !" అంటూ వచ్చి, తల్లిని వాటేసుకుని తల్లికంటే ఎక్కువగా ఏడ్చింది వరాలు. కర్మలన్నీ యథావిధిగాచేసి, కొడుకులేని లోటు తీర్చేడు నరహరి.

వెళ్ళేనాడు వరాలు తల్లిని, ఒక్కర్తి పీ ఏంవుంటావ్ ? మాతో వచ్చేయ్!" అంది.

"ఈ కొట్టూ, వడ్డీ వ్యాపారం ఏం కానే తల్లీ ? ఇక్కడే గిద్దెడు గింజలు పొంగించుకుని పడుంటాను ?" అంది బంగారమ్మ.

* * *

అప్పుకోసం ఈగల్లా ముసురుతూనే వున్నారు బంగారమ్మ చుట్టూను.

మొగుడు పోయిన ఖర్చుతో బంగారమ్మ చేతిలో డబ్బు ఆట్టే ఆడటం లేదు.

"పట్నంలో షావుకారు దగ్గర తక్కువ వడ్డీకి అప్పు తీసుకుని,

మనూళ్ళో అయిదు రూపాయల కాడి కిచ్చావంటే నీకు సానా లాభం వత్తది, బంగారత్తా!" అంటూ సలహా ఇచ్చాడు నాగిరెడ్డి.

"తెలివంటే నీదే!" అంటూ మర్నాడు నాగిరెడ్డి, తను పట్నం వెళ్ళి, వంబెడు సొమ్ములు షావుకారి చేతిలో పెట్టి, అప్పు పుచ్చుకుని, రెట్టింపు వడ్డీకి అప్పులివ్వటం మొదలుపెట్టింది మెల్లిగా బంగారమ్మ ఇంట్లో వున్న వెండి బంగారాలు, ఇల్లు, భూమి అన్నీ షావుకారు దగ్గర తాకట్టుగా చేరి పోయేయి. ఎప్పటికప్పుడు వడ్డీలు వసూలుచేసి, మళ్ళీ మరొకరికి అప్పివ్వ టమే తప్ప, షావుకారుకి పైసా వడ్డీ కట్టేదికాదు, ఏకంగా ఒకసారే ఇవ్వచ్చు లెమ్మని.

ఇలా అప్పిచ్చుకున్నవాళ్ళల్లో రౌడీ రంగడు ఒకడు!

రౌడీ అంటే ఎవరినీ ఖూనీ చెయ్య లేదు. ఎవరి బుర్రా బద్దలు కొట్టనూ లేదు. ఆ వూళ్ళో జరిగే అన్యాయక్ర మాలను ఎదుర్కోవటమే వాడి కా పేరు తెచ్చింది. బంగారమ్మ దగ్గర అప్పు పుచ్చుకున్నవాడు శ్లేష్మంలో పడ్డ ఈగే నని వాడికి తెలుసు. కుటుంబ బాధ్యత నెత్తిన పడటంవలన మరొక గత్యంతరం లేక పుచ్చుకుని నాలుగు గేదెల్ని కొని పాలు ప్రొద్దుటే పట్నం తీసుకు వెళ్ళి అమ్మేవాడు.

* * *

ఆ ఏడు పంటలు సరిగా పండక, అప్పటికే అసలుకంటే రెట్టింపు వడ్డీ చెల్లించడంతోనే ప్రాణం విసిగిన రైతులు కొద్ది నెలలుగా బంగారమ్మ ఎంత గింజుకున్నా బకాయి పెట్టేసారు.

ఉన్నట్టుండి ఒకరోజు బంగారమ్మకు షావుకారు ధగ్గరనుండి రిజిష్టర్ నోటీసు వచ్చింది, "వడ్డీతోసహా వెంటనే చెల్లించ మని!" బంగారమ్మ డబ్బంతా ఊరు మీద బిగుసుకుపోయింది.

ఎటూ పాలుపోక నాగిరెడ్డి దగ్గరకు పరిగెత్తుకెళ్ళింది!

"వడ్డీకూడా బకాయెత్తే ఓరూరు కుంటారు? నీ డబ్బునాంటిది కాదేటి? వెంటనే కొంత సొమ్ము సెల్లుకట్టు!" అన్నాడు.

"అంతే నంటావా?" అంటూ ఊరు మీద పడింది బంగారమ్మ.

పట్నంలో పాలమ్మి ఇంటి ముఖం పట్టిన రంగడికి గ్రామ సావిడికోని రేడియో సన్నకారు రైతులు ఋణాలు చెల్లించక్కర్లేదని, ప్రభుత్వం ఋణ విముక్తుల్ని చేస్తున్నదని చెప్పటం విన్నాడు.

"వర్వాలేదు! బంగారమ్మ బాకీ కాస్త కాలు చెయ్యి కూడదీసుకున్నాక చెల్లిం చచ్చులే!" అనుకుంటూ సంతోషంగా ఇంటికి చేరేసరికి బంగారమ్మ హరమేసు క్కూర్చునుంది.



"ఇదిగో రంగడూ! ఇయాల నా సొమ్ము నాకిత్తేనే కానీ కదిలేది లేదు."

"ఏటప్పా!" మా ఇంటిది ఆసుపత్రెల్లో వుంది. ఇబ్బందుల్లో వున్నానని సెప్పితే ఇనుకోవేటి?"

"నాను ఇబ్బందుల్లో ఉండే నీ ఇంటి సుట్టూ తిరుగుతూంట! నాకు అరిజెంట్‌గా డబ్బు కావాలి."

"నాకాడ పైసనేదు. కన్నమేయమంటా వేటప్పా?"

"కన్నమే ఏత్తావో, బత్తెల్నే తెగ నమ్ముతావో వాకేటెరుకు?"

"ఏటీ! మధ్యతరంగా బత్తెల్ని తెగ నమ్మి తినే కూల్లో దుమ్మేసుకొంటాన్నేటి, ఇంతకాలం వడ్డీ నీ యదాన్న పెట్టింది?"

"దొంగరాలినోడా! ఒట్టికెళ్ళినప్పుడు అప్పా, గిప్పా అంటూ ఇచ్చకాలు కబుర్లు సెప్పి, నా యదాన్న కొట్టేనంటావా? మరోకాడ అప్పెట్టి

నీ యధాన్న కొట్టేను : మంచిగా ఇయ్యకుంటే నేనే అమ్మేత్తా నేటను తున్నావో నీ బిత్తెల్ని :"

"ఓ యబ్బో : నామీద ప్రేమతో ఇచ్చినావా : వడ్డీ డబ్బుల కాసపడి, సావుకారు కాడ తక్కువ పుచ్చుకుని, మాకాడ రెండు రెట్లు గుంజుతున్నావ్ : తెల్దనుకోమాకు: అమ్మే త్తదంట బిత్తెల్ని: బంగారమ్మో : మాటలు జాగ్రత్తగా రానీ : రౌడీ రంగడని పేరు యట్టనే యట్టేరు :"

"ఏటి సేత్తావుతా :" అంటూ బిత్తె పలుపు విప్పబోయింది.

"ఏటా జబర్దస్తీ : బిత్తెమీద సెయ్యి తియ్ : లేకుంటే కట్టకట్టి, గంగానమ్మ సెర్లో కిసిరేయ్‌గలను : అసలు రైతులు ఋణాలు తీర్చక్కర్నేదని పెబుత్వం తీర్మాన మిచ్చింది. ఎర్నెల్లు:"అన్నాడు రంగడు. ఈ గలాటాకి చుట్టుప్రక్క లంతా పోగయ్యేరు. నిమిషాలమీద ఊరంతా పాకిపోయింది. రంగడు రేడియోలో విన్న సంగతి.

బంగారమ్మ గుండెలు బాదుకుంటూ ఒక్క ఉదుటున పట్నంపోయి, అల్లుడితో మొరపెట్టుకుంది "అసలు లైసెన్సు లేకుండా వడ్డీవ్యాపారం చెయ్యటం పెద్ద నేరం. అదీకాక ప్రభుత్వం పల్లెల్లోని రైతుల సహాయార్థం కొన్ని బిల్లులను ప్రవేశపెట్టింది" అంటూ వివరంగా చెప్పాడు.

అల్లుడు చెప్పింది సగం అర్థమై సగంకాక, "అట్టాగైతే షావుకారు నోటీ సిచ్చి నాడేటి :" అంది.

"ఆ బిల్లులు మీలాంటి వడ్డీ వ్యాపారస్తులకు కాదు. ఈ విషయంలో నేనేం సహాయం చెయ్యలేను. మరో ప్లీడర్ని పెట్టుకోండి :" అంటూ నిర్మొహమాటంగా చెప్పి, గబగబా కోర్టుకి వెళ్ళిపోయేడు అల్లుడు నరహరి.

"అలాగంటాడేటే అమ్మాయీ :" అంటూ చ తి కి ల బ డి పో యిం ది బంగారమ్మ.

కోర్టులో తోటి ప్లీడరు సుబ్బారావు "ఏమోయ్ : నరహరీ : మీ అత్తమీద షావుకారు సుబ్బయ్య దావావేస్తున్నాడు. అసలావిడ అంత అప్పు ఎందుకు చేసినట్టు :" అన్నాడు.

ముఖం చిట్లించుకుంటూ "నాకు తెలియదు" అన్నాడు.

"మరి మీ అత్త తరపున వకాల్తా తీసుకోవడంలేదా :" అన్నాడు.

"లేదు" అని అంటూ వుండగా వెనకాల గుసగుసలు వినిపించేయి.

"అంత డబ్బాస పనికిరాదు. డబ్బు ఖర్చుపెడుతున్నాడని మొగుడికి విషం పెట్టి, చంపేసిందని చెప్పుకుంటారా వూళ్ళో :" అంటూ.

నరహరి ఉగ్రనరసింహంలా ఇంట్లో అడుగుపెట్టి, "వరం :" అంటూ గర్జించి, "మీ అమ్మని తక్షణం వెళ్ళి

పోవమ్మను. వళ్ళటమే కాదు. మళ్ళీ ఈ గడప తొక్కకూడదు ! కోర్టులో తలెత్తుకోలేకపోయాను, మీ అమ్మని గురించి చెప్పుకునే మాటలు విని " అన్నాడు.

వరాలు బిత్తరపోయింది.

బంగారమ్మ వెర్రిదాన్లా కూతురికేసి చూస్తూ, "ఏటే, మీ ఆయనకి గంగానమ్మ కానీ పూనిందేటి, అలా చిందు లేస్తున్నాడు ?" అంది.

"అమ్మా ! కాలం కర్మం కలిసొచ్చి న్నాడు వద్దువుగాని. కానీ వెళ్లిపోవే, నీకు పుణ్యముంటుంది !" అంది వరాలు.

బంగారమ్మ నిర్ఘాంతపోయి, గబగబా ఊళ్ళో ప్లీడర్ల దగ్గరకు వెళ్లి పడింది. కొట్టుకూడా మూసేసి, పిచ్చి కుక్కలా ప్లీడర్ల చుట్టూ ప్రదక్షిణలు చేసింది. రాబట్టుకోగలిగినంతవరకు రాబట్టుకుని, చివరకు పెదవి విరిచేసారు, ప్లీడర్లు. బంగారమ్మ భాగ్యమంతా వేలంలో పెట్టేసాడు సుబ్బయ్య షావుకారు. నూకాలు కడుపుమంట చల్లారింది. బంగారమ్మ లబో దిబోమంటూ గుండెలు బాదుకుని, అప్పిచ్చిన వాళ్ళందరికి శాపనార్థాలు పెట్టింది.

'దిక్కూ మొక్కూ లేనిదాన్ని తీసుకొచ్చి, అంబారీ ఎక్కిస్తే ఆడికే ఇసం పెట్టేసింది ! అల్లుడు గుమ్మమెక్కితే కాళ్లిరక్కొడతాన్నాట్ట !

''దురాశ దుఃఖానికి చేటని అంత దబ్బాశ పనికిరాదు !" అంటూ ఊళ్లో వాళ్లంతా తలో రకంగా గుసగుసలాడుతున్నారు.

బంగారమ్మ భాగ్యం మొదటికి వచ్చేసింది. ఒకప్పుడు కల్పతరువులాంటి బంగారమ్మ ఆ ఊళ్లో ఎవరికీ అక్కర్లేకుండా పోయింది ! రొచ్చులోకి దింపిన నాగిరెడ్డి ముఖం చూపించటం మానేసాడు ! అయినా బంగారమ్మ ఆశ చావలేదు.

"వడ్డీ ఇవ్వకపోతే మానేను. అసలయినా ఇవ్వకపోతారా ?" అని ఆ ఊరినే అంటిపెట్టుకుని వుంది.



# ప్రేమ పూజారి

కృష్ణమూర్తి వరండా అరుగుమీద మంగలికి గడ్డం అప్పగించి కూర్చొన్నాడు. పిచ్చివాడు వచ్చి వాకిట్లో తచ్చాడుతున్నాడు.

కృష్ణమూర్తి నవ్వుతూ, 'ఒరే, అబ్బీ! ఇలా రా!" అన్నాడు.

ఏవేళనున్నాడో బాబు అరుగు దగ్గరికి వచ్చి నిలబడ్డాడు.

"కూర్చో."

కూర్చున్నాడు.

"నువ్వు పాటలు బాగా పాడతావని విన్నాను. ఓ పాట పాడోయ్!"

"హిహిహీ!" పెళ్ళికూతుర్ని పెళ్ళికొడుకు పేరు చెప్పమంటే సిగ్గుపడ్డట్టుగా సిగ్గుపడ్డాడు బాబు

"సిగ్గెందుకు? నాకు పాటలంటే ఇష్టం. పాడు."

అతడు పాటకు లంకించుకొన్నాడు. "కోతీబావకు పెళ్ళంటా, కోవెల తోటా విడిదంటా..."

"ఎక్కడ పట్టుకొన్నావోయ్ ఇంత పాత పాట! ఏదైనా భక్తిపాట వచ్చా?"

"రఘుపతి రాఘవ రాజారాం ... పతితపావన ... పావన ... పావన..."

ఆగిపోయిన రికార్డులా పావన అంటూ ఎక్కడో దీర్ఘంగా చూడసాగాడు. అతడి ధ్యాస ఎక్కడో లగ్నమైంది.

కృష్ణమూర్తి క్షౌరం పూర్తి అయింది.

"ఆ గడ్డం, ఆ జుట్టు చూస్తే పిల్లలు జడుసుకొంటారు. నున్నగా గుండు చేసెయ్యి పట్టుకొని!" మంగలికి కన్ను గీటుతూ అన్నాడు.

"పిచ్చివాడు. కొడితే? రక్కితే?" మంగలి భయం వ్యక్తం చేశాడు

"ఏంకాదు. నేనుంటాగా?" కృష్ణమూర్తి బాబు చెయ్యిపట్టుకొని మంగలి ముందు కూర్చోబెట్టాడు.

పులినోట్లో తల దూర్చబోతున్నవాడిలా జుట్టులో కత్తెర దూర్చాడు భయపడుతూ, మంగలి. ఏ క్షణంలో పిచ్చివాడు తన గూబ గుయ్యిమనిపిస్తాడో, గొంతు పట్టుకొంటాడోనన్న గుండెదడతో వడివడిగా తన పని ముగించుకోసాగాడు.

కృష్ణమూర్తి ఆసక్తిగా బాబు ముఖంలోకి చూడసాగాడు. ఊరివాళ్ళ ఊహాగానాలకూ ఇతడికీ ఎంతవరకు సంబంధముందో తెలియదు. నిజంగా ఇతడు పిచ్చివాడే అయితే ఎంత దయ

పోల్కంపల్లి శాంతాదేవి